కులు ఆయా వైజ్ఞానిక సారాన్ని ఆధారంగా తీసుకుంటూ జీవితాన్ని గడుపుతూంటారు; వీటికితోడు వివిధకళలూ, సంసారిక జీవితం, బిడ్డలపెంపకం' వైవాహిక సాంప్రదాయాలూ, చదువు సంధ్యలూ, వృత్తులూ, ప్రభుత్వం–క్లొద్ది మాటల్లో చెప్పాలంటే తరతరాలుగావొస్తూ సామాజికులకు అందుబాటులోఉన్నవన్నీ కూడా వారిమీద తమ పలుకుబడుల్ని ప్రసరిస్తూనే ఉంటవి.

సాంస్కృతిక భావన అనేది సమాజం మొత్తాన్ని పరిశీలించేందుకు ఉపకరిస్తుంది; సాంస్కృతిక పద్ధతులూ, సాంప్రదాయాలలోని ఒక భాగమే. ఒక సమూహం లేదా సమాజం ప్రవర్తించే విధానాలనే సత్యం మనకు స్పష్టమౌతుంది. ఇంతకు క్రితం యునైటెడ్ స్టేట్స్‌నుగూర్చి రాసినదంతా–కొన్ని ప్రత్యేక పద్ధతుల మీదా, నైతికమైన తీర్పుల్లోని అతివాదం మీదా ఆధారపడినవే కాని – ఇలాటి కొన్ని భాగాలను కలిపి, అవి ఎటునుంచి మొదలైనవో తెలుసుకోకుండానే పూర్తిచిత్రాన్ని ప్రదర్శించి ఉండలేదు. ఏ ప్రజలైనా సరే 'భౌతికవాదులు' అనీ, 'ధనమే ప్రధానంగా పరిగణించేవారు', అనీ, 'లైంగికంగా విశేషోద్రేకులు' అనీ, అనటం - ఆ వెనుకనున్న పరిస్థితుల్ని అర్థంచేసుకోకుండానే నైతికమైన తీర్పులను జారీచేయటమౌతుంది.

సమాజంలోని వివిధ వ్యక్తులు అనేక తెగలకు సంబంధించిఉండి కలిసికట్టుగా ఉండేందుకు అనేక విధానాలను అనుసరిస్తూంటారు. వయస్సును బట్టీ, లింగభేదాన్నిబట్టీ ప్రతివ్యక్తికీ సమాజంలో స్థానం ఉంటుంది; ఈ స్థానం - సామాజిక గౌరవాలలోని స్థానంగా, ఆయాకుటుంబాలకు సంబంధించిన ప్రత్యేకించబడినవృత్తులరీత్యా, అనేక సమూహాలరీత్యా - (సోదరభావాన మెలిగేవీ, రహస్యమైన ఉత్తర్వులను నిర్వహించేవీ, ఆటపాటలూ, క్లబ్‌లు, ట్రస్టీలసమూహాలూ మొదలైనవి) – వీరు విభజించబడు

పలుకుబడులూ మొదలైనవి - అంతటా గుర్తించబడినవి. అమెరికన్ల ప్రవర్తనా, లేదా వారి సంస్థలను చూసి, పరిశీలించినవారు, పైకి కనిపించే దాన్ని మాత్రం గుర్తించి, వెంటనే తమ అభిప్రాయాన్ని పొగడటం ద్వారానో, తెగడటం ద్వారానో జారీ చేస్తారేకాని, ఆ వెనుకవున్న చారి త్రాత్మక, సాంస్కృతిక పునాదుల్ని గూర్చి అర్థం చేసుకోరు.

ఒక వ్యక్తినిచూసి, అతనిలోని గుణగణాలన్నిటినీ 'అమెరికన్ల' కు అంటగట్టటం కూడా జరుగుతోంది. ఉదాహరణకు - అమెరికన్ల భౌతిక వాదం - కేవలం అమెరికన్ మధ్యతరగతి ప్రజలకు సంబంధించిందై ఉన్నది. కాని, ఎక్కువమంది అమెరికన్లు మధ్యతరగతివారే కావటంతో ఆ సిద్ధాంతం అమెరికన్ సిద్ధాంతంగా పరిగణించబడుతోంది.

పరదేశీయుడికి అమెరికన్ - కలహారంభకుడుగా, రౌడగా, సకాలానికి పనులు చేసుకునేవాడుగా, జాగ్రత వహించేవాడుగా, కాస్త తిండిపోతుగా కనిపించవొచ్చు; ఐతే యీ గుణగణాలు అతని వృత్తి, అతని కుటుంబ పరిస్థితులు, మతవిశ్వాసాలు, వయస్సు, ధనసంపదలమీద ఆధారపడిఉంటవి. వృత్తిధర్మాలూ, మతైక విశ్వాసాలూ మొదలైన వాటిల్లో పోలికలు ఉన్న ట్లయితే ఇలాటి గుణగణాలే ఇతర అమెరికన్లలో కనిపించటం పరిపాటి.

ఐతే - లక్షణాలూ, ఉద్దేశాలూ, ఉద్వేగాలూ, ఆశయాలూ, నమ్మకాలూ, విశ్వాసాలూ మొదలైన అమెరికనుల ప్రత్యేక సాంప్రాదాయా యున్నవి; సంస్థలూ, ముఠాలూ, సమితులూ మొదలైనవి ప్రత్యేకచిహ్నాలు కలిగి అమెరికన్ సమాజానికి సంబంధించినవిగా ఉంటున్నవి. వీటిని అర్థంచేసు కొనేందుకు సాంస్కృతిక భావం దగ్గిరి దారి.

## సంస్కృతి అంటే ఏమిటి?

కళాసాంప్రదాయాలూ, నమ్మకాలూ, కూడగట్టుకొన్న విజ్ఞానం మొద లైనవి సమాజాన్ని నడిపించే పద్ధతి సంస్కృతి అనబడుతోంది; సామాజి

మొదటి సంవత్సరాల్లో అడవులనుగూర్చి తెలుసుకోవటంలో వరసాగ్గా తాను ఎదుర్కొన్న అపజయాలనుగూర్చి ఎంతోచిత్రంగా వర్ణించాడు. అనేక ఆంగ్ల స్థావరాలు నాశనమవటమో, లేక విచ్ఛిన్నమవటమో జరిగింది. చివరకు జేమ్స్‌టౌన్, ప్లిమౌత్‌లలోనివారు, తాము జీవితానికి ఎదురొడ్డి నిలవటాన్ని తెలుసుకునేవరకూ ఇలాగే జరిగింది.

కనుకనే అమెరికనులు * మొదటినుంచీ అనేక కొత్త ఊహలనూ, పథకాలనూ ఒప్పుకొంటూ, వాటిని ప్రయోగిస్తూ, అపజయాన్ని ఎదుర్కొంటూ తిరిగి ప్రయత్నిస్తూండవలసి వొచ్చింది.

లింకన్ విశాల భావాలను వ్యక్తంచేసే ఉపన్యాసంలోనూ, తనమాటలు ప్రతి అమెరికన్ హృదయాన్నీ వికసింపజేసే ధోరణిలోనూ, అమెరికన్‌లు చేసే ప్రయోగాల తాలూకు సారాంశాన్ని "ప్రతి మానవుడూ సరిసమానంగానే సృష్టించబడ్డాడు" అనే భావంలో వెలిబుచ్చారు. ముఖ్యంగా అంతర్యుద్ధం - ఇలాటి భావాలలోఉన్న జాతీయత, మానవ శ్రేయస్సుకు అంకితము కాజడ్డది. కలకాలం ఓర్చినిలవగలదా లేదా అనేదాన్ని రుజువుచేసేందుకే వొచ్చిందని ఆయన అన్నారు.

తమ సంస్కృతిని అమెరికన్‌లు చాలా తక్కువే అర్థం చేసుకున్నారు. పరదేశాల్లోని వీరి మిత్రులు అంతకన్నా తక్కువ అర్థం చేసుకున్నారు. తెలిసిందెంతో ఉన్నది. కాని అర్థం చేసుకున్నది బహుకొద్ది. అమెరికన్ జీవిత విధానంలో పైకి స్పష్టంగా కనిపించే విషయాలు విస్తారమైన ఉత్పత్తి, అమెరికన్ పరిశ్రమలూ, సైనికబలాలశక్తీ, వ్యాపారానికీ, వ్యక్తిగత సాహసాలకు వారిచ్చే ప్రాధాన్యతా, స్త్రీ స్వాతంత్ర్యం, బాలబాలికల

---

* అమెరికన్‌లలో సరిసమానమైన ఇతర జాతీయతలను నొప్పించవలసి వొచ్చినా, 'అమెరికన్' అనే పదాన్ని వాడక తప్పటంలేదు. కనీసం ఆంగ్లభాషలో అమెరికన్ అనే పదానికి యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా పౌరుడనే అర్థం వ్యక్తమౌతుంది. ఇందువల్ల యునైటెడ్ స్టేట్స్ పౌరుడు అనే పదాన్ని అనంగీకారంగా ఉండేదాన్ని ఉపయోగించవలసిన బాధ తప్పుతుంది.

# అమెరికన్ జీవితం

## ఒకటో అధ్యాయం

### సాంస్కృతిక భావన

ప్రతి నాగరికతా ఒక ప్రయోగం; కాలగతికి నిలవటమే దానికి పరీక్ష. అనేక ఇతర నాగరికతలతో పోలిస్తే యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా నాగరికత భేదిస్తుంది: ముఖ్యంగా ఇది మొదటినుంచీ తెలిసివుండి ప్రవేశ పెట్టబడుతూనేఉన్న ప్రయోగం కనుక ప్లైమౌత్, బోస్టన్‌లలోని చిన్న మతసంబంధమైన సమాజాలూ, ఖండానికి సంబంధించిన కాంగ్రెస్, చట్ట సమ్మతంగా ఏర్పడిన ఫెడరల్ ప్రభుత్వమూ, జాక్సన్ ఊహించిన ప్రజా స్వామ్యం, టెడ్డీ రూజ్‌వెల్ట్ తాలూకు అనుదిన వ్యవహారం, ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ తాలూకు కొత్తవ్యవహారం, మార్షల్ పథకం, ట్రూమన్ సిద్ధాంతమూ - మొదలైనవి ఆశాజనకంగా తెలిసిఉండి ప్రవేశపెట్టబడినవే.

పరిస్థితుల వొత్తిడివల్ల యూరపియన్‌లు అమెరికాకు వలసలు వొచ్చారు. అలాటి వొత్తిడే కొత్తకొత్త ప్రయోగాలను చేసేందుకు వారిని ప్రోత్సహించింది. మొదట్లో అమెరికా జేరిన పిల్‌గ్రిమ్స్ వ్యవసాయంలో ఉత్తీర్ణులు కాలేకపోయ్యారు. అప్పుడు వారి ఇండియన్ స్నేహితుడు స్క్వాన్‌టో సలహాలప్రకారం ప్రతి ధాన్యపు పాదులోనూ చేప వేస్తేనే కాని పాదుకు తగిన ఎరువు సమకూడదనీ, కలిసికట్టుగా వ్యవసాయం చేయటానికి మారుగా ప్రతిఒక్కరూ పంటపడించాలనే సిద్ధాంతాన్ని అనుసరించాలని తెలుసుకొని తదనుగుణంగా ప్రవర్తించారు. ప్లిమౌత్‌లోని

కనుక ఒక ప్రజను మనం అర్థం చేసుకోవాలంటే యీ క్రింది వాటిని గమనించాలి : వారి పరిసరాలు (భౌగోళికంగానూ, వాతావరణం, ప్రకృతి సహజంగా లభ్యమయే వస్తుసముదాయం, ఆహారదినుసుల సరఫరా, విద్యుత్ ఉత్పత్తి, పారిశ్రామిక అభివృద్ధి మొ॥లైనవి); మానవాళి పలుకుబడులు. (తల్లిదండ్రులు, స్నేహితులు, ఇరుగుపొరుగులు, తోటిపనివారు, ఉపాధ్యాయులు, పోలీసులు, ఇతర ఉద్యోగులు మొదలైనవారు); వారి సంస్థలు. (కుటుంబం, పాఠశాల, చర్చి, ప్రభుత్వం, ఉద్యోగసద్యోగాలూ వగైరా); వారి కళా ప్రదర్శనలూ, ఆదర్శాలు. (జాతీయమైన లేదా తెగకు సంబంధించినవాటిని ప్రదర్శించే విధానాలు, మతాలు, సాముదాయక విశ్వాసాలు, పూర్వీకుల్ని పూజించటం మొదలైనవి); ప్రాథమికమైన అవసరాలు - ఆత్మవిశ్వాసం, జాత్యాభివృద్ధి, తనను తెలియబరచుకోవటం - యీ మూటినీ వారు ఏయే విధానాల ద్వారా సాధిస్తున్నారో ఆ పద్ధతులు.

ప్రతి సంస్కృతీ ఒక సాలెగూటివలెఉంది. అందులోని దారాలు ఒకదాని నొకటి పెనవేసుకొని ఉంటవి. అర్థికస్థితి - ప్రభుత్వం; విద్య - వినోదము అనే రెండు ఉదాహరణలను తీసుకొని మనం మనసులో వాటినివిడదీసుకొని పరిశీలిస్తే అవి సత్యదూరాలైనా విడివిడిగా కనిపించవొచ్చు. ప్రభుత్వం నడిపించబడే విధానాన్ని పరిశీలన చేయకుండా అర్థికస్థితిని గూర్చి విశదీకరించలేము. ప్రభుత్వం - పన్నులు విధించేదిగా, వ్యాపారాన్ని ప్రోత్సాహించేదిగా, పనివాళ్ళ తగువుల్లో మధ్యవర్తిత్వాన్ని వహించేదిగా, ఇలాగే ఇంకా అనేక పనులు చేసేదిగా ఉంటున్నందువల్ల ప్రభుత్వపరంగా ఉండే అర్థికస్థితికి ఎంతో బాధ్యతవహిస్తున్నది. మన బుర్రలు మరీ తీవ్రంగా ఆలోచించలేని కారణంగా - యీ సాలెగూటిలోని దారాలను తెంచి - అంటే సంస్కృతికి సంబంధించిన అల్లికను విడగొట్టి పరిశీలించి తిరిగి వీటన్నిటినీ కలిపి సంపూర్ణరూపంలో చూసేందుకు ప్రయత్నిస్తాం.

తూంటారు. ఇలాటి భేదాలు ఉన్నప్పటికీ - సమాజంలోని వివిధ తెగలూ, మతాలూ మొదలైనవాటి పలుకుబడులవల్ల ప్రవర్తనల్లో భేదం ఉంటున్నప్పటికీ - మొత్తం సమాజానికంతకూ సంబంధించిన ప్రవర్తనల్లో ఎన్నో పోలికలు కూడా కనుపిస్తుంటవి.

సంస్కృతి — వ్యక్తిత్వాన్ని గూర్చి నిశ్చయంగా చెప్పగలిగేందుకు సహకరిస్తుంది; తన పరిధుల్లో ఎన్నోరకాల వ్యక్తిత్వాలను సృష్టించగలుగుతుంది: ఈ వివిధ వ్యక్తిత్వాలకోవతో - జాతీయవ్యక్తిత్వ మనేదాన్ని గుర్తించవొచ్చు: ఎందుకంటే - ఆ సంస్కృతిలోవున్న ప్రతీవ్యక్తీ వంశపారంపర్యంగావొచ్చే సంస్కృతి పలుకుబడులకు లోనౌతూనే ఉంటాడు కనుక. ఏదో ఊహించిన స్వభావసిద్ధమైన వాంఛ, లేదా దత్తం, , లేదా కులగోత్రాలమీద కాకుండా, ఆ సమాజానికి సంబంధించిన సంస్కృతి నుంచి పొందిన గుణగణాలనుబట్టి జాతీయ ప్రవర్తనకోసం చూడటం న్యాయబద్ధమనే చెప్పవలసి ఉంటుంది.

యునైటెడ్‌స్టేట్స్‌లో అమెరికన్ దంపతులకు పుట్టిన బిడ్డను, పసితనంలోనే ఫ్రాన్స్‌కు తీసుకొనివెళ్ళి ఫ్రెంచి కుటుంబంలో పెంచినట్లయితే - సాంకేతికంగా జాతీయత ఏమైనప్పటికీ - ఫ్రెంచివారివలెనే ఆ బిడ్డ పెరుగుతాడు. అదే విధంగా చైనీయుడు చిన్నతనంనుంచీ అమెరికన్ కుటుంబములో పెంచబడినట్లయితే - అతడు వేషభాషల్లోనూ, ఊహల్లోనూ, ప్రవర్తనలోనూ అమెరికన్‌వలెనే సంచరిస్తాడు; అతని ముఖంలో కనిపించే భావాలూ, ఇతర చిహ్నాలూ అతను పెరిగిన కుటుంబీకులను పోలిఉంటూ- అతను పెరిగిన వాతావరణం, ఆహారవిశేషాలూ మొదలైనవి తెగవాగిస్తూండడంలో - అతను అమెరికన్‌వలెనే కనిపిస్తాడు; శరీరచ్ఛాయ, మంగోలియన్ వొంపులూ మొదలైనవి అతన్ని కన్న తల్లిదండ్రుల పోలికల్లో ఉన్నా, అతని ధోరణీ, అలవాట్లూ, ఆచారవ్యవహారాలూ మొదలైనవి పెంచిన కుటుంబంలోనుంచే వొస్తవి.

# ఒకటో అధ్యాయం

## సంకర సంస్కృతి

అంతర్జాతీయ సంబంధబాంధవ్యాలు నేడెంతో శీఘ్రంగా జరుగుతున్నందు వల్ల, పూర్వం ఎన్నడూ ఎరగనంతవేగంగా మనకు ఇతరులతో సంబంధాలు ఏర్పడుతున్నవి. ప్రతి సంవత్సరము 15 లక్షల మంది అమెరికన్‌లు యూరప్ వెళ్తున్నారు. అసలు ఇంటినుండి కదలకుండానే పరదేశీయుల్తో మనకు సంబంధబాంధవ్యాలు ఏర్పడగలవు - ఎందుకంటే, 50,000 మంది పరదేశీ విద్యార్థులు, ఇతర నిపుణులూ, ఏటా అమెరికాను దర్శిస్తూనే ఉన్నారు.

ఈ విధంగా సంకరమయ్యే సంస్కృతులు ఉత్తేజపూరితంగానూ, ఫలవంతగానూ ఉంటున్నవి. నిజానికి ఇలాటి సంకరతవల్లనే నాగరికత పురోగమించింది. తూర్పుదిశలోని సామ్రాజ్యాలనుంచి గ్రీస్ ఎంతో నేర్చుకొని విజ్ఞానపూరితమైంది; గ్రీక్ నాగరికతతో సంబంధ మేర్పడ్డాక రోమ్ తన బర్బరత్వాన్ని విడనాడింది. రోమన్ నాగరికతనుంచి యూరప్ ఉత్తరదిశలోని రాజ్యాలు నాగరికతను నేర్చినవి. చరిత్రకందని కాలాలు గడిచాక, ఇస్లాం మతంతో ఏర్పడిన సంబంధాల ద్వారానూ, మరుగుపడిపోయిన పురాణాలు తిరిగి కనుగొనబడ్డాక, యూరప్‌కు నూతన జ్ఞానోదయమైంది. ఇక యునైటెడ్‌స్టేట్స్ - గ్రీక్, రోమన్ యూరోపియన్ సంస్కృతులకు వారసత్వాన్ని వహించటమేకాక, ఆఫ్రికా, ఆసియా, స్పానిష్ అమెరికా, వివిధ ఇండియన్ ప్రదేశాలు మొదలైన ప్రపంచంలోని అన్నితావులనుంచీ పలుకుబడులకు లోనైంది.

మన భోజనాలలో జర్మనీ, మెక్సికో, జపాన్, ఇటలీలలోని భోజన విశేషాలుంటున్నవి. ఇండియన్‌లనుంచి వరి పండించటం, స్క్వాష్‌లు తయారుచేసుకోవటం నేర్చుకున్నాము. దేశమంతటా చైనీయుల రెస్టారెంట్లు వర్ధిల్లుతూన్నవి; భోజనపదార్థాలు అమ్మే తావుల్లో చైనీయులు ఉపాహారాలు - సాయ్‌పాస్, నూడిల్స్, ఛెమియన్ మొదలైనవి ఉంటూండటం

వల్ల, ఇల్లాలు వాటిని ఇంటిలోకూడా వడ్డించగలుగుతోంది. ఐతే అసలు వస్తువుకు అమెరికనులు తమ అభిరుచుల ననుసరించి మార్పులుచేయటం జరిగింది; ఐనప్పటికీ సంస్కృతుల కలయికలో యీ మార్పులు తప్పవు.

మన సంగీతంలో అధికభాగం జర్మనీనుంచీ, ఇటలీనుంచి తీసుకోబడింది. చిత్రకళ ఫ్రాన్స్‌నుంచీ, న్యాయసూత్రాలు ఇంగ్లండ్‌నుంచీ. జనసమ్మతంగాఉండే సంగీతం ఆఫ్రికానుంచీ తీసుకోబడినవి.

సంకరమయ్యే సంస్కృతులు, సంస్కృతిని ముందుకు నడిపించినప్పటికీ, అందువల్ల ప్రమాదాలు కూడా ఉన్నవి. సంకరమైన సంస్కృతుల వల్ల సౌంజ్ఞలు కూడా సంకరమవటం జరుగుతోంది. ఇండియన్ తల పక్కకు ఊపటంచూసి 'కాదు' అన్నట్టు కనిపించినా, అతని ఉద్దేశం 'అవును' అని; విరుద్ధమైన వాక్యానికి జవాబు కూడా ఇలాగే ఉంటుంది. ఉదాహరణకు 'నీవు వెళ్ళలేదా ?' అన్న ప్రశ్నకు జపానీయుడు 'ఔను' అని జవాబిస్తాడు; అంటే 'కాదు' అని దాని భావం.

ఇలాటి సంకర సౌంజ్ఞలు ఒకానొకప్పుడు ముఖ్యంగా మంచి మర్యాదల్లో విరుద్ధభావాలను వ్యక్తం చేయటం లేదా మోసబుచ్చటం కూడా చేస్తుంటవి.

ఇతరులకు ఇబ్బంది గలిగేదీ, చిరాకు కలిగించే మాటలు చెప్పటం జపాన్‌లో మర్యాదగా భావించబడదు. ఇలాటిది ముక్కుకు సూటిగా వెళ్ళాలని వాంఛించే అమెరికనులకు నిజాయితీలేని భావాన్ని కలిగిస్తుంది.

జర్మనీలో తరగతులవారీ మనుష్యులకు మధ్య లేదా అధికారులపట్ల ఎంతో వినయాన్ని సూచించి, ఆయావ్యక్తులమధ్య ఎంతో భేదమున్నదనే భావాన్నే స్పష్టీకరించడం ఆచారం; కాని అమెరికన్‌లు అందరూ సమానులే అనే ధోరణిలో ప్రవర్తించటం, లేదా భేదాలు, తరగతులు లేవని నటించటం చేస్తుంటాడు; కాని, జర్మన్ సంస్కృతులలో వెల్లడయ్యేభేదాన్ని

చూసి చికాకూ, ఇబ్బందీ పడతారు. ముఖ్యంగా ఇలాటిది కపటమే కనుక మరింత చిరాకుగా ఉంటుంది.

సంకరమైన సౌంజ్ఞలనుంచి, మాటల అర్థాలే భేదించే స్థితికి రావటం తేలిగ్గా జరుగుతుంది; ఇక చేతులు కలిసేందుకు ఆ మాటలే వారితీ స్తవి. కనుక మనం యీనాడు జీవించే అంతర్జాతీయ ప్రపంచంలో యీ సౌజ్ఞలను అర్థంచేసుకోవటం అతిముఖ్యమైంది. అలాకానట్లయితే పరదేశీయులు ఎంతోమందితో స్నేహానికి మారుగా, విరోధం వొచ్చి వుండేది- మనకు.

పరదేశాల్లో ఉండటం, లేదా ప్రయాణాలు చేసి రావటం ఎంతో చాకచక్యంతో కూడుకున్న పని. త్వరితగతిని అర్థంచేసుకునేందుకు తగిన ప్రయత్నాలు చేయలేనివారికి ఆ యా క్రొత్తప్రదేశాలలో ఆనందముండను సరికదా, ఎంతో ఇబ్బందిపడి, వెగటనిపిస్తుంది. అమెరికన్ యాత్రికులు ఇందుకు మంచి ఉదాహరణ; పరదేశాల్లోని భోజనాలు, పడకలు, రైళ్లు మొదలైనవి అమెరికాలో వలె లేవని ఫిర్యాదులు చేస్తుంటారు. నిజానికి అవి అమెరికాలోవలె ఉండవు! ఐతే కొత్తవిషయాలను, ప్రదేశాలను, ఆచార వ్యవహారాలను చూసేందుకు కాకుంటే, వారు పరదేశాలకు యాత్రికులుగా వెళ్ళడం దేనికి ?

ఈ అమెరికన్‌లు ఇంటిదగ్గర ఉన్నప్పుడు, తమ దేశాన్ని గూర్చిన విమర్శలకు ఎంతో బాధపడతారు. పరదేశాలనుంచి వొచ్చే యాత్రికులంటే వారికి ఎంతో ఇష్టం— వారిని వినోదాలతో ఆనందపరచి, తమదేశంలోని సౌకర్యాలను, అమెరికన్ జీవితంలోని హాయిని ప్రదర్శిస్తారు. కాని విమర్శను మాత్రం వారు సహించరు. నిజానికి పరదేశీయులు అమెరికానుగూర్చి చేసిన విమర్శల నన్నిటినీ ప్రతిఘటించడం రోజూ జరుగుతూనే ఉంది.

"ఐతే వారు ఎక్కణ్ణుంచి వొచ్చారో తిరిగి అక్కడికే వెళ్ళరాదా!"

సంకరమైన సంస్కృతులవల్ల ఎల్లవేళలా సంభవమయ్యే యీ అపార్థాలు- పరదేశాలకు వెళ్ళి రావటంతో, తమదేశమే బాగున్నదని 'తెలుసు

కునేందుకు ఉపకరిస్తున్నవి. కనుక కొత్త వాతావరణాన్ని గూర్చిన విమర్శలు తప్పవు; దేశాటనంలో నేర్చుకోవలసిన విషయాల్లో ఇవి కొన్ని భాగాలేమో కూడాను।

ఇంటినుంచి దూరమయ్యామనే బాధవల్లకూడా విమర్శ జరుగుతోంది; సరిక్రొత్త స్థానాలను పిడిచామనే భావం, లేదా అపజయం ఎదురైందనే క్షోభ కారణాలు కావొచ్చు. ఇలాటి మానోభావాలను యాత్రికుడు, తన అభిప్రాయాలను కొత్తవాతావరణంమీద ప్రసరిస్తాడు. అతను "అమెరికన్ భోజనం చప్పగా, రుచీపచీ లేకుండా ఉన్నది_" అన్నాడంటే, అది అతని నిజాయితీతో కూడిన అభిప్రాయమే। "నాకు ఇండియన్ భోజనమే బాగుంటుంది; అంతేగాక, వడ్డించేవారు మంచి మర్యాదలను ప్రదర్శించలేదు, న్యూయార్క్ ప్రజలు ఇంగ్లీషు భాషను అర్థం చేసుకోలేరు. నా చక్కని ఇంగ్లీషు భాషోచ్చారణను వారు అర్థం చేసుకోలేకపోతే, నేను వెళ్ళే యూనివర్శిటీలోని వారికి నాపైన మంచి అభిప్రాయం ఏర్పడేట్లు చేయటమెలా ? నా చదువులో మంచి మార్కులు తెచ్చుకోవట మెలా ?"

తమనూ, ఇతరులనూ విడివిడిగా చూసి వ్యక్తిత్వాలను అర్థం చేసుకునే విధానాన్ని ఫ్రాయిడ్ చూపి మానవులు భయంతోనూ, ఖేదంతోనూ బాధపడకుండా చేశాడు. అదేవిధంగా వివిధ సంస్కృతులు కారణంగా వివిధ సమూహాలుగా యేర్పడిన మానవులు, తమతమ భావాలను అర్థంచేసుకొని, అవి భేదించినప్పటికీ, అందర్నీ కలిపి వుంచిన మానవత్వాన్ని అర్థం చేసుకునే అవకాశా లున్నవి. పూర్వంకన్న అధికంగా దూరప్రదేశాలను చూడబోయినవారు, యీ భేదాలను అర్థం చేసుకొని, అలాటి భేదాలను సమాధాన పరచుకొని అంతర్జాతీయ జీవితాన్ని సుఖతమం చేసుకునే అవకాశా లెన్నో ఉన్నవి.

జాతికి సంబంధించిన చరిత్ర, భూగోళం, వాతావరణం, భాష, సంస్థలు, ఆచారవ్యవహారాలకన్న జాతీయజీవితం అధికమైంది. సామాజిక

కన్న అత్యధికంగా ఎంతోమంది అమెరికన్‌లు వ్యాపారంలో పనులు చేసేందుకు నియమించబడినారు.

న్యూ ఇంగ్లండ్ రాష్ట్రం దాటి, న్యూయార్క్ రాష్ట్రంలో ప్రవేశిస్తూనే యాత్రికుడు కొండప్రదేశాలమీద చెట్లూ చేమలూ ఉన్న రహదారిగుండా, ట్రాఫిక్ లైట్స్, ట్రక్స్ వగైరా కనిపించకుండానే వందమైళ్లు ప్రయాణం చేస్తాడు. వారాంతాల్లోనూ, ఎక్కువ ముమ్మరంగా ఉండే గంటల్లో మినహా మిగతా సమయాల్లో యాత్రికుడు న్యూయార్క్ పట్టణం గుండా పశ్చిమానికి న్యూజెర్సీ టోల్‌గేట్‌కు, ఆగకుండానూ, ఎక్కువ ఆలస్యంలేకుండాను జేరుకోగలడు. అక్కణ్ణుంచి పెన్సిల్‌వేనియా టోల్‌గేట్‌కు కలిపే రహదారి ఓహియో రాష్ట్ర సరిహద్దులకు జేరుస్తుంది. ఈ రహదార్లు ఎక్కువ వేగంలో వెళ్ళేందుకుగాను నిర్మించబడినవి; ఇవి శుభ్రంగా, అందంగా, అమెరికన్ సుందరదృశ్యాల అందాన్ని చెడగొట్టే ప్రకటనలు లేకుండా ఉంటాయి.

టోల్‌గేట్లు ఒకరకం "దీవన" లైనప్పటికీ, వీటివల్లనే ప్రయాణం తేలిగ్గా జరుగుతోందనలేము. పెట్రోల్ దొరికే ప్రతి బంకూ, చేతికి సరిపడేటన్ని మంచిరకం దేశపటాల్ని సరఫరాచేస్తుంది. పోదల్చుకున్న దారిని ఎన్నుకొని, దాని నెంబర్ గుర్తుంచుకున్నట్లయితే రహదారిలో ఎమరయ్యే ఆవే నెంబర్లు సక్రమమార్గంలో నడిపిస్తవి. రహదార్లనుగూర్చిన వివరాలు ముందుగా తెలుసుకోవాలంటే, ఏ అయిల్ కంపెనీకి ఒకకార్డు రాసినా వెంటనే లభ్యమౌతవి.

కారు పశ్చిమానికి వేగంగా వెళ్తున్నకొద్దీ దృశ్యాలేగాక, భూమిరంగు కూడా మారుతూంటుంది. న్యూజెర్సీలో భూమి వర్ణం పసుపురంగులో ఉండి, ఇసుక ప్రదేశంగా ఉంటుంది. పెన్సిల్‌వేనియాలో భూవర్ణం ఎరుపు; ఓహియాలో గోధుమ వర్ణం; ఇల్లినాయిస్‌లో నల్లరేగడ వర్ణంలో భూమి కనిపిస్తుంది. భూవర్ణములోని భేదాలవలెనే, ఆ యా ప్రదేశాల్లోని ప్రజలు

కంటే దారిలో వొచ్చే గ్రామాలూ, పట్టణాల్లోని వీధులు జనసమ్మర్దంగా ఉంది. వేగంగా ప్రయాణంచేసేందుకు వీలుగాఉండే రోడ్ల నిర్మాణం జరిగి ఉండని కారణంవల్ల, రాజబాటల్లో ప్రయాణంచేస్తూ దారిలో తగిలే పట్టణాల్లోని చెడుభాగాలు- పెట్టెలో వస్తువుల్ని కుక్కినవిధంగా ఉండే మిల్లుల్నీ, శిధిలావస్థలో ఉన్న పెద్దపెద్ద భవనాలు ఇప్పుడు చౌకబారు గదుల్ని అద్దెకిచ్చే ఇళ్లుగా మారటం, పెద్దబజార్లల్లో పురాతన పద్ధతుల్లో నిర్మించిన అంగళ్ల ఇటుకలతోనూ క్లాఫ్‌బోర్డులతోనూ అందవికారంగా ఉండటాన్నీ- చూడవలసిరావటం ఒక దురదృష్టం. ఐతే నవీనపద్ధతుల్లో అభివృద్ధి పథనంలో గృహనిర్మాణాలు జరుగుతూండటం కూడా మనకంట పడుతుంది. యుద్ధానంతరం అమెరికా గృహనిర్మాణ కార్యక్రమంలో ఎక్కువశ్రద్ధ చూపసాగాక, మొత్తం దేశపు రూపురేఖలే మారసాగినవి. నూతన గృహాలు ఆధునిక పద్ధతుల్ని వివరిస్తవి. అవి క్రమవిధానంలో ఉండక, నిరాడంబరంగా, పెద్దపెద్ద కిటికీలతో ఉండి ప్రపంచంపట్ల స్నేహభావాన్ని ప్రకటించేవిగా కనిపిస్తవి. వీధుల్లో నిటారుగా సమకోణాల్లో బారులుతీరిన విధంగా యీ గృహాలు లేవు; అందుకు మారుగా అవి ఒకదానికి మరొకటి ఎంతో సమీపంలో ఉంటూ, వీధులుతిరిగిన వంకర్లకు అనుగుణంగా ఉంటున్నవి. అక్కడికి దగ్గర్లోనే నూతనంగా నిర్మించబడి, అందంగా కనిపించే దుకాణాలతో ఉన్నది. ఇల్లాలు సరాసరివొచ్చి, బిడ్డను బండిలోనే వొదిలి, గుట్టలుగుట్టలుగా ఉన్న, చక్కగా పాకెట్లుగా కట్టబడిన ఆహారదినుసులను కొనుక్కొని, నాలుగుమూలలా తిరిగేందుకు అనుకూలంగా ఉన్న పెద్ద మార్కెట్ కూడా కనిపిస్తుంది. ఒక గుమాస్తా కాష్ రిజిష్టర్ దగ్గర కొనబడిన సరుకుల్ని సరిజూస్తాడు; సహాయం అవసరమైనపక్షంలో మరొక గుమాస్తా ఆ సామానుల్ని ఆమె కారుదగ్గరికి జేరుస్తాడు. ఆమె తనకొరకు తానే వేచి వుంటుంది. ఈ విధంగా కాతాదారుడు తన కొరకు తానే వేచిఉంటూన్న సమయంలో, జనశక్తి వృధాచేయడం ఎంతో ధనవ్యయంతోకూడుకున్న దవుతుంది. ఐనప్పటికీ ఇంతకుపూర్వం

ఇంకా చీకట్లు వేళ్ళాడుతూనే ఉంటవి- మరో మూడుగంటల తరువాతకాని అక్కడ సూర్యోదయ మవదు. ఈ రెండు మహాసముద్రాలమధ్యా- ఒక పెద్ద భూభాగం- నిన్న మొన్నటిదాకా అరణ్యాలతో, బీళ్ళతో నిండిఉన్నది- ఇప్పుడు ప్రపంచంలోని వివిధ జాతులెవారు నివశిస్తూ, తామొక ప్రజ అని, తమదొక జాతీయతని పేర్లు పెట్టుకున్నారు.

మతం, భాష, శరీరఛాయ, వృత్తులు, వాతావరణం, జానపద విధానాలు- ఆచార వ్యవహారాలూ- మొదలైనవి వీరిని విడదీస్తున్నవి. న్యూ ఇంగ్లండు లోని గ్రామాల్లోని రిపబ్లిక్‌లు యీనాటికీ మూడు శతాబ్దాలక్రితం ఉన్న విధానంలోనే నడుపబడుతున్నవి; తమలో తాము ఎన్నికలు జరుపుకొని, కొంతమందిని ఎన్నుకొని, వారిని కొద్దిమొత్తాల ప్రతిఫలానికో, లేక ఉచితంగానో, ఏటా జరిగే వార్షికోత్సవంలో వోటర్లు సూచించిన విధానంలో ఆ గ్రామావసరాలను చూసేందుకూ, ఆయా పనుల్ని చేసేందుకూ నియమించటం జరుగుతోంది. ఆ గ్రామాలకు కొద్దిదూరంలోనే ఉన్న పట్టణాల్లో యూరప్‌లోని వివిధ ప్రాంతాలనుంచి వొచ్చిన కార్మికులు ఒక కొత్త సమాజాన్ని ఏర్పరచి- గ్రామవాసీలు ఎన్నడూ ఎరగని కొత్తకొత్త సమస్యల్నీ, ఇబ్బందుల్నీ తెచ్చిపెట్టడం జరుగుతోంది.

అమెరికన్ జీవితం ఒకస్థాయిని అందుకొన్నదని మాట్లాడేవారు న్యూయార్క్‌లోని లాబీవర్గాలను పరిశీలించినవారే! యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాను గూర్చి తెలుసుకొనేందుకు ఒకేమార్గం ఉన్నది: అది అమెరికాలో ఒక మహాసముద్ర తీరంనుంచి, మరో మహాసముద్ర తీరానికి ప్రయాణం చేయటం; ఈ ప్రయాణం రైల్లోనూ, విమానంలోనూ కాకుండా నేలమీద తగినంత వ్యవధిలో చేయాలి.

న్యూ ఇంగ్లండులో బయలుదేరినట్లయితే, వేగంగా ప్రయాణం చేసేందుకు అనువుగా ఉండే రాజమార్గాలు బహుకొద్దిగావటంవల్ల- ప్రతి ఐదు మైళ్ళకూ ఒకసారి ప్రయాణవేగాన్ని తగ్గించుకోవలసి ఉంటుంది: ఎందు

శాస్త్రీలు చేసిన కృషి ఫలితాలు అద్భుతమైనవైనప్పటికీ, ఆ శాస్త్రవిజ్ఞానం జవాబులు చెప్పలేని ప్రశ్నలెన్నో ఉన్నందువల్ల అదంతా ఒక నిగూఢ రహస్యంగానే ఉన్నది. ఒక సమాజంలోని వ్యక్తులందరూ సరిసమానంగ భావించబడుతూండగా, ఇరుగునఉన్న మరో సమాజంలోని వ్యక్తులు గతులవారీగా ఎందుకు చూడబడుతున్నారు ? ఒక ప్రజ ఎంతో అ… శక్తిసామర్థ్యాలను ప్రదర్శిస్తుండగా, మరొక ప్రజ అదంతా ఎం… క్తి హైనట్లుగా భావించి విశ్రాంతి తీసుకుంటూ ఉండటం ఎందు… తో… తోంది ?' వీటిని విశదీకరించేందుకు ఇవ్వబడే నిరాడంబరమై… జరు సమాధాన పరిచేవిగా తోచవు. …న జవాబు

ఆమెరికన్ సంస్కృతిని విశదీకరించటం చాలా కష్ట… దానివేళ్లు ఎంతెంతో దూరాలనుంచి వొచ్చినవి ; మూ… ం. ఎందుకం… సంస్కృతి పెరిగేందుకు సహాయపడినవి అనేకం … లాలకు లెక్కలేదు న్వయమంటూ ఉన్నవాటకం అనటంకన్న. వి… ఉన్నవి. దీన్ని స… దనటం సమంజసం. దీన్నంతను యీ విధం… ఎధ వినోదాలతోకూడి… పడతాం - అన్నిటిలోనుంచి చిన్నచిన్న … గా చూపేందుకు మేం ఇ… ప్రతిభావంతంగానూ కలుసుకొని పొయ్యే… భాగాలు శక్తివంతంగానూ మైన రూపాన్ని దాల్చింది. …ట్లుగా విసిరివేయబడి, పరిపూ…

---



# రెండో అధ్యాయం

## ముందుచూపు

రాకీ పర్వత తీరాలనూ, మైనీ ద్వీప భాగాలనూ వెలుగుతో నింపుతూ సముద్రపు టంచున … సూర్యోదయమైన సమయంలో కాలిఫోర్నియాలో

దానితోచేసే పనులూ, దానిమీది కట్టడాలూ భేదిస్తూంటవి : పెన్సిల్ వేనియా లోని ధాన్యపు కొట్టాలు తెల్లని అర్చిలతోనూ, ఆకుపచ్చరంగు తలుపుల తోనూ నిర్మించబడటంతో మొదలై, పశ్చిమాన అంబరచుంబితంగా ఉండే ఆకారంలోకి మారుతవి.

ప్రతిచోటా హోటళ్లున్నవి ; వాన కురిశాక కప్పపిల్లలు తండోపతండా లుగా విస్తరించి ఉన్నవిధంగా, రహదారిలో యాత్రికుల సౌకర్యార్థం పోటీలుపడి, పోయినకొద్దీ మంచిమంచి హోటళ్ళుగా రూపొందినవి. పశ్చి మానికి పోయినకొద్దీ అవి కాస్త చౌకగానూ, ఎక్కువ సౌకర్యాలతోనూ ఉంటవి; గోడలమీద తివాసీలు కప్పబడటంనుంచి, టెలివిజన్ ప్రదర్శ నాలూ, వార్తాపత్రికలూ, టెన్‌క్యూబ్స్, దానంతటదే ఉష్ణప్రసారంచేసే సాధ నాలవరకూ ఉచితంగా సమకూర్చబడుతవి. కొత్తఫర్నిచర్, పరిశుభ్రంగా కావలసిన పక్కబట్టలూ, తుండుగుడ్డలూ మొదలైనవీ, వేడినీటి స్నానాలూ మొదలైనవికూడా ఉచితంగానే సమకూర్చబడుచున్నవి.

తూర్పున ఉన్న జనసమ్మర్దమైన పట్టణాలు, దాని వెనుకనున్న పెద్ద భూభాగానికి ఒక నమూనా, కంటితుడుపు మాత్రమే ! పశ్చిమానికి కదిలి పోతూన్నకొద్దీ పట్టణాలు చిన్నవిగా కనిపిస్తవి – ఎందుకంటే ఎంత పెద్ద పట్టణంకూడా చిన్నదిగా కనిపించేటంత పెద్దఖండమిది ! చక్రాలు మైళ్లను దాటిపోతూండగా, భూభాగరూపాలే మారిపోతూంటవి. సమప్రదేశంగా ఉన్న మైదానమని పేరుపడిన కాన్సాస్‌లోకూడా అనేక మార్పులు కని పిస్తవి. సారవంతమైన నల్లరేగడి ప్రదేశాల్లో ఏపుగా పెరిగిన గోధుమ పంట, ఆకురాలే కాలంలోకూడా, వసంతంలోని ఆకుపచ్చవర్ణాన్ని కలిగి, ఉండి, కాంతివంతంగా మెరుస్తూ ఉంటుంది. ఇక్కడ - మిసిసిపీ నదికి వెనుక ఒకేప్రదేశంలో భూమ్యాకాశాలు కలిసినట్లుగా కనిపించే తావువరకూ ఏ రెండు, మూడు ఇళ్ళో కంటికి కనిపిస్తవి. అక్కడి పట్టణాలకు జేరుతే అవి దృష్టిని ఆకర్షించలేవు ; దుకాణాల ముందుభాగాలు నాసిగానూ,

గృహాలు పెట్టెలవలెనూ. ధాన్యపుకొట్టు చర్చిగోపురాలకన్న ఎత్తుగానూ ఉండి. ఎంతో అందవిహీనంగా కన్పట్టుతవి.

న్యూ మెక్సికోలో - పైకెగిరే దుమ్మూ. ధూళినిబట్టి అక్కడొక నది ఉన్నదని గ్రహించవలసి ఉంటుంది. కొన్నినెలలుగా అందులో నీరులేదు. అక్కడ పెరిగిన పిచ్చిమొక్కలూ. తుంగమొక్కలూ గాలికి ఎగిరి, చుట్టచుట్టుకొని రోడ్డుమీదికి వొచ్చిపడటం జరుగుతూంటుంది.

ఇక అరిజోనాలోని నిటారుగాఉన్న కొండలూ, పర్వతాగ్రాలూ, పెద్ద పెద్ద గోడలవలె ఉండి, రాతి కట్టడాలున్న శిధిలమైన పట్టణంవలె కని పిస్తుంది. ఇక్కడ చెట్లు - చివరకు కాక్టస్ చెట్లుకూడా కనిపించవు.

పర్వతాలు పైకి పోతున్నచోట లేదా. కాన్సాస్‌లోని జలపాతం కిందికి దూకుతున్నచోట తిరిగి వృక్షసంపద గోచరిస్తుంది. ఒక చిన్నలోయలో ప్రపంచంలోని ఐదారు వాతావరణాల్లో మాత్రమే కనిపించే పుష్పజాతులు పక్కపక్కనే కనిపిస్తవి. మరొక్క అడుగు ముందుకువేస్తే. ఎప్పుడూ పచ్చగా కనిపించే ప్రదేశాలు జరిగిపోయి. వేడిగా ఉండే ఎడారుల్లో కని పించే కాక్టస్, యుక్కా వృక్షజాతులు కనిపిస్తవి. ఇదొక చిత్రమైనదేశం; రోడ్డు పక్కగా ఉక్కుకడ్డీలతో కంచెలు వేసి ఉంటవి; పశువులు యీ ఉక్కు కడ్డీలమీద కాళ్లు వేయవు.

ఈ దేశంలోని ఆకాశంలో రోజంతా మేఘాలే కనిపించవు. సూర్య తాపం ఎండిపోయిన నేలను తాకుతూ ఉంటుంది. పశువులు ఎండిన మొక్కలమధ్య-కాస్త పచ్చగాఉండే పదార్థ మేదన్నా దొరుకుతుందా అని వెదుకుతూంటవి.

గొప్ప గొప్ప దృశ్యాలు కనిపించేదేశంకూడా ఇదే; గ్రాండ్‌కన్యాన్ అద్భుతముగా కన్పట్టి, దూరాభారమైన ప్రయాణానికి తగిన దృశ్యమని పిస్తుంది; ఇతర ప్రపంచంతో సంబంధం లేనట్లుగాఉండే ఇండియన్‌ల పల్లెల్లో - ఆ పురాతనకాలంలోని విధానంలోనే వారు జీవిస్తూంటారు. ఇక

పట్టణాల్లోని వీధుల్లో తెల్లవారికన్న నల్లవారే (ఇండియన్స్) అధికంగా కనిపిస్తారు. స్త్రీలు కొట్టవొచ్చేట్లుగా ఉండే రంగులున్న గౌనులూ, జాకెట్లూ వేసుకుంటారు. పురుషులు అప్పుడప్పుడు ఆ పూర్వపు పద్ధతుల్లోనే క్రాపు చేయించుకొని, తలకు రంగుల గుడ్డలు చుట్టుకుంటారు. పెట్రోల్ సరఫరా చేసే స్టేషన్లు పెట్రోలు అమ్మటంకన్న - ఇండియన్‌లు తయారుచేసిన దుప్పట్లూ, రగ్గులూ నగలూ మొదలైనవాటిని అమ్మేందుకు ఎక్కువగా దోహదం చేస్తూంటవి.

ఇక్కడి ప్రదేశమంతా సమతలంలోనే ఉన్నదనుకోవటం కేవలం భ్రమ ; ఎందుకంటే, మిసిసిపీ నదినుంచి అది ఎగువకు పోతునే ఉన్నది. న్యూమెక్సికోలోనూ, అరిజోనాలోనూ భూమి సముద్రమట్టానికి ఒకమైలు పైన ఉన్నది ; గ్రాండ్ కన్యాన్ దగ్గిర భూమి సముద్రమట్టానికి 7,000 అడుగుల ఎత్తున ఉన్నది.

గంటకు 70 మైళ్ళ వేగంతో పోతూన్నప్పటికీ, ఎప్పటికైనా యీ భూభాగం తరుగుతుందా అని ఆశ్చర్యపడవలసి వొస్తుంది. ఇద్దరు డ్రైవర్లు ఉన్నట్లయితే భూభాగంమీది ప్రయాణాన్ని 8, 10 రోజుల్లో ముగించవచ్చు; అంతకన్న తక్కువకాలంలోనే ప్రయాణాన్ని ముగించమంటే చాలా కష్టమైన పని. దృశ్య విశేషాలనుకూడా చూడదల్చుకుంటే యీ ప్రయాణానికి 200 గాలన్ల పెట్రోలూ, చాలా ల్యూబ్రికేషన్లు, ఒకటి రెండుసార్లు ఆయిల్ మార్చుకోవటం అవసరమౌతవి ; దారిలో అనేక క్షుద్రజీవులకు గంటకు 70 మైళ్ళ వేగాన పయనించే అద్దం మృత్యుశయ్యే అవుతూండటంవల్ల ఆగిన ప్రతిచోటా ముందున్న అద్దాన్ని శుభ్రపరచుకోవలసి వొస్తూంటుంది. ఈ 3,600 మైళ్ళ ప్రయాణాన్నీ కారు తనలోపం లేకుండా ప్రయాణించగలదని నమ్మకం ; యంత్రాల విషయంలో తమకు అంతా తెలుసని అమెరికనులు భావిస్తున్నారు.

కారే లేనట్లయితే అమెరికన్ ఎక్కడ, ఎలా జీవించేవాడు ? అశ్వశక్తి కవచాలతో అతను అడివినీ, దూరప్రదేశాలనూ జయించాడు : అది చేసే రొదా, ముందుకు ఉరికేప్పుడు ఊపే ఊపూ అతనికి మధురగీతాలు : దాని కాంతివంతమైన రంగూ, తళతళ మెరిసే క్రోమ్ - అనాగరికునికి అద్దమూ గాజుగోళాలంత ఆనందాన్నిస్తవి. కారు - కాంతివంతంగానూ, అందంగానూ ఉండేవాటిపట్ల అతని అనురాగాన్ని వెల్లడిస్తుంది; అది అతని పురోభివృద్ధికి సూచనగానూ, తన స్త్రీని మభ్యపెట్టి జయించేందుకు సాధనంగానూ ఉంటోంది. దాని అశ్వశక్తి అతని శక్తి సామర్థ్యాలకూ, స్వరక్షణకు ఉపకరిస్తోంది. అధికారి కోపంతో కేకలువేస్తే, లేదా భార్య గునిస్తే - దానికి తగిన ప్రతిఫలం అతనికి అందుబాటులో ఉన్నది - తన కుడికాలిక్రింది వంద అశ్వాలశక్తి సిద్ధంగా ఉంది. భార్య, అధికారికన్నా తన ఆధిక్యతను ప్రదర్శించేందుకు తోడ్పడి, కొద్దికాలంలోనే ఎంతోదూరం తనను తీసుకొని వెళ్ళగలదు.

పశ్చిమానికి పయనించటమంటే అమెరికన్ చరిత్రను పునఃశ్చరణ చేయటం - ఎందుకంటే అమెరికన్‌లు మొదటినుంచీ పశ్చిమానికి కదిలి పోతూనే ఉన్నారు.

దాదాపు అన్ని విజ్ఞానశాఖల్లోనూ పాఠాన్ని నేర్చుకున్నట్లుకూడా అవుతుం దీప్రయాణం. ఆ యా భూములు, నదులు, మైదానాలు అనేక పర్వత శ్రేణులు మొదలైనవి - భూగోళశాస్త్రాన్నీ, భూగర్భశాస్త్రాన్నీ మనఎదుట ఉంచుతవి, ఆ యా ప్రదేశాలలో ప్రత్యేక నివాసాలను ఏర్పరుచుకొన్న అనేక జంతుజాలాలు - లేళ్లూ, ఏంటిలోప్స్, బర్రెలూ, కుందేళ్ళూ, మైదానాలమీద ఉండే కుక్కలూ మొదలైనవి కనిపిస్తవి. దారిలో యూరప్‌లోని వివిధ ప్రాంతాలవారూ, మెక్సికన్‌లూ, ఇండియన్‌లూ, జపానీయులూ కనిపిస్తారు. వాతావరణంలోకూడా ఎంతోమార్పు కనిపిస్తుంది : తూర్పున మేఘావృతమైన ఆకాశానికిమారుగా పశ్చిమానికి సాగిపోతున్న కొద్దీ,

కాంతివంతంగా, వర్షచిహ్నాలేలేని ఆకాశం కన్పట్టుతుంది. ఆయా నదులూ అక్కడి ప్రజలకు భూమాత ఇచ్చే అనేక వస్తుసముదాయాలూ, తదను గుణంగా అవతరించిన పరిశ్రమలూ, హఠాత్తుగా కానాస్‌లో ఉద్భవించిన నూనెగనులూ మొదలైన వేల అంశాలు మనకెంతో విజ్ఞానాన్ని ఇస్తవి. వీటన్నిటినీ మించి ఆశ్చర్యచకితుల్ని చేసేవి. మనకు గోచరిస్తవి - మానవుడు ఎడారి ప్రదేశాలను ఏం చేసుకోగలడో ఇవి నిరూపిస్తవి.

అరిజోనాలోని పశ్చిమోత్తర దిశలో భూమిమీద కొండప్రదేశాలు అటూ, యిటూ వెదజల్లబడినట్లుగా ఉంటవి; వీటిమీద నిర్మించబడిన రోడ్డు మీద ప్రయాణం చేస్తుంటే హఠాత్తుగా ఆకాశం మీదినుంచి భూమిమీదికి దిగిపోతున్నట్లనిపిస్తుంది. ఎదురుగుండా బ్రహ్మాండమైన హూవెర్‌డామ్ సాక్షాత్కరిస్తుంది. ఇందులోని నీరు గ్రాండ్ కాన్యన్‌వరకూ విస్తరించి ఉంటుంది. ఈ డామ్ వసంతకాలంలోని వరదలు పరిసర ప్రాంతాలను తుడిచిపెట్టకుండా కాపాడుతుంది. చుట్టుపట్లకు అత్యవసరమైన నీటిని పంపి, సారవంతమైన భూములుగా మారుస్తుంది. అక్కడి 7,500,000 జనానికి గృహోపయోగముకొరకు కావలసిన విద్యుత్‌శక్తిని ఉత్పత్తి చేస్తుంది. దిగువనుఉన్న మరికొన్ని డామ్స్‌లోకూడా విద్యుత్ ఉత్పత్తి జరిపి, వ్యవసాయాభివృద్ధి జరిపేందుకు అవసరమైన నీటినికూడా, ప్రవాహాన్ని అదుపులో ఉంచటంద్వారా - సరఫరా చేయగలుగుతోంది.

హూవెర్‌డామ్‌నుంచి, 25 మైళ్ళ దూరంలోఉన్న నెవడాలోని లాస్ వెగాస్‌కు జేరుతాము. ఐతే యీ కాస్త దూరంలోనూ ప్రజాస్వామ్యకాది క్రమంగా ఉచ్ఛస్థాయికి వెళ్ళటం కనిపిస్తుంది. స్థానిక ప్రభుత్వాల సహకారంతో ఫెడరల్ ప్రభుత్వం ప్రజావసరాలను తీర్చింది. అక్కణ్నుంచి మిలామిలా మెరిసిపొయ్యే కాంతిలో మునిగిన పట్టణం - జూదరులకు ప్రసిద్ధి కెక్కింది. వినోదాలతో నిండిపోయి, తాగుబోతుల్ని ఆదరించేది. ఇలాటి నైచ్యాన్ని మరుగుపరిచే ఉద్దేశ్యంతో కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతిని ప్రసరించే లాస్‌వెగాస్ పట్టణం జేరుతాము.

లాస్‌వెగాస్‌నుంచి కాలిఫోర్నియాకు కొద్దిమైళ్ళదూరమే. ఇప్పుడు పెద్ద భూఖండమంతా మనవెనుక ఉంటుంది. ఐతే మనమింకా జేరవలసిన చోటికి జేరలేదు. ఎందుకంటే తూర్పు కాలిఫోర్నియా, అరిజోనా, నెవడాల వలెనే ఎగుడుదిగుళ్ళున్న పర్వతాలతో, చెట్లూచేమలూ లేకుండా, పచ్చదనం కలిసిన గోధుమరంగు ఎడారి ప్రదేశంగా ఉంది. కాక్టస్, సేజ్ మొదలైన ఎడారి వృక్షాలూ, పెరుగుదల ఆగిపోయిన జునిపెర్ చెట్లతో కనిపిస్తుంది.

శాన్ బెర్నార్డినో దగ్గర ఎడారి అంతమౌతుంది. వంకర టింకర్లుగా పెరిగి విస్తరించిన జోష్వాచెట్లకు, ముదురు ఆకుపచ్చ వర్ణంలో ఉండే జునిపెరీ చెట్లకు మారుగా—కొబ్బరి తోటలతో, నారింజతోటలతో కన్నుల పండువగా ఉండే ప్రదేశాలు కానవొస్తవి. బోడిగా కనిపించే నేలకు మారుగా దున్నిన మైదానాలు, ఆకుపచ్చ రంగులో మిలమిలా మెరిసే ప్రదేశాలు సాక్షాత్కరిస్తవి.

ఖాళీ ప్రదేశాలు మనవెనుక ఉంటవి. ఎందుకంటే ఎక్కడైతే ప్రకృతి శోభాయమానంగా ఉంటుందో ప్రజలు అక్కడే గుమికూడుతూంటారు. ఇక్కడి ట్రాఫిక్ నాలుగు వరసల్లో సాగిపోతూంటుంది. ఒకపట్టణం — మరొక పట్టణానికి దారితీస్తుంది. మధ్యలోను, రోడ్డుకు ఇరుప్రక్కలా నారింజతోటలు కనిపించి, ఆ యా పట్టణాల సరిహద్దులను సూచిస్తూంటవి. పర్వత శ్రేణులు మోటుగా ఇంకా పైపైకి పోతూనే ఉంటవి. ఐతే అక్కడి లోయలు వొత్తుగా పెరిగిన ధాన్యపు కంకులతో, గాలికి నవ్వుతూ, పాటలు పాడుతుంటవి. పశ్చిమదిశ ప్రయాణంలో భౌగోళికంగా ఇది ఖండాంతం.

కాలిఫోర్నియా పండ్లతోటలతోనూ, పచ్చని పైరులతోనూ విలసిల్లే ప్రదేశం, స్వాప్నికానుభవంవలె గోచరించే హాలీవుడ్ ఫాక్టరీతోను, చిత్రమైన మతవిశ్వాసాలున్న ప్రజలతో మాత్రమే నిండిఉన్నదికాదు. కాలిఫోర్నియాలో పరిశ్రమలు ఎంతో విస్తరించినవి. లాస్‌ఏంజిల్స్ విస్తీర్ణంలో

అమెరికాలోని పట్టణాల్లోకల్లా పెద్దది. కొన్ని రాష్ట్రాలలో ఉన్నవాటికన్న అధిక సంఖ్యాకంగా యీ పట్టణంలో కార్లున్నవి.

ఈ దేశాన్ని తూర్పునుంచి పశ్చిమంవరకూ దాటటం శ్రమతోనూ, ఉద్రేకంతోనూ కూడినపని. అందుకనే, ఇది ఒక సవాల్‌ను ఎదుర్కొంటు న్నట్లుంటుంది. పుస్తకాల్లో ఎంత వివరంగా చదివినప్పటికీ, కన్ను చూడ గలిగిందంతా కనిపించని కారణాన – చూసి తెలుసుకోవలసిందీ, నేర్చుకో వలసిందీ ఎంతో ఉంటుంది. ఒకటి మాత్రం నిజం. దేశవిస్తీర్ణ మనేది, ఆ దేశాన్నిగూర్చిన లెక్కల్లో ఒక సాధనంగా ఉంటుంది. దాని అత్యధిక వైశాల్యం – వివిధరకాల అంశాలలో ఉంటుంది – దృశ్యాలూ, మను షులూ, వాతావరణం, వృత్తులూ, జానపదరీతులూ, మాటతీరూ, దుస్తుల ధారణా, నమ్మకాలూ, తప్పులూ, ప్రభుత్వం, నేరాలూ, విశాలభావాలూ, సంకుచితాభిప్రాయాలూ, మంచీ చెడులూ - ఇలాటి వెన్నో కనిపిస్తవి.

తూర్పునుంచి పశ్చిమానికి దేశం నడిబొడ్డులోనుంచి ప్రయాణంచేస్తే యీ వివిధరకాల అంశాలలో కొన్నేమనకు కనిపిస్తవి. ముఖ్యంగా నీటి గుండా ఏర్పరచబడిన రహదార్లు మనకు తగలవు : యూరప్‌నుంచి సరు కులు సరాసరి గ్రేట్‌లేక్స్‌గుండా షికాగోకు, లేదా మెక్సికో అఖాతంగుండా నదిలో ఎగువకు మిన్నిసోటాలోని సెయింట్‌పాల్‌కు జేరవేసే అవకాశా లున్నవి. మెయినీనుంచి జార్జియాకున్న 2,000 మైళ్ళ అప్పలేషియన్ అడివిదారికూడా తగలదు. దక్షిణానఉన్న మెల్లిగాపారే పెద్దనదులుకానీ, అందంగాఉండే బ్రహ్మాండమైన మేడలుకానీ, సమోష్ణంగాఉండే ఫ్లోరిడా ప్రాంతంకానీ ఎదురవవు. అంతులేని దేశమల్లే కనిపించే టెక్సాస్‌కానీ, లూసియానాలోని దట్టంగా నాచుపట్టిన నదీతీరాలుకానీ, పశ్చిమోత్తర దిశ లోని బ్రహ్మాండమైన అరణ్యాలుకానీ, సియటిల్‌లోని కొండప్రదేశాలూ, పచ్చని మైదానాలుకానీ, గోల్డెన్‌గేట్‌దగ్గర పైకి ఎగబాకే ఎగుడు ప్రదేశాలూ

కానీ, దీపాల తోరణాలు వేళ్ళాడే ఆ వొంతెనలుకానీ మనకు ఎదురవవు. ఈ ప్రదేశాన్నంతనూ పటాల్లో చూడటానికి ఒక జీవితం చాలదు.

యునైటెడ్‌స్టేట్స్ సరిహద్దులమధ్య 30 లక్షల చదరపుమైళ్ళ వైశాల్యం ఉన్నది. ఇందులో 40% భూమి పచ్చిక పెరిగి, గొడ్లమేతకు ఉపయోగ పడుతోంది. 28% అరణ్యప్రదేశాలు, 22% వ్యవసాయానికి ఉపయోగ పడుతూన్నది. 10% కట్టడాలకూ, రోడ్లకూ ఉపయోగించబడింది. ఫెడరల్ ప్రభుత్వానికి చెందింది. దేశంలో 30%. ఇందులో జాతీయ అరణ్యప్రదేశాలు, పచ్చికబయళ్ళు, ప్రకృతి సహజమైన అద్భుతాలున్న ప్రదేశాలూ (గ్రాండ్ కాన్యాన్, కారల్స్‌బాడ్ గుహలు, వేడినీటి ఊటలూ, పసుపు పచ్చని రాతిపొరలున్న ప్రదేశాలూ మొదలైనవి) ఉన్నవి. 560 లక్షల ఎకరాలు - అంటే ఇంగ్లండ్, స్కాట్‌లండ్, వేల్స్ విస్తీర్ణమంత ఇండియన్‌ల కొరకు ప్రత్యేకించబడింది.

స్వభావసిద్ధంగా ఫలవంతంగాఉన్న భూమిమీద ప్రపంచంలోని అడివి జంతువు లనేకరకాలు ఉన్నవి. యునైటెడ్‌స్టేట్స్ అద్భుతమైన పంటను పండిస్తోంది. 3,000,000,000 బుషెల్స్ బియ్యం, 1,000,000,000 బుషెల్స్ గోధుమ; 355,000,000 బంగాళాదుంపలు-1954 లో పండించబడినవి. అదే సంవత్సరంలో 25,000,000,000 పౌనుల మాంసం ఉత్పత్తి చేయబడి భక్షించబడింది.

బొగ్గు, పెట్రోలు, ఉక్కు, విద్యుత్‌శక్తి, రాగి, పత్తి మొదలైనవాటిని ఉత్పత్తి చేయటంలో యునైటెడ్‌స్టేట్స్ మిన్నగా ఉంటోంది. ప్రకృతి ఇచ్చిన ఇలాటి ఐశ్వర్యం ఇంతకుముందు - ముందు వెనుకల ఆలోచన లేకుండా వృధా చేయబడింది. లేదా ప్రపంచంలోని నిరంకుశత్వాన్ని ప్రతిఘటించేందుకు, లేదా విజయానంతరం దెబ్బతిన్న ప్రదేశాలను బాగుచేసేందుకు విరివిగా వినియోగించబడినది. ఐనప్పటికీ ఆ నేలలో ఇంకా ఎంతో ఐశ్వర్యం ఉన్నది. దీన్ని ఇకముందు జాగ్రత్తగా వ్యయపరచవలసిన అవసరమూ ఉన్నది.

యాత్రికులు అమెరికన్ జీవితం అందుకున్న స్థాయినీ, శాశ్వత ధోర ణినీ సామాన్యంగా గమనిస్తారు. సినిమాలు, రేడియోలు, స్వశక్తిచోదిత వాహనాలనూ, వస్త్రాలనూ అమ్మే జాతీయసంస్థలూ, పాక్ చేయబడిన ఆహార పదార్థాలూ, మేగజైనులూ మొదలైనవి ఎంతో ఉపకరిస్తూ - వాటిల్లో కనిపించే విధంగానే అమెరికన్ ప్రవర్తన ఉండటం జరుగుతోంది' సంస్కృతిలోని అనేక భాగాల్లో వారు పాలు పంచుకుంటున్నారు. ఇలా భాగాలు పంచుకోవటంవల్ల - వారు తాము అనుభవించవలసిన వ్యక్తిత్వా నికి, ప్రత్యేకతకు, విభేదానికీ గురికావటంలేదు. అతను - వెర్మాంట్ లోని రైతు అవనీ, మిసిసిపీమీద పడవనడిపే సరంగు అవనీ, కానాస్ లోని షాపువాడుకానీ, షికాగోలోని పండితుడు అవనీ, టెక్సాస్‌లోని నూనె ఉత్పత్తిదారు అవనీ, పరిశ్రమలో పనిచేసే నీగ్రో కార్మికుడు అవనీ, గ్రీస్‌నుంచి వచ్చిన రెస్టారెంట్ యజమానికానీ, పోలెండ్‌లోని తల్లిదండ్రుల కుమారుడైన వైద్యుడవనీ, జపానీయుల సంతానమైన అమెరికన్ అవనీ, పశ్చిమోత్తర దిశలోని తోటపనివాడుకానీ - వీరందరూ చూపులకు భేదంగా కనిపించినప్పటికీ, వీరిని అమెరికన్‌లని తేలిగ్గా గుర్తు పట్టవొచ్చు.

చికాకు పరచకుండా వివిధ జాతుల్ని కలగాపులగం చేయకుండానూ, వారి వారి వ్యక్తిత్వాలు భంగంకాకుండా మానవు లందర్నీ ఒక తాటిమీదికి తీసుకొని రావటం - సంస్కృతి సాధించగలిగిన అత్యున్నతాశయాల్లో ఒకటి కాదా ? అనేకరకాల మనుషుల్ని కూడగట్టి, ఆ రకరకాల సంస్కృ తినీ వారు అనుభవించి ఆనందించేందుకు ఎలాటి ఆటంకాలూ లేకుండాచేసి సమాజంలో కొంత అధికారమూ, ఆనందమూ లభ్యమయేట్లు చేయటం సంస్కృతికి ఒక అగ్నిపరీక్ష కాదా? నేటి అమెరికాను సృష్టించిన వ్యక్తు లందరూ-అన్నిటికన్నా మిన్నగా ఉన్న యీ ఆశయాన్ని కాదా సాధించింది?

# మూడో అధ్యాయం

## సఫల జాతీయత

మానవచరిత్రలో ఇలాటిది ఇంతకు ముందెన్నడూలేదు. తమ తమ గ్రామాల్లో కలకాలంగా ఉంటూ, ఆ సమాజానికి సంబంధించిన ఆచార వ్యవహారాలకు అలవడి, తెలిసిన మొహాలు రక్షణ నిస్తుండగా హాయిగా జీవితాలను సాగించేవా రనేకమంది అమెరికాకు వలసలు వొచ్చారు. వీరు- ఇటలీ, ఐర్లండ్, జర్మనీ, రష్యా, గ్రీస్, బాల్కన్‌దేశాలు, స్కాండినేవి యాల నుంచి తరలి వొచ్చారు.

ఒక తావులోని నివాసాలను విడిచి, వేరొక తావులో నివాసాలను ఏర్పరచుకొన్న యీ మానవగాథ లెక్కలద్వారా తెలియవొచ్చేదికాదు. అంతకు ముందెన్నడూ ప్రయాణం చేయనివారు, ఏ ఇబ్బందులపాలై ఏ అవమానాలకు గురై ఏ కష్టాల నెదుర్కొనవలసివొచ్చి వారు సరిహద్దు ప్రాంతాలనుంచి ముందుకు చూసుకొని వెళ్ళేందుకు సంసిద్ధులయ్యారో తెలి యదు. 1850 నాటికే ఇలా వలసవొచ్చేవారు ఏటా 370,000 మందిదాకా ఉంటున్నారు. ఈ అంకె అట్లాంటిక్ మహాసముద్రతీరాల్లోని పరిస్థితుల్ని బట్టి పెరగటం, తరగటం జరుగుతున్నప్పటికీ - అది పైకి పొయ్యేదిగానే ఉంటున్నదనే చెప్పాలి. 1905 నాటికి ఏటా 10 లక్షలమంది కాందిశీకులు రాసాగారు. మొదటి ప్రపంచయుద్ధం యీ జనప్రవాహాన్ని ఆపింది. యుద్ధానంతరం తిరిగి ఇది పెరుగుదల అవసాగాక, చట్టాలు దీన్ని తగ్గించినవి. ఇప్పటికి అమెరికాకు వొచ్చిన మిలియన్ల జనాభాను అమెరి కన్‌లుగా రూపొందించటం పెద్దపనిగా తయారైంది. ఏమైనా యీ నాటి కూడా అమెరికన్ జాతినిబట్టి చూస్తే కాందిశీకులరాక చిన్నదే ఐనప్ప

టికీ - ఏటా 2 లక్షలమంది వలస వొస్తున్నారు. ఈ జనాభా ఒట్టావా పట్టణ జనసంఖ్యంత ఉంటూన్నది.

1820 - 1953 సంవత్సరాలమధ్య అమెరికాకు వలసవొచ్చిన వారి సంఖ్య 4 కోట్లు. వీరిలో 45 లక్షలమంది గ్రేట్‌బ్రిటన్ నుంచి. అంతకన్న కాస్త ఎక్కువమంది ఐర్లెండ్‌నుంచీ. 25 లక్షలమంది స్కాండినేవియా నుంచీ. దాదాపు 50 లక్షలమంది ఇటలీనుంచీ. 65 లక్షలమంది జర్మనీ నుంచీ. మధ్యయూరప్. తూర్పుయూరప్ భాగాలలోని రాజ్యాలు తరుచు సరిహద్దుల్ని మార్చుకుంటూండటంవల్ల దేశాలవారీగా కాకుండా మొత్తంగా ఆ ప్రదేశాలనుంచి 80 లక్షలకు పైగా జనం అమెరికాకు వలస వొచ్చారు.

దీని ఫలితాలివి : అనేక జాతీయతలు కలిసిన ఒక ప్రత్యేక జాతీయత అవతరించింది. ప్రపంచంలోని అనేక భాషలు వినబడే ప్రదేశాలు ఏర్పడి నవి. నేటికీ మ్యూనిచ్‌లోని జర్మన్ సమాజంలాటి సమాజమూ ; మాడ్రిడ్ లోని స్పానిష్ సమాజంలాటి సమాజము : జూరిచ్‌లోని స్విస్ సమాజం లాటి సమాజమూ కనిపిస్తవి. డెట్రియాట్‌చే చుట్టబడిన హామ్‌ట్రమన్ తన స్వంతప్రభుత్వమున్న పోలిష్ పట్టణాం. లాస్ ఏంజిలీస్ ప్రపంచంలోని పెద్దదైన మెక్సికన్ పట్టణాల్లో రెండోది. చైనా గడ్డను దాటిన తరువాత శాన్‌ఫ్రాన్సిస్‌కోలోనే పెద్ద చైనీయుల సమాజం ఎదురవుతుంది. దీనికి ప్రత్యేకంగా ఆసుపత్రి. పోస్టాఫీసు. థియేటర్లు. రేడియో స్టేషన్. దినపత్రికలు. టెలిఫోన్ ఎక్స్చేంజిలు ఉన్నవి. ఇక్కడి టెలిఫోన్ ఆపరేటర్లు చైనాభాషలోని ఆరురకాల యాసలనూ మాట్లాడుతూ. తమ చందాదారుల పేళ్ళను క్షుణ్ణంగా అప్పగించగలిగి ఉన్నారు. ఇటాలియన్ల సంఖ్యలో మిలాన్ తరువాత షికాగో వొస్తుంది. పోలిష్ జనసంఖ్యలో వార్సా తర్వాతకూడా వొస్తుంది. స్విస్‌దేశీయుల వలసతో గ్రీన్‌సిటీ ఏర్పడింది.

న్యూ మెక్సికో ద్విభాషారాష్ట్రంగా ఉంటూ. అధికారపు ఉత్తర్వులు ఇంగ్లీషు. స్పానిష్‌భాషల్లో ప్రకటించబడుతుంటవి. రాష్ట్ర సంబంధమైన

కాన్‌స్టిట్యూషన్ కూడా ఈ రెండుభాషల్లోనూ లిఖించబడింది. న్యూమెక్సి కోలో ఆ పురాతనపు స్పానిష్ ఆచారాలతో జీవితాన్ని గడిపే సమూజాలు పల్లెల్లో వున్నవి. అక్కడ ఒక్క ఆంగ్లపదమన్నా వినిపించదు. ఇక అరిజోనాలో ఇండియన్స్ మూడోవంతు భూభాగాన్ని ఆక్రమించుకొని తమ తాతలూ, తండ్రుల కాలంనాటి ఆచార వ్యవహారాలను పాటిస్తున్నారు.

అమెరికన్ పట్టణాల్లోకల్లా చిత్రమైనది న్యూయార్క్. ఇంగ్లీషు గాకుండా 200 ఇతర భాషల్లో పత్రికలు ఇక్కడ ప్రచురించబడుతూన్నవి. న్యూయార్క్ జనాభా 80 లక్షల్లోనూ - సగానికిపైగా ఇతరదేశాల్లో పుట్టిన వారూ, లేదా ఇతరదేశ వాసులకు జనించినవారూను. వీరిలో ఇటాలి యన్‌లూ, రష్యన్‌లూ - (ఒక్కోరు 4 లక్షలు) పరదేశాల్లో పుట్టిన వారిలో అధిక సంఖ్యాకులు. అనేక దేశాలనుంచి వచ్చిన యూదులూ. కొన్ని తరాలుగా యునైటెడ్‌స్టేట్స్‌లోనే నివసిస్తున్నవారు నాలుగోవంతు జనాభాకు ఉన్నారు. యూదులెక్కువగా ఉన్నపట్టణాల్లో న్యూయార్క్‌కు ప్రథమస్థానం లభిస్తుంది. వీరుగాక - నీగ్రోలూ. ప్యూర్టోరికాలు. హైటి యన్‌లు. మెక్సికన్‌లు మొదలైన వారనేకులు ఉన్నారు.

యూరప్‌లోని అన్నిజాతీయతలూ. ఆసియా. ఆఫ్రికా. ఇతర అమెరి కన్ రాష్ట్రాల జాతీయతలూ కలిసి 'అమెరికన్' గా రూపొందింది. వీరందరూ అమెరికన్‌లే. ఎందుకంటే ఒకసారి ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ "మనందరమూ వలస వచ్చిన కాందిశీకులమే !" అన్నారు.

## నానా విధానాలలోని ఐక్యత.

యూరపియన్స్ ప్రపంచానికి కొలంబస్ తెరిచిన ద్వారాలగుండా 17 వ శతాబ్దంలో అరు జాతీయతలవారు అమెరికా ఖండంమీద స్థావరాలను ఏర్ప రుచుకున్నారు. స్పెయిన్ దేశీయులు నైరుతి దిక్కున సాగివెళ్ళి కాలి ఫోర్నియా తీరాలను జేరారు. ఫ్రెంచివారు మిసిసిపీనదిని మొదట్లో కను

కున్నవారిలో ఒకరై, న్యూఆర్లియన్స్‌లో స్థావరాలను ఏర్పరుచుకున్నారు. ఈ నాటికీ ఫ్రెంచి సంస్కృతి ఆ పురాతనపు ప్రదేశాల్లో స్పష్టంగా కనిపిస్తూంటుంది. లూసియానా తీరాల్లో ఫ్రెంచిభాషే ముఖ్యభాషగా యీ నాటికీ ఉంటున్నది

డెలెవెరే రాష్ట్రంలో మొదట్లో స్వీడన్ దేశీయులు స్థావరాలను ఏర్పరుచుకొని దానికి న్యూస్వీడన్ అని పేరుపెట్టారు. న్యూయార్క్ రాష్ట్రం ఇంగ్లీషువారికి పూర్వం డచ్‌వారిచే ఆక్రమించబడిందని అందరికీ తెలిసిన సంగతే : ఇక పెన్సిల్‌వేనియా రాష్ట్రం - ఏ జర్మన్ రాష్ట్రానికి సంబంధించిన పతాకంక్రిందా లేనప్పటికీ, అక్కడి జనాభాలో అత్యధికభాగం జర్మన్‌లే. (1720 లో కూడా దీన్ని పెన్సిల్‌వేనియా డచ్ అని పిలిచేవారు).

యూరప్‌నుంచి వలసవొచ్చి స్థావరాలను ఏర్పరుచుకొన్న వారిలో అత్యధిక సంఖ్యాకులు బ్రిటీష్ దీవులవారు. ఇంగ్లండ్, స్కాట్‌లండ్, వేల్స్, ఉత్తర ఐర్లెండులనుంచి మొత్తం జనాభాలో దాదాపు సగమంది వొచ్చారు. అమెరికన్ జీవితంలోని ప్రాథమికత బ్రిటీష్‌వారికే సంబంధించి ఉన్నదనటం సమంజసం. భాష, చట్టం, కుటుంబీకులపేర్లు, ప్రభుత్వంపట్ల ఉండే అభిప్రాయాలు, సాహిత్యం - మొదలైనవి బ్రిటీష్ సంస్కృతినుంచే వొచ్చిన వనటంలో ఎలాటి సందేహమూలేదు. ఐతే, ఈ సంస్కృతి అనేక ఇతర పలుకుబడులకిందపడి ఎందుకు మరుగుపడిపోలేదు ?

ముఖ్యకారణం ఇది : నేటి జాతి ఏర్పడేందుకు కారకులైన మొదటి కాందిశీకులు ఇంగ్లీషువారు. 170 ఏళ్ళదాకా అమెరికాకు వలసవొచ్చినవారు ఇంగ్లీషురాజు పాలనకింది ప్రజలుగానే ఉన్నారు. వీరి పునాదులు, భాష, సంస్థలు - చివరకువారు రాజుగారిమీద తిరుగుబాటు చేసిన విధానం - ఇవన్నీ కూడా ఆంగ్ల సాంప్రదాయానుసారంగానే ఉన్నవి. "ప్రాతినిధ్యం లేకుండా పన్నులు చెల్లించం" అనే వారి నినాదాలు - వలస వొచ్చినవారు లేదా

అమెరికన్‌లవికాక, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవిస్తు పుట్టిన ఆంగ్లేయుని ప్రాథమిక హక్కులను సూచించేవిగా ఉన్నవి.

మొదటి ఆంగ్లస్థావరం, స్థానికమైనది జేమ్స్‌టౌన్. ఇది ఒక క్రమపద్ధతిలో నిర్మించబడి, ఆనాటి గొప్పవారి సహకారాన్ని పొంది, ప్రభుత్వపు టాజ్ఞలతో రూపొందింది. రెండవ స్థానిక స్థావరం ప్లిమౌత్. ఇది ఇంగ్లండ్ ఉత్తరదిశలో ఉండే చిన్నచిన్న రైతులచే నిర్మించబడింది. తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ఆ రైతులు పరవశులై, ఆంగ్లికన్‌వలెగాక, బైబిల్‌ను తమ ధోరణిలో అర్థం చేసుకొని, ఆనాటి ఆంగ్లప్రభువుల అజ్ఞానుసారం గాకుండా, తమ ప్రత్యేక పద్ధతుల్లో పూజాపునస్కారాలు చేసుకున్నారు. మతైక ప్రాధాన్యతఉన్న సమాజాలు ఏర్పడటంలో ప్లిమౌత్ మొదటిది. సలెమ్ తరువాత బోస్టన్, ప్రావిడెన్స్, న్యూహెవెన్, కనెక్టికట్ రాష్ట్రభాగాల్లో చిన్నచిన్న స్థావరాలు, ఒకదానికొకటి సంబంధం లేకుండా, ఒకదానిమీద మరొకటి ఆధారపడకుండా ఏర్పడినవి. న్యూ ఇంగ్లండ్ రాష్ట్రమందంతటా గ్రామాలకు సంబంధించిన రిపబ్లిక్‌లు ఏర్పడి, ప్రభుత్వానికి అత్యవసరమైన భాగాలుగా ఉంటూ వర్థిల్ల సాగినవి.

వలసరాజ్య విస్తరణ కాలమం దంతటా - వలసవొచ్చినవారిలో అత్యధికులు ఇంగ్లీషువారు, స్కాట్‌లెండ్ నుంచి ఉత్తర ఐర్లండ్‌కు వెళ్ళినవారూను. 20 లక్షలమంది బానిసలు వొచ్చినప్పుడుకూడా, వారిరాక అమెరికన్ సంస్కృతికి రూపాన్నివ్వటంలో ముఖ్యాంశమైనప్పటికీ- ఆంగ్ల ప్రాధాన్యతనూ, చట్టాల్నీ, భాషనూ, ప్రభుత్వాన్ని సవాలుచేయలేదు.

వలసవొచ్చిన ఇంగ్లీషువారూ, స్కాట్లండ్‌వారూ - ఎన్నోరకాలకు చెంది, ఎన్నో భేదాలతో ఉన్నప్పటికీ– వారిమధ్య రెండువిషయాల్లో ఎంతో సామ్యం కనిపిస్తుంది : తమ ఇళ్ళదగ్గరి పరిస్థితులు అసంతృప్తికరంగా ఉండటమూ, ఇక్కడ కొత్తదారులు తొక్కేందుకు ఎన్నో అవకాశాలుండడమూను. ఉత్తములుగా పరిగణించబడే మనుషులు కొంతమంది–

విలియమ్ బ్రాడ్‌ఫర్డ్, బాడ్‌విన్‌థ్రాడ్, విలియమ్ పెన్, లార్డ్ బాల్టిమోర్ మొదలైనవారు– తమతమ మత విశ్వాసాలను స్వేచ్ఛగా వెల్లడించుకొనే అవకాశాలున్న సమాజాలను రూపొందించాలనే సదుద్దేశంతో వలస వొచ్చారు. మిగతావారు_తమ సంకుచిత జీవితాలనుంచి–తమ కుటుంబాలను పోషించుకునేందుకు తగినంత భూమి లేకుండటం, కఠినంగా ప్రవర్తించే భూస్వాములు, క్రుంగిపొయ్యే పన్నులభారం మొదలైనవాటినుంచి తప్పించుకునేందుకు వలసలు వొచ్చారు.

"భగవంతుడే ఒక జాతిని ఏర్చి కూర్చి, యీ అటవీప్రదేశంలో నాణ్యమైన విత్తనాలుగా చల్లేందుకు ఉద్దేశించి పంపాడు" అని విలియమ్ స్టాగ్‌టన్ రాశాడు. ఆయన చెప్పింది సరైనమాట. ఇక్కడ స్థావరాలను ఏర్పరుచుకో దలచుకున్న వారికూడా కొన్ని నియమాలుండి, వారు వాటిని పాటించవలసి వొచ్చింది.

అమెరికాకు వలస రావటమనేది మొదటినుంచీ అంతర్జాతీయంగానే ఉంటూన్నది. పెలిగ్రిమ్స్‌తో పాటే వాలూన్ ప్రజలూ, ఫ్లెమిష్ జాతీయులూ వొచ్చారు. ఓక్సు టౌన్‌లో ఇటాలియనులూ, డచ్‌వారూ, పోలెండ్ వారూ ఉన్నారు. వలసల్లో స్థావరాలను ఏర్పరుచుకున్న మొదటివారిలో ఫ్రెంచ్‌వారూ ఉన్నారు; వీరిలో అమెరికన్‌లలో అగ్రగణ్యు లనదగిన పాల్ రెవరే, డ్యూ పాంట్స్ మొదలైనవారు ఫ్రెంచ్‌వారినుంచే వొచ్చారు. జర్మన్ ప్రొటెస్టెంట్స్– ముఖ్యంగా మెన్నోనైట్, మోరలియన్స్ తెగలకు చెందినవారు మతైకమైన బాధలకు తాళలేక, పెన్సిల్‌వేనియా రాష్ట్రింలోకి మందలు మందలుగా వొచ్చి, విలియమ్ పెన్, మత సహనాలలోని మిత్రత్వాన్ని రుచిచూపారు. అట్లాంటిక్ మహాసముద్ర తీరంలోని వలసలన్నిటిలోనూ ఆంగ్లసంస్కృతి, అంతర్జాతీయాభిరుచులతో మిళితమైంది.

1654 లో మొట్టమొదటి యూదులు మన్‌హత్తన్ జేరారు. కాని 1646 లోనే ఆ చిన్నద్వీపంలో 12 జాతీయతలకు సంబంధించిన ప్రజలు,

ఒకే సమాజంగా సహజీవనం చేస్తూ, ఉత్తరోత్తరా ప్రపంచంలోని సహ జీవన సిద్ధాంతాన్ని నిరూపించేదిగా కన్పట్టించి.

అమెరికన్ సంస్కృతిలోని సారమంతా—అనేక తావులనుంచి, జాతీయతలనుంచి సమకూర్చబడినప్పటికీ స్పష్టమైన వ్యక్తిత్వాన్ని కలిగియున్నది; కొత్తగా కనిపెట్టబడిందికాకున్నా, నూతన విధానంలో, కొత్త కొత్త అభిరుచులకు నిలయమైంది. శక్తిసామర్థ్యాల ప్రయత్నాలూ, సిగ్గుపడవలసిన కొన్ని అన్యాయాల ద్వారానే యీ ఫలితాలు లభ్యమైనవి. డెలెవెరే రాష్ట్రంలో స్వీడనీయుల్ని డచ్‌వారు తరిమివేశారు; ఇంగ్లీషువారు డచ్‌వారిని తరిమివేశారు. ఉత్తర అమెరికన్ భూభాగాల్లో భాగాలు కుదరక మొత్తం దేశమంతా తమ అధీనంలో ఉండాలనే ఉద్దేశంతో ఇంగ్లీషువారూ, ఫ్రెంచ్‌వారూ వందేళ్ళు తమలోతాము పోరాడారు. పోరులోకి వారు ఇండియన్‌లను కూడా లాగి, యూరప్‌లో అధికారంకోసం పోరాడే యుద్ధాల ధోరణికి దీన్ని రూపొందించారు.

1763 లో పారిస్ సంధి జరిగాక, ఉత్తరదిశనుంచి ప్రమాదం రాదని నిశ్చయంగా తెలిసింది; స్పెయిన్ ఫ్రాన్స్‌తో చేతులుకలిపి యుద్ధంలో పాల్గొన్న నేరానికిగాను ఫ్లారిడాను వొదులుకోవలసి వొచ్చింది. (1783 లో కొద్దికాలంవరకూ తిరిగి ఇవ్వబడిన తరువాత యునైటెడ్ స్టేట్‌చే కొనబడింది.) ఈ ఖండం తూర్పుదిశను ఉన్న వలసలన్నీ ఇంగ్లీషువారి అధీనంలోకి వొచ్చినవి. తనుక ప్రభుత్వాన్నిగూర్చిన అభిప్రాయాలూ, మతవిశ్వాసాలూ, కుటుంబ జీవనం మొదలైనవాటికి సదవకాశాలు చిక్కినవి. ఐతే డచ్‌వారి సద్వర్తనావిధానం, ఫ్రెంచ్‌వారి ధైర్యసాహసాలు, స్వదేశీయుల విజ్ఞానం, నాగరికతా, నీగ్రోల సంగీతము, విషాదము, ఎంత కష్టానయినా ఎదుర్కొ-గలిగిన స్కాట్స్ సహనం మొదలైనవి ఆంగ్లపద్ధతులకు కలిసినవి.

ఇంగ్లీషువారు-అమెరికన్లయి-ఇండియన్స్‌వలె వ్యవసాయం చేయటం' వేటాడటం నేర్చుకున్నారు. అంతేగాక ఇండియన్స్‌వలె పోరాడుటయూ నేర్చుకున్నారు; ఈ కౌశలం విప్లవం జరిగినప్పుడు బ్రిటిష్‌వారితో పోరాడేందుకు ఎంతో ఉపకరించింది.

అట్లాంటిక్ మహాసముద్రానికి పశ్చిమదిశలో స్థావరాలను ఏర్పరచుకోవలసి వొచ్చినప్పుడు, అనేకమంది శక్తిసామర్థ్యాలూ, కౌశలం అవసరమైనవి. కనెక్టికట్ నదీతీరాన ప్లిమౌత్ ఒక చిన్న వ్యాపార పట్టణంగా అవతరించాక, థామస్ హూకర్ తన మతాన్ని అడివిదారులగుండా నదీతీరాన్ని జేర్చటంతో పశ్చిమానికి కదలి వెళ్ళటం ఆరంభమైంది.

కెనడా బ్రిటిష్‌వారి చేతుల్లో పడ్డాక, పశ్చిమదిశ మరింతగా ఆకర్షించసాగింది. వెర్‌మాంట్ నిశ్చయ స్థావరమైంది; పశ్చిమ న్యూయార్క్‌రాష్ట్రంలోని మొదటి సమాజాలకు మరికొన్ని జేర్చబడినవి. విప్లవం పూర్తయాక పశ్చిమోత్తర దిశకు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న యువకులు అవసరమయ్యారు. న్యూ ఇంగ్లండునుంచి ఓహియో నదిమీది మెలియట్టులో మొదటి స్థావరాలను ఏర్పరచుకున్నారు. పెన్సెల్‌వేనియానుంచి మెనోన్నైట్స్, అలసట నెరుగని స్కాచ్-ఐరిష్‌వారూ పశ్చిమానికి పయనమయ్యారు. ఇల్లినాయిస్, విస్కాన్సిన్, మిఛిగన్, ఇండియానాలలో స్థావరాలు ఏర్పడినవి. తరువాత జఫర్‌సన్ లూసియానా రాష్ట్రాన్ని కొన్నాక, మరో క్రొత్త దేశం పరిశోధించబడవలసింది తయారైంది. ఈ విధంగా సరిహద్దుప్రాంతాలు పశ్చిమానికి ఉరుకులు పరుగుల్తో పయనించినవి.

## సరిహద్దు ప్రదేశాలు.

'సరిహద్దు' అనేమాటకు యూరప్‌లో వ్యాడుకలో ఉన్న అర్థంకన్న, అమెరికన్‌లకు కొత్త అర్థంతో ధ్వనిస్తుంది. యూరప్‌లోని 'సరిహద్దు'

అంటే–అక్కడ కాపలా ఉంటుంది: దాన్ని . దాటవలసినవారు అక్కడ నిలిచి తమతమ పత్రాలను కాపలావారికి చూపికాని కదిలేందుకు లేదు. కాని అమెరికన్ 'సరిహద్దు'–స్వేచ్ఛకు, అవకాశానికి, అభివృద్ధికి ఏర్పడింది. అదొక నిలువవలసిన ప్రదేశంకాదు; తలుపులు తెరిచి ఆహ్వానించే ప్రదేశం. నీవు ఎవరో తెలియచెప్పుకోవలసిన అవసరం అక్కడ లేదు; ఇష్టంలేకుంటే ఏం చెప్పకుండానే ముందుకు పోవొచ్చు.

నాగరికత తన మోటుపద్ధతుల్ని ఇక్కడ ప్రవేశపెట్టలేదు: విశాలమైన ప్రదేశాలుండి. మానవుల ఆక్రమణకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో బతుకుతూ. తమతమ చట్టాలను నిర్మించుకునేందుకు అనువైన భూఖండమది.

పశ్చిమాన సరిహద్దు అనేది ఒకటి ఉన్నదనేభావం–తాను అటువైపు వెళ్ళవలసిన అవసరం లేనప్పటికీ–అమెరికన్ తత్వంలో అదొక షరతుగానే ఉంటున్నది. అమెరికన్ భావ ప్రపంచంలో యీ సరిహద్దు నాగరికతలను అధిగమించి, మానవుని చేతుల్లోనుంచి ప్రకృతే చట్టాలను, తన చేతుల్లోకి లాక్కొని, మానవనైచ్యం, మోసం మొదలైనవాటిని పెద్ద పెద్ద నదీజలాలలో శుభ్రపరచి, విశాలమైన ఆకాశం, పరిశుభ్రమైన పిల్లగాలులతో నిండిన ప్రదేశమది.

సముద్రపుటలలవలె జనం పశ్చిమానికి కదిలిపొయ్యారు. మొదట్లో వలలు పన్నేవారూ, వేటగాళ్లూ, ఆ తరువాత స్థిరనివాసాలను ఏర్పరచుకొనే ఉద్దేశంతో బయలుదేరినవారు. ఆటుపిదప వ్యవసాయమే శాశ్వత వృత్తిగా స్వీకరించిన రైతులూ వెళ్ళారు. ఇతర ప్రపంచంతో సంబంధంలేని గృహాలు అక్కడక్కడ మొదట్లో వెలిసినవి; కాలక్రమేణా అవి పెరిగి పెద్దవై పట్టణాలుగా, మహానగరాలుగా రూపొందినవి.

మొదట్లో యీ పశ్చిమదిశగా జరిగిన ప్రయాణాలు–ముఖ్యమైన నాలుగు రహదార్లలోను ఏదో ఒకదానిగుండా జరిగినవి : అట్లాంటిక్ తీరంలోని దక్షిణ రాష్ట్రాలనుంచి మెక్సికో అఖాతాన్ని అనుసరించీ; దక్షిణ పర్వత

శ్రేణులనుంచి టెన్నెస్సీ నైరుతి దిక్కుగానూ; ఓహియో లోయల్లోకి; లేదా గ్రేట్ వేల్స్ గుండా ఏర్పరచుకున్న జలమార్గానా - యీ ప్రయాణాలు జరిగినవి. ఈ రహదార్ల పక్కలనుంచి అనేక ప్రదేశాలు శాఖలవలె చీలి ఆక్రమించుకోబడినవి.

1840 లో పశ్చిమదిశకు పసిఫిక్ మహాసముద్ర తీరంవరకూ వెళ్ళ దలచుకున్నవారికి భౌగోళికంగా మరికొన్ని దారులు-మైదానాల మీదినుంచీ కనుమలద్వారానూ ఏర్పరచబడినవి. ఆ తరువాత చాలా కాలానికికాని యీ మైదానాలు జనసమ్మర్దమవలేదు.

మొదట్లో స్థిరనివాసాలను ఏర్పరచుకున్న వారి స్థానాలను ఆక్రమించిన రైతుల్లో చాలామంది ఇటీవల వలసలు వెళ్ళినవారు. 1820 - 1830 ల మధ్య వారు న్యూయార్కు రాష్ట్రానికి పశ్చిమ భాగంలోను, పెన్సిల్ వేనియా, ఓహియో రాష్ట్రాలలో ఖాళీలైన ప్రదేశాలను ఆక్రమించు కున్నారు. 1840 లో వారు మిస్సోరి, ఇల్లినాయిస్, దక్షిణవిస్కాన్సిన్ రాష్ట్రాలకు కదిలిపొయ్యారు. 1850 - 1860 లలో వారు తూర్పు అయోవా, మిన్నెసోటాలకు జేరారు; 1870 కి వారు మైదానాలమీది రాష్ట్రాలను ఆక్రమించుకోసాగారు.

అమెరికన్ ప్రవర్తనలో 'సరిహద్దు' అనేది పెద్ద పాత్ర వహించిందనే సత్యం చాలాకాలంగా తెలిసిందే। ఈసూత్రాన్నిగూర్చి ఉద్ఘాటిస్తూ ఫ్రెడరిక్ జాన్సన్ టర్నర్—"సరిహద్దు అనేది స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను, ఆత్మ విశ్వాసాన్ని, వ్యక్తిత్వాన్ని ప్రసాదించింది" అన్నారు.

మొదట్లో పశ్చిమానికి కదిలి వెళ్ళటమనేది వ్యక్తిగతంగా ఉన్నప్పటికీ- ఒక పట్టణాన్ని, అందులో స్థిరనివాసాల్ని ఏర్పరచుకోవలసిన పరిస్థితులు ఏర్పడినప్పుడు, వలసలు వొచ్చినవారందరూ కలిసి ఒక కూడలిగా, లేదా సమాజంగా ఏర్పడవలసిన అవసరం తప్పలేదు. ఈ సమాజాలు ఒకోసారి మేఫ్లవర్ ఒడంబడికలో ఉపయోగించబడిన పదజాలంతో వ్రాతపూర్వక

మైన నియమావళిని రూపొందించినవి. మరికొన్ని సమయాల్లో యీ సమాజాలు చాలా చిన్నవిగానూ, వారిమధ్య ఏర్పడిన సంబంధ బాంధవ్యాలు గాఢతమంగానూ ఉండటంవల్ల వ్రాతపూర్వకమైన నియమావళే అవసరం లేకపోయింది.

మైదానాలను దాటి కాలిఫోర్నియాకు పయనమైన 'పశ్చిమ వలసల సమాజం' అవనీ, అయోవా రాష్ట్రంలోని 'ఆరిగన్ వలసల సమాజం' అవనీ– సురక్షితమైన, విజయవంతమైన వలసలను స్థాపించేందుకు క్రమశిక్షణ అత్యవసరమైంది. కాలిఫోర్నియాలో బంగారుగనులు కనుగొనబడ్డాక, అక్కడికి జేరేందుకు ఏర్పడిన జనసమూహాలలో కొన్నిట – డాక్టర్లు, భూగర్భశాస్త్రజ్ఞులు, మతగురువులు, మెకానిక్‌లు మొదలైన వృత్తుల్లో ఉన్నవారుకూడా ఉన్నారు.

ఆనాటి తొలి అమెరికన్ సమాజంలోని వ్యక్తులు చేసిన గొప్ప పనుల్ని గూర్చి వినటంకన్న, కలిసికట్టుగా వారు సాధించినవి వినదగినవి. ధాన్యపు గిడ్డంగుల్ని నింపటం, ఏపిల్ తోటలను పెంచటం, ఎలుగ్గొడ్లను వేటాడటం, రోడ్లను నిర్మించటం, ధాన్యంనుంచి పొట్టును విడదీయటం మొదలైన పనులు సామాజిక పరంగా కొనసాగినవి. ఒకరికొకరు సహాయపడే విధానం కష్టపడి పనిచేయటం హాస్యాస్పదంగా ఉండినట్లయితే, దీని ఫలితం నీచవృత్తులకు సమాజం ఆలవాలమవటంగా పరిణమించి ఉండేది: అలాకాకుండా తమంతట తామే కలిసికట్టుగా పనులు చేసుకొని పొయ్యేందుకు ఆనాటి ప్రజలు సంసిద్ధులయ్యారు.

యూరప్ ఖండంనుంచి వొచ్చిన కాందిశీకులు సామాన్యంగా ఒకే తావులో నివాసాలను ఏర్పరచుకొని–అక్కడ చర్చ్‌లనూ, సామాజిక శాఖలనూ, వార్తాపత్రికలనూ, సాంస్కృతిక కూడళ్ళనూ – తమంతట తాముగా చేరి సేవచేసే అభిలాష ఉన్నవారి సహాయంతో, అలాటి విధానంలోనే ఏర్పరిచారు. ఈ రకం స్వయంసేవక సిద్ధాంతం, సమాజంలో ఒకరి

కొకరు సహాయపడే విధానం—ప్రపంచంలోని అన్ని గ్రామీణ వాతావరణా ల్లోనూ కనిపిస్తుంది: తమతమ గ్రామాల్లో రైతులుగా కాలం గడుపుతూ, పొలంపనిలో ఒకరికష్టాన్ని మరొకరు పంచుకుంటూ, పంపిణీవిధానంలో లభ్యమైన ఆనందంలోకూడా పాలుపంచుకుంటూ జీవితాల్ని గడిపేందుకు అలవడిన యూరపియన్ వలసదార్లందరికీ యీవిధానం సుపరిచితమైనదే।

1882 వరకూ *ఎక్కువమంది—జర్మనీ, స్కాండినేవియా, బ్రిటిష్ వెల్స్‌నుంచి వలసలు వొచ్చారు. ఆంగ్లేయుల్లో ఎక్కువమంది మిసిసిపీ లోయల్లోకి వెళ్ళి, అది జర్మన్‌సమాజంగా రూపొందేసమయంలో, అక్కడ ఆంగ్ల సంస్కృతిని నిలబెట్టారు. 1896 అనంతరం—యూరప్ ఉత్తర దిశ నుంచి వొచ్చే కాందిశీకులకన్నా, యూరప్ దక్షిణ, తూర్పుదిశలనుంచి వొచ్చే వలసదార్లసంఖ్య అత్యధికమై—మొదటి ప్రపంచయుద్ధానికి 10 సంవత్సరాల ముందువరకూ జనం ప్రవాహంగా వొచ్చిపడటం జరిగింది. సైనికులుగా జేరాలనే బలాత్కారాన్ని ఏవగించుకొంటూ, దాన్నుంచి తప్పించుకొనే ఉద్దేశంతోనే యూరప్ ఖండవాసులు అనేకమంది అమెరి కాకు వలసలు రావటం జరిగింది.

1849 లో ఒకానొక నార్వీజియన్ యువకుడు అమెరికానుగూర్చి ఇలా రాశాడు: "—ఇక్కడ నీ తండ్రి ఎవరు? ఆయన ఏంచేసేవాడు?" అనే ప్రశ్నలేదు. 'నీవు ఏంపనిచేస్తావు' అనేదే ప్రశ్న. తల్లి పాలతోపాటే స్వాతంత్ర్యమనేది మానవుడికి సమకూరిందనిపిస్తుంది; అందుకనే యునైటెడ్ స్టేట్స్‌లోని పౌరులందరికీ, వారు పీల్చేగాలి ఎంత అత్యవసరమో స్వాతంత్ర్యం కూడా అంతే అత్యవసరమనిపిస్తుంది."

మొత్తంమీద వలసలు వొచ్చేవారికి ఇక్కడ స్వాగతం చెప్పబడింది; వారు చేసే కాయకష్టానికి తగిన ప్రతిఫలం కూడ దొరుకుతుంది; వారి ఆచార వ్యవహారాలు ఆహ్వానించబడుతవి; బలాత్కారమనేది జరగక, వారి ఇష్టానుసారంగా ఇక్కడ స్వేచ్ఛగా జీవించవొచ్చు—ఐనప్పటికీ వారు

కేవలం తమకు తాముగానే ఉండలేమనే విషయాన్ని గ్రహించారు - తాము కోరుకున్న తమ సంస్కృతిని ఇచ్చివేసేందుకు సిద్ధపడటం, అదేవిధంగా మరొక క్రొత్త సంస్కృతిని చేపట్టేందుకు ఇష్టపడటంకూడా జరిగింది. ఈ విధంగా తమకొక పునాది లేకుండా పోతోందనే భావం-అమెరికన్ సంస్కృతిమీద తీవ్రంగా పనిచేసింది.

వలసదారునిలో రెండు విరుద్ధశక్తులు పనిచేయసాగినవి. గ్రామీణ జీవనంలోని సుఖసౌఖ్యాలు చేజిక్కకపోతూన్నప్పటికీ, ఆ స్థితిని తాను అధిగమించాననే సత్యంతాలుకు భావన ఉన్నది. ఆ పురాతన జీవితం తాలూకు విలువలు ఎదుర్కొబడినవికనుక, వాటెని తాను సంరక్షించు కోవాలి. అమెరికన్ విధానాలనే అనుసరిస్తూ తాను అంతకన్న మంచి నివాస స్థలాలకు కదలాలంటే - అక్కడ తన అవసరంలేక, తిను వెనక్కు పంపివేయబడవొచ్చు.

## అలవరుచుకున్న సంస్కృతి

కనుక తన ఆశలన్నీ తన సంతానంమీదనే ఉండవలసివొచ్చింది. ఐతే ఇక్కడకూడా ఒక సంధిగ్ధావస్థ వొచ్చిపడింది. సంతానం తప్పకుండా అమెరికన్‌లే అయ్యారు. తాను స్వగ్రామ సీమల్లో అలవరుచుకున్న గ్రామీణ సంస్కృతిని కానీ, ఆ శిక్షణను కానీ సంతానానికి అలవరచాలని చేసిన ప్రయత్నాల్ని వారు ఎదుర్కొన్నారు. పాఠశాలల్లో ఆంగ్ల సాంప్రదాయాలకూ, సంస్కృతికీ విశేష గౌరవమున్నదని వారు తెలుసుకున్నారు. ఆటస్థలాల్లో వినిపించే శబ్దాలు-తమ స్వస్థలాలలో విననయే శబ్దాలకు వేరు రూపాలేననీ గ్రహించారు.

అందరు యువతీ యువకుల్లాగే తాముకూడా ఏదోవొక సమాజానికి అంకితమైపోవాలని వారు వాంఛించారు. తమ తల్లిదండ్రులు ఆ పాత సంస్కృతినే పట్టుకొని వేళ్లాడుతూ, పెరుగుదలను నిరాకరించి, ఆ పురా

తన సంస్కృతినే గౌరవిస్తూ కూర్చోవటం. తమ స్థితిలోని మార్పుల్ని అంగీకరించకుండటాన్ని వారు గమనించారు. కాని రెండో తరంవారు ఇలాటిదాన్ని నిరాకరించేందుకు సంసిద్ధులయ్యారు. మూడోతరంవారు ఇలాటి నిరాకరణద్వారా-తమ తల్లిదండ్రుల్ని ఆర్థికంగా, సామాజికంగా ఉన్నతస్థాయికి తీసుకొనేవెళ్ళేందుకు తగిన గుణపాఠాలుగా అమలుజరిపి-వారినికూడా అమెరికన్ విధానంలో విధాగాలుగా ఉండేట్లు చేయగలిగారు.

అనేకసార్లు అమెరికన్ బాలబాలికలు జాతీయంగా ఉండేందుకూ, తదనుగుణంగా తాము అంగీకరించబడేందుకు ప్రయత్నాలు చేశారు. అనాటి దృశ్యాల్లో జాతీయత పెంపొందేందుకు ఇదొక ముఖ్య విభాగంగా ఉన్నది. తమను విడదీసి, విభేదాలతో చూసే దుష్టశక్తులమీద తిరుగుబాటు చేసేందుకుగాను అనేకసార్లు బాలబాలికలు సమూహాలుగా ఏర్పడి, నిరోధించటం కూడా జరిగింది. ఈ సమూహాలు – అల్లరిచిల్లరి ముఠాలుగా కూడా రూపొందటం అనేకసార్లు జరిగింది. స్వశక్తిని నమ్ముకొన్న యువతీయువకులు, ఎలాగైనా విజయాన్ని సాధించాలనే పట్టుదలలతో, క్రమంగా రాజకీయాల్లోకి జొరబడి, బలశాలుర అవసరాన్ని తీర్చారు. లేదా చట్టసమ్మతంగా ఏ ఆటపాటల పోటీల్లోనో విజయసాధనకు విచ్చేనమెట్లను ఎక్కిన విధంగా ఎగబాకుతూ, మొదట్లో నోరు తిరగక హాస్యాస్పదమైన ఉచ్చారణతో ఉండిన పోలిష్ పేర్లు–కొన్ని ఫుట్‌బాల్‌టీమ్సుకు స్థిరపడిపోయినవి. చాలామంది సహృదయాలతో విద్యావిధానాల్ని అనుసరించి, ఆ తరువాత వృత్తుల నవలంబించి, సమాజంలో గౌరవ ప్రతిష్ఠల్ని గెలుచుకున్నారు.

తమ తల్లిదండ్రుల తాలూకు పరదేశత్వాని నిరాకరించి, ఈ యువతీయువకులు వివాహాలు చేసుకొని, తమ గృహాలనుంచి విడివడి, స్వకుటుంబాలను స్థాపించుకునేందుకు, అమెరికన్ తరహాల్లో గృహాల్ని నడిపేందుకు ఉవ్విళ్లూరారు. వివాహానికి అత్యవసరమైనది ప్రణయమనే భావం స్థిరపడిపోవటంతో-అది అమెరికన్ విధానంలో చివరిమెట్టు ఐంది. దీంతో

ప్రణయమనేదానికి విశేష ప్రాముఖ్యత లభించి, కుటుంబస్థాపనకు పునాది ప్రణయమేగాని, కుటుంబ విస్తరణ కాదనేది దృఢపడి, అమెరికన్ జీవిత విధానం మరొక మెట్టుపైకి వెళ్ళింది.

ఒక తరానికీ మరొక తరానికీ మధ్య ఏర్పడే అఖాతం - విషాదపూరితమైనదైనప్పటికీ - పరదేశాల్లో జన్మించినవారికీ, వారి సంతానానికీ మధ్య యీ భేదం ద్విగుణీకృతంగా ఉన్నది. కొంతమంది దీన్ని భరించలేక పొయ్యారు: దివాళాతీయటం, ఉద్రేకాలను ఆధీనంలో ఉంచుకోలేకపోవటం, జూదగాళ్ళవటం, నేరస్థులుకావటం, పిచ్చివాళ్ళవటం మొదలైనవి ఈ దుష్ఫలితాలలో కొన్ని. కాని ప్రతిఒక్క అపజయానికీ, పది పన్నెండు విజయాలు లభ్యమౌతున్నవి. మొత్తంమీద వలసలు వొచ్చినవారు స్పష్టంగా అమెరికన్‌గా రూపొందటం జరిగింది. ఈ విషయాన్ని తెలుసుకోవాలంటే - బ్రెజీల్‌లో జర్మన్ పూర్వీకుల సంతానాన్నీ, లేదా న్యూసౌత్‌వేల్స్‌లోని పూర్వీకుల సంతానాన్నీ - యునైటెడ్ స్టేట్స్‌లోని వారితో పోల్చి చూడవొచ్చు. బ్రెజీల్‌లోనివారు మాట్లాడే భాష జర్మనీ. వారి ఆలోచనలు, వోటుచేసే పద్ధతులుకూడా జర్మనీకి సంబంధించినవే! ఆంగ్ల సమాజాల ఇరుగుపొరుగుల్లోఉన్న న్యూసౌత్‌వేల్స్‌లోని జర్మనీవారి కన్నా, మిస్సోరిరాష్ట్రంలోని జర్మనీవారు ఎక్కువ జర్మన్ సాంప్రదాయాలను ప్రదర్శిస్తారు. ఎందుకని?

తన 9-వ ఏట పళ్ళగంపలు నెత్తిన పెట్టుకొని బోస్టన్‌లో అమ్ముకునే జాన్ డిఫ్రరారీకథ చూద్దాం: అతని తండ్రికి 8 మంది సంతానం: అందర్లోకీ పెద్దవాడు జాన్: వీరందరికీ పెట్టి పోషించవలసిన బాధ్యత ఆ తండ్రిది. పోతే బోస్టన్‌లోని స్టేట్ స్ట్రీట్ ప్రాంతంలో ధనవంతుల యిళ్ళన్నీ ఉన్నవని ఆ కుర్రాడికి తెలుసు; ఎక్కడైతే డబ్బు ఎక్కువగా ఉంటుందో, అక్కడ కొనుగోలుశక్తికూడా అధికంగానే ఉండటంవల్ల తన సరుకుల చలామణీ బాగా ఉంటుందనీ అతనికి తెలుసు. ఈ విధంగా తన

పళ్ళబుట్టలు ఖాళీకాగానే, ఇంటికి తిరిగివొచ్చి, ఆ డబ్బు తండ్రికి ఇస్తూండేవాడు.

ఎనిమిదో తరగతి చదువుతూండగానే అతను పాఠశాలను విడిచి పెట్టినా - చదువుసంధ్యలను విడనాడలేదు. స్టేట్ స్ట్రీట్‌లోని తన ఖాతా దారులు పెట్టుబడుల మూలంగా ధనవంతులయ్యారనికూడా అతనికి తెలుసు. ఒకపక్క పళ్ళవ్యాపారాన్ని సాగిస్తూనే, యీ ధనసంపాదనంతా ఎలా జరిగిందో క్షుణ్ణంగా తెలుసుకునేందుకుగాను అతను పుస్తక భాండాగారం నుంచి పుస్తకాలు తెచ్చుకొని పఠిస్తూండేవాడు. తన 16-వ యేట ఒక బండినీ, గుర్రాన్నీ అతను కొనగలిగాడు. మూడేళ్ళతరువాత ఫాన్యుల్ హిల్‌లో అతనొక పళ్ళదుకాణాన్ని టోకువ్యాపారం నిమిత్తం స్థాపించాడు. చట్టసమ్మతంగా ఉండే కాంట్రాక్టులకు తన వయస్సు చాలనందున, తన తండ్రిపేరిటే వ్యాపారాన్ని సాగించాడు. 1890 లో పబ్లిక్ లైబ్రరీ దగ్గిర బోయిల్‌స్టన్ స్ట్రీట్‌లో పెద్ద స్టోర్స్ ఆరంభించాడు. తనకు ఎంతో కుతూహలమున్న-పళ్ళు, పెట్టుబడి, నిజమైన ఆస్థిపాస్థులు, చట్టంవ్యాపారంలో విజయాన్ని సాధించినవారి జీవితచరిత్రలూ - మొదలైన విషయాలమీద గ్రంథాలను తెచ్చుకొని రాత్రివేళల్లో పఠిస్తూండేవాడు. పరదేశాల్లో దొరికే పళ్ళను, ఎంతోమంది కలలుగనే వాటిని దిగుమతిచేసి-వాటిని హోటళ్ళకూ, రెస్టారెంట్లకూ, ఓడల్లోని నావికులకూ, ధనవంతుల ఇళ్ళకూ అమ్మటం ద్వారా మంచి లాభాలు వొస్తవని నిశ్చయంగా తెలుసుకున్నాడు.

తనదగ్గర పెట్టుబడులు పెట్టేందుకు తగినంత ధనం జేరాక - సంవత్స రాల తరబడి చదివిన చదువులతో కొన్ని ప్రాథమిక సత్యాలను అతను అవగాహన చేసుకున్నాడు. అట్టడుగునుంచే ఒకే ఊపులో శిఖరాన్ని అందుకున్న వ్యక్తులమీద పెట్టుబడి పెట్టటం మంచిదనేది యీ సత్యాల్లో ఒకటి. "వ్యక్తి గట్టివాడైతే, అతను చేసే వ్యాపారంకూడా గట్టిదే ఐ ఉంటుంది" అనేది అతని సకారణవాదన. మరొక సత్యమిది: భూమి,

ఎస్టేట్లమీద పెట్టే పెట్టుబడి సురక్షితమైనది. చిన్నచిన్న ఇళ్ళుకొని, వాటికి తగిన మరామత్తులు చేయించి, లేదా రూపురేఖలు మార్చి, వాటిని అద్దెల కివ్వసాగాడాయన.

80 ఏళ్ళ వయస్సు వొచ్చేటప్పటికి జాన్ డెఫ్రారీ 40 లక్షల డాలర్లు గడించాడు. తాను మరి ఎక్కువకాలం బతకబోవటంలేదని తెలుసుకొని, ఈ ఐశ్వర్యమంతా ఏం చెయ్యాలా అని ఆయన ఆలోచించాడు. ఆయన తిరిగి పుస్తక భాండాగారానికి వెళ్ళి, తనలాటి మిగతావారు ఏంచేశారా అని అన్వేషించాడు; కాని, వారు చేసిందేదీ ఆయనకు నచ్చలేదు. బోస్టన్‌లో ఉన్న యువకులకు - తనలాగే ఆశలూ, శక్తి సామర్థ్యాలున్నవారికి తానేమైనా చేయాలని ఆయన అనుకున్నాడు. తన రొఖ్ఖాన్ని దాచుకున్న అనేక బ్యాంకుల్లో ఎంతో జాగ్రత్తగా ప్రశ్నలు వేయసాగాడాయన. పొట్టిగా వున్న ముదుసలి, నిరాడంబరంగావున్న జాన్ లక్షాధికారి అని ఎవరికీ తెలియదు.

చివరకు ఆయనకు ఒక ట్రస్ట్ ఆఫీసర్ - తన అభిరుచులకూ, ఆశయాలకూ సరిపడినవాడు దొరికేడు; ఆయనకు తన వాంఛల్ని విశదీకరించాడు-జాన్. "ఈనాడు నేనున్న యీ ఉచ్ఛస్థితికి కారణం-బోస్టన్. కనుక బోస్టన్‌లోని బీదకుర్రాళ్ళకు నేనేదన్నా చేయాలి. మానవులు తమ కాలాన్ని సద్వినియోగం చేసేందుకు ప్రోత్సహించే కార్యాన్ని తలపెట్టాను-"అన్నాడాయన.

తనకెంతో సహాయపడిన పుస్తక భాండాగారానికి జాన్ 10 లక్షల డాలర్లు ఇచ్చాడు; ఈ మొత్తాన్ని తిరిగి తిరిగి పెట్టుబడుల్లో పెడుతూరాగా అది 20 లక్షల డాలర్లు ఐనప్పుడు, పుస్తకభాండాగారంలో జాన్ డెఫ్రెరీ శాఖకు సంబంధించిన కట్టడం పూర్తిచేయాలి. మిగిలిన 10 లక్షల డాలర్లూ తిరిగి రెట్టింపు ఐనపుడు - ఆ 10 లక్షల డాలర్లు ఏ విధంగా వినియోగించబడాలో ట్రస్టీలు నిర్ణయిస్తారు.

ఇలాటి దానాన్ని చేశాక, వలసవొచ్చిన వాని సంతానమైన జాన్ - తనను తానొక వ్యక్తిగా నిరూపించుకొని, తన ఆస్థికి సంబంధించిన

అనేక గృహాల్లో - ఒక ఇంటిలో నిరాడంబరంగానూ, తానంటూ ఉన్నా నని ఎవ్వరికీ తెలియకుండా ఉండే విధానంలోనూ శేష జీవితాన్ని గడి పేందుకు ఉద్యుక్తుడయాడు.

జాన్ డెఫ్రారీ జీవితంలోని పరిధులు - జీవితంలోని ఆర్థిక విభాగంలో సాధించవగిన విజయాలను ఉపదేశించేవిగానూ, అమెరికన్ విధానమనే దాన్ని రుజువుచేసే విధంగానూ ఉన్నవి. ఆయన ఎప్పుడూ ధనాన్ని వృధా చేయలేదు. తాను నడవగలిగినపుడు బండిలో వెళ్ళే ఆలోచనే ఆయనకు రాలేదు; తన ఆస్థిపాస్థులకు అవసరమైన మరామత్తులన్నీ చేయించేవాడు; స్వంత గ్రంథాలయాన్ని ఉంచుకున్నాడు; ఆయనకు టెలిఫోన్ లేదు. చివ రకు ఆయన ఉత్తరాలద్వారాకూడా వ్యాపారాన్ని సాగించలేదు; స్వయం గానే వెళ్ళి వ్యాపారం చేసుకునేవాడు. తనవంట తాను చేసుకొని, తాను సుఖపడేందుకు ఎలాటి ప్రయత్నాలూ చేయలేదు. ఆయన ఆజన్మ బ్రహ్మచారి.

అమెరికన్ విజయానికి సంబంధించిన పథకం - అక్కడ స్వభావ సిద్ధంగా లభ్యమయే వస్తు సముదాయంమీదా, వ్యాపారం చూపే మహదావ కాశాలమీదా ఆధారపడి ఉన్నది. ఐతే దేన్నయితే పొందాలని తాను తీవ్రంగా వాంఛించాడో, దాన్ని పొందేందుకు పడే బాధ, ఆవేదనా - ఆ వాంఛనే చంపి, శక్తిసామర్థ్యాలను హరించటంతో విజయాన్ని సాధి స్తూండటం జరుగుతూంటుంది. మరొక్క తరం గడుస్తేనేకాని - తాము పరదేశీయులమనే భయం, తాము దూరంగా, క్రుంగిపోతూన్న స్థితిలో ఉన్నామనే భావం పోయి, విజయసాధన పథకాలకు విశిష్టరూపం రాలేదు.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం - యూరప్‌నుంచి వొచ్చిపడే కాంది శీకుల సంఖ్యను తగ్గించటం, లేదా పరదేశీయుల్ని రానీకుండటం అమెరికా భవిష్యత్‌కు అవసరమని తోచింది. అప్పటి జనాభాలో 8 వ వొంతు, పర దేశాల్లో జన్మించినవారు. వీరిలో ముప్పాతికమంది పట్టణాల్లోని మురికి

గొందుల్లో, జనసమ్మర్దంలో కాపరాలు చేస్తున్నారు: ఆ పరిసరాల్లో వారి సంతానం తేలిగ్గా నేరస్థులయే అవకాశా లెన్నో ఉన్నవి.

సామాజిక సమస్యలూ, యుద్ధానంతరం అధికమైన జాతీయ తత్వం, ప్రపంచంలో ప్రజాస్వామిక మనేదానికి రక్షణను ఇచ్చేందుకు జరిగిన ఆందోళనలూ మొదలైనవి ఆర్థిక మాంద్యతకు దారితీయటంవల్ల, వలసలు వొచ్చేవారిమీద కఠినమైన ఆంక్షలు విధించాలని అమెరికన్‌లు నిశ్చయించారు. 1921 లోనూ ఆ తరువాత 1924 లోనూ వలసలమీద కఠినమైన ఆంక్షలు విధించబడినవి. 1929 లో జాతీయతల కేటాయింపు జరిగి — బ్రిటీష్ వేల్స్, యూరప్ ఉత్తర దిశలనుంచి వలసలువొచ్చేవారికి ఎక్కువ అవకాశాలు ఇవ్వబడినవి. ఏటా వలసలు వొచ్చేవారి కోటా 150,000 కు కొంచెం పైగా ఉన్నప్పటికీ - దేశంలోని వలసలు వొచ్చినవారి జన సంఖ్య అత్యధికంగానే ఉంటున్నది. ఎందుకంటే, ఇంతకుముందు వలసలు వచ్చి ఇక్కడ స్థిరపడిపోయినవారి సంతానం యీ కోటాల్లోని లెక్కలకు తీసుకోబడలేదు.

## వలసలు వచ్చినవారూ; అమెరికన్ సంస్కృతి

వలసలు వొచ్చినవారు అమెరికన్ సంస్కృతిమీద మొట్టమొదటిగా పురాతనకాలం నుంచీ వొస్తున్న ప్రాపంచిక ధర్మాలనే బలపరచటం జరిగింది. కాని రెండో తరంవారు, తమ పూర్వీకుల స్వదేశాలతో సంబంధ బాంధవ్యాలను తెగతెంపులు చేసుకున్నప్పటికీ, వాటిమీద జరిగే యుద్ధాలను ఎదుర్కొనే ఉద్దేశ్యంతోనే ఉన్నారు: ఇది వారికి వారుగా బ్రతికేందుకు ముఖ్యంగా కేంద్రీభూతమైన కారణం. ఐనప్పటికీ ప్రాపంచిక విషయాల్లోనూ తమ బాధ్యతల్ని, దీర్ఘకాలంనుంచీ వొస్తున్న ఆచారాలను వారు వొదులుకోలేక పొయ్యారు. సామ్రాజ్యవాదుల దుండగాలను అరికడుతూ, స్త్రీలూ, పురుషులూ అనేక ప్రాంతాలలో జీవితవిధానంలో మార్పు రావా

లనీ, అది మరొకమెట్టు పైకిపోవాలనీ ఎంతో పోరాడుతూండటం వారం దరికీ తెలిసిన విషయమే। సామ్రాజ్యవాదులనుంచి స్వాతంత్ర్యాన్ని సాధించాలని వారు చేసిన తీవ్రప్రయత్నాలే నేటి అమెరికన్। బలానికీ, శక్తికీ సోపానాలు.

వలసలు రావటంవల్ల కావలసినంతమంది పనివారు లభ్యమై, పట్టణాలూ, రహదార్లూ, రైలుమార్గాల నిర్మాణం జరగటమే గాక - కేవలం వ్యవసాయానికే సంబంధించిన ఆర్థికవిధానం, పారిశ్రామికంగా అత్యున్నత స్థాయికి వెళ్ళే అవకాశం ఏర్పడింది. ఇక వ్యవసాయంలోకూడా ఇష్టానుసారంగా పంటలు పండించి,.పాడుచేయబడిన క్షేత్రాలను వలసలువొచ్చిన వారు ఆక్రమించి తిరిగి వాటిని ఫలవంతం చేశారు.

ఆహారానికి అవసరమైన ముడిసరుకుల్నే గాకుండా, అమెరికన్ వంటకాలలో ఎన్నో కొత్త కొత్త అభిరుచులనుకూడా వారు ప్రవేశపెట్టారు. కొన్నివందల ఉపాహారాలను తయారుచేసి అవి బహుజన సమ్మతంగా ఉండేట్లు చేశారు.

ఇక కళల విషయంలో వలసలు వొచ్చినవారు ఎంతో సహకరించారు. తొలి అమెరికన్ రచయితలు ఇంగ్లీషును ఇతర పురాతన సాంప్రదాయాలతో మిశితం చేశారు. నీగ్రోలు అమెరికన్ సంగీతంలో ఆధ్యాత్మికంతో పాటు "జాజ్" ను కూడా ప్రవేశపెట్టి రంగస్థలంమీది సంగీతానికి ఎంతో శోభతెచ్చారనేది ప్రాథమిక సత్యం. అమెరికన్ సంగీత విద్వాంసులలో చాలామందీ, గొప్ప రచయితల్లో కొంతమందీ నీగ్రోలు. జర్మనులూ, ఇటాలియనులూ తమతోపాటు సంగీతాభిరుచుల్నికూడా తీసుకొనివొచ్చి, ఆ సంగీతంతో శ్రోతల్ని ఆకర్షించారు; వీరిలో చాలామంది యీనాటి అమెరికన్ ఆర్‌చస్ట్రాలో పాల్గొంటూనే ఉన్నారు.

ఇక యూదులు— దుస్తుల వ్యాపారాన్ని తమ ఆధీనంలో ఉంచుకోవటం దగ్గర్నుంచీ, బహుజనులు శాస్త్రీయ, కళారంగాలలో ప్రవేశించేందుకు

ఉత్సాహపడే అవకాశాలను తమపలుకుబడులద్వారా సాధించారు. వ్యాపారం చేసే సమాజాలుగా - వారు పట్టణాల్లో ప్రవేశించి, బట్టల దుకాణాలూ, హార్డ్ వేర్ దుకాణాలూ, లాండ్రీలూ, ఇతర చిల్లర దుకాణాలను స్థాపించారు. అనేకమంది యూదులు పైబట్టలతో వొచ్చి, బజార్లవెంట తిరుగుతూ, ఉత్తరోత్రా గొప్పగొప్ప ఐశ్వర్యాలను సంపాయించినవారున్నారు. అమెరికన్ జీవితాన్ని వెలుగొందించిన అనేకవేల యూదులలో- సుప్రీంకోర్టు న్యాయాధిపతులూ, నోబుల్‌బహుమతులు పొందినవారూ, అత్యుత్తమ గాయకులూ, జనరంజకమైన సంగీతాన్ని ఏర్పికూర్చినవారూ, నాటక రచయితలూ, సినిమా పరిశ్రమల్లో ఘటికులూ, ప్రభుత్వాధికారులూ పారిశ్రామిక నాయకులూ ఉన్నారు.

కన్నుల పండువుగా ఉండే రకరకాల మనుషులూ వలసలువొచ్చిన వారిలో ఉన్నారు. నేటికీ న్యూ ఇంగ్లండులోనూ, దక్షిణ పర్వతశ్రేణులున్న ప్రాంతాలా పురాతన బ్రిటిష్ జనాభా తాలూకు మనుషులు ఉన్నారు; ఐతే వీరి సమాజాలు చాలా అరుదుకావటంవల్ల అవి చిత్రంగాకూడా కనప్పట్టుతవి. న్యూ మెక్సికోలోని హిస్పానో-అమెరికన్ సమాజం, చైనా టౌన్స్, చిన్న టోకియోలూ, చిన్న ఇటలీలూ మొదలైనవాటివలె - వాటికొక ప్రత్యేకత ఉన్నది. ప్రత్యేకత ఉన్న అమెరికన్ దృశ్యం వీటికి అనేక కొత్త నేపథ్యాలను సమకూరుస్తుంది.

ఉదాహరణకు ఒక చిన్న పట్టణం తాలూకు పెద్దబజారు చూడు – ఏ బెన్నింగ్‌టన్నో, వెర్‌మాంటో తీసుకో. అరుదుగా దొరికే పళ్లూ, మిఠాయిలూ, రొట్టె మొదలైనవి తయారుచేయటం మొదలైన పనుల్లో నిమగ్నులయేవారు- గ్రీక్‌లు. అదేవిధంగా- ఉత్తరపు బజారు మూలలో ఉన్న రెండు ఉత్తమతరగతి రెస్టారెంట్లూ, దర్జీ షాపూను. ఒక ఇటాలియన్ కుటుంబం పాదరక్షలు మరామత్తుచేసే షాపు నడుపుకుంటోంది. చుట్టలు అమ్మే షాపు సిసిలీ వారిది. హార్డ్‌వేర్ షాపు, ఫార్మసీ, అనేక బట్టల దుకా

ణాలు యూదులచే నడపబడుతున్నవి. వీటన్నిటిమీదా అమెరికన్ పేర్లు కూడా కనిపిస్తవి. ఒక మంచిరకం మార్కెట్ సిరియన్‌చేత నిర్వహింప బడుతున్నది. కాయగూరల అమ్మకం. పెట్రోల్ బంకులూ మొదలైన అనేక చిన్నచిన్న వ్యాపారాలు ఫ్రెంచ్. కనెడియన్‌లు నడుపుతున్నారు. డచ్ పూర్వీకుల వంశం వాడైన అమెరికన్‌చే ముద్రణాలయం నిర్వహించ బడుతోంది. ఇక న్యాయవాదుల పేర్లలో - బార్బర్, హోల్డెన్ మొదలైన వాటితోపాటు అగొస్టినీ, లెపిన్, మెర్రిస్సే మొదలైనవికూడా కనిపిస్తవి. వీరిలో అనేక కుటుంబాలు తరతరాలుగా వెర్మాంట్‌లో నివశిస్తున్నవి; మరి కొన్ని కుటుంబాలు ఇటీవలే వలస వొచ్చినవి. కొన్ని శతాబ్దాలుగా జగడాలు పెంచుకొనీ, పోట్లాటలు జరిపిన అనేక కుటుంబాలు శాంతియు తంగా కలిసికట్టుగా జీవించటం అమెరికాలో జరిగింది. ఇదొక స్వల్పమైన విషయమని అనలేము.

ప్రశాంత సహజీవనాన్ని అమలుజరిపేందుకు గాను జానపద పండ గలూ, పబ్బాలూ, వేరువేరు తెగలకు సంబంధించిన సమాచారాలూ. ఆయా భాషలకు ప్రాధాన్యత ఉండే పాఠశాలలూ, ప్రత్యేకమైన దైవపూజా మందిరాలూ మొదలైన వాటిని ప్రోత్సహించటంవల్ల కానీ, ఒకేసంస్కృతి క్రింద జీవించేందుకు వొత్తిడిచేయటంవల్ల కానీ- జరుగుతుందనే నమ్మకం లేదు. పురాతన ప్రపంచంలోని జానపద సంస్కృతిని ప్రోత్సహించటం వల్లనో, లేక వాటిని విడనాడటం వల్లనో అమెరికాకు ఇది లాభించట మనేది జరిగింది ?

వివిధ జాతుల సమ్మేళనపట్ల అమెరికా వైఖరి కారణంగానే ఆ రెండూ సమర్థించబడినవి. హాలెండ్ లోని డచ్ సమాజాలలోనూ, మిచిగన్ పెల్లా, అయోవాలలోనూ జానపద సంబంధమైన పండుగలు ఐపోగానే, అక్కడి ప్రజలు తిరిగి మామూలు అమెరికన్‌లు అయేవారు. టార్పాన్ ఊటల దగ్గరా, ఫ్లారిడాలోనూ - జలదేవతల్ని గూర్చిన పండగల్లో పాల్గొ

న్నాక- వారి జీవితం తిరిగి సినిమాలకూ, టెలివిజన్‌కూ, రోటరీ క్లబ్‌లకూ అంకితమై పోతుంది. ఇటలీ-అమెరికన్, పోలిష్-అమెరికన్ సామాజికులు - రెండోతరం, మూడోతరాలలో సిటీ కౌన్సిల్‌తో సభ్యులుగానూ, ఇతర పట్టణ సంబంధమైన సంస్థలలో సభ్యులుగానూ ఉండసాగాక, వారి ప్రాథమిక సమాజాలు అంతర్ధానమైనవి. తరతరాలుగా వొచ్చిన ఆచారాలను విడనాడలేని, జీవితంలో అవి ప్రస్ఫుటరూపాలను దాల్చిన కొన్ని స్థలాల్లో ముఖ్యంగా మతైకమైన నమ్మకాల ప్రాధాన్యత గోచరించేచోట- భాషా సంబంధమైన విభేదాలు అంతరించినా- ఏదో ప్రత్యేకత, భేదం ఇంకా ఉన్నదని తోస్తుంది. ఐతే ఎంతో పురాతనమైన అమెరికన్ ప్రజల విషయంలోకూడా ఇలాటి భేదం స్పష్టంగా కనిపిస్తూనే ఉంటుంది.

అనేక ఇతర కథలవలెనే జూలియస్ లెఖ్‌మన్ కథకూడా ఇలాటి సత్యాలనే నిరూపిస్తుంది. బవేరియా మంచి యువకుడుగా ఉన్నప్పుడు ఆయన న్యూయార్కుకువొచ్చి, పనులుచేసుకుంటూ చదువు సంధ్యలు సాగించి, వివాహమాడి తరాలు గడచిపోవటాన్ని ఆయన చూశాడు. ఆయన ధనవంతుడు కాలేదు కాని, జీవితాన్ని హాయిగా గడపగలిగాడు. తన 92-వ ఏట చనిపోబోయేముందు, ఆయనొక వీలునామా రాశాడు: అందులో 1000 డాలర్లు జర్మనీలోని తన తల్లిదండ్రుల సమాధుల సంరక్షణకు ఆయన కేటాయించాడు; 60,000 డాలర్లు యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వానికి చెందాలనీ "నన్నూ నా భార్యను పౌరులుగా స్వీకరించి, తమ ఆశీర్వాదాలను వర్షించినందుకు మా కృతజ్ఞత" అని ఆయన విశదీకరించాడు.

# నాలుగో అధ్యాయం

## కుటుంబ జీవనం

అమెరికన్ కుటుంబంలో గమనించదగిన విషయం - తల్లీ, తండ్రీ పిల్లలూఉన్న చిన్న కుటుంబమనేది; ప్రపంచంలోని అనేక తావుల్లో యీ కుటుంబం చాలా పెద్దదిగా ఉంటుంది; ఒకే కప్పుకింద - తాతా, అవ్వా, వారి కుమారులూ, వారి కుమారుల కుటుంబాలుకూడా నివశిస్తూండటం జరుగుతోంది. కాని, యునైటెడ్‌స్టేట్స్‌లోనూ, పశ్చిమ ప్రపంచమం దంతటాకూడా - వైవాహిక సంబంధం కేంద్రీకరణగా ఉంటూ, ఒకో వివాహం ఒకో కొత్తకుటుంబానికి దోహదమౌతోంది. ఒకవ్యక్తి తన తల్లిదండ్రుల కుటుంబంలోనే జీవితాన్ని ఆరంభించి, పెళ్ళయాక కొత్త కుటుంబాన్ని, తన స్వంతదాన్ని ఏర్పరుచుకున్నప్పటికీ - మొదటి కుటుం బంలో సభ్యుడుగానే ఉంటున్నాడు. వివాహమాడటంద్వారా అతనికి తన భార్య కుటుంబంతోకూడా సంబంధ బాంధవ్యాలు ఏర్పడుతూ - తన సంతానం వివాహమాడి వేరువేరు సంసారాలను స్థాపించుకున్నాక వారి తోడి సంబంధాలు కొంతవరకూ తగ్గుతవి. ఈ విధంగా అమెరికన్ అనేక కుటుంబాలతో సంబంధాన్ని కలిగి ఉంటున్నాడు. ఐతే ఒకసారి పెళ్లాడాక ఆ కుటుంబంతోనే అతనికి ఎక్కువ సంబంధమూ, తన బాధ్యతల్ని నిర్వ హించవలసిన విధీ ఉంటూన్నది. ఐనప్పటికీ తన తల్లిదండ్రుల కుటుం బంతో బలమైన సంబంధాన్ని కలిగి ఉండటంకూడా జరుగుతూనే ఉన్నది.

తల్లిదండ్రులు - కొత్త సంసారంలో తలదూర్చకుండా ఉండేందుకు జాగ్రతలు తీసుకోవటం పరిపాటి. తల్లిదండ్రుల్లో ఒకరు చనిపోవటం సంభవిస్తే - రెండోవారు సామాన్యంగా ఒంటరిగానే జీవితాన్ని గడుపు తారు; లేదా తన సోదరితో ఉంటారు; లేదా వృద్ధుల సంరక్షణనుచూసే

సంస్థతాలూకు గృహానికన్నా వెళ్తారు. అమెరికన్ జీవితం యవ్వన సుఖాలను అనుభవించేందుకూ, యవ్వనమిచ్చే శక్తిసామర్థ్యాలను కేంద్రీకరించేందుతూ ఉద్దేశించబడింది; అందుకని పిల్లలున్న సంసారంలో - ఆ తల్లిదండ్రుల తాలూకు తల్లిదండ్రులుకూడా ఉండటం బహు అరుదు. ఐతే తల్లిదండ్రులతోనూ, సోదరులూ, సోదరీలతోనూ ఉండే సంబంధ బాంధవ్యాలు బలమైనవిగానే ఉంటూ, చుట్టాల రాకపోకలు సాగుతూ, ఒకోసారి వారం రోజులపాటు ఉంటూండటం సర్వసామాన్య విషయం.

సోదరులూ, బావమరుదులూ, మరదళ్ళే కాకుండా, దాయాదులూ, బాబాయిలూ, మామలూ, ఆ దాయాదుల తాలూకు బంధువర్గం, చివరకు రక్త సంబంధం లేనివారితో కూడినవాటిని గూర్చి - ఎంతో గర్వపడే పెద్దపెద్ద కుటుంబాలుకూడా ఉన్నవి. ముఖ్యంగా సోదర సోదరిలమధ్యా, తాతా మనుమళ్ళమధ్యా గాఢమైన అనురాగం ఉంటోంది. మనమలనూ, మనుమరాళ్ళనూ లెక్కపెట్టుకొని గర్వంగా చెప్పుకోవటం ఒక ఆచారంగా పరిగణించబడుతోంది. తమ సంతానమూ, వారి సంతానమూ మొత్తమంతా కలిసి ఏక కుటుంబీకులుగా కొద్దికాలం గడిపేందుకు దూరభార ప్రయాణాలు చేసినప్పుడు ఈ కుటుంబీకులమధ్య ఉండే అనురాగం ఎంతో బలవత్తరమైనదిగా ప్రదర్శించబడుతుంది.

ఐతే, ఏ కుటుంబం అమెరికన్ పద్ధతి నిష్పాక్షికమైనది? ఇంటిపేరనేది, కుటుంబనామ మనేది భర్తపరంగా వొస్తూండటంవల్ల ఆయన కుటుంబానికి ఒకరకం ప్రాధాన్యత ఉంటూన్నది. ఐతే, సద్భావమనేది ప్రత్యేకమైన భేదాన్ని చూపవలసి ఉండటంవల్ల, ఆమె కుటుంబంపట్లకూడా అది అనువర్తిస్తుంది. ఉభయులవైపునా ఉండే తాతలూ, అవ్వలూ - మనుమలూ, మనుమరాండ్రూ తమవారేనని సరిసమాన భావాలను కలిగి ఉంటారు. ఒక పండుగకు ఒక కుటుంబం ఉన్నచోట అందరూ గుమి

కూడితే మరో పండుగకు ఈ కుటుంబీకులంతా, మరొకకుటుంబం ఉన్న దగ్గిర గుమిగూడుతారు. ఒక బిడ్డకు తండ్రివైపు తాతగారి పేరు పెడితే, మరో బిడ్డకు తల్లివైపు తాతగారి పేరు పెట్టటం జరుగుతుంది. (ఈ రోజుల్లోని తల్లిదండ్రులు చెవికి ఇంపుగా సోకే పేరు ఏరుకున్నప్పటికీ - యీ విధానమే ఎక్కువగా అమలు జరుపబడుతోంది).

యునైటెడ్ స్టేట్స్‌లో వ్యవసాయమే ముఖ్యవృత్తిగా ఉంటున్న ఆ తొలిదినాల్లో, మొత్తం కుటుంబీకులందరూ క్షేత్రంపెద పంట పండించేందుకే పూనుకుంటూ, కనీసం ఒక్క కొడుకన్నా ఇంటిదగ్గరేఉండి క్షేత్రాన్ని చూసుకోవలసి ఉంటూండేది. ఐతే ఈ రోజుల్లోని కుటుంబాలు వ్యయపరిచేవిగానే ఉంటూన్నవి. కనుకనే మొత్తం కుటుంబమంతా ఒకే కప్పుకింద ఉండటమనే అభిప్రాయం మాయమైంది. బ్రహ్మచర్యాన్ని గడిపే వయసు మళ్ళినవారూ, భర్తతోకానీ, భార్యతోకానీ వియోగం సంభవించినవారి విషయం వేరు; వారి సమస్యలింకా బాగా పరిష్కరించబడలేదు.

కొంతమంది పరిశీలకులు - అమెరికన్ కుటుంబం శాఖలు శాఖలుగా విడిపోతూండటంవల్ల అదొక బలహీనమైన సంస్థ అనీ, పాఠశాలలూ, కోర్టులూ, యువకుల సమాజాలూ వాటి పనుల్ని సక్రమంగా చేసుకునేందుకు కొంత ఇబ్బంది కలుగుతున్నదనీ అభిప్రాయపడుతున్నారు. కాని ఇది తప్పు అభిప్రాయం.

వ్యాపారంచేసే సమాజంలో, ఈ కుటుంబం మరింత బలంగానూ, శాశ్వతంగానూ - ఆ వ్యాపారంకన్నా మిన్నగా ఉండటం జరిగింది. ఎక్కువ కుటుంబాలు వ్యాపారాలకన్నా దీర్ఘకాలంవరకూ సజీవంగా ఉంటూనే ఉన్నవి.

తొలిపాఠాలూ, ఆరోగ్యమూ, సంరక్షణా మొదలైనవాటిని నిస్సహాయ స్థితిలో ఉన్న పసిపాపకు కుటుంబమే ప్రసాదిస్తుంది. అటుపిదప -

ఆ శిశువుతాలూకు మతం, సంస్కృతిపట్ల అతని ప్రవర్తనా, అభిప్రాయాలూ, ఇతర వ్యక్తులతో ఎలా మెలగవలసిందీ, ఆటపాటల్లో పాల్గొనటం మొదలైనవాటిని సుశిక్షణద్వారా కుటుంబమే అందిస్తుంది. చిన్నతనంలో కుర్రవానికి సామాజికస్థానం, పరువు ప్రతిష్ఠలూ మొదలైనవి ఆ కుటుంబంనుంచే సంక్రమిస్తవి; అతను పెద్దవాడయాక ఉచ్ఛదశకు వెళ్ళటం లేదా పతనమవటం అతని బాధ్యత. తమ సామాజిక స్థానాన్ని గూర్చిన అభిప్రాయాల్ని పిల్లలు చాలా తేలిగ్గా వంటబట్టించుకొని, తమతో పాటే దాన్ని పాఠశాలకు తీసుకొనివెళ్ళి అక్కడ మరికొన్ని పాఠాలు నేరుస్తారు. కుటుంబానికి సామాజిక స్థానమనేది ఏర్పడటం అనేక విషయాలమీద ఆధారపడి ఉంటుంది: తండ్రివృత్తి, అతని ఆదాయం, కుటుంబంతాలూకు వంశవృక్షం, నివసించేస్థలం, సామాజికంగా వారి అభిరుచులూ, మతవిశ్వాసాలూ, ఆ సమాజంలో ఉంటూన్నకాలం, నైతిక దృక్పథం మొదలైనవి గణనకు వొస్తవి.

తరువాత గృహానికి సంబంధించిన ఇతర విషయాలు లెక్కలోకి తీసుకోబడుతవి. ముఖ్యంగా గృహం (యునైటెడ్ స్టేట్స్‌లోని కుటుంబాల్లో 56% కు స్వగృహాలున్నవి) తల్లిదండ్రులు గర్వపడేవి - కారు, గృహోపకరణాలు, తమ కుటుంబంలోని పెద్దల గొప్పతనం, ఔన్నత్యం మొదలైనవి. ఆ తరువాత తల్లిదండ్రులు తమ వంశీకుల్నిగూర్చి చెప్పే కథలు - ఆ కుటుంబీకుల సౌశీల్యత, తల్లిదండ్రులు తమ యవ్వనాన్ని గడిపిన విధానం, చేసిన సత్కార్యాలూ - ఒక పిన్నమ్మ 95 ఏళ్లు బతికి, తన స్నేహితులందరూ తనకన్న ముందుగానే చనిపోవటాన్నిగూర్చి ఆశ్చర్యపడటం - మొదలైనవి చెప్పబడుతవి. వీటన్నిటికన్నా బలవత్తరంగా ఉండే అభిప్రాయమిది: ఇప్పటి తమ స్థితిలో కుటుంబీకులందరూ ఉన్నారు; జీవశాస్త్రరీత్యా తమ ప్రత్యేకత, ఔన్నత్యం, కలిసికట్టుదనం తమకున్నవి; ఆ సంబంధ బాంధవ్యాలు ఎంత బలమైనవంటే - ఒకరుచేసే పనుల తాలూకు ఫలితాలు కుటుంబానికంతకూ వర్తిస్తవి।

పరదేశ పరిశీలకులు అమెరికన్ కుటుంబంలోని బలహీనతగా గుర్తించిన విషయం - అందులోని సభ్యులందరిమధ్య సమానత్వ ముండట మనేది - కాని, ఇది నిజానికి కుటుంబానికి ఎంతో బలాన్ని చేకూరుస్తున్నది. ఐతే అమెరికాలోకూడా కొన్ని కుటుంబాల్లో ఒకరిది పైచేయిగా ఉంటూండటం లేకపోలేదు. కొన్ని కుటుంబాలలోని తండ్రులు ఎదురు చెప్పేందుకు వీలులేని వినయాన్ని తమ సంతానం తమపట్ల ప్రదర్శించాలని ఆజ్ఞాపించటం, ఆదాయాన్ని వ్యయపరిచే విధానంలో ఒక్క మాటన్నా మాట్లాడేహక్కు భార్యలకు లేకుండటం, తల్లి అలసిఉండి, చిరాగ్గా ఉన్న కారణంగా చిన్నపిల్లలు చేసే స్వల్పమైన తప్పులకూడా దెబ్బలు తినటం జరుగుతూనే ఉన్నది. ఐతే సరాసరిన, ఇతర సంస్కృతులతో పోల్చి చూసుకున్నట్లయితే, అమెరికన్ కుటుంబాలలోని సభ్యుల మధ్య సమానత్వమనేది అమలు జరపబడుతూండటం కనిపిస్తుంది.

ఈ సమానత్వమనేది వివాహంతో ఆరంభమై, యీ రోజుల్లో దంపతులిద్దరూ జీవితంలో భాగస్వాములుగా ప్రవేశించటంవలె జరుగుతూన్నది. అనేక కుటుంబాల్లో - భార్య మొదటిసారి పురుడు పోసుకునే వరకూ పనిచేసుకుంటూనేఉంటూ, పిల్లలు తమనుగూర్చి తాము జాగ్రత వహించేవయస్సుకు ఎదిగాక, తిరిగి పనిచేసుకునేందుకు వెళ్తూండటం జరుగుతోంది. ఏమైనా ఆమె ఒక రోజులో చేయవలసినదానికన్న ఎక్కువ పనినే ఇంటిదగ్గర చేయవలసిఉంటుంది - ఎందుకంటే ఐశ్వర్యవంతులకు దాసదాసీజనమంటూ ఉంటారు. పోతే అనేక గృహోపకరణాలుగా ఉపయోగపడే యంత్రాల సహాయంతోనూ, నిలవ చేయబడి సిద్ధంగావున్న ఆహారాలు లభ్యమౌతున్నప్పటికీ, ఐదారుమంది కుటుంబీకుల అవసరాలన తీరుస్తూ, మంచి మర్యాదల్ని పాటిస్తూ, ఇరుగు పొరుగులతో సఖ్యతగా ఉండటమంటే - ఇదంతా పూర్తిగా రోజంతా పనిచేయటమే కాగలదు.

అమెరికన్ కుటుంబీకుడు - మరొక రకం ఆర్థిక సమానత్వంకూడా ఉన్నదంటాడు : ఆదాయాన్ని వ్యయపరిచేది భార్య. స్త్రీలకు ప్రత్యేకిం

బడిన పత్రికలూ, పగటివేళల్లోని రేడియో, టెలివిషన్ ప్రోగ్రాములూ మొదలైనవి అమెరికన్ స్త్రీకి ఏదైతే ఇష్టమో గ్రహించే ఆ యా వస్తుసము దాయాల్ని గూర్చి విశేష ప్రచారంచేసి ఆమె దృష్టిని ఆకర్షించగలుగు తూన్నవి.

ఒక క్రొత్తకారు కొనుక్కునేందుకు, లేదా అమెరికన్ పరిశ్రమలో ఉత్పత్తి ఐన మరో ఖరీదైన వస్తువేదన్నా కొనుక్కునేందుకుగాను, ఆమె కొంతకాలంపాటు పనిలోకి వెళ్ళవచ్చును. ఇలా పనిలోకి వెళ్ళే అవకాశముండటం, ఇంతకుపూర్వం పనులు చేసుకొని డబ్బు సంపాదించు కోవటం జరిగి ఉండటం - ఇవి దాంపత్య జీవితంలోని తన సమానత్వాన్ని రుజువు చేస్తున్నవనే భావం ఆమెలో బలంగా పనిచేసేందుకు సహాయ పడుతవి.

ఐతే తండ్రి నామకః ఇంకా కుటుంబ పెద్దగానే ఉంటూన్న మాట నిజమే. కాని పురుషుని ఆధిక్యత చిహ్నరూపంగా ఉంటూంటే స్త్రీ ఆధిక్యత నిజరూపాన ఆస్తిపాస్తులు - ఇల్లు లేదా కారు మొదలైనవి దంపతులు ఉభయులపేరిటా ఉండటం సామాన్యంగా జరుగుతుంది. జమా ఖర్చులూ, లెక్కలు తణిఖీచేయటం దంపతులు ఇద్దరూ కలిసి చేసేపనిగా ఉంటూ, గృహిణే నెలసరి బిల్లులన్నిటినీచెల్లిస్తూ, ఇన్‌కమ్‌టాక్స్ లెక్కల్ని తయారు చేస్తూంటుంది.

అమెరికన్ వివాహం సహజంగానూ, తప్పకుండానూ యీ సమా నత్వంవైపే దారితీస్తుంది. వివాహానంతరం దంపతులు, వేరొక కుటుం బంగా ఏర్పడి, ఒకరినుంచి మరొకరు తమతమ ఉద్రేక, ఉద్వేగాలను తృప్తిపరచుకునేందుకు ప్రయత్నిస్తారు. ప్రేమికులుగా, తల్లిదండ్రులుగా, ఆటపాటల్లో సహచరులుగా, కలిసి పని చేసుకునేవారుగా ఒక జీవితంలోని సాహసకృత్యాలన్నిటా భాగస్వాములుగా ఉండేందుకుగాను తమమధ్య బల వత్తరమైన సంబంధబాంధవ్యం ఉండాలని వారు గాఢంగా కోరుతారు.

అమెరికన్ వివాహంలోని గొప్ప సమస్యల్లా అది పట్టుబట్టి కోరి రాబట్టు కునే విషయాలు అనేకం ఉండటం. బైటనుంచి సహాయాన్ని ఆర్థించకుండానే మానవునికి అత్యవసరమైన మూడు ప్రాథమిక అవసరాలు – జీవశాస్త్రరీత్యాను, సామాజికంగాను, మానసికంగానూ అవసరమైన వాటిని తృప్తి జెందేట్లు చేయటమే వైవాహికోద్దేశం.

## సంతాన శిక్షణ.

దంపతులు సరిసమాన హక్కులతో భాగస్వాములుగా చేరిన విధానమే, వారి సంతానానికూడా అందివ్వబడుతుంది. తమ చిన్నారులను పరిపాలిస్తూ, వారిని సక్రమ మార్గంలో తల్లిదండ్రులు నడపవలసిన బాధ్యతలు కలిగిఉన్నప్పటికీ - ఎంత త్వరలో యీ పిల్లలు స్వతంత్రులుగానూ, ఆత్మాభిమానంతోనూ ఉండేందుకు వీలవుతుందో దానికొరకై ప్రతివారు ప్రయత్నిస్తారు. పరిశుభ్రంగా ఉండటం, టాయిలెట్ కావటం మొదలైన శిక్షణలు - కొన్ని సంస్కారాలకన్నా ముందుగానే ప్రవేశపెట్టబడుతవి; తన పనులు తాను చేసుకోగలిగిన పిల్లలకు మెప్పుకోళ్ళు లభిస్తవి. ఇరుగు పొరుగుల్లోఉన్న పిల్లల్తో తమ పిల్లల్ని పోల్చి చూసుకుంటూ - ఇతర్లకన్నా ముందుగా తమ పిల్లలు నడవటం, మాట్లాడటం, మొదలైనవి నేర్చేందుకు తల్లులు తగిన ఉత్సాహ ప్రోత్సాహాలను ఇస్తారు. ఐతే బాగా చదువుసంధ్య లున్న తల్లులు - గెసెల్ పరిశీలనను చదివి, తమ పిల్లల్ని మరింతవేగంగా ముందుకు తీసుకొని వెళ్ళటం అంత మంచిదికాదనే విషయాన్ని గ్రహిస్తారు.

పిల్లల పెంపకంలోని ఇతర విషయాలు - వ్యక్తిగతమైన ప్రత్యేకతా, వైవిధ్యం, స్వేచ్ఛ, సమానత్వం మొదలైనవాటికి ప్రాముఖ్యతనిస్తూన్నవి. అమెరికన్ గృహాలలో సర్వసామాన్య సంఘటనగా కనిపించే-పసి పిల్లలు పాలసీసాలోనుంచి పాలుతాగే విధానమే, వారినొక ప్రత్యేక వ్యక్తిత్వానికి లాక్కువెళ్లే మొదటి మెట్టుగా ఉంటూన్నది. అదేవిధంగా శిశు

వుకు ప్రత్యేకించబడిన గదీ, ఎత్తుగా ఉన్న వాడికుర్చీ, ఆటవస్తువులూ మొదలైనవి వాడిలో వైవిధ్యాన్ని పురిగొల్పుతున్నవి. ఒకరికన్న ఎక్కువ మంది ఉన్న గృహాలలో - ప్రతి పిల్లవాడికీ, లేదా పిల్లకూ ప్రత్యేకించబడిన స్వంత వస్తువులనేవి ఉండటం ఒక ఆచారం. వెచ్చగా ఉండే గృహంలోని పిల్లవాడికి బిగుసుగా ఉండే దుస్తులధారణ అనవసరమౌతోంది కనుక, వొదులుగా ఉండే దుస్తులధారణ జరిగి, తనను బంధించేలాటిదేదీ లేనందువల్ల, తాను ఎంతో స్వేచ్ఛను అనుభవిస్తున్న భావం వాడిలో ఘాటుగా నాటుకుంటుంది; ఇకముందుకూడా అన్ని విషయాల్లోనూ తానూ స్వేచ్ఛను సాధించాలనే పట్టుదలకూడా అధికమౌతుంది. వాడి తల్లిదండ్రులు సామాన్యంగా యవ్వనంలోనే ఉండటంవల్ల, పిల్లవాడిరాక కేవలం జీవశాస్త్రరీత్యా యాదృచ్ఛికంగా జరిగిందికాకుండా జాగ్రత్తగా అమలుజరిపే ఒక పథకం ప్రకారమే సంభవించినదై ఉంటోంది. సామాన్యంగా ప్రతి కుటుంబంలోని సంతానమూ హద్దుపద్దుల్లో ఉంచబడుతూ, ఉన్న సంతానానికి ఉన్నతవిద్య, మంచి దుస్తులు, ఆరోగ్య రక్షణ, ఆనందంగా జీవితాన్ని గడిపే సాధనాలూ అందుబాటుతో ఉండేట్లు చూడబడుతోంది.

తల్లిదండ్రులు తమ పిల్లలందర్నీ సరిసమానదృష్టితో సాకాలనీ, ఒకరిపట్ల ప్రత్యేకాభిమానం ప్రదర్శించరాదనే నియమం పాటించబడుతూన్నా, పిల్లలకలా కనిపించకపోవొచ్చు. తల్లిదండ్రుల ఆస్థిపాస్థులన్నిటిలోనూ పిల్లలందరికీ భాగాలుండే నియమం అనుసరించబడుతోంది.

చాలా చిన్నతనంనుంచే తమంతటతాముగా ఆలోచించుకొనే అవకాశాలు పిల్లలకు ఇవ్వబడుతూ, గృహసంబంధమైన నిర్ణయాలలో వారికి పాలు ఇవ్వబడుతోంది. ఎన్నుకోవటంలో వారికి అవకాశాలు ఇవ్వబడుతూన్నవి. వారి కొరక పని కేటాయించబడినప్పుడు - ముఖ్యంగా అదిచేసేందుకు వారు అంగీకరించనిపక్షంలో, నోరుమెదపకుండా ఆ పనిచేయటానికి

మారుగా, తాను ఎందుకు సమ్మతించలేదో వివరించే అవకాశమున్నది. ఇదంతా ఒక్క మాటలో చెప్పాలంటే - అమెరికన్ కుటుంబం ప్రజాస్వామిక సిద్ధాంతాలమీదనడిచే ఒక చిన్న సమాజంగా ఉంటున్నది; అందులోని, సభ్యులందరికీ హక్కులూ, విధులూ ఉంటున్నవి. తండ్రి చట్ట నిర్మాతగానూ, తల్లి ఆ చట్టాలను అమలుజరిపే అధికారిణిగానూ, పిల్లలు వోట్లనిచ్చే సభ్యులగానూ ఉంటున్నారు. నిజానికి అమెరికన్ సంస్కృతి లోని సంసారిక, రాజకీయ, ఆర్థిక, మతైకరంగాలు ఒకదానితో మరొకటి పెనవేసుకొనిపోయి ఉండటంలో, వాటిని విడదీసి, వర్ణించటం చాలా కష్ట మౌతోంది. వ్యక్తి, వ్యక్తిగతస్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య సిద్ధాంతాలూ మొదలైనవాటిని పిల్లలు పాఠశాలల్లో నేర్చుకొని, త్వరలోనే వాటన్నిటినీ ఇంటిదగ్గర అమలుజరపాలని ప్రయత్నిస్తూ, వారి సమస్యలనూ, హక్కులనూ - తల్లిదండ్రులపట్ల గౌరవాన్ని విడనాడకుండా సాధించేందుకు యత్నిస్తారు.

అటు పాఠశాలల్లోనూ, ఇటు ఇంటిదగ్గరకూడా పిల్లల్లో నాటించేందుకు ప్రయత్నించబడే ఉన్నతభావం - న్యాయబద్ధమైన ప్రవర్తన; దీన్ని త్వరలోనే పిల్లలు గ్రహించి, తమలో తాము యీ ఉన్నత భావాన్ని నేర్చుకునేందుకు ప్రయత్నిస్తారు. ఈ భావం చాలా చిన్నతనంనుంచే గాఢంగా పనిచేస్తుండటంవల్ల, ఇదేదో ప్రకృతిబద్ధమైనన్యాయం - ఏ భూమ్యాకర్షణ శక్తిలాటిదో నన్నేంతగా నిత్యజీవితంతో మిళితమైపోతోంది.

న్యాయబద్ధమైన ప్రవర్తనలో ముఖ్యంగా బలహీనులమీద ఒంటికాలిమీద లేవటం పనికిరాదు; నియమావళిని అతిక్రమించకుండా, అదేసమయంలో తన జట్టును విడనాడకుండానూ, అవతలి వ్యక్తిలోని లోపాన్ని లేదా బలహీనతను తన లాభానికి ఉపయోగించకుండానూ (ఎదుటి వ్యక్తి కిందపడ్డప్పుడు, ఆతన్ని కొట్టరాదు - లాటిది); శక్తి ఉన్నంతవరకూ ఆటపోటీని విడనాడకుండానూ 'మంచి ఆట ఆడాను' అనే తృప్తి మిగిలి, ఒకవేళ

ఓటమి ప్రాప్తించినా, అది రాజసంగా ఉండేట్లూ, ఒకవేళ గెలిచినా రాజసంగానే ఉండేట్లూ ప్రవర్తించటం అత్యవసరమనిపిస్తూ, అమలుజరుప బడుతోంది. ఏ ఫుట్‌బాల్ మేచో పూర్తికాగానే ఉభయపక్షాలవారూ ఒక రొకరు అభినందించుకోవటం పరిపాటి; ఇదే తత్వం రాజకీయాలలో కూడా ప్రదర్శించబడి, ఎన్నికల్లో గెలుపొందిన సభ్యుడ్ని, ఓడిన సభ్యుడు అభినందించటమేగాక, తన వెనుక నిలబడిన బలగాన్నంతటినీ, గెలుపొందిన సభ్యుడ్ని బలపరచమని ఆదేశించటం జరుగుతోంది.

ఒక పిల్లవాడు, మరొక పిల్లవాని తాలూకు ఆటవస్తువును లాక్కున్నట్లయితే-తల్లి "అలాచేయరాదు; అది వాడిది కదా!" అని మందలించటం సహజం. మొదట్లో ఆ వస్తువు ఎవరిదో, వారి యాజమాన్యాన్ని గౌరవించటం విధి. కాని, ఒక పిల్లవాడు చాలాసేపు ఆ ఆటవస్తువుతో ఆడుకొని, ఎదుటి పిల్లవాణ్ణి భ్రమింపజేస్తూ, చిరాకుపరిచినట్లయితే అతనికి యీ విధంగా చెప్పబడుతోంది; "నీ దగ్గర ఆ వస్తువు చాలాసేపు ఉన్నదికదా, ఇప్పుడు కాస్సేపు జానీని దానితో ఆడుకోనివ్వు" యాజమాన్యాన్ని వహించినవాడు ఇతరులతో కూడా తన ఆనందాన్ని పంచుకునేందుకు తప్పక అంగీకరించవలసిఉన్నది. ఎంతో చిన్నతనంలోనే అమెరికన్ పిల్లలు - ఒక వస్తువును కలిగిఉండటానికీ, లేదా, యాజమాన్యాన్ని వహించటానికీ, వేరొకరితో పాలుపంచుకునేందుకూ ఉన్న తారతమ్యాన్నీ పోటీపడటం, సహకరించటానికి గల తేడానూ తెలుసుకోగలుగుతున్నారు. అమెరికన్ సంస్కృతి యందంతటా కనిపించే చిహ్నాలు (వీటిలో కొన్నిటితో మనకు ముందు ముందు పరిచయమౌతుంది - ఉదాహరణకు - కార్మికుల సమస్యలు, మొదలైనవి) — ఆ తారతమ్యాన్ని అధికం చేసేందుకు గాక, సహకారత్వాన్ని పెంపొందించేందుకు ప్రయత్నిస్తూ, ఉభయతత్వాలకూ ఒక అన్వయాన్ని అన్వేషించేందుకు ఉపకరిస్తున్నవి.

ఆటపాటల్లో న్యాయబద్ధమైన ప్రవర్తన మరొక సద్గుణ చిహ్నానికి దారితీస్తుంది: కలిసికట్టుగా పనిచేయటం, ఒక గమ్యస్థానాన్ని జేరేందుకూ. దానిఫలితాలను పదిమందీ పంచుకునేందుకుగాను, తమంతటతామే ఒక జట్టుగా ఏర్పడి, అందరికీ సమ్మతమైన నియమావళిని పాటిస్తూ ముందుకు సాగటం సంస్కృతిలో ముఖ్యమైన విభాగం. ఇలాటి తత్వం ఆటపాటల్లో ఆరంభమై, వ్యాపార రంగాల్లో శాస్త్రీయ రంగాల్లో, బహుజనావసరాలలో, ఒక వ్యక్తిగాకుండా, అనేక వ్యక్తులు జేరిన కూడలిద్వారానూ, అనేక కౌశలాలను కూడదీసి సాధించవలసిన పరిస్థితుల్లోనూ - ఎంతో పురోభివృద్ధిని సాధించేందుకుగాను చేసే ప్రయత్నాలలో అంతమౌతూన్నది.

సంతానశిక్షణలో బలవత్తరమైన నీతి పాటించబడుతోంది. గృహం, పాఠశాల, చర్చి, యువజనసమ్మేళనలూ అన్నీ కలిసి యీ నీతిని అమలు జరిపేందుకు ప్రయత్నిస్తూన్నవి. స్కౌట్ పటాలాలలో జేరే కుర్రవాడు యీ విషయాలను కంఠతా పెట్టాలి: "స్కౌట్‌గా తాను - నమ్మదగినవాడుగా, విశ్వాసనీయుడుగా, సహకారిగా, స్నేహపూర్వకంగా, దయనీయుడుగా, విధేయుడుగా, ఉత్సాహిగా, ధైర్యసాహసాలు గలవాడుగా, శుభ్రతను ఆరాధించేవాడుగా, మంచి మర్యాదలను పాటించేవాడుగా - ఉండాలి." 35 సంవత్సరాల తరువాత యీ విషయాలను ముందువెనుకలు ఆలోచించకుండానూ, ఎక్కడా ఆగకుండానూ రాయగలగటమనేది, దాని శాశ్వత పలుకుబడిని నిరూపిస్తోంది. బైబిల్‌లోని పిట్టకథలూ, మనోవికాసాన్ని కలిగించే ఇతర భాగాలూగా కుటుంబాచారాలమధ్య జాగ్రత్తగా పెంచబడిన పిల్లవాని మనస్సుల్లో, జీవితమంతటా ధ్వనిస్తూనే ఉంటుంది..

ఏది ఒప్పు, ఏది తప్పు అనే విషయాన్ని తేలిగ్గా నిర్ణయించుకునేందుకుగాను తనకు శిక్షణ చాలా చిన్నతనంనుంచే ఇవ్వబడుతుంది; అప్పటికీ తప్పులు చేయటం జరిగినట్లయితే, వాడికి తెలియజెప్పి శిక్షించటం జరుగుతోంది. ఎక్కడో వాడి జీవితంలో మానవద్వేషి ఎదురై "తప్పుఎ

చేసినా ఫర్వాలేదు; కాని పట్టుబడకుండా చూసుకో" అన్న పదకొండో దైవాజ్ఞను నేర్పవొచ్చు. కాని గాడితప్పిన జీవితాలను ఎన్నుకొనే కొద్ది మంది మినహా, మిగతావారిలో చట్టాలను అతిక్రమించరాదనే బలమైన అభిప్రాయం ఉంటూనేఉన్నది.

అమెరికన్ కుటుంబీకులు ఎంతో ప్రాముఖ్యతను ఇచ్చేవాటిల్లో సంతాన శిక్షణ ఒకటి. ఈ పనిని సక్రమంగా నిర్వర్తించేందుకుగాను - వారు అనేక పత్రికలను చదవటం, ఉపన్యాసాలను వినటం, ఇతర తల్లిదండ్రులతో సంప్రదింపులు చేయటం చేస్తూంటారు. శాస్త్రీయపద్ధతులద్వారా దీన్ని సాధించేందుకు వారు ప్రయత్నిస్తూంటారు: కాని శాస్త్రవేత్తలు తరచుగా సంతాన శిక్షణ విషయంలో తమ అభిప్రాయాలను మార్చుకుంటూండ టంతో ఇదొక గడ్డుసమస్యగా రూపొందుతోంది. ఇలాటివాటితో చిరా కెత్తిన ఒక మాత ఇలా అన్నది: "పిల్లల మనస్తత్వాన్ని వివరించే పుస్త కాల్ని పఠించటం నేను మానుకున్నాను. ఏ విషయాలైతే నిశ్చయంగా నీకు తెలియకుండా, అనేక ప్రశ్నల్ని లేవదీస్తవో, వాటిజోలికి పోకుండ టమే మంచిది!" ఐతే, తల్లి తన స్వంత అభిప్రాయాలను కలిగిఉంటూ, తన తల్లిదండ్రులకు దూరమైనప్పటికీ, తనకు వారు చిన్నతనంలో ఇచ్చిన శిక్షణతాలూకు జ్ఞాపకాలను అమలు జరిపేందుకు ఒకవైపు ప్రయత్నిస్తూ, మరొకవైపు తాను పొరబడటం లేదని నిశ్చయంగా తెలుసుకునేందుకు - సంతానశిక్షణలో ఘటికులనబడేవారి అభిప్రాయాలనుకూడా సేకరిస్తూ, వాటి మీద కూడా ఆధారపడుతూనే ఉంటుంది.

కుటుంబంలో తల్లిపాత్ర ప్రాముఖ్యమైనది. బిడ్డకు 5-6 సంవత్సరాల వయస్సువొచ్చేవరకూ, పగటిలో అధికభాగం వాడు తన తల్లి పలుకుబడి లోనేఉంటూ, తన అవసరాలకూ, ఆనందానికీ, సుశిక్షణకూ ఆమె మీదనే ఆధారపడిఉంటాడు. తాతా, అవ్వలు దాపులోనే ఉంటూన్నప్పటికీ, వారు పిల్లల విషయంలో ఎక్కువగా కల్పించుకునేందుకు తల్లిదండ్రులు అంగీక

రించరు: ఎందుకంటే, అమెరికన్ సమాజం ఎన్నో మార్పులు చెందుతూ, ఒక తరంవారి అలవాట్లూ, ఆచారాలూ మరొక తరంవారికి పురాతనమైన విగా కనిపిస్తూండటంవల్ల, అవి తరువాతి తరంవారికి ప్రమాదకరంగా కూడా పరిణమించవచ్చు.

తమపిల్లలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అలవాటు చేయటంవల్ల ఒకనాటికి తప్పనిసరిగా వారు తమతో విడివడి, దూరమౌతారనే విషాదంకూడా ఉండనేఉన్నది. పిల్లవాడి తాలూకు యీ నాటి వ్యక్తిత్వం, ఒకనాటికి ప్రత్యేక వ్యక్తిత్వమై, వైవిధ్యంతో, తన ఇష్టానుసారంగా ప్రవర్తిస్తాడనే భావం - తల్లిదండ్రుల తత్వంలో ఎక్కడైనా ప్రస్ఫుటమౌతుందా?

ఏమైనా అమెరికన్ జీవితవిధానంలో తల్లిదండ్రులకూ, బిడ్డకూ మధ్య ఉన్న సంబంధబాంధవ్యాలు బలహీనమయేందుకు ఎన్నో హేతువులున్నవి. పాఠశాల చదువు సంధ్యలతోపాటు, పిల్లవాడి తాలూకు ఆటపాటల్ని కూడా చూస్తుంది, పిల్లవాడి దంతాలూ, కళ్లూ, ఆరోగ్యాలను పరిశీలించటమేగాక అవసరమైతే, అంటువ్యాధుల బారినుంచి తప్పించుకునేందుకుగాను ఇంజక్షన్లను కూడా సిఫారస్‌చేస్తుంది. దంతాలుకానీ కళ్లుకానీ బాగాలేనట్లయితే, వాటిని సరిదిద్దుకునేందుకు అవకాశాలను కలిగించటం, అవసరమై వాడి తల్లిదండ్రులు భరించలేని ఖర్చయితే, కుర్రవాడికి కళ్లజోడు కూడా ఇవ్వటము మొదలైన బాధ్యతల్ని పాఠశాలలు తీసుకుంటూన్నవి. ప్రత్యేకమైన జాగ్రతలు తీసుకోవలసిన అవసరమున్నదనుకొన్నప్పుడు ఆయా బాలబాలికలను, ఆయావ్యాధుల నివారణలకై ప్రత్యేకించబడిన వైద్యాలయాలకు పంపటం జరుగుతోంది.

మొగపిల్లల స్కౌట్‌సంఘాలూ, ఆడపిల్లలస్కౌట్ సంఘాలూ, చర్చీ సంఘాలూ మొదలైనవి సామాజిక అవకాశాలనూ, వినోదాలనూ పిల్లలకు సమకూర్చుతూన్నవి. పాఠశాలలకు ఎండాకాలంలో సెలవులిచ్చినప్పుడు, పిల్లలు వారివారి ఇళ్ళకువెళ్ళకుండా ఏ ఎండాకాలపు కేంపులో ఏర్పరచబడు

తూన్నవి. ప్రతిరోజూ కొద్దికాలంసేపు వేరేపనిపాటల్లోఉంటూ, కాస్తోకూస్తో సంపాయించుకునే అవకాశాల్లాటివి - పిల్లవాడు తన తల్లిదండ్రులమీద ఆధారపడే విషయాన్ని బలహీనపరుస్తూంటవి; కాని తనమీద తానే ఆధార పడుతూ, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకునేందుకు ఎంతోసహాయపడు తూన్నవి.

ఆర్థికవిధానంలో అమెరికా 'అరుదైన వస్తువులు' అనబడే తత్వంనుంచి "విరివిగా దొరికేవస్తువులు" తత్వానికిమారటమనేది, తల్లిదండ్రులకూ, పిల్లలకూ మధ్యఉన్న సంబంధబాంధవ్యాలలోకూడా మార్పులు తీసుకొచ్చింది. పని చాలా అరుదుగా లభ్యమౌతున్న కాలంలో, పనివాళ్లమీద యజమానులు చెలాయించే అధికారాలూ, పనివారు వినయవిధేయతలతో యజమానులకు తలలొంచే పద్ధతులూ ఆచరణలోఉండేవి; ఆ నాటి తండ్రులు కూడా పనిలో తమ అనుభవాల్లాటి వాటినే ఇంటిలో కూడా ప్రవేశపెట్టి, పిల్లలు తమ మాటల్ని సుగ్రీవాజ్ఞగా పాటించితీరేట్లు చూసేవాళ్లు; ఎందుకంటే - రేపు యీ పిల్లలు పెద్దవారైతే ఇలాటి తత్వం అలవడితేనేకాని బతకలేరు! ఇక అర్థికరంగంలో విరివిగా లభ్యమవటమనేది ఉంటూన్నప్పుడు - ఎంతో పని, పనివాళ్లకొరకై వేచిఉండటం జరిగింది. కనుక లొంగి ఉండటం, వినయవిధేయతల్ని విపరీతంగా చూపటమనేది అవసరంగా తోచనందున దాన్ని సంతాన శిక్షణలో జేర్చే అవసరం కూడా లేకపోయింది.

పరదేశ పరిశీలకులు ఇదంతా చూచి, అమెరికన్‌లు చాలా దూరం వెళ్ళారనీ, సంతానశిక్షణ విషయాన్ని కేంద్రీకరించుకొన్న సంస్కృతి ఏదో అమెరికన్‌లకూ ఉన్నదనీ, తత్ఫలితంగా, పిల్లల దృక్పథాల్లో ఎన్నో మార్పులు రావటం - వారు మాట్లాడకూడని సందర్భాలలో మాట్లాడటం, ఆజ్ఞలను శిరసావహించవలసినచోట్ల వాదప్రతివాదాలు చేయటం, పెద్దల దగ్గర తలబిరుసుతనంగా ప్రవర్తించటం, పెద్దల ఆధిక్యతలను గుర్తించ

కుంచటం లాటివి సంభవిస్తున్నవని - అభిప్రాయపడుతున్నారు. పల్లెప్రాంతాలలోని తల్లులు కూడా సంపాదనాపరులే కావటంవల్ల పెరిగి పెద్దయే పిల్లలు అటు తండ్రిమీదకానీ, ఇటు తల్లిమీదకానీ ఆధారపడేందుకు వీల్లేకుండానూ, దృఢమైన చట్టాలను అలవరుచుకోలేక, నేరస్థులు కావటం కొన్ని సందర్భాలలో జరుగుతోంది.

ఇదొక నేరమని అన్నప్పటికీ - అమెరికన్లు అంగీకరిస్తారు; కాని జవాబుగా - సంస్కృతి అనేది సాలిగూటివలె ఉంటుందనీ, తాము స్వాతంత్ర్యాన్ని గాఢంగా నమ్మటంవల్ల, పిల్లలకు ఆ స్వాతంత్ర్యాన్ని ఇస్తామనీ, పోటీలు పడి ముందుకు సాగే సమాజంలో ఆ స్వాతంత్ర్యం ఎంతో అవసరంకనుకనే దాన్ని వొదులుకోలేమనీ - అంటారు. అమెరికన్ జీవన విధానంలో లోతులకు చొచ్చుకొనిపోయిన మరొక కారణంకూడా ఇందుకు దోహదాన్నిస్తోంది; యువతీయువకులపట్ల ఉండే అనురాగం. ప్రతిదీ ఈ పురాతన సాంప్రదాయంవైపే మొగ్గుతూ, దాన్నే బలపరుస్తూంటుంది. సామాన్యంగా సాహిత్యం - యువతీయువకుల మధ్యనుండే ప్రణయాన్ని గూర్చే వ్రాయబడుతోంది. స్త్రీలు తమ నిజమైన వయస్సు చెప్పరు. అవ్వలు సన్నగా, నాజుగ్గా ఉండేందుకు ప్రయత్నిస్తూ, యువతులవలెనే దుస్తుల్ని ధరించి, సామాజిక సమ్మేళనల్లోనూ, ఇరుగుపొరుగుల వేడుకల్లోనూ పాత్రలు వహించేందుకు యత్నిస్తూంటారు. ఇక పురుషులు - 40 సంవత్సరాల వయస్సు దాటితే పరిశ్రమలు తమను ఉంచేందుకు సిగ్గుపడతవేమోనని భయపడి, యవ్వనులవలెనూ, యోగ్యులుగానూ కనిపించేందుకు శక్తివంచన లేకుండా పాటుబడతారు.

అమెరికన్‌లు - యవ్వనానికి ఇంత గొప్ప విలువలు ఎందుకిస్తున్నారు?

యుక్తితోకూడిన అనేక కారణాలున్నవి. అమెరికాలో ఏర్పడిన స్థిర నివాసాలకు బలంగాఉన్న యువకులు అవసరమయ్యారనేది నిస్సందేహం.

పిల్గ్రిమ్ ఫాదర్స్ యువకులుగా, 20 - 30 సం॥ల వయస్సుల్లో అమెరికాకు వొచ్చారు. కాప్టెన్ జాన్‌స్మిత్ అమెరికాకు వొచ్చినప్పుడు ఆయన వయస్సు 37 - సంవత్సరాలు. స్వాతంత్ర్య పత్రంమీద సంతకాలు చేసిన 'ఫాదర్స్'–జఫర్‌సన్ వయస్సు 33 సం॥లు: హాన్‌కాక్ వయస్సు 39 సం॥లు: థామస్‌లించ్ జూనియర్ వయస్సు 27 సం॥లు మాత్రం. దేశ నిర్మాణమంతా యువకుల కండరాలమీదనే జరిగింది; పారిశ్రామిక పురోభివృద్ధి అంతా బలశాలురుగా ఉండి ట్రిగ్గర్‌ను క్షణికంలో లాగగల సామర్థ్యత ఉన్న యువకులనే కోరుతూన్నది.

భావినిగూర్చే పురాతన సాంప్రదాయాలన్నీ కృషిచేసినవి - ఆ గమ్యస్థానాన్ని యువకులు మాత్రమే జేరగలరని భావించబడేది. కనుకనే అమెరికన్ జాతికి పురోభివృద్ధి చిహ్నంగా 'యవ్వనం' నిలబడి - అభ్యుదయానికీ, పరిపూర్ణతకూ, ముందుకు సాగేందుకూ, సజీవమైన పోటీలకూ, బలశాలురైన మేటి ఆటగాళ్ళకూ, బేరింగ్ దుస్తుల్లోని యువతులు మొదలైనవేగాక - అనేక మందుమాకులు, డ్రాసరీలూ, రకరకాల దుస్తులూ, ఇంకా ప్రకటించబడే అనేక వస్తువులు, అమెరికన్లను నిత్య యవ్వనులుగా ఉంచేందుకు ప్రయత్నిస్తూన్నవి.

జాతీయమైన ఆట - బేస్‌బాల్; ఇది యువకుల్లోని సామర్థ్యతను, వేగాన్ని, త్వరితగతిలో తగిన విధంగా ప్రవర్తించటాన్ని - శారీరకంగానూ, మానసికంగానూ బంతిమీదనే కన్నుంచటాన్ని అలవరుస్తూన్నది. జాతీయ సంగీత వాయిద్యం జాజ్ - యువకుల ఆవేశాలకు భాష నిచ్చేదిగానూ, వారిలోని ఉడుకునెత్తుర్ను పొంగులెత్తించేదిగానూ ఉన్నది. మతైకంగాకూడా - పితృసంతతివాడైన దైవంగాక, శక్తివంతుడైన భూమాత పుత్రుడు లేదా ఒక చిన్న పిల్లవాడు–సేవలను పొందగలుగుతున్నాడు. అందుకనే క్రైస్తు శిలువమీద ఉన్నప్పటి చిత్రంకన్నా, బాలుడుగా ఉన్నప్పటి చిత్రమే అమెరికన్‌లను ఆకర్షించగలుగుతూన్నది.

## భామల భూమిక

ఈనాటి యువతి, తనకొక భర్త లభించేవరకూ తన బతుకు తాను బతకగలదు; లేదా దాంపత్య జీవితంలో భర్తతో పొత్తుపొసగని పక్షంలో, అతనితో విడిపోయి, అవసరమైతే తననుతాను పోషించుకోగలదు. ఇలాటి అవకాశంవల్ల ఏర్పడిన భయమే వేరొక రూపంలో 'గౌరవం'గా రూపొందుతోంది. ఈనాడు పనిపాటలు చేసుకునే స్త్రీలలో సగంమంది వివాహితలు. ఆనాడు క్షేత్రాలమీద పనిపాటలు చేసేందుకు స్త్రీలు చేదోడు వాదోడుగా ఉన్నట్లే-యీనాడు సంసారంలో స్త్రీకూడా సంపాదనాపరురాలుగా ఉంటూన్నది. దీని ఫలితంగా భర్తకూడా, ఇంటిపనుల్లో గృహిణికి సహకరిస్తూండటంవల్ల, స్త్రీ పురుషుల పాత్రల ప్రాముఖ్యత సరిసమానం చేయబడుతోంది. అధికారమనేది సమాన భాగాలు వేయబడటం, లేదా జాతివిచక్షణ లేకుండగనే, ఎవరి ప్రాబల్యం ఎక్కువగా ఉంటే వారిదే పైచేయిగా ఉండటం లేదా ఉభయులూ ఆధ్వర్యాన్ని సరిసమానంగా పంచుకోవటం జరుగుతోంది.

అనేక ముఖ్యవిషయాల్లో పురుషులకన్న స్త్రీలదే పైచేయిగా కూడా ఉంటూన్నది: వారి జీవనప్రమాణం ఎక్కువ; స్త్రీలకు పురుషులకన్నా 2,400,000 ఎక్కువ ఓట్లున్నవి. 1952 లో పుట్టిన అమ్మాయి జీవిత ప్రమాణం 73 ఏళ్లని అంచనాలు వేయబడితే, అదే సంవత్సరంలో పుట్టిన పిల్లవాడి జీవిత ప్రమాణం 67 సంవత్సరాలని అంచనాలు వేయబడినవి. పుండ్లూ, హృద్రోగాలూ, ఇంకా అనేక ఇతర క్లిష్టమైన జబ్బులు స్త్రీలలో కన్నా పురుషుల్లో అధికంగా ఉంటూన్నవి. ఇక చట్టాలు - ఒకప్పుడు స్త్రీలకన్నా పురుషులకు ఆస్తిపాస్తులమీది హక్కును అధికంగా ఇచ్చినా, ఇప్పుడు ఉభయుల హక్కుల్నీ సరిసమానం చేయటమేగాక, కొన్ని విషయాలలో స్త్రీలకు ఎంతో అనుకూలమైనవిగా కూడా ఉంటూన్నవి. ప్రజా

సంబంధమైన కార్యాలయాల్లో ముఖ్యమైన ఉద్యోగాలకు వారికి అర్హత ఏర్పడింది. రాయబారులుగాను, ప్రభుత్వనిర్వహణలోని ఉన్నతస్థానాల లోను స్త్రీలకు ఉద్యోగాలు ఇవ్వబడినవి. పరిశ్రమల్లో పురుషులకన్న స్త్రీల పెట్టుబడులు కొద్దిగా - (51.6%) ఎక్కువగా ఉన్నవి.

సామాజికంగా కూడా స్త్రీలకు మరికొంత అనుకూల వాతావరణము న్నది. అనేకమంది వెళ్లవలసిన ద్వారాలలో ముందుగా స్త్రీలకు దారి ఇవ్వ బడుతోంది; టేబిల్‌మీద ముందుగా స్త్రీలే కూర్చోవటం, ముందుగా వారికే వడ్డనలు జరగటం ఆచారంగాఉన్నది. సామాజిక సమస్యల్లో స్త్రీలదే పైచేయిగా ఉంటూన్నది. ఇంటికి ఎవర్ని భోజనానికి పిలవాలి (భర్త అను మతితోనే) ఎక్కడ నివసించాలి, ఎవరెవరికి ఎలాటిబహుమతుల్నిపంపాలి మొదలైన విషయాలను గృహిణి నిర్ణయిస్తూంటుంది.

పురుషులువెళ్ళే విశ్వవిద్యాలయాలన్నిటిలోనూ, స్త్రీలకు ప్రవేశముండ టమేగాక, ఆ తరువాత పురుషులు అవలంబించే వృత్తులందన్నిటా వారు కూడా ప్రవేశించగలుగుతున్నారు. ఒకప్పుడు ప్లీడర్‌వృత్తికి పురుషులకే ప్రవేశముండేది; యీ నాడు అలాటివృత్తులందేగాక - ఎంతో ఓర్పు అవస రమైన ఆటపాటల్లో పాల్గొనటం, తమ భర్తలను తామే ఎన్నిక చేసుకోవ టం, తాను కనవలసిన సంతానాన్ని తానే నిర్ణయించటం మొదలైనవాటిల్లో ఆమెవే తుదినిర్ణయాలుగా ఉంటూన్నవి. ఈ రోజుల్లో స్త్రీలు లాగూలు తొడగటం, నిక్కర్లువేయటం, పురుషులవలెనే దుస్తుల్ని ధరించటంకూడా చేస్తూనేఉన్నారు. కొన్నిసమాజాలద్వారానూ, వ్యవస్థలద్వారానూ స్త్రీలే పుర జనుల పురోభివృద్ధికి అవసరమైన కార్యకలాపాలను నిర్వహిస్తున్నారు. స్త్రీలలో 65% మంది కనీసం ఒక వ్యవస్థలోనన్నా సభ్యురాండ్రుగా ఉంటు న్నారు. క్లబ్‌లద్వారా, ఉపన్యాసాలద్వారా, సమ్మేళనలద్వారా, ఇంటిదగ్గరే ఉండి పఠించటంద్వారా - వారు సాంస్కృతిక జీవనంలో ప్రముఖ పాత్ర లను కలిగిఉంటున్నారు.

ఖండాంతరాల్లోని పరిశీలకులు - స్త్రీలే అమెరికన్ సమాజంలో ప్రముఖులుగా ఉంటున్నారని తలుస్తున్నారు. ఐతే స్త్రీలు మాత్రం యీ మాటను ఒప్పుకోక - తమకు పరిశ్రమల్లో, ప్రభుత్వంలో, విద్యాశాఖల్లోని ఉన్నతోద్యోగాలు తగినంత విరివిగా లభ్యమనలేదనే అంటున్నారు. మంచిజీతాలున్న ఉద్యోగాలన్నీ పురుషులకే కేటాయించబడుతూ, అదేపనిచేసే స్త్రీలకు అంత జీతాలు లభ్యమవటం లేదంటారు: తాము బైట ఉద్యోగం చేస్తున్నప్పుడుకూడా. ఇంటిపనుల బాధ్యత తమకు తప్పటంలేదనీ, ఇంతవరకూ పురుళ్లుపోసుకోవటం మొగవాళ్ల వొంతయే విధానాన్ని ఎవ్వరూ కనిపెట్టక పోవటం శోచనీయమనీ-అంటున్నారు!

భార్య — వంటమనిషిగా, మాతగా, దాదిగా, పనిమనిషిగా, సామాజిక కార్యదర్శినిగా, కొనుగోలు ఏజంటుగా, ఛాఫర్‌గా (పిల్లల్ని బడినుంచి, సంగీతపాఠశాలకూ, అక్కడనుంచి స్కౌట్ సమావేశాలకూ తీసుకుని వెళ్ళవలసి ఉంటూంటుంది), తోటమాలిగా, సామాజిక సేవకురాలుగా మంచి ఇరుగుపొరుగుగా ఉండటమేగాక - తన భర్తకు ప్రియసఖిగా, సలహాదారిగా, లైంగిక జీవనంలో భాగస్వామిగాకూడా ఉండాలని భావించబడుతోంది.

ఐతే స్త్రీత్వభావమనేది త్వరత్వరగా మార్పులు జెందుతూ, చాలామంది స్త్రీలు తమస్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కొత్తకొత్త విషయాల్లో ప్రవేశపెట్ట సాగేక, వారికి కొంత తేలికై, కొన్ని బాధ్యతలనుంచి వైదొలగే అవకాశాలు లభిస్తూన్నవి. చాలామంది ఆందోళనపడి, జ్వరపడి: వ్యక్తిపలె తమను తాము మరిచిపోవటం జరుగుతోంది. ఐతే పూర్వీకుల్లోని శక్తి సామర్థ్యం - ఆనాడు తన పురుషునితోపాటే తానుకూడా అడవిలో నివాసాన్ని ఏర్పరచుకొని, అతనికి చేదోడువాదోడుగా ఉంటూ, జీవితాన్ని పోరాడగలిగిన భార్య - యీ నాడు తన కొత్త పాత్రకు అనుకూలంగా మారేందుకు ప్రయత్నిస్తూన్నది.

ప్రాథమికంగా చెప్పాలంటే యీనాటికీ పురుషులే సంపాదనాపరులు గానూ, ఇల్లాలు గృహకృత్యాలను నిర్వర్తించే గృహిణిగానే ఉంటూన్న దనే చెప్పాలి. ఐతే ఆ యా పాత్రలు ఒకదానితో మరొకటి సంఘర్షించటం వల్ల - రోజురోజుకూ దంపతులమధ్య సమానత్వం ముందుకు సాగు తూన్నది. అమెరికాపురోభివృద్ధిలోని నియమాలలో ముఖ్యమైనది యీ సర్వ జనసమానత్వం - అది స్త్రీపురుషులమధ్యా, తరతరాలమధ్యా, సామాజిక తరగతులమధ్యా, యజమానీ సేవకులమధ్యా, ఉపాధ్యాయ విద్యార్థుల మధ్యా, తినేవాడూ వొడ్డించేవానిమధ్యా - అన్ని రంగాలలోనూ ప్రవేశపెట్ట బడి ఆచరించబడుతూనే ఉన్నది. ఒకోసారి వడ్డించేవానికీ, తినేవానికీ మధ్య ఉండే పరిచయంవల్ల, వడ్డించేవాడు కాస్త కటువుగా మాట్లాడటం, అదేవిధంగా టాక్సీ నడిపేవాడు గొణుక్కోవటం మొదలైనవి - కొత్త వారికి అపార్థాలుగా ధ్వనించవొచ్చు; కాని అమెరికన్‌కు మాత్రం అవి : 'నేనుకూడా నీఅంత మంచివాణ్ని: మనిద్దరం సరిసమానులమే ఐనా నీవు నాకన్నా కాస్తబాగా కనిపిస్తున్నావు - అంతేతేడా।' అనే భావానికి బాష నివ్వటంగా ధ్వనిస్తుంది.

ఆచార వ్యవహారాల పరిశీలకులకు - దాంపత్యంలో కనిపించే యీ సమా నత్వానికి కారణం బహుశా విడాకులు అత్యధికంగా ఉండటమనిపిస్తుంది. దాంపత్యాలలో నూటికి 20 వొంతులు విడాకులకు గురవుతున్నవి. మరి కొంతమంది - 'బాధ్యతలను గుర్తించకుండటం' కారణమనీ, (ఇది కారణంగా పేర్కొనటం అర్థంలేనిది) లేదా మతైకవిశ్వాసాలు తగినంతగా లేకపోవటమనీ (పూర్వంకన్నా యీనాడు చర్చికి వెళ్ళటం అత్యధికంగా ఉంటూన్నప్పటికీ) అభిప్రాయపడుతున్నారు.

మంచి వృత్తుల్లో ఉన్నవారిలోనూ, మధ్యతరగతి కుటుంబీకుల్లోకన్నా - తక్కువ ఆదాయాలుండి పనిపాటలు చేసుకునేవారిలోనే విడాకులు అధి కంగా ఉంటూన్నవి. చిన్న చిన్న సమాజాల్లోకన్నా పట్టణాల్లో విడాకులు

ఎక్కువ; దక్షిణభాగంలోనూ, పశ్చిమోత్తర భాగాల్లోకన్నా - పశ్చిమానా, నైరుతి దిక్కునా విడాకులు ఎక్కువ; చదువు సంధ్యలున్నవారిలోకన్న విద్యాసంస్కారం లేనివారిలో విడాకులు అధికంగానూ ఉంటూన్నవి.

ఐతే పురుషులుకాని, స్త్రీలుకాని తాము భరించలేని దాంపత్య జీవితానికి ఇష్టపడరనేది నిస్సందేహంగా తేలిపోయింది. బాధాకరమైన దాంపత్య జీవితాన్ని జీవించటంకన్నా, సామాజికంగా మచ్చవొచ్చినా విడాకులద్వారా విముక్తి జెందుతూన్నారు. ఐతే విడాకులు అధికమవటంలో సామాజికంగా వొచ్చిపడే కళంకం కొంతవరకూ తగ్గటం, విడాకులు పెద్ద పట్టింపుగా లేకుండటం జరిగింది. మానసిక శాస్త్రం అభివృద్ధిజెంది, విజయవంతమైన దాంపత్యాన్ని ఏర్పరుచుకోగలిగిన అనేక పథకాలు హామీలు ఇస్తూన్నప్పటికీ, యీ విడాకుల సంఖ్య ఎందుకు తగ్గటంలేదు ?

వివాహమూ, విడాకులూకూడా కష్టసాధ్యమయ్యేటట్లుగా చట్టాలుబిగించబడినవి. కాంట్రాక్టుల విషయంలో న్యాయశాస్త్రం అనుసరించే పద్ధతుల్ని - విడాకుల విషయంలో విరుద్ధప్రమాణంగా అనుసరించబడుతున్నవి; ఏ వ్యభిచార అభియోగానికో దంపతులిద్దరూ ముద్దాయిలైతే, విడాకులివ్వబడటం లేదు: ఆ తప్పును ఏ ఒక్కరో చేసినప్పుడే విడాకులు ఇవ్వబడుతున్నవి. కేవలం దంపతులిద్దరూ కోరినప్పుడూ, లేదా ఉభయుల వాఙ్మూలాలను ఆధారంచేసుకొని మాత్రమే విడాకులు ఇవ్వకూడదని 32 రాష్ట్రాలు శాసనాలు చేసినవి. నెవడారాష్ట్రమొక్కటే ఇందుకు మినహాయింపుగా ఉండటంవల్లనే, అక్కణ్నించి అనేకమంది రెనోకు వెళ్తున్నారు.

సామాన్యంగా వివాహానంతరం మూడోఏట విడాకులు జరుగుతూన్నవి. వీటిల్లో మూడింట రెండొంతులు సంతానంలేనివే విడాకుల్ని కోరుతున్నవి; కనుక విడాకులు ఇవ్వబడినప్పటికీ కుటుంబవిచ్ఛిత్తి అనేది జరగటంలేదు. మీదు మిక్కిలి విడాకుల్ని పొందినవారిలో 70% మంది, తిరిగి వివాహాలు చేసుకొని, వాటిని విజయవంతం చేసుకునేందుకు ఎన్నోఅవకాశాలను

ఏర్పరుచుకొంటున్నారు. ఎక్కడో ఏ లాటరీ పద్ధతిమీదనో వధూవరుల ఎన్నిక జరిగే పద్ధతులతో పోల్చిచూస్తే, ఈ అమెరికన్ పద్ధతుల తాలూకు రికార్డుల్నిగూర్చి ఆశ్చర్యపడవవసరం లేదు. సంతానమున్న దాంపత్యాలలో జరిగే విడాకులే ఒక క్లిష్టసమస్యగా పరిణమిస్తవి.

## నేరస్థులు — పిల్లలా? పెద్దలా?

తమ రక్షణకు చలనంలేకుండాఉన్న పిల్లలకన్నా - విచ్ఛిన్నమై పోయిన కుటుంబాలలోని పిల్లలు - వారి సామాజికస్థితినిగూర్చి నిశ్చితాభిప్రాయంలేక, సామాజిక నిబంధనలమీద తిరుగుబాటుచేస్తారు. ఆయా తెగలను అనుసరించి సామాజిక స్థితిగతుల నిర్ణయాల పాలబడిన పిల్లలూ, మురికిపేటల్లో నివాసాలున్న పిల్లలూ - వారి జీవితాలు కష్టభూయిష్ఠంగా ఉండటాన్ని గ్రహిస్తారు. సమాజంలోనూ, పాఠశాలల్లోనూ ఇతర బాలురకు తమకన్నా ప్రత్యేకస్థానాలివ్వటాన్ని వారు స్పష్టంగా చూస్తారు. తమకూ తమ హక్కుల్ని కాపాడుకునేందుకుగాను - వారు మిగతావారినుంచి విడివడి, తమ తరగతికి లేదా స్థితికిజెందిన వారందరితోనూ చేతులు కలిపి, తమను వేరుచేసిన సంస్థలను దూషించి, అగౌరవపరచటానికి ప్రయత్నిస్తారు. వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని గూర్చిన పాఠాలెన్నోనేర్చి, గీతాలెన్నోవిన్న వీరు - విప్లవాన్ని ఆశ్రయించి, దాంతో తృప్తిజెందేందుకు సిద్ధపడతారు. తెగలవారీగా సామాజిక స్థితిగతులుండటం, బీదరికం నలువైపులా కమ్ముకొని, అమాయకత్వంలో, విభేదాల మధ్య పెరుగుతూన్న సమాజాలున్న తావుల్లోనే - సామాజికంగా తాము కూడా సమానుల మవాలనే తీవ్రవాంఛలతో వేరొకమార్గంలేక తిరుగుబాట్లు జరుగుతూన్నవి.

చిన్నపిల్లలు నేరస్థులవటమంటూ జరగటం - అమెరికన్ సమాజం తాలూకు ఓటమికి స్పష్టమైన నిదర్శనంగా ఉన్నది. పేర్కొనబడే కారణాలకన్నా ఎన్నో క్లిష్టమైన కారణాలు దీనికి ఉన్నవి. ఈ కారణాల్లో

కొన్ని ఇవి: యుద్ధం రోజులూ, యుద్ధానంతరపురోజులూ, శిథిలమైన లేదా జీర్ణమైన గృహాలు, పనిపాటలమీదా, రెక్కలమీదనే ఆధారపడే తల్లి దండ్రులూ, మూలకారణాల జోలికిపోకుండా పైపైనే తిరుగులాడి సమస్యా పరిష్కారాలు జరిగినవనుకొనే తత్వాలూ, బీదరికంలో బాధపడుతూ అనవసర వాగ్వాదాలూ, కొట్లాటలూ జరిగే సంసారాలతో మనశ్శాంతి లభించక, ఏదో నిత్యనూత్నమైనపని, వొళ్లుజలదరించేదిచేసి, ఆ మనశ్శాంతిని లభ్య పరచుకోవాలనే తీవ్రవాంఛ, ఒక ముఠా, లేదా గాంగ్‌లో తాను అభినందించ బడాలని కోరటం, త్వరత్వరగా పెరిగిపొయ్యే జీవనప్రమాణాలూ, వీటివల్ల ఏర్పడే వివిధాందోళనలూ మొదలైనవి. నేరాలుచేసేతత్వం కేవలం ఒక్క వ్యక్తిత్వానికే సంబంధించినదన్నీ దాన్ని రూపుమాపేందుకు శిక్షించటం ఒక పరిష్కారమార్గమనీ భావించటం తప్పు. నేరాలకు మూలకారణాలనేవి సమాజంలోనేఉన్నవి. విభేదాలతో చూడబడటం, ప్రత్యేకించబడటం, బీదరికం, అమాయకత్వం మొదలైనవాటిని అధీనంలోనికి తెచ్చుకోగలిగిన కొద్దీ నేరాలసంఖ్య తగ్గుతుంది. మురికిపేటల్ని రూపుమాపేందుకూ, గృహ నిర్మాణాలను అభివృద్ధిచేయటం లేదా ఉన్నవాటి స్థితిగతుల్ని బాగుచేయటం, వినోదాలకై కేటాయించబడిన స్థలాలను వృద్ధిచేయటం మొదలైన పనులకు ప్రతికూలంగా తమఓట్లనువేసేకొద్దీ భేదదృక్పథాన్ని అమలుజరిపేందుకు ప్రయత్నించే నగరవాసులే నిజమైన నేరస్థులు! నేరస్థులంటూ ఉండటంవల్లనే విభేదదృక్పథానికి అవసరమేర్పడిందనే వాదాన్ని తీసుకొచ్చే వారున్నారు; కాని, యీ విభేదదృక్పథానికీ, అసమానత్వానికీ, పరిష్కార మార్గమనేది వాటి నిర్మూలనలోనే ఉన్నదనే సత్యాన్ని వారు గ్రహించటం లేదు.

ఈ సమస్య క్లిష్టంగా ఉన్నప్పటికీ, అనేక తరహాల మనుషులు అమెరికాకు వలసలు వొచ్చి యీనాడు అమెరికన్ పౌరులుగా మారిపోయిన చరిత్రను పురస్కరించుకొని, యీ నాటి సమస్యలుకూడా తప్పకుండా పరిష్క

రించబడుతవనే గాఢమైన నమ్మకం వారికి ఉన్నది. జీవనప్రమాణమనేది క్రమంగా పెరుగుతూనే ఉన్నది. సామాజిక శాస్త్రవేత్తలూ, వృత్తిధర్మంగా శిక్షణలను పొందిన ఘటికులైన సామాజిక సేవకులూ - నేరస్థుల సమస్యలను సమగ్రంగా పరిశీలిస్తూనే ఉన్నారు. బాలనేరస్థులను విచారించేందుకై ఏర్పడిన ప్రత్యేక న్యాయస్థానాల్లో - వారు కేవలం నేరస్థులవలెగాక, సానుభూతితో విచారించబడటం, ఎందువల్ల వారు నేరస్థులయ్యారో ఆయాకారణాలను కనుక్కోవటం, అవసరమైన మానసిక సలహాలూ, చికిత్సల నివ్వటం మొదలైనవి - యీ సమస్యా పరిష్కారానికి మరింత దోహదమౌతూన్నవి.

నేరాలను రూపుమాపేందుకు దేశంలో అనేకపథకాలూ, పద్ధతులూ అమలు జరుపబడుతూన్నవి. పెన్సిల్వేనియాలోని ఒకానొక న్యాయాధిపతి, నేరస్థులవిషయంలో తగినశ్రద్ధచూపి, తన రోటరీక్లబ్‌ను లాభాల విషయం తలపెట్టని పద్ధతిలో ఒక సమాజాన్ని ఏర్పరచి, కొంత ధనం సమకూర్చి, సుశిక్షణపొందిన ఒక ఆఫీసర్ను నియమించమని ఆదేశించాడు. ఆ తరువాత కొంత వాలంటర్ దళాన్ని ఏర్పరచి, ఆఫీసర్‌కు అవసరమైనప్పుడల్లా తగినసహాయం లభించేట్లు చూడమన్నాడు. దీని ముఖ్యమైన లక్ష్యమిది: నేరస్థుల సమస్యల్ని ప్రజానీకం అర్థంచేసుకుంటూ, ఆ సమస్యలు సామాజికమైనవని గ్రహించేట్లు, వాటిని పరిష్కరించేందుకు నేరస్థుల్ని శిక్షించడంగాకుండా, అసలు నేరాలేజరగని విధంగా ప్రయత్నాలు జరపాలని ఆయన ఉద్దేశించాడు. ఒక న్యాయాధిపతి ఇలాటి సహాయం కొరకు ప్రభుత్వాన్ని అర్థించకుండా, వాలంటీర్‌దళాన్ని అర్థించటం అమెరికన్ పద్ధతి అనవొచ్చు. ప్రభుత్వం వృత్తిధర్మాల్ని అనుసరించేవారిని ఈ సమస్యాపరిష్కారానికి నియోగించవొచ్చునేకాని - ఒక క్రమపద్ధతిలో సమాజాన్ని మేల్కొల్పటం, తెలివిగా నలుగురికీ ఉపయోగంగా వుండేటట్లు చూడటం మాత్రం జరగదు.

రోటరీక్లబ్‌చే నియమింపబడిన ఒకానొక ఆఫీసర్ పరిష్కరించవల సిన సమస్యారూపం ఇది: ఫ్రాంక్ అనే కుర్రవాడు అనేకసార్లు ఇంటి నుంచీ, బడినుంచీ పారిపోయాడు; చిన్నచిన్న దొంగతనాలు అనేకం చేశాడు. ఐతే ఫ్రాంక్‌కు గణితశాస్త్రసామర్థ్యం ఉన్నదనే విషయాన్ని ఆ ఆఫీసర్ గ్రహించి, బడివేళల అనంతరం ఆ సామర్థ్యాన్ని ఉపయోగించ గల ఉద్యోగం ఒకటి ఏర్పాటుచేశాడు. అంతేగాక పురాతనమైన కార్లమీద పనిచేసేందుకు ఫ్రాంక్‌కు పిచ్చెక్కేటంత - కుతూహలం ఉన్నదనే విష యాన్ని కూడా ఆఫీసర్ కనుగొన్నాడు. ఒకానొక వాలంటరీ 1940 మోడల్ కారును దానం చేయటంతో, ఫ్రాంక్ జీవితంలో మరొక ముఖ్య ఘట్టం ఎదురైంది. సామాజిక పద్ధతులపట్ల ద్వేషం బూనిక ఫ్రాంక్ శక్తి సామర్థ్యాలు సక్రమంగా వినియోగమయే అవకాశాలెన్నో లభించినవి. భావపరంపలూ, శక్తిసామర్థ్యాలూ నేరాలు చేసేందుకు ఇన్నాళ్లుగా అతన్ని ప్రోత్సహించిన దుష్టశక్తులస్థానే - ఆ యా నేర్పరితనాలు సద్వినియోగ మయే మార్గాలెన్నో ఏర్పడినవి.

పసివాళ్ళకు తమకూ్కడా రక్షణ ఉన్నదనే నిశ్చితభావం ఏర్పడి, తాముకూడా పెద్దలు నివసించే ప్రపంచానికి అవసరమేననే నమ్మకాన్ని కలిగి ఉండటం, తమ పాత్రలకూ్కడా ప్రాముఖ్యత ఉన్నదని తెలుసుకో వటం అత్యవసరం. అనేక పథకాలు - పసివాళ్ళచే స్థాపించబడి, నిర్వ హించబడే అనేక సమాజాలు దేశమంతటా ఉద్భవించి, సామాజికసేవలో తగిన ప్రతిఫలాల్ని పొందేందుకు అనుగుణంగాఉండే వాతావరణానికై పాటుపడసాగినవి. న్యూజెర్సీలోని పస్‌కాక్‌లో ఒక సమాజం ఎంతో అవ సరంగా కనిపించే ఒక ఆసుపత్రి నిర్మాణానికై - నాట్యప్రదర్శనలను ఏర్పాటు చేయటంద్వారానూ, డైరెక్టరీలను పంచటంద్వారానూ, నమూనా ఇంటిని ప్రదర్శనకు పెట్టి, టిక్కెట్లు అమ్మటంద్వారానూ కొంత మొత్తాన్ని పోగుచేయగలిగింది. కొద్ది శిక్షణలోనూ, సూచనలలోనూ యవ్వనారంభ

దశలో ఉన్న వ్యక్తితాలూకు శక్తిసామర్థ్యాలను ఉపకరించే పనులవైపు మళ్ళించటం. పెరిగి పెద్దవాడౌతూ, తానుకూడా సమాజానికి అవసరమేనని నిరూపించటం సాధ్యమౌతూన్నది.

## పె ద్ద లై న పు ర వా సు లు.

పిల్లల సమస్యలు, వృద్ధాప్యంలోని సమస్యల్తో సరితూగుతూ, యీ రెండు సమస్యలతాలూకు పునాదులూ నిర్లక్ష్యంగా వొదిలివేయబడినవి. చకచకా ముందుకు సాగుతూ, సర్వశక్తులనూ కేంద్రీకరించి, పారిశ్రామికంగా బల వత్తరమైన సమాజం - చిన్నవారూ, పెద్దవారూ - వీరి ఉభయుల శక్తి సామర్థ్యాలనూ వినియోగించుకునేందుకు తగినన్ని మార్గాలను కనిపెట్టలేదు. యువకులు తమ బాధ్యతల్ని కలిగిఉంటూ తన శక్తిసామర్థ్యాలను స్వాధీనంలోకి తెచ్చుకొని వినియోగించటాన్ని ఏవిధంగా పొందలేకపోతూ న్నాడో, అదేవిధంగా వృద్ధులు తమ కర్తవ్యాలను నిర్వర్తించకుండా చూడ బడుతూన్నారు. పురుషులు 65 - వ ఏట - ఒక్కోసమయంలో 60 - వ ఏటనే ఉద్యోగ సద్యోగాలనుంచి విరమించవలసి వొస్తోంది.

వృద్ధుల సంఖ్య అత్యధికం కావటంతో—ఇటీవల పురజనుల్లో వృద్ధు లైనవారికి కొన్ని పథకాలు ప్రవేశపెట్టబడినవి, వాలంటీర్ దళాలు వీరి కొరకై క్లబ్‌లలో ప్రత్యేకంగా కొన్ని గదుల్ని కేటాయించి—వారికి కావల సిన ప్రోగ్రాములను—ఉబుసుపోని కాలంలో చేసే పనులూ, ఆటపాటలూ, నాట్యాలూ, నైపుణ్యమున్న చేతిపనులూ, పాఠవిభాగాలూ మొదలైనవి ఎన్నుకోవటంలోనూ, లేదా ఊరికనే కూర్చొని మాట్లాడుకునే విషయా లను నిర్ణయించుకోవటంలోనూ ప్రోత్సహించబడుతున్నారు.

ఇలాటి ప్రోగ్రామ్‌లు తన తండ్రిపట్ల ఎలాటి ఫలితాన్ని తీసుకొనిరా గలిగినవో గమనించిన ఒకామె ఇలా అన్నది: “ఇప్పుడాయనకు జీవిత ములో కొత్త ఆశలు ఎన్నో ఏర్పడినవి. ఇప్పుడాయన ఒక కొత్తవ్యక్తిగా రూపొందాడు।

"ఇదొక అత్యద్భుతమైన విషయం............ఇది భూతలస్వర్గమంటే నమ్మి!" ఒక పెద్దాయన అన్నాడు.

వృద్ధాప్యంలో తాను ఇతరులమీద ఆధారపడి ఉండవలసి ఉంటుందేమోనని భయపడే అవకాశాలు మరిలేకుండా - సామాజిక రక్షణఏర్పడి. ఉద్యోగాలనుంచి విరమించినవారికి డబ్బుచెల్లించబడటం జరుగుతోంది. ఈ చెల్లించేమొత్తాలు స్వల్పమైన వైనప్పటికీ ఒక దంపతులకు ఒకస్వగృహమంటూఉన్నా, లేదా ఒక విధవరాలు లేదా కళత్రాన్ని పోగొట్టుకున్నవాడు తన కొడుకుతోనో, లేదా కూతురుతోనో ఉంటూ, తనకు వొచ్చే పైకాన్ని వారికిస్తూ జీవితశేషాన్ని సుఖంగా గడుపవొచ్చు. ఇక ఇతరులు - పోషణా రక్షణా అవసరమైనవారు, ప్రైవేట్ ఆసుపత్రుల్లోకి వెళ్లవొచ్చును - ఇవి ఇటీవలే ఆరంభమైనా అత్యధికంగా ఉన్నవి. ఇక్కడ వారానికి 40 డాలర్లు లేదా అంతకు ఎక్కువగా చెల్లించేవారికి అంగవైకల్యమున్నా వృత్తిలోఉన్నవారి రక్షణఉంటుంది. పెద్దపెద్దపట్టణాల్లో గదులు అద్దెకు తీసుకొని, చివరి రోజుల్ని ఒంటరిగా, గొణుక్కుంటూ, తమలో తాము మాట్లాడుకుంటూ గడుపుతూ, ఏ హోటలులోనో కాస్త సంజీ, సజీవ వ్యక్తులతో కాలం గడపాలని ఉబలాటపడుతూ, ఏ పార్కులోనో పావురాళ్ళకు కాస్త ఆహారంవేసి కాలాన్ని వెళ్ళబుచ్చేవారివే - వృద్ధుల్లో విషాద చరిత్రలు! ఏమైనా తమకు స్నేహితులూ, పరిచయస్థులంటూ ఉండటం అత్యవసర మనుకునేవారికి ఆయామిత్రుల్ని సమకూర్చటం భారీఎత్తున జరుగుతూనే ఉన్నది.

వ్యాపారంచేసి లేదా ఉద్యోగంచేసిదాన్నుంచివిరమించిన వృద్ధులుతమకు ఇష్టమైతే, తమలో ఇంకా మిగిలిన ఉత్సాహం, శక్తిసామర్థ్యాలను సామాజిక సేవలకై వినియోగించవొచ్చును. ప్రతిపట్టణంలోనూ - జనసామాన్యం తాలూకు ఆరోగ్యమూ, మానసిక, ఆధ్యాత్మిక స్థితిగతుల్ని అభివృద్ధిచేసేందుకు వాలంటీర్ సమాజాలెన్నో ఏర్పడిఉన్నవి. ఈ సమాజాలన్నిటికీ

ఎంతోమంది వాలంటీర్లు అవసరం. ముఖ్యంగా పెద్దలైన పురవాసులు వాలంటీర్లుగా జేరటంవల్ల సామాజిక జీవనం ఎంతో పెంపొందుతూన్నది.

వృద్ధులున్న తరంవారు పూర్వంకన్నా తక్కువ పలుకుబడినీ మంచి మర్యాదల్నీ కలిగిఉన్నారనే భావాన్ని సామాజిక శాస్త్రవేత్తలునొక్కి వక్కాణిస్తున్నారు; ఇది కొంతవరకూ నిజమే! ఐనప్పటికీ తన కుమారులకు సలహాదారుగానూ, మనుమలూ, మనుమరాండ్రకు ఆటపాటల్లో తోడుగానూ ఉండేవృద్ధుడు కుటుంబ జీవనంలో ప్రముఖపాత్రను వహిస్తూనే ఉన్నాడు. అమెరికన్ పిల్లలకు తాతగారు తమ ఇంటికి రావటం లేదా వారే తాతగారింటికి వెళ్ళటమంటే ఎంతో ఉత్సాహం. అవ్వగారి పనితనం-సూదితో పని చేయటంలోనూ, వంటగదిలోనూ- యీ నాటికీ అభినందించబడుతూనే ఉంటోంది. వృద్ధులకు యువతీయువకులతో మాట్లాడు సావకాశం ఎంతో ఉంటోంది; వయస్సు అనేది ఏదో గొప్ప రహస్యంగా యువతీయువకులకు తోస్తుంది; అది ఒక చరిత్రగా, తాము ఎరుగని చరిత్రకు రూపురేఖల్ని దిద్దేదిగా వారికి స్ఫురిస్తూంటుంది. అది శాశ్వతత్వానికి ఒక గ్యారంటీగానూ, రక్షణగానూ ఉంటూ, పిల్లవాడు ఆధారపడిన కుటుంబంలో ఒక ముఖ్యాంశంగా ఉంటున్నది. తాతలూ, అవ్వలూ 70 - 80 ఏళ్ళపాటు బతుకుతున్నారనే సత్యం-ఆ కుటుంబానికి ఒక గౌరవాన్నీ, హుందాతనాన్నీ, కొత్తశక్తినీ ఇస్తూన్నది. ఈ విషయాలు యీ నాటికీ చలనం లేకుండానే ఉన్నవి.

కుటుంబంలోని వ్యక్తులు చెల్లాచెదరై అనేక సంస్థలకు తమ తమ పాత్రలను అంకితం చేసినప్పటికీ-దాని సభ్యుల తాలూకు ఉద్రేక, ఉద్వేగాలకు కుటుంబమే కేంద్రీభూతమై ఉంటూ, వారి గాఢ విశ్వాసాలకు ఆటపట్టయి, వారి తొలి అనుభవాలకు అందుచేతనే గాఢమైన అనుభవాలకు నిలయమై, ప్రజాస్వామ్య శిక్షణకు ముఖ్యమైన స్థానంగానూ ఉంటూన్నది. భంగపాటులకూ, అమాయకత్వాలకూ గురైన తల్లిదండ్రులవల్ల అనేక

హానికరమైన ప్రవర్తనలకు కుటుంబం నిలయమౌతూన్నది. ఐతే పొరపాట్లు జరుగుతూనే మంచి ఏమిటో గ్రహించవలసి ఉండటంవల్ల, యీ ఇచ్చిపుచ్చుకొనే పద్ధతిలోనే ప్రతివ్యక్తీ ఎంతో నేర్చుకోవలసిఉన్నది. ఈ లక్ష్యం సాధించబడగానే - ఇదే అనురాగాన్ని వారు కుటుంబంనుంచి - మానవాళికంతకూ చూపగల చాతుర్యాన్ని అలవరుచుకోగలుగుతున్నారు.

# ఐదో అధ్యాయం

## అమెరికన్ శీలం

అమెరికన్ శీలమనేది ఒకేవిధానంలో ఉంటుందని అనలేము—ఒకే విధానంలో ఉంటే టర్కిష్, ఇంగ్లీష్ లేదా చైనీస్ శీలం ఎక్కడా కనిపించని విధంగానే. అనేక జాతీయతలూ, సంస్కృతులూ కలగాపులగ మవటం వల్లా, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలనుంచి వలసలు వొచ్చినవారివల్లా, ఆ యా ప్రాంతాలలోని ఆచార వ్యవహారాలవల్లా అమెరికన్ వ్యక్తిత్వం మరింత క్లిష్టతరమౌతూన్నది. అనేక వందల మతైక విశ్వాసాలూ, వివిధ నమ్మకాలూ మొదలైనవాటివల్ల క్లిష్టతమ మౌతూన్నది. ఆ తరువాత ఆ యా వ్యక్తులకు సంబంధించిన తరాలవల్లకూడా మార్పులు చెందుతోంది. వలసలువొచ్చినవారు మొదటితరమనుకుంటే—వారి సంతతి రెండోతరంగానూ, వారి సంతతి మూడోతరంగానూ ఉంటూ నేటి అమెరికన్ పౌరుడు ఆ వంశవృక్షంలోని శాఖలకు చెందినవాడై ఉంటూన్నాడు.

అమెరికన్లు అందర్నీ ఒకే కోవలోకి తీసుకొని వివరించటం సబబుగాదు. ఐతే కాస్త లోతులకు వెళ్ళి పరిశీలించేవారు అమెరికన్ల జీవితంలో గల విభేదాలకు ఆశ్చర్యపడతారు. మొత్తంమీద అమెరికన్లందరూ

కష్టించి పనిచేస్తారనేది నిజం. వారు ప్రయాణాలకూ, కేంపులకూ, ఆట పాటల్ని తిలకించటానికీ, తాగుడుకూ, పొగతాగేందుకూ, సినిమాలు చూసేందుకూ, టెలివిషన్ ప్రదర్శనలకూ, వార్తాపత్రికలూ, మాగజైన్లు పఠించేందుకు-ప్రపంచంలోని ఏ ఇతర ప్రజా ఖర్చుపెట్టనంత ఖర్చుబెడ తారు. ఐనప్పటికీ వారు చర్చిలకూ, సామాజిక సేవలకూ, ఆసుపత్రులకూ ఇంకా అనేక దానధర్మాలకూ-కూడా ఎంతో డబ్బు వ్యయపరుస్తారు. వారు ఎప్పుడూ హడావిడిగానే ఉంటారు: ఐనా తగినంత విశ్రాంతి తీసుకునేందు కూ-కూడా వారికి సావకాశం ఉంటూండకపోదు. వ్యక్తిగతమైన హక్కుల విషయంలో వారెంతో స్నేహమార్గాన్ని ప్రదర్శిస్తూ, వాటిని రూఢిపరు స్తూంటారు. పెద్ద వ్యాపారివలెనే చిన్నవ్యాపారినీ, గొప్ప పౌరునివలెనే సాధారణ పౌరునీకూడా వారు ఆదర్శప్రాయంగా తీసుకొని ఉభయులనూ పూజించటమనేది విస్మరించరు.

## విజయమే ప్రధాన లక్ష్యం

అందరూ - అమెరికన్లుకూడా ఒప్పుకున్న ఒక విషయమేమంటే - అమెరికన్‌లు విజయాన్ని ఎంతో విలువైనదిగా పరిగణిస్తారు. విజయ మంటే కేవలం ధన, కనక, వస్తువాహనాలేగాక, ఏదో విధంగా గుర్తించ బడటమనేది! ఒక కుర్రవాడు వ్యాపారి అయేందుకు మారుగా మతప్రచా రకుడైతే - మరేం ఫర్వాలేదు. కాని అతని వృత్తిధర్మం విస్మరించనట్ల యితే అతని విజయంకూడా గుర్తించబడుతుంది.

విజయాన్ని పొందేందుకు అనేక విషయాలు సమకూడాలి. ప్యూరిటన్ విశ్వాసాల ప్రకారం - పని చేయటమే సౌశీల్యంగా భావించబడుతూన్నది; ఎందుకంటే, పనిచేయటంలో సోమరితనం మాయమవటమేగాకుండా, అందువల్ల వొచ్చే ప్రతిఫలాలు ఈశ్వరుని అనురాగానికీ చిహ్నాలుగా భావించబడుతూన్నవి. శాశ్వత నివాసాలకొరకై వేచి ఉన్నభూమిలో

ఎంతో సారమున్నది. స్థాపించబడిన సమాజం, అందులో తరగతులవారీ మనుషులుండటంవల్ల, ఒక వ్యక్తి పైపైకిపాకే అవకాశాల్ని కలిగిఉండ గలగటమనేది లోపించింది.

పురాతన ప్రపంచంలో అవకాశాలేలేక మగ్గిపోయిన వలసదారులకు, కొత్త ప్రపంచంలో అనేక సదవకాశాలు ఎదురుచూస్తుండటంవల్ల తాను ఎలాగైనా విజయాన్ని సాధించాలనే నిశ్చయం ఉన్నది: ఆ తరువాతి తరం వారిలో తాము పరదేశీయులమనీ, యీ కొత్త దేశానికి వలస వొచ్చామనే భీతి అంతరించి, తరగతులవారీగా ఉన్న సమాజంలో తానుకూడా కష్టపడి పైపైకి పోతూ విజయాన్ని సాధించాలనే దీక్ష దృఢతరమైంది. సోదరులు కుటుంబంలోని తల్లిదండ్రుల కరుణకు–యూరప్‌లోవలె ప్రయత్నించక–బైటిప్రపంచంలో తాము ఎన్నుకున్న వివిధమార్గాల్లో విజయాన్ని సాధించాలని ప్రయత్నించసాగారు.

పోటీలకు ప్రాధాన్యతను ఇచ్చే సమాజంలో–పైచేయిగా ఉండటమనే దాన్ని అనేక చట్టాలద్వారా పరిమితం చేసినప్పటికీ, ఆక్రమణలు జరిపే ప్రవృత్తి ఉండకపోదు. ఆర్థికవిధానంలో అవసరమైన కండబలానికి ఇది అవసరమేకాని, కొంతమందిపట్ల ఇది తన కాఠిన్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆ తొలిదినాల్లో యీ ఆక్రమణ అనేది అత్యవసరమైన జీవనాధారంగా ఉండేది. ఐతే యీనాడు ఇలాటిది సమాజానికి గొప్ప ప్రతిబంధకంగా ఏర్పడింది. ఒకానొక ఫాక్టరీ కార్మికుడు ఎన్ని సంవత్సరాలైనా తన ఉద్యోగస్థాయిలో ఎదుగులేకుండటంవల్ల, తన ఆక్రమణ తత్వాన్ని తరగతులమీద లేదా జాతులమీద కయ్యానికి కాలుదువ్వేందుకు, లేదా నిర్వాహకులమీద తిరగబడేందుకు ఉపయోగించవొచ్చు: అలాటి అవకాశాలు లేనట్లయితే స్వదూషణతో ఆరంభమై ఏ తాగుడుకో అలవడటం, లేదా ప్రమాదాలను చేసేందుకు సిద్ధపడటం, నరాల బలహీనత్వంతో బాధపడటం జరుగుతుంది.

విజయానికి విశేష గౌరవం ఉండటంవల్ల, దాని ప్రతిఫలాలుకూడా అగ్రస్థానాల్లోనే ఉంటూన్నవి. కేవలం ధనాన్ని కూడగట్టుకోవటం ఒక్కటే అమెరికాలో విజయచిహ్నంగా లేదు: అది ఒక పరికరంగానూ, చిహ్నంగానూ ఉంటూన్నది. మనిషి అంతస్థు పెరిగినకొద్దీ ఆయనమీది వొత్తిడికూడా అధికమౌతుంది. సమాజాన్ని రక్షించి, బాగుచేసే ఉద్దేశంతో ఏర్పడిన అనేక వందల వాలంటీర్ సమాజాలకు ఆయన విరివిగా విరాళాలు ఇవ్వవలసి ఉంటుందనేభావం ఉన్నది. 'ఎవరు - ఎవరు ?' అన్న పుస్తకాన్ని తీసినట్లయితే, అందులో ప్రముఖుడైన ప్రతి వ్యాపారీ, జన సామాన్యానికి సహాయపడేందుకు ఏర్పడిన అనేక సమాజాలతో సంబంధాల్ని కలిగి ఉండటం కనిపించి ఆశ్చర్యపరుస్తుంది.

ఈ విధంగా విజయానికీ, గౌరవమర్యాదలకొరకై తీవ్రంగా కృషిసల్పటంవల్ల - వ్యక్తిలో ఉండే భయం, శూన్యతలు రూపుమాసే అవకాశం ఉంటుందని మనస్తత్వవేత్తలు అభిప్రాయపడుతున్నారు. శక్తివంతంగా ముందుకుపోయే సమాజంలో శక్తిసామర్థ్యాలున్నవ్యక్తి ఇతరులవలె కృషి సల్పి, తాను ఎంతముందుకు సాగగలడో తెలుసుకునేందుకు తహతహ లాడటం అబ్బురంకాదు.

విజయాన్ని సాధించాలనే ఆశయమున్నవారికి ఇలాటి సామాజికమైన ఏర్పాట్లు ఎంతో ఉన్నతమైనవిగా కనిపిస్తవి. ఐతే సర్వసామాన్యుడికి ఇలాయీ పద్ధతి అంతగా అనుకూలమైనదికాదు. అపజయం ఎదురౌతుందనే భీతి, ఎంతోపోటీ ఉన్నదనే భయం, స్వాభిమానాన్ని కోల్పోతానేమోననే సందేహం మొదలైనవాటిని అదుపులోకి తెచ్చుకోలేని వారికి ఎంతో ఆందోళన ఎదురౌతుంది. ఫలితంగా వారు అనురాగాన్ని విశేషంగాకోరి దానికొరకు తహతహ లాడుతారు. అంటేఅనురాగానికీ,విజయానికీ సంబంధం ఏర్పడుతోందన్నమాట. అమెరికన్‌లు యవ్వనదశలోకి వొచ్చే సమయానికి వారు రెండు అభిప్రాయాల విషయంలో తికమకపడతారని గోరర్

నమ్ముతున్నారు; విజయసాధనకు తాము ఎంతగానో ప్రేమించబడాలి; ఎంతగానో ప్రేమించబడటంవల్ల విజయంలభిస్తుంది, బడిలో విజయాన్ని సాధించినపుడు తల్లుల అనురాగాన్నివర్షించి పొగడ్తలను తమ బిడ్డలకు అందివ్వటం, వారు అపజయాన్ని పొందినపుడు అనురాగాన్ని చూపకుండటం జరుగుతూండటంవల్ల ఇదేపద్ధతి అమలు జరుగుతూందనే అభిప్రాయం పిల్లల్లో నాటుకుపోతోంది.

తరగతులనేవాటికి పరిధులంటూ లేకుండటంవల్లా, వంశపారంపర్యా వొచ్చే వృత్తులంటూ, విద్యఅంటూ లేనందువల్లా, సిద్ధాంతరీత్యా ఒక పిల్లవాడు అందుకోగలిగిన ఔన్నత్యానికూడా ఒక హద్దుఅంటూలేదు. కనుకనే అతను ఏసమయానా "ఇక్కడికి నేను అంతా పూర్తిచేశాను. ఇకనుంచి యీ అందుకోగలిగిన స్థానాన్నుంచి పతనమవకుండా, దీన్నే అంటిపెట్టుకుని ఉండాలి" అని అనలేడు. సిద్ధాంతరీత్యా ఏ కుర్రవాడైనాసరే అమెరికన్ ప్రెశిడెంట్ అయ్యే అవకాశం ఉండటంవల్ల అందు కొరకై తీవ్రకృషి సల్పటమనేది నైతికధర్మం. తాను సామాజికంగా ఉంటూన్న తరగతులనుబట్టిగాక, జీవితంలో అందుకోగలిగన ఎత్తులను బట్టే వ్యక్తిత్వాలు నిర్ణయించబడుతూన్నవి. కేవలం ధనికుల ఇంట జన్మిం చటంవల్లకానీ, లేదా సామాజికంగా ఉన్నతమైన కుటుంబంలో పుట్టటంవల్ల కాని కీర్తిప్రతిష్ఠలంటూరావు; నిజమైన పరీక్షఏమిటంటే - ఆ వ్యక్తి బయలు దేరిన స్థలంనుంచి ఎంతపైకి పోకగలిగాడనేది.

అమెరికన్‌లకు పని అంటేఇష్టం. పనేవారికి ఆహారపానీయాలవంటిది. ఇటీవలి సంవత్సరాలలో వారు ఆటపాటల నెన్నిటినోనేర్చేరు; ఐతే యీ క్రీడల్లో కూడా వారు పనిచేయటమనేదాన్ని సృష్టించారు. అనేక క్రీడల్లో తమ శక్తిసామర్ధ్యాలన్నిటినీ వారు ప్రదర్శిస్తారు. ఒకవేళ సెలవుదినాలైతే రోజుకు ఏ ఐదారు వందలమైళ్ళవొంతునో ప్రయాణంచేస్తూ గంటకు 60 మైళ్ళ వేగానపోతూకూడా దృశ్యవిశేషాలను గ్రహిస్తూ, అక్కడక్కడ ఫొటోలు తీసుకునేందుకు మాత్రం ఆగుతూ, ఆ తరువాత ఇంటికి వొచ్చి

తాము తీసిన ఫొటోలను పరిశీలిస్తూ తాముచేసిన ప్రయాణంలో తాము నిజంగా చూడదగింది ఏమిటనే విషయాన్ని గ్రహిస్తారు.

ఇటీవలి కాలంవరకూ, దేశంలో చేయవలసినపని ఎంతో ఉండిపోయింది. మొదట్లో రకరకాల మనుషులు ఎన్నో రకాల వాతావరణాల్లో ఉన్నవారు అంటిపెట్టుకొని పనిచేయవలసిన అవసరం ఉండేది. మతప్రచారకుడు వృక్షాలను పడగొట్టి పొలం దున్నవలసిఉండేది. ఉపాధ్యాయుడూ, వైద్యుడూ, న్యాయాధిపతీ–సామాన్యులను రక్షించేనిమిత్తం తుపాకుల్ని ఉపయోగించవలసి ఉండేది. వ్యవసాయదారుడు తన పనిముట్లూ, జీనూ, గృహోపకరణాలూ మొదలైనవాటిని తానే తయారుచేసుకోవలసి ఉండేది. అంటే అతను–కమ్మరిగా, వడ్రంగిగా, సారాకాచేవాడుగా, పశువైద్యుడుగా–ఒకేవ్యక్తిత్వంలో ప్రదర్శించవలసి ఉంది; పోతే కర్షకునిభార్య నూలు వాడికేదిగా, నేతపని చేసేదిగా గృహవైద్యునిగా ఉండేది.

## భౌతికవాదం

తమకున్నదంతా అమెరికాపట్ల వొడ్డిన వారిలో ఎక్కువమంది బీదవారు. వారు పై గుడ్డలతోవొచ్చి ఎంతో కష్టించి పనిచేసి, సంపాదనలోనే కొంత ఆదాచేస్తూ స్వంత వ్యాపారాన్ని లేదా స్వంత క్షేత్రాన్ని ఏర్పాటు చేసుకునేందుకు ప్రయత్నించారు. వోటుచేసే స్వాతంత్ర్యంకన్నా, తాము దేన్నయినా పొందేందుకు లేదా స్వంతం చేసుకునేందుకున్న స్వాతంత్ర్యమే ఖండాంతరాలనుంచి అనేకమందిని అమెరికా ఆకర్షించింది. స్వశక్తి సామర్థ్యాలతో వారు సంపాయించగలిగిన స్వంత వ్యాపారాన్ని లేదా స్వంత క్షేత్రాలను వారెంతో విలువైనవిగా భావించారు.

కొత్తవాళ్లు అనేకమంది అమెరికాకు వలసలు రావటంతో, స్వాభావికంగా డబ్బువిషయంలో ఏర్పడవలసిన వారి తత్వానికి విరుద్ధతత్వం ఏర్పడింది. జర్మన్ మనస్తత్వవేత్త హ్యూగో మున్‌స్టెర్‌బెర్గ్ పరిశీలించి ఇలా

అన్నాడు; "అమెరికన్ తాను సంపాయించిన సువర్ణాన్ని తన శక్తిసామర్థ్యాలకు ఇవ్వబడిన బహుమతిగా ప్రాథమికాభిప్రాయాన్ని ఏర్పరచుకుంటాడు....కనుక అమెరికన్‌ను కేవలం భౌతికవాదిగా పరిగణించటం, అతనికి ఆశయాలనేవి లేవనటం పొరపాటే అవుతుంది....ఒక గొప్ప చిత్రకారుడు ధనసంపాదనకు ఏవిధంగా పాటుబడతాడో, అమెరికన్ వ్యాపారి కూడా ధనసంపాదనకు అదేవిధంగా పాటుబడతాడు....ఇదంతా తాను కష్టించినదానికి మెప్పుకోళ్ళుగా బహుమతులుగా అతను భావిస్తాడు."

ఈ విధంగా ధనసంపాదననేది విజయానికి స్పష్టమైన రుజూగా ఉంటూన్నది; ఐతే ఇతర రుజూలు—ఉదాహరణకు గొప్పతనం, ప్రజలచే గుర్తించబడటం, మంచి పనులు చేయటం, కీర్తిప్రతిష్ఠలూ మొదలైనవికూడా అంగీకరించబడినవే। ఐతే సంపాయించిన ధనాన్ని కూడబెట్టి. తన దగ్గర్నే లొక్కిపెట్టి ఉంచటమనేది ఏవిధంగానూ ముఖ్యమైన విషయమే కాదు. ఆ ధనరాసులు తన యజమానిని ఎంతో సుఖపెట్టటంమాత్రమే ఐతే—ఇతరులకు నిజంగానే కన్నెర్రగా ఉంటుంది: కాని వాటిని అనేక ధర్మసంస్థలకు విరాళాలుగా ఇచ్చేందుకూ, తన కుటుంబీకుల్లోని దురదృష్టవంతులు సుఖంగా బతికేందుకు ఏర్పాట్లు చేసేందుకూ ఉపయోగించబడినపుడే, ధనవంతుని అందరూ మెచ్చుకోగలుగుతారు. .

కనుక అమెరికాను దర్శించినవ్యక్తి-అమెరికన్ ఆరాధించే భౌతికవాదానికీ, ధనానురాగానికీ, ధనరాసులను కూడబెట్టేందుకూ సంబంధం లేనిదని తెలుసుకుంటాడు; ధనసంపాదనపట్లా, ధనవ్యయంపట్లా అమెరికన్‌కు ఉన్న అనురాగమది। కొత్తొచ్చినట్లు కనిపించే యీ సిద్ధాంతాన్ని అమెరికన్ సిద్ధాంతమనటంకన్నా, మధ్యతరగతికి సంబంధించిన సిద్ధాంతమనటం సబబు—ఎందుకంటే ఎక్కువమంది అమెరికన్‌లు మధ్యతరగతికి చెందినవారే।

II

ముడిసరుకులు విరివిగా దొరకటం అమెరికాకు ఒక ప్రత్యేకత. ఆర్థిక మాంద్యం ఏర్పడినకాలంలో. భాగ్యవంతమైన దేశం తన భాగ్యాన్ని ఎక్కువమంది ప్రజలకు లాభసాటిగా ఉండేవిధంగా ఉపయోగించినట్లయితే ఆర్థికవిధానమే దెబ్బ తింటుందనే సత్యం బైటపడింది. అదేతప్పును తిరిగి చేసేందుకు అమెరికా సిద్ధపడలేదు. అమెరికాలో తయారయ్యే వ్యవసాయక సాధనాలూ, యంత్రాలూ ఎక్కువగా ప్రపంచం నలుమూలల ఎగుమతులు చేయబడుతున్నవి: ఇందువల్ల ఉత్పత్తిలోనూ. సరుకుల వాడకంలోనూ ఇతర దేశాల స్థాయికూడా పెరగాలనేదే ఆశయం।

అత్యధికోత్పత్తి కారణంగా ఇహలోక సుఖాలుకూడా పెరుగుతవనే విషయం నిస్సందేహం; పోతే అమెరికన్‌లకు - కొత్తవీ. తళతళా మెరిసేవీ. మెత్తగా హాయిగా ఉండేవీ. వీలుగా అమర్చబడినవీ. శక్తివంతమైనవీ. ఎక్కువ శ్రమపడనవసరంలేని వస్తుసముదాయాలంటే అమిత ఇష్టం. రొట్టె ముక్కలుగా కోసి 'లభ్యమౌతూండటంవల్ల. గృహిణికి దాన్ని కోయవలసిన శ్రమ లేదు. పోతే దాన్ని కాల్చవలసివచ్చినప్పుడు మాత్రం ఆమె-రెండువైపులా సరైన పాకంలో అది కాలేందుకు పెనం మీద ఒక్కసారిమాత్రం తిరగవేయవలసిఉండి. ఐతే ఆ తరువాతికాలంలో రొట్టెముక్కలు రెండువైపులా ఒకేసారి కాలేందుకు వీలుగాఉండే గృహోపకరణం కనిపెట్టబడటంతో ఆ శ్రమకూడా గృహిణికి తప్పింది: అటుపిమ్మట రొట్టెముక్క రెండువైపులా సరిసమానంగానూ. పాకంగానూ కాలాక దానంతటదే బైటికివొచ్చే సాధనంకూడా కనిపెట్టబడ్డాక. యీ కాల్చటమనే పనికిగాను గృహిణి కాచుకొని ఉండవలసిన అవసరంకూడా లేకుండాపోయింది. త్వరలోనే కాల్చబడిన రొట్టెముక్కలకు వెన్నరాచి. తగుమాత్రంగా ముక్కలు చేసి. ప్లేట్లలోకి అమర్చి ఇవ్వగల యంత్రంకూడా కనిపెట్టబడవొచ్చు: బహుశా ఇప్పటికే అలాటి సాధనం ఒకటి ఉండి ఉండొచ్చు.

కదలవలసిన పనిలేకుండానే జీవించగల అవకాశాలను ఏర్పరచుకొన్న అమెరికన్ తనలోని శక్తి సామర్థ్యాలను విడుదల చేసేందుకు అనేక మార్గాలను అన్వేషిస్తూండటం దేనికి? అతను నివసించే పట్టణాల్లో అనేక కాఫీ క్లబ్‌లూ, టెన్నిస్‌కోర్టులూ, విహార వినోదాలనిచ్చే ప్రదేశాలూ, చర్చీలూ, సమాజాలూ ఎన్నో ఉన్నవి: అమెరికన్ తన శారీరక మానసిక శక్తులెన్నిటినో వీటికి ధారపోస్తూంటాడు. ఎంతో శ్రమనూ, పనినీ కలిసి వొచ్చేట్లుగాచేసే అనేక సాధనాలవల్లా సుఖపడటమంటే ఎంతో ఆసక్తి పడటంవల్లా మిగిలిన కాలాన్నీ, శక్తిసామర్థ్యాలనూ వేరు విషయాలపట్ల ఉపయోగించేందుకు అమెరికన్ ప్రయత్నిస్తాడు.

## సేవాదర్శం

భౌతికవాదం, సుఖం అనే పదాల్లో - ఒకరకం స్వార్థం, ఇతరుల కష్టంమీద తాను సుఖపడటమనే సూచనలాటిది ధ్వనిస్తుంది. ఇతర విషయాల్లో అమెరికన్ విమర్శలను ఓర్చడు: ఐతే ఆ విమర్శకులుకూడా—తగినంత ధనవంతులు కానివారిపట్ల, ఇహలోక సుఖాలకు అంతగా నోచుకోనివారిపట్ల సహకార, సానుభూతుల్ని చూపటం, అమెరికన్ ఆచరించే పద్ధతనే విషయాన్ని ఒప్పుకున్నారు. "ఇతరులకు, నిస్సహాయులకు నీవు ఎంత సహాయం చేయగలవో అంతా చేయి" అనే క్రైస్తవ మతసంబంధమైన ఆజ్ఞ తాలూకు ఆదర్శం ఆచరణలో కనిపిస్తుంది. స్వదేశంలోకానీ, పరదేశంలోకానీ జరిగిన ఒక దుస్సంఘటన తాలూకు కష్టనష్టాలను పూరించేందుకుగాను పౌరులనుంచి తమంతటతాముగా చేసే సహకారం ప్రవాహరూపంలో లభ్యమౌతుంది. మొదట్లో అమెరికాలో స్థిరనివాసాలను ఏర్పరుచుకొన్న కాలంలో ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉండవలసిన అవ: రాయీ, సరిహద్దు ప్రాంతం పశ్చిమానికి కదిలిపోతూన్నప్పుడు అక్కడికి వలసలు వెళ్ళినవారు ఒకరికొకరు తోడుగా, నీడగా ఉండవలసిన అవ:

రాలూ అంతరించి ఉండుగాక; కాని అలాటి అవసరం ఏర్పడినప్పుడు మానవాళికి సహాయపడాలనే భావంమాత్రం అంతమొందలేదు.

1909 లో - తన 19 వ ఏటనే గ్రీస్‌నుంచి అమెరికాకు వలసవొచ్చిన మైక్ కాస్పెనివాస్‌ను గూర్చిన కథల్లాటివి అనేక మేగజైన్సులో కనిపిస్తవి. అతను మొదటి ప్రపంచయుద్ధంలో పోరాడాడు; తరువాత వివాహితుడయ్యాడు; కాని తన భార్యనూ, బిడ్డనూ కోల్పోయ్యాడు. ఆ తరువాత అతనితల్లి గ్రీస్‌లో వ్యాధిగ్రస్థురాలవగా - ఆమెకు సహాయపడేందుకు అతను గ్రీస్ వెళ్లాడు; అక్కడ అతను వివాహమాడి తొమ్మిమంది బిడ్డలకు తండ్రయ్యాడు. రెండవ ప్రపంచ సంగ్రామ సమయానికి అతని కుటుంబం బీదరిక బాధను అనుభవిస్తోంది. ద్వితీయ ప్రపంచ సమరంలో అతను నాజీ పేరచూట్ సైనికులతో తలబడ్డాడు; నాజీలకు చేజిక్కి-మూడేళ్ళపాటు ఖైదులో ఉన్నాడు. ఆ తరువాత గ్రీస్‌కు తిరిగివొచ్చి - తన కుటుంబీకులందరూ అస్థిపంజరాలవలె ఉండటాన్ని చూశాడు.

ఇంతకుపూర్వం అతను అమెరికాలో ఉండి, అమెరికన్ పౌరుడుగా ముద్రపడి ఉండిన విషయాన్ని విజ్ఞప్తిచేస్తూ, తనతోపాటు పెద్దవాళ్ళయిన తన ముగ్గురు పిల్లలకు అమెరికాకు తిరిగి వొచ్చేందుకు అనుమతి నివ్వవలసిందిగా అమెరికన్ ప్రభుత్వానికి విన్నపం చేసుకున్నాడు. తన కుటుంబంలోని మిగిలినవారికి ప్రయాణపు ఖర్చులకూ-డా పైకం లేకపోయింది. ఇప్పటికి మైక్ వయస్సు 65 సంవత్సరాలు. అతని కథ పత్రికల్లో ప్రకటించబడగానే అతని కుటుంబమంతా అమెరికాకు వొచ్చేందుకు అవసరమైన 2,600 డాలర్లు వెనువెంటనే విరాళాల రూపాన పోగైనవి. నౌకాశాఖ సరఫరా డైరెక్టర్-లోగడ మైక్ తన దగ్గర పనిచేసి ఉండటంవల్ల, ప్రభుత్వ యంత్రాంగంలో మైక్ తాలూకు కాగితాలు నిలిచిపోకుండా, చకచకా కదిలేట్లుచేసి, సామాన్యంగాఉండే ఒక గృహాన్ని, మైక్ కొనగలిగిన దాన్ని చూసిపెట్టాడు. రంగులు వేసేవారు శ్రమదానం చేశారా ఇంటికి;

ఫర్నిచర్ స్టోర్సువారు గృహానికి అవసరమైన ఫర్నిచర్‌ను ఉచితంగా ఇచ్చారు; గ్రీక్ చర్చికి సంబంధించిన స్త్రీలు వస్త్రాలనూ, గృహోపకరణాలనూ, వంటఇంటి సామగ్రినీ విరాళంగా ఇచ్చారు. "ఇలాటి పనులు ఒక్క అమెరికాలోనే జరుగుతవి" అన్నాడాయన.

సేవ అనేది ఒక ఆదర్శంగానూ, మానవధర్మంగానూ అమెరికన్ జీవితంలోని వివిధశాఖలకు విస్తరించింది. సమాజానికి సంబంధించిన అనేక సంస్థలు, పౌరుల అవసరాలకూ, వారు ఆరోగ్యకరంగా, హాయిగా, ఐశ్వర్యవంతంగా బతికేందుకు వీలైనన్ని సత్కార్యాలు చేయాలని భావించటం జరుగుతోంది. (దీన్నిగూర్చి ముందుప్రకరణంలో ఇంకా వివరంగా చెప్పబడుతుంది.) ఈ లోగా సేవ అనేది ఒక వ్యాపారసంబంధమైనదిగా కూడా ముందుకు ఉరికింది. అనుభవజ్ఞులైన పనివారు, సేవాధర్మాన్ని పాటించేందుకు సంసిద్ధులైనవారు - 1870 లో 25% ఉన్నారు; వారీనాడు 53% కు పెరిగారు. బిడ్డ తాలూకు మురికిబట్టల్ని రోజూ ఉతికేందుకైతేనేమి, లేదా కారు శుభ్రంగా కడిగేందుకైతేనేమి, (ఈ పని చేసేందుకు అనేక యంత్రాల సహాయముండటంవల్ల 10-15 నిమిషాలలోనే పని పూర్తిఅవుతుంది). వెనువెంటనే మనుషులు లభ్యమౌతారు. ప్రతి టెలిఫోన్ డైరెక్టరీలోని చివరి పసుపురంగు పేజీలలో ఇలాటి సేవాధర్మాలను నిర్వర్తించేవారి ఎడ్రసులు అనేకవందలుంటవి.

పెద్దపట్టణాల్లో కొద్ది ప్రతిఫలానికి ఇలాటి సేవలు అందుబాటులో ఉంటూన్నని; పోతే ఎక్కువమంది ప్రజలు గ్రామాల్లోనూ, పల్లెల్లోనూ, లేదా పట్టణశివార్లలోనూ, నివశించేవారికి గృహసేవనిమిత్తం అనేక చిన్న చిన్న సంస్థలు నెలకొల్పబడినవి. గ్రామాలకు ప్రతిరోజూ ఒక కూరగాయలమ్మేవాడూ, ఆహారదినుసులు అమ్మేవాడొకడూ, అనేకమంది రొట్టెలమ్మేవారూ, చెడకుండా నిలవఉంచబడిన ఆహారపదార్థాల నమ్మేవాడూ, ముగ్గురు ఐస్‌క్రీమ్స్ అమ్మేవాళ్లేగాక - అప్పుడప్పుడువొచ్చే బ్రష్‌లు అమ్మే

వారూ, వాక్యూమ్ క్లీనర్స్‌ను అమ్మేవారూ; ఇన్సూరెన్స్ ఏజంట్లూ, మాగ
జైనులూ, కార్లు అమ్మేవారుకూడా వొస్తూనేఉన్నారు. పోతే ప్రతిరోజూ
తప్పనిసరిగా టపాబట్వాడా ఉంటూనేఉన్నది.

ఇలాటి సేవలను విస్తరింపజేయటంలో జాతీయశీలం తాలూకు రెండు
విరుద్ధశక్తులు ఒక దానితో మరొకటి సంఘర్షించకుండా ఉండే ప్రయత్నం
జరిగింది: వ్యాపారదక్షతలోని తలబిరుసుతనం, మత్తైకఉద్వేగంతో ఇతరు
లకు సేవచేయాలనే గాఢవాంఛల తాలూకు మృదుత్వాలకు ఒక కూడలి
ఏర్పడింది. ఇలాటి సేవలను పొందినవారందరూ - ఆయాసంస్థలకు సహ
కారసానుభూతుల్ని అందివ్వటం తమవొంతుగా భావిస్తున్నారు; ఎందు
కంటే యీ సంస్థలు పౌరులందరికీ సహాయపడేందుకు సిద్ధంగా ఉంటాం
డటంవల్ల, వీటివిజయాలకు తగిన సహకారాన్ని ఆ పౌరులే అందివ్వవలసి
ఉంటుంది.

ఆధునిక మాతృమూర్తులు తమ బిడ్డల నైతికస్థాయిని పెంపొందిం
చేందుకుగాను - ఇతరులకు సహాయపడటం, ముఖ్యంగా బలహీనులకూ,
వృద్ధులకూ, స్త్రీలకూ సహాయపడటం, న్యాయమైన క్రీడల్లోపాల్గొనటం
మొదలైన నీతిదాయకమైన ఆదర్శాలను బోధిస్తూనేఉన్నారు. తన సంతా
నాన్ని తానే పెంచుతూ మంచిబుద్ధులు గరపటమనే బాధ్యతలను అమెరి
కాలో తల్లులేవహించటం సర్వసామాన్య విషయమవటంవల్ల - అమెరి
కన్‌లు సుగుణాలన్నీ స్త్రీత్వంలోనే ఇమిడిఉన్నవని భావిస్తున్నారని -
వేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఐతే నైతికపధాలను అతిక్రమించిన
సంతానాన్ని దండించేందుకు, తండ్రులు ఎప్పుడూ కర్రలను సిద్ధంగా ఉంచు
తారనీ, విషయాన్ని నిర్ణయించేందుకు తండ్రిదే తుదితీర్పనీ - చాలామంది
అమెరికన్‌లు గట్టిగా చెప్పగలగటంవల్ల - మంచితనమనేది శక్తివంతమైన
పురుషత్వంగా, కనీసం దాని శారీరకవిభాగంగా ఉంటూన్నదని చాలామంది
అమెరికన్‌లే అభిప్రాయ పడుతున్నారు.

## అనుసరణ తత్వమున్న జాతి

అమెరికన్‌ల జీవితంలో అనుసరణతత్వమున్నదని అనేకమంది పరిశీలకులు ఒప్పుకున్నారు. విరుద్ధతత్వాలున్న అనేక సంస్కృతులను కూడగట్టుకోవలసి రావటం, ప్రపంచంలోని అనేకప్రాంతాలనుంచి కోట్లాది జనాభాను వలసదార్లుగా తీసుకోవటంవల్ల, కొన్ని ఆచారవ్యవహారాలను స్థాపించటం. వాటిని అనుసరించేటట్లు చేయటం ప్రాధమికమైన అవసరమైంది. ఐతే యాత్రీకులుచూసే యీ అనుసరణలు కేవలం బాహ్యామైనవిగానూ, తగినంత తీవ్రంగాలేనివిగానూ ఉంటూన్నవి. ఇంగ్లండులోని వ్యాపారులకన్న. అమెరికన్‌వ్యాపారులు తమ ఇష్టానుసారంగా దుస్తుల్ని ధరిస్తారు. ఇక స్త్రీలు పెద్దపెద్ద బజార్లలోకూడా రకరకాల దుస్తులూ - ఫర్‌కోట్ల దగ్గర్నుంచీ. బెర్మూడా షార్ట్సువరకూ ధరించి తిరుగుతూంటారు. ఇక పట్టణాలన్నీ ఒకే విధంగా ఉంటూ, రాత్రులందు నియాన్‌సైన్స్‌తో వెలిగిపోతూ కనిపించినప్పటికీ - అక్కడకూడా అనేక వ్యక్తిత్వాలున్నవనే విషయాన్ని త్వరలోనే తెలుసుకోవచ్చు. దేశంలోని సినిమాలన్నిటిలోను రేట్లు ఒకేవిధంగా ఉంటూన్నప్పటికీ, ప్రతిపట్టణంలోనూ ఎమెచ్యూర్ సంగీతసభలూ, కెమేరా క్లబ్‌లూ. చిత్రకళాశాలలూ మొదలైనవి ఉన్నవి 170,000,000 మంది ప్రజలున్న జాతిలో అనేక అభిరుచులూ, తత్వాలున్నవారు ఉన్నారు.

కొత్త మతాలు ఉద్భవిస్తూన్నవి: జనరంజకంగాఉండే మనస్తత్వశాస్త్రాన్నిబోధించే పాఠశాలలూ, మానవత్వాన్నిబోధించే విద్యాలయాలు మొదలైనవెన్నో వొస్తూన్నవి: ప్రతిదానిలోనూ ఎంతోమంది అనుసరించేవారుంటూనే ఉన్నారు. నూతనమైనదీ. వైవిధ్యమున్నదానిపట్ల ఏంతో ఇష్టముండటమనేది భావిప్రపంచంలోని ఒక పంధాగానే ఉన్నట్లుతోస్తుంది.

ఐతే నలుగుర్నీ కూడగట్టుకొనే సిద్ధాంతాలు అమలుజరపని ఏ సమాజమూకూడా అభివృద్ధిచెందలేదు. సామాజికులందరూ, సమాజం తన

ర్శాలను అందుకునే విధంగా ప్రవర్తించే వాంఛలను ప్రోత్సహించాలి. ఇత రత్రా గురిచేయబడిన వ్యక్తిత్వంద్వారా యునైటెడ్‌స్టేట్స్‌లో ఇదెలాసాధ్య మౌతున్నదో డేవిడ్‌రైజ్‌మన్ సిద్ధాంతం అర్థంచేసుకునేందుకు ఎంతో సహాయపడుతూన్నది. సరిహద్దుప్రాంతమనేది పశ్చిమానికి కదలిపోతూన్న ప్పుడూ, పారిశ్రామికరంగాభివృద్ధి సమయంలోనూ, అమెరికన్ మానసికంగా తనలోపొందిన పరిణామం ఒక ప్రత్యేకతగా ఉండేది; ఐతే పెద్దపట్టణాల్లోని ఇతరత్రా గురిచేయబడిన వ్యక్తిత్వమనేది అమెరికన్‌తత్వాన్ని మార్పుచేసేం దుకు ఎలా ప్రయత్నిస్తూన్నదని రైజ్‌మెన్ నమ్మాడు. లోనివ్యక్తిత్వం ఉత్పత్తిని పెంపొందించేందుకు తన శక్తిసామర్థ్యాలను వినియోగిస్తుంటే, రెండోశక్తి ఆ ఉత్పత్తినంతటినీ వాడేందుకు ప్రయత్నిస్తున్నది. ఎందుకంటే అధికోత్పత్తికి సరితూగాలంటే అధికవినియోగం కూడా అవసరం; అప్పుడే అందరికీ పనిపాటులంటూ ఉండటం ఆర్థికపరిస్థితులు తారుమారులేకుండా సాఫీగాసాగిపోవటం జరుగుతుంది.

పూర్వపు మోటువ్యక్తిత్వమనేది చాలావరకుమారిందనీ, ఇంకామారు తూన్నదనే విషయాన్ని – యీ పైనచెప్పుకున్నవన్నీ సూచిస్తూనేఉన్నవి. తన పోటీదారుల్ని తొక్కుకుంటూ పైపైకిపొయ్యే వ్యక్తిని అమెరికన్‌లు మెచ్చుకునే స్థితిలోలేరు. అలా కాకుండా తన పోటీదారులతో మంచిగా ఉంటూనే వారితోపోటీలో ముందుకు సాగిపోయ్యేవారూ - లేదా తన యజమానులూ, సహోద్యోగులతో కలిసికట్టుగాఉంటూ, పైకిపాకేవారిని చూస్తేనే అమెరికన్‌లు మెచ్చుకోగలరు. సుసాధ్యమైనదీ, స్నేహపూర్వక మైనదీ, సహకారసానుభూతులున్నదీ ఐన ఇలాటితత్వమే అమెరికన్ ఆదర్శాన్ని అనుసరించటమని భావించబడుతోంది. బాంబులువేసి, పక్షుల గూళ్లను చెల్లాచెదరుచేసే తత్వమున్న టెడ్డీరూజ్‌వెల్ట్ స్థానంలో - స్నేహ పూర్వకంగా, అందరూసమానులనే తత్వాన్ని వెల్లడిచేస్తూ, నలుగురి అను రాగాన్నీ పొందగలిగే చిరునవ్వుతోఉండే ఐక్ ఉండటాన్ని, అమెరికన్‌లు

హర్షిస్తారు. జనసామాన్యాన్ని అధీనంలో ఎవరైనా ఉంచుకోగలరా అంటే- అది సాధ్యమనే ఆయన రుజూచేశారు. ఇలాంటిదాన్ని ఆయన సమర్థించగలిగారు. కనుకనే ఆయనపట్ల అమెరికన్‌లకు అచంచల విశ్వాసమున్నది.

ఆర్థిక విధానంలో ప్రతిదీ విరివిగా లభ్యమవసాగాక, పోటీలు పడవలసిన అవసరం సన్నగిలి, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవటమనే అమెరికన్ తత్వం బలహీనమైంది. ఐతే సర్వజన సమానత్వమనే తరతరాలనుంచీ వొచ్చే తత్వానికి మంచి పట్టు చిక్కింది. కొద్దికాలం క్రితంవరకూ పట్టణంలోని ధనవంతుడు లేదా జాతీయ రంగంలోని ప్రముఖుడు నలుగురికీ దూరంగాఉంటూ, వేషధారణలో ఎంతో హుందాతనాన్ని ప్రదర్శిస్తూ, ప్రవర్తనలోనూ, మాటల్లోనూ ప్రత్యేకతను కనబరుస్తూండేవాడు; అలాటిది ఆయన అనుసరించాలనే పలువురి భావంగాకూడా ఉండేది. ఐతే యీనాడు ఒక ఛార్లెస్ ఇవాన్స్ హగ్స్ లాటి వ్యక్తి అసంభవంగా కనిపిస్తాడు. ఈనాడు గొప్పవారు సామాన్యులవలెనే కనిపించేందుకు ప్రయత్నించటం-వేషధారణలో, ప్రవర్తనలో చదువు సంధ్యలు మొదలైనవాటిల్లో-జరుగుతోంది.

తన పిల్లలతో కానీ, మంగలితోకానీ, యజమానులతోకానీ, తోటి పనివారితోకానీ-చివరకు విమానంలో తన పక్కసీటులో కూర్చున్న ముక్కూ మొహం ఎరగని మనిషితోకానీ-అమెరికన్ తాను కులాసా పురుషుణ్ణనే విషయాన్ని వెలిబుచ్చాలని వాంఛిస్తాడు. తాను గౌరవించబడటమనేది ముఖ్యంగా భావించబడుతోంది. అందుకనే అతను-తమలో తాము అనురాగాన్ని ప్రదర్శించడమే అత్యుత్తమ అదర్శమని భావించే అనేక క్లబ్‌లలో, సమాజాల్లో సభ్యుడుగా ఉంటూ, తనచుట్టూఉన్న సజ్జనులకొరకై ఉవ్విళ్లూరుతూంటాడు.

సాధారణ అమెరికన్ 'పని' ని గౌరవిస్తూ, తన స్వహస్తాలతో పని చేయాలని వాంఛిస్తూండటంవల్ల-తనకూ తన సేవలకై నియమించబడిన

వారికి మధ్యకానీ, తనకు ఆజ్ఞలను జారీచేసే యజమానులకూ తనకూ మధ్యకానీ—ఒక తరగతీ, కొన్ని అడ్డంకులూ ఉన్నవనే భావించడు. ఖండాంతరాలనుంచి వొచ్చే యాత్రీకులు—యజమానులూ, వారిదగ్గర పనిచేసేవారూ ఒకర్నొకరు ముద్దుపేర్లతో పిలుచుకోవటంచూసి ఆశ్చర్యపోవటం, కొంతమంది ఇలాటి పద్ధతికి ఇష్టపడకుండటం జరిగింది. ఇలాటిది గౌరవానికి భంగకరమైనదని ఆ పరిశీలకుల భావం. ఐతే అమెరికన్‌లకు కావలసింది గౌరవంకాదు; తాము అందరికీ ఇష్టులుగా ఉండటం. ఇష్టులుగా ఉండటమనేది గోడలమీదినుంచి ఎగబ్రాకేందుకు సంసిద్ధంగా లేకుండటంవల్ల—తరగతులూ, కులమత భేదాలనే గోడలు కూలిపోయినవి.

## చలనశక్తి

సమానత్వమంటే ఒక చట్టంమీదఉండే ఒకేమాదిరిస్థానమనే అర్థం కాదు; ఇలాటిది వాంఛనీయమైనదైనప్పటికీ, మానవుని శక్తిసామర్థ్యాలూ, ప్రత్యేకశాఖలలో అతను చూపే కౌశలం మొదలైనవాటివల్ల - ఇలాటిది అసంభవమౌతున్నది. అలాకాక ఆదర్శం-అంతకన్న గమనించదగిన పరిమాణాల్లో సత్యం ఏమంటే – ఈ స్థితులన్నిటినీ క్రమంగా గడిచేందుకు గల సాధారణమైన అవకాశాలు - రోజు పనివాడినుంచీ కార్పొరేషన్ ప్రెసిడెంట్‌వరకూ, వలసవొచ్చినవాని కుమారునినుంచీ, కాలేజిప్రొఫెసర్ వరకూ సరిసమానంగా ఉంటూన్నవి. ఇలాటి కథల్నిగూర్చి తెలుసుకునేందుకు హోరేషియో, అల్జీర్ సాహిత్యాన్ని చూడక్కర్లేదు; విజయులైనవారి జీవితచరిత్రల్ని పరిశీలిస్తేచాలు.

చెక్కలతో నిర్మించబడిన కేబిన్‌లో జన్మించి ఉంటేనేకాని అమెరికన్ ప్రెసిడెంట్ అయ్యే ఆశలులేవని తలచిన కాలంఉన్నది. స్టీవెన్‌సన్‌కన్న ఐసెన్‌హోవర్ ప్రెసిడెంట్ అయేందుకు అనుకూలవాతావరణం-స్టీవెన్‌సన్ ఐశ్వర్యవంతులింట పుట్టిఉండటం, ఐసెన్‌హోవర్ బీదఇంట పుట్టిఉండటం

ఒక పనివాడు లేదా గుమాస్తా - కార్పొరేషన్ ప్రెసిడెంట్ అయే మార్గాలు ఇదివరకంత బాహాటంగా తెరచి ఉండబడలేదని సామాజిక శాస్త్రజ్ఞులు వేలెట్టిచూపుతున్నారు. ఐనప్పటికీ ఒకప్పుడు బుక్‌కీపరుగా ఉన్న హార్లోకర్టిస్ జనరల్‌మోటార్స్‌లో అత్యున్నతస్థానాన్ని అందుకున్నాడు. పూర్వం మెస్సెంజర్‌బాయ్‌గా పనిచేసిన డేవిడ్ సర్నాఫ్ ఆర్. సి. ఎ. లో అత్యున్నతస్థానాన్ని అలంకరించాడు. ఈనాడు వ్యవసాయదారుని కుమారుడు కాలేజీకి వెళ్ళటం అరుదైన విషయం: అలా వెళ్లగలిగితే అక్కణ్నుంచి ఆ నిచ్చెనమెట్లు ఎక్కటం చాలా తేలికఅవుతుంది; ఇదే విషయములో పారిశ్రామికునికీ, అతనిదగ్గర పనిచేసేవారికీ మధ్యఉన్న భేదమనే అఖాతం-జీవితస్థాయి పెరగటంలో చాలావరకుపూడింది. పనిపాటలు చేసుకునేవాడికి స్వంతకారుండి, స్వంతటెలివిషన్‌సెట్‌ఉండి, భార్యాపిల్లలూ - గృహోపకరణాలైన ఆధునికయంత్రాలు-ఎలిక్ట్రిక్ రిఫ్రిజిరేటర్, బట్టలుతికే యంత్రం, వాక్యూమ్‌క్లీనర్ మొదలైనవిఉండి - అతనిపిల్లలు హైస్కూల్ చదువులేగాక అనేక సందర్భాలలో కాలేజీచదువులుకూడా సాగించే అవకాశాలుండగా, అత్యున్నతస్థానాల్లో ఉన్నవారికి ఎన్నో విషమసమస్యలు - చికాకుపరిచేవీ, తలబద్దలుకొట్టుకొనేవి ఉంటూన్నవి; వారానికి 35 లేక 40 గంటలు పనిచేసే పనివాడు హాయిగా కాలంగడుపుతూంటే - ఎన్నోబాధలు పడవలసిన అత్యున్నతస్థానాన్ని అందుకోవాలనుకునేవాడు ఒక రకం దురాశాపరుడుగానే ఉంటున్నాడు.

సామాజిక చలనశక్తి విషయం సరిగా ఆలోచించకపోవటం మార్క్స్ చేసిన పెద్దపొరపాట్లలో ఒకటి. ఖండాంతరాలనుంచివొచ్చే యాత్రికులు అమెరికాలోని ప్రజలు తరగతులవారీగా ఎందుకని రాజకీయపార్టీలుగా ఏర్పడలేదని ఆశ్చర్యపడుతూంటారు. దీనికి జవాబు తేలిగ్గానే చెప్పవొచ్చు: యూరపియన్‌ల దృష్టితోచూసినట్లయితే అమెరికాలో తరగతులనేవి లేవు; ప్రతి తరంవారూ ముందుకు సాగిపోతూనే ఉన్నారు; పైతరగతిని పడ

గొట్టటమంటే - ఎన్నో ఆశలు పెట్టుకొని తాను ఏ గమ్యస్థానాన్నయితే చేరాలని పనివాడు భావించాడో - ఆ గమ్యస్థానాన్నే విచ్ఛిన్నంచేసినట్లవు తుంది. ఎక్కువకూలి, తక్కువపనిగంటలు, సంవత్సరాంతంలో గారంటీగా వొచ్చే మరికొన్ని బోనస్‌లూ మొదలైనవాటిని పనివాడు పొందగలగటం వల్ల - వృత్తిలో ఉన్నవారందరూ అతని అదృష్టానికి ఈర్ష్యపడవలసే ఉంటూన్నది. ఇక సామాజిక స్థానమనేదికూడా మార్పులు చెందుతూనే ఉన్నది: పనివాడు ఒక నెలరోజులపాటు ఏ ఫ్లోరిడాలోనో కాలం గడప గలిగిన స్థితిలోఉన్నాడు. కాని, ఏ న్యాయవాదో - స్వగృహాన్నివిడిచి దూర తీరాలకు వెళ్లటంవల్ల తన వృత్తి చెడిపోతుందేమోనని భయపడి, మిన్న కుండవలసి వొస్తోంది.

పారిశ్రామికుడు ఒక గొప్ప భౌతికవాదిగాను, ధనాన్నికూడబెట్టేవాడు గానూ చూడబడవలసిన రోజులుపోయినయ్: ఎందుకంటే అతను ధనాన్ని సాంస్కృతికవ్యాప్తికై వినియోగించటం జరుగుతూనేఉన్నది. షికాగోలో మాంసాన్ని ప్యాక్‌చేసి అమ్మకంచేసే ఒక వ్యాపారి ఒకసారి మ్యూజి యమ్‌కువెళ్లి, చిత్రకళలో ఎంతో కుతూహలాన్నిపొంది, ఫ్రెంచ్ ఆధునిక చిత్రకళతాలూకు అనేకచిత్రరచనలను కూడబెట్టగలిగినవారిలో ప్రపంచంలో కల్లా అగ్రగణ్యుడుగా ఉన్నాడని - ఎలిస్టర్‌కూల్ చెపుతున్నాడు. లేవా హంటింగ్‌టన్ హర్ట్‌ఫర్డ్ తనఐశ్వర్యాన్నంతనూ అనేక కళల అభివృద్ధికై ఉపయోగించిన దృష్టాంతమున్నది: ఆయన మువీప్రొడ్యూసరుగా, సృజ నాత్మకకళారాధనలో ఏకాగ్రత భంగంకాకుండా ఉండే ఒక ప్రదేశాన్ని నిర్మించినవాడుగా, చిత్రరచనల నెన్నిటినో కూడగట్టినవాడుగా, న్యూయార్క్ ఆర్ట్‌గాలరీని నిర్మించినవాడుగా, హాలీవుడ్‌లో శాస్త్రసమ్మతమైన థియేటర్ నిర్మాతగా ప్రసిద్ధికెక్కాడు.

ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలోని ప్రజలవలెనే - అమెరికన్‌లుకూడా ప్రశాంతమైన గృహజీవనాన్నీ, జీవితవిజయాన్నీ, తోడునీడలుగా ఉంచే

మిత్రులనూ, ఆప్తులనూ ఆపేక్షిస్తారు. ఐతే వీరిలో చాలామంది విశాలమైన భూములమీద తిరుగులాడుతూ, తాము ఎవరివారో, ఎవరితో సంబంధ బాంధవ్యాలను కలిగిఉన్నారో తెలుసుకుంటారు. తాను ఎదురుచూసే అమ్మాయిని (లేదా పురుషుణ్ని) వారు విమానప్రయాణంలో, లేదా నాట్యములో, లేదా ఆఫీసుసంబంధమైన పార్టీకో కలుసుకోవటం జరుగుతోంది. ఇక కాలేజీకోని వివిధశాఖల్లో ప్రవేశిస్తూ, భావిజీవితంలో తాము అవలంబించే వృత్తికొఱకై ఆరాటపడుతూ, ప్రయోగాలుచేస్తూ, ఒక కంపెనీనుంచి మరొకదానికిమారుతూ చివరకు తమకు అనువైనవృత్తిని ఎన్నుకుంటారు. తాము పనిచేసే కంపెనీనుంచి-దానికి పోటీగా పనిచేస్తున్న కంపెనీకి మారటంతో అభివృద్ధి అనేక సందర్భాలలో సాధించబడుతోంది; ఈ విధంగా చలనశక్తి అనేదానికి బహుమతులు లభిస్తున్నవి; అంటిపెట్టుకొని ఒకేచోట ఉండటమనేది శిక్షించబడుతోంది.

వారు నిచ్చెనమెట్లు ఎక్కినవిధంగా వృత్తిలో పైపైకిపోసాగుతుండగా మంచిఇరుగుపొరుగులకు మారటం, లేదా తమకూ, తమసంతానానికీ తగినంత రక్షణనూ, వైశాల్యాన్నీ ఇవ్వగల విశాలగృహాలకు మారటంజరుగుతుంది. ఇల్లు మారటమనే విషయంలో వారు భయపడరు సరికదా, అలాటిదానికి ఎంతో ఇష్టపడతారు. వీరి పూర్వీకులు అమెరికాలో అనేక ప్రదేశాలు మారుతూ, ముఖ్యంగా పశ్చిమానికి కదిలిపోతూ తమకు అనువైన స్థలాలను ఎన్నుకొన్నారు; ఈ నాడిది భౌగోళికంగా జరుగవలసిన అవసరం లేదు; కాని, ఆ పూర్వీకుల రక్తమాంసాలను పంచుకొని జన్మించిన అమెరికన్లలో అదొక స్వాభావికవాంఛగాను, ఆత్మసంబంధమైనదిగానూ ఉండిపోయింది. ముఖ్యంగా అమెరికన్‌ల విశ్వాసాలలో ప్రాథమికమైనది - సుఖసౌఖ్యాలనేవాటిని వెదకవలసిందేకాని, వాటికొరకై వేచికూచోకూడదన్నది. ఈ విధంగా వారు అన్వేషణకూ, అందువల్ల కలిగే అశాంతికీ అంకితమై పొయ్యారు.

ఎక్కడైతే అంతా మార్పులుచెందుతూ, స్థలాలుమారుతూ ఉంటుందో- అక్కడ ఒక కొలపాత్రలాటి దాని అవసరం ఉన్నది. బడిలో చదివి సంపాయించే మార్కుల విషయంలో, వృత్తులలో, పనుల్లో సంపాయించే జీతాలు డాలర్ల అంకెల్లో ఉండే విషయంలో, కళాపూరితమైన పనుల్లో సైతం వెలగట్టేవిధానంలో - అత్యున్నతమైనదీ, విశాలమైనదీ, అమితోష్ణమైనదీ, ప్రప్రధమమైనదీ-వీటిని అమెరికన్ ఎంతగానో అపేక్షించటంలో - అంకెలద్వారా ధ్వనించేస్థాయిని గుర్తించటం అమల్లో ఉన్నది.

అమెరికన్‌లు మార్పుల్ని అంగీకరిస్తారు; వాటంతటవివొచ్చి పడుతవి కనుకనే అనికాదు; అవి పరిసరాలకు కొంతసహాయపడుతూంటవి కనుక. క్లైడీకుక్‌హోహన్ అన్నట్లుగా - తమలోకానీ, పరిసరాల్లోకానీ వొచ్చే మార్పుల కనుగుణంగా మనుషులు మారి సరిపెట్టుకుంటూ ఉంటారు. తూర్పుభాగాలు తమలో జరిగే మార్పులకు అనుగుణంగా మారటాన్ని ఎన్నుకుంటే, పశ్చిమప్రాంతాలు పరిసరాలలోని మార్పులకు అనుగుణంగా మారటాన్ని ఎన్నుకొన్నారు. రహదారి ముక్కుకు సూటిగా ఉండే నిమిత్తం పర్వతాన్ని తొలగించటం, నదీప్రవాహాల్ని మరలించి ఎడారి ప్రదేశాలను సస్యశ్యామలం చేయటం చేతితోచేసే పనులకు మారుగా వాటంతటవే పనిచేసే యంత్రాలను స్థాపించటం, వినోద కార్యక్రమాన్ని కొనసాగించే విధంగా కొత్తకొత్త పరిశ్రమలను సృష్టించి వాటంతటవిగా పనిచేసే యంత్రాల కారణంగా వొచ్చిపడిన నిరుద్యోగం, ఎక్కువ విశ్రాంతి కాలాల్లో పనివాళ్లు గాలికి తిరగకుండా వారికి తగిన పనులివ్వటం - ఇలాటి మార్పులు విషయంలో అమెరికన్‌లు ప్రత్యేక ఆనందాన్ని పొందుతూంటారు.

## సరిహద్దు ప్రాంతపు పలుకుబడి

యూరపియన్ సంస్కృతి తాలూకు కీర్తిప్రతిష్ఠల్నీ, బరువుభారాల్నీ తీసుకొని వొచ్చిన మనుషులు - అమెరికన్ భూభాగమూ, దాని శీతోష్ణ

స్థితులలో ఉండసాగాక వారినుంచి ప్రత్యేక నాణ్యతఉన్న అమెరికన్ సంస్కృతి ఉద్భవించింది. 17 వ శతాబ్దంలోకూడా భూస్వాముల వొత్తిడితో నలిగి నల్లేరయిపోయినవారు - అమెరికాకు రావటంతో ఆ పీడన నుంచి విముక్తులై, ఎలాగైనాసరే స్వంతభూమిని ఏర్పరచుకోవాలని తహ తహ లాడిపోయ్యారు. ఐతే అనాడు అమెరికాలోని పరిస్థితులు దారుణంగా ఉన్నవి: ముఖ్యంగా ఆ గడ్డమీద స్థిరనివాసాలను ఏర్పరుచుకోవాలంటే - ఇండియన్‌లతో రాజీపడటమో, లేదా సమరంలో గెల్చుకోవటమో అవసర మైంది: దారీతెన్నూలేని కారడవి మార్గాలనుంచి పయనిస్తూ, తమకు అనువుగా ఉండేభూమిని కనుగొనటం, అక్కడ గృహాలను నిర్మించు కోవటం, ఏవో కొద్ది సాధారణ పనిముట్లతో వ్యవసాయాన్ని సాగించటం- యుద్ధంలోకానీ, ఆకలితోకానీ, ప్రకృతి సహజమైన వాతావరణంలోకానీ చావటం - మొదలైనవి, చావగా మిగిలిన యూరపియన్‌లను త్వరలోనే అమెరికన్‌లుగా మార్చివేసినవి. ఈ తొక్కులాటే అమెరికన్ తత్వమనే దానికి రూపురేఖలను దిద్దింది.

ఈ సరిహద్దు ప్రాంతాలలోని అనుభవం - ఎంతోశక్తివంతమై, కఠిన మైన బోధకుడుగా ఉండి, కొత్తతత్వాలనూ, గుణగణాలను ముందుకు ఉరికించింది. దైనందిన జీవితంలోని కష్టాలు-ప్రవర్తనలో మోటుదనాన్ని కొనితెచ్చినవి. అనువుగా ఉండే భూమికొరకై (ఆ తరువాత బంగారం కొరకు) పడిన పోటీలు, తాను చావకుండా ఉండేందుకు ఇతరులను చంప టం, చట్టాలూ, ప్రభుత్వపుటాజ్ఞలూ లేకుండటంవల్ల మనుషులు మోటు దేలారు ; ఒక్కొకసమయంలో అనాగరికులవలె శారీరక బలప్రయోగాలను అమిత త్వరితగతిలో ప్రదర్శించేందుకు సిద్ధమయ్యారు. ఈ బలప్రయోగా లనేవి అమెరికన్ జీవితంలోని వివిధరంగాలలోకి పాకినవి. మోటుపనులు చేసే ముఠాలుగా, జాతిసంబంధమైన పోరాటాలుగా, రాజకీయాలలో జరిగే మోసాలుగా, రాజకీయకారణాలుగా జరిగే పోరాటాలుగా పరిణమించినవి.

జీవితం కష్టభూయిష్టమైన దైనప్పటికీ - అందువల్ల లభించే ప్రతిఫలం అత్యధికంగా ఉండేవి; ఒక్కోసమయంలో కొద్దిపెట్టుబడికే అత్యధిక లాభం రావటంకూడా కద్దు. కనుకనే "త్వరగా ధనవంతు డవటం" అనే వేదాంతం - కష్టపడి పనిచేయటానికి కొంచెం అదృష్టంకూడా కలిస్తే సువర్ణమయ మవుతుందనే విశ్వాసం ఏర్పడింది. వ్యాపారులు మెరిసే చౌకబారు వస్తువులను ఇండియన్‌లకు ఇచ్చి. విలువైన ఫర్స్‌ను సంపా యించేవారు. భూమినుంచి బంగారము. వెండి. అయిల్ మొదలైనవి - జీయస్ డానేమీద వర్షించిన బంగారంకన్న విలువైనవి లభించినవి. ఆ తరువాత రైల్వేలైనుల నిర్మాణంలో అత్యధికలాభాలు పొందినవి; అటు పిమ్మట స్టాక్స్‌మీద జూదమాడటం ఆరంభమై. 1929 లో వాల్‌స్ట్రీట్ వ్యాపారం కూలటంతో ఆ నష్టం అందరినీ నష్టపరచటం జరిగింది.

ఐతే సరిహద్దు ప్రాంతమనేది కొన్ని గుణాలకు నిలయమై. అవి అమె రికన్‌లలో ప్రతిఫలించేట్లు చేసింది. శక్తివంతమైన బాహువులతో పనిచేసు కొని గౌరవప్రదంగా జీవించటాన్ని అది ప్రోత్సహించింది. అది సర్వ స్వతంత్రుడైన. ఆత్మ గౌరవంగల వ్యవసాయదారుణ్ణి సృష్టించి. జాతీయ జీవనంలో ఒక చిహ్నంగా ఉండేట్లు చేసింది. సారవంతమైన, కుతూ హలంగల, అనుభవ పూర్వకమైన మానవుణ్ణి అది సృష్టించింది; ఆ మాన వుడు తనకుతానే ఏలుతూ. తన బాహువుల్ని ఏపనిమీదనైనా ప్రయోగించ గలుగుతూ, తేలిగ్గా సమర్థించగల సమాజాల్ని ఏర్పరచుకుంటూ, పరిస్థి తులూ వాతావరణంలో కలిగే మార్పులకు అనుగుణంగా త్వరితగతిని మారుతూ, తరగతులవారీగా పరిగణించబడే మానవాళినుండి స్వేచ్ఛను పొందుతూ. తనను ఇంత ఉచ్ఛస్థితికి తీసుకొచ్చిన మాతృభూమిపట్ల గాఢ విశ్వాసాన్నీ ఆశలనూ నిరూపిస్తూండే-మానవుణ్ణి రూపొందించింది.

ఈ నాటి అమెరికన్‌లో యీ గుణగణాలన్నీ ఏదోవొక రూపంలో పొడచూపుతూనే ఉంటవి. సరిహద్దుప్రాంతమనేది దేశానికి ఆవలి సముద్రపు

టొడ్డువరకూ వ్యాపించిపోయి, ఆ పేరే ఇప్పుడు వినరాకపోయినప్ప టికీ—అది అదృశ్యమవలేదు. నిజానికి ప్రభుత్వాధీనంలో ఇంకా ఎంతో భూమి - గృహనిర్మాణయోగ్యమైనది ఉన్నది; ఏటా 40,000 నుంచి 50,000 ఎకరాల ఇళ్ళస్థలాల్ని ప్రభుత్వం అమ్ముతూనేఉన్నది. అంతకన్న ముఖ్యమైనది—అమెరికన్ తనపై తనకుగల అభిప్రాయంలో ఆ తొలిరోజు ల్లోని పూర్వీకుల తత్వం గాఢంగా ఉన్నదనే అభిప్రాయ పడుతూన్నాడు.

నిర్విరామంగా ముందుకు సాగుతూ కారడవుల్లోనుంచి బైటపడి, తిరిగి సమాజాలుగా ఏర్పడుతూ, వ్యక్తిగతమైన గొనుతన మిత్వత్వాలతో, సంఘాలతో ఉంటూన్న జాతి-'స్నేహం' అనేదాని భావంలో ఎన్నో మార్పులు పొందటం తథ్యం. కుటుంబ చరిత్రలో సంభవమైన కీర్తి ప్రతి ష్ఠల్నిబట్టిగాక, వ్యక్తిగతంగా చేసే పనులవల్ల వ్యక్తిత్వం నిర్ణయించబడే విధానాన్ని మనుషుడు నేర్చుకొనితీరవలసివొచ్చింది. సమాజంలోకి కొత్తగా వొచ్చేవ్యక్తి తనకు స్నేహితులు కావాలనుకున్నపుడు అతనుకూడా స్నేహ పూర్వకంగా ప్రవర్తించవలసే ఉంటుంది: జీవితం సాఫీగా సాగాలంటే అతనికి స్నేహితులు అవసరంకూడాను,

ఈ విధంగా త్వరితగతిని మిత్రుల్ని సంపాయించటమనేది విదేశీయు లకు అవిశ్వాసనీయంగా తోచినప్పటికీ, అమెరికన్‌లలో అది ఒక గొప్ప అలవాటుగానే ఉంటూన్నది. కొన్ని దేశాల్లోవలె—అమెరికన్‌లు కొద్దిమంది ప్రియమిత్రులమధ్యా, మిగతా మానవాళిమధ్యా ఏదో గొప్ప భేదమున్న దన్నట్లుగా ప్రవర్తించరు. వారికి ఎక్కువమంది మిత్రు లున్నట్లయితే— వీధుల్లో బోర్డ్ మీటింగుల్లో, చర్చిలలో, మువీలలో - వారిని ముద్దుపేళ్ళతో పిలుస్తూ చుట్టూఉన్న వాతావరణంలో ఎంతో సుఖంగా ఉన్నదని భావించ గలగటం జరుగుతోంది.

"అతను నా మిత్రుడు" అనే పదం - ప్రియమిత్రులైన ఏ ఇద్దరు ముగ్గురి పరంగానో వాడబడటంలేదు. ఇరుగు పొరుగులూ, క్లబ్ మెంబర్లూ,

తనకు సంబంధమున్న సమాజాలలోని సభ్యులూ, తోటిపనివారూ, తన కారులో పెట్రోలువేసే మనిషి, పూర్వపు ఉపాధ్యాయుడూ, మతగురువూ, స్టోర్ కీపర్ - మొదలైన వారందరూ - ఆ పదజాలంలో ఇముడుతూనే ఉన్నారు. ఇతర సంస్కృతులు స్నేహమనేది పవిత్రమైనది కనుక, దాన్ని కొద్దిమందికి మాత్రమే ప్రత్యేకించవలసినదని భావిస్తూంటే - అమెరికన్ సంస్కృతి ఆ స్నేహాన్ని అతి పవిత్రంగా భావిస్తూండటంవల్ల దాన్ని అందరికీ పంచాలనే భావాన్ని వ్యక్తీకరిస్తూ ఉన్నది. అమెరికన్ ఆర్థిక విధానంలో క్షయాన్నిబట్టి నిలవలు ఎక్కువగా లభ్యమౌతూన్నట్లే, మిత్రత్వంకూడా పంచినకొద్దీ ఇంకా ఎక్కువ నిలవఉండే పద్ధతిలోనే ఉంటూ వ్నది. ధాన్యాల నిలవలనుంచీ, మొదటి ప్రపంచయుద్ధం తాలూకు అనుభవాలనుంచీ నిలవలనేవాటిని విపరీతంగా ఉంచటం భాగ్యవంతంకాదనీ, అందువల్ల బీదరికం, లేమికూడా సంప్రాప్తమౌతవనీ అమెరికన్లు గ్రహించారు.

మిత్రుల కొరకు అన్వేషించటమనేది కేవలం వ్యక్తిత్వాలవరకే పరిధిగా ఏర్పడిలేదు; అది అంతర్జాతీయంగా ఉన్నది. మంచి ఇరుగు పొరుగు లుండాలనే తీవ్రవాంఛ, తగినంత అభివృద్ధిచెందని ప్రదేశాలకు అమెరికా చేసే సహాయమూ, నిలవలున్న ఆహారపదార్థాలను ఆకలిగొన్న ప్రజలకు సరఫరా చేయటం, 'వరల్డ్ నైబర్స్' లాటి సంస్థలూ మొదలైన వాటిని రాజకీయ విస్తరణలుగా అర్థం చేసుకోలేము. వీటి వేళ్లు ప్రేమించేందుకూ, ప్రేమించబడేందుకూ తహతహలాడటంలోనూ, నీవు ప్రజలను ప్రేమించి నప్పుడే, వారుకూడా నిన్ను ప్రేమించటం జరిగి, విశ్వప్రేమవ్యాప్తి జెందుతుందనే న్యాయంమీద ఆధారపడిఉన్నది. (ఇక్కడే రూజ్‌వెల్ట్ స్టాలిన్‌తో చేసిన వ్యవహారంలో పొరబడ్డాడు).

## అమెరికన్ విశ్వాసం

ఐతే అమెరికన్ శీలాన్ని రూపొందించిన విశ్వాసాలూ, అభిప్రాయాలూ ఏమిటి ,

జార్జ్ సంతాయణ ఇలా అన్నారు : "ఈ జాతికి సంబంధించిన విశ్వాసమూ, నైతిక దృక్పథమూ, ఊహల రూపాలలో చెప్పాలంటే కుదిరేవి కావు ; ఆధ్యాత్మికంగా కఠినమైనది. అదే - పనిచేయాలనే తీవ్రవాంఛ. అభ్యుదయంపట్ల విశ్వాసమూ అనే శుభప్రదమైన వర్తమానం.

అమెరికన్ సంస్థలపట్ల అమెరికన్‌ల విశ్వాసం గాఢమైనదిగా ఉన్నది. స్వాతంత్ర్యపత్ర ప్రకటనా. కాన్‌స్టిట్యూషన్‌లు - స్వప్రభుత్వం తాలూకు ప్రాథమిక సూత్రాల నన్నిటినీ వివరించినది : ఇవి ఎంతో నిర్దుష్టంగానూ, సమగ్రంగానూ ఉండటంవల్ల వీటిని కనిపెట్టింది అమెరికన్‌లే ననే భావం- లేదా కనీసం ఆ సూత్రాలు తమవేననే చిత్రమైనభావం వారికి ఉన్నది. ఈ పత్రాలలోని ప్రాథమిక హక్కులు ప్రశ్నించే ధోరణికోకానీ, వాటిని పెడార్థాలు తీసేందుకు వీలుగాకానీ లేకుండటంవల్ల, ప్రాథమిక సూత్రాల విషయం అమెరికన్‌లు ఆందోళన చెందవలసిన అవసరంలేదు : అవి వారికి శాశ్వతంగా సమర్పించబడినవి.

అమెరికన్‌లు విశేషంగా తమనుగూర్చి తామే ఆందోళన పడకుండటం తీవ్రంగా ఆలోచించకుండటాన్ని పరిశీలకులు గమనిస్తున్నారంటే - దానికి కారణం పైన చెప్పుకున్న పత్రాలిచ్చిన స్థోమత, వారి గమ్యస్థానాలు నిర్ణయించబడి, వాదోపవాదాలు అవసరంలేకుండా చేయబడటమూను. వీటిని జేరేందుకు అవసరమైనదల్లా కష్టించి పనిచేయటమే ! నూతనసృష్టి, నిర్మాణం _ కొత్తప్రదేశాలను ఏర్పరచటం, కొత్తగనుల్ని కనుక్కోవటం, కొత్త పురజనసంస్థను నెలకొల్పటం, కొత్తవ్యాపారాన్ని విస్తరింపజేయటం ఇలాటి వాటినే అమెరికన్‌లు మెచ్చుకుంటారు. నిజానికి ఇలాటివే వారి

స్వప్నాలు. అందరు సృష్టికర్తలవలెనే వారుకూడా విమర్శకుల విషయంలో అనుమానాస్పదులుగా ఉంటున్నారు.

ఈ కారణంవల్లనే అమెరికన్‌లు ఉత్సాహపూరితులుగా ఉంటూ, తమ దేశంలోని పొరపాట్లను వారెంత తీవ్రంగా ఖండిస్తూన్నప్పటికీ, బైటినుంచి వినవొచ్చే తీవ్రవిమర్శలను వారు కలిసికట్టుగా ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉంటున్నారు. డీటాక్వివెల్లీ యునైటెడ్‌స్టేట్స్‌ను ఎంత మెచ్చుకున్నప్పటికీ, ఇలాటి దేశభక్తిమాత్రం చిరాకు కలిగిస్తుందనే అభిప్రాయంలో ఉన్నారు. తమను పొగడనట్లయితే, అమెరికన్‌లు ఫిర్యాదు చేయటమే గాక, తమను తామే పొగడుకుంటారు. ముఖ్యంగా తాను ప్రేమించి ప్రేమించబడటమనే అమెరికన్ తత్వాన్ని ఆయన గమనించారు: ద్వేషించి ద్వేషించబడటమనే దాని కారణంగానే ఎంతో మానవచరిత్ర నిర్ణయించబడి ఉన్నది: దీనికన్నా మొదటిది సర్వత్రా ఎన్నుకోదగ్గదే।

అమెరికన్ విశ్వాసం తాలూకు అనేక విషయాల్లో కొన్ని ప్యూరిటన్ ఫాదర్స్‌నుంచి వంశపారంపర్యంగా వొచ్చినవీ, మరికొన్ని పశ్చిమానికి కదిలిపోతూ వారి సంతతివారు తమతోపాటే తీసుకొని వెళ్ళినవీను. భగవంతుని సృష్టిలో రూపొందిన మానవుడు భగవత్ స్వరూపుడేననీ, కనుక అతని వ్యక్తిత్వాన్ని గౌరవించవలసి ఉంటుందనే అభిప్రాయం ఈ విశ్వాసాలలో ఒకటి. ప్రభుత్వమనేది ఎలా ఉండాలో ఒక నిశ్చితాభిప్రాయాన్ని కలిగి ఉండటమనే దాని పుట్టుపూర్వోత్తరాలుకూడా పిల్గ్రిమ్ ఫాదర్స్ నుంచి దిగుమతి ఐనవే: నలుగురు ఎన్నుకొన్నదీ, సమ్మతించిందీ, సకారణవాదనలలో ఏర్పడే అధికారం మొదలైనవి 17 వ శతాబ్దపు వేదాంతులకు సంబంధించినవే. ముఖ్యంగా వ్యక్తులనుగాక ఆదర్శాలను ఆరాధించటం, మానవాళిని నడిపించేది గాఢమైన మతైక విశ్వాసమనే నమ్మకము మొదలైనవికూడా ప్యూరిటన్‌ల తాలూకు అభిప్రాయాలే।

కనుక క్లావెనిస్ట్ నైతిక దృక్పథమనే మేకులు దించబడిన రంగస్థలం మీద, అమెరికన్‌లు విమోచన దృశ్యకావ్యాన్ని నిర్వహించారు. ఆ కఠిన

చట్టాలను అతిక్రమించినట్లయితే వారు శిక్షించబడేవారు; ఒకవేళ వారి నేరం మరుగుబడి పోయినట్లయితే. వారు తమకు తామే శిక్షలను విధించుకొని అనుభవించేవారు. శారీరక సంబంధమైన వాంఛల తీవ్రతను అరికట్టేందుకు వారు మరింతగా కష్టపడి పనిచేశారు; ఈ విధంగా పనిచేయటమనే దానికి ద్విగుణీకృతమైన విలువలు ఏర్పడినవి. ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రకారం యీ కామసంబంధమైన వాంఛలరూపం వెల్లడవటంవల్ల కలిగే తేలికభావమంటూ ఉన్నప్పటికీ - యీ నాటికీ తాను కష్టించి తనభాగం పనిని చేయనట్లయితే అమెరికన్ మనసు తేలిక పడదు.

పనివిషయంలో మతైకమైన విశ్వాసమనేది ఎంత తీవ్రంగా ఉంటుందో కలొనెల్ అబ్రహాం డావెన్‌పోర్ట్ కథకన్న మంచి ఉదాహరణ దొరకదు. 1780 లో ఒకనాడు వాతావరణమంతా ప్రళయరూపం ధరించింది. ఆకాశం కారు మేఘాలతో ఆవరించబడింది. కనెక్టికట్‌లోని ప్రజాప్రతినిధుల సభను వాయిదా వేయాలనే సూచనను చేశారు.

సూచనను ప్రతిఘటిస్తూ డేవెన్‌పోర్ట్ లేచి నిలబడి ఇలా అన్నాడు: "ప్రళయం వాస్తోందో లేదో మనకు తెలియదు. కాని, అది సంభవించబోవటం లేదనుకునే పక్షంలో యీ సభను వాయిదా వేయవలసిన అవసరం లేదు; ఒకవేళ అది సంభవించబోతున్నదనే అనుకుంటే - నేను నా బాధ్యతను నెరవేరుస్తుండగా అది వొచ్చిపడటాన్నే నేను ఎన్నుకుంటాను. కనుక వెంటనే వెలిగించబడిన కొవ్వొత్తుల్ని లోనికి తీసికొని రావాలని నేను కోరుతున్నాను."

## హాస్యం

హాస్యాన్ని భరించటం, అనుభవించటాన్నిబట్టే సంస్కృతి బైటపడుతూండటం అనేక సందర్భాలలో జరుగుతూంటుంది. నిజానికి యీనాటి నాగరికతలోవలె - ఇంతకు పూర్వం ఏ నాగరికతలోనూ హాస్యానికి

ఇంత గొప్ప విలువ ఇవ్వబడలేదు. అమెరికన్ రంగస్థలంమీద అమెరికన్ లకో హాస్యాస్పదమైన విషయాలను సునిశిత హాస్యంతో వెల్లడించిన విక్ హోగన్స్ జాతీయ కథానాయకుడుగా పరిగణించబడ్డాడు. అమెరికన్ ప్రజల ప్రతినిధిగా భావించబడే మార్క్ట్వెయిన్ అమెరికన్ జీవిత చిత్రణకుగాక, అతని హాస్యధోరణికి మెచ్చుకోబడినాడు. అమెరికన్ దృక్పథంలో దుఃఖాంతంకన్న సుఖాంతమే ప్రాముఖ్యతను పొందటం ఒక విశేషం; అందుకనే టెలివిజన్‌లో హాస్యాన్ని ప్రదర్శించేవారి జీతాలు చాలా అధికంగా ఉంటూన్నవి.

బంధించబడిన విధంగా తోచినప్పుడూ, ఉరుకుల పరుగుల్తో ముందుకు సాగే అమెరికన్ పారిశ్రామిక రంగంలోని గందరగోళంతో తలదిమ్మెక్కిపోయినప్పుడూ, బర్రున తిరిగే అనేక యంత్రాలుచేసే శబ్దంతోనూ, ట్రాఫిక్ కలిగించే అలజడితోనూ, వేడెక్కిపోయిన తత్వానికి లోబడి పోతూన్నప్పుడూ - హాస్యం ప్రాణానికి హాయినిచ్చి ఆ దుష్టశక్తులనుంచి విముక్తిని ప్రసాదిస్తుంది. హాస్యం ఈ విషయాల నన్నిటినీ ఎంత బాగా స్పష్టీకరిస్తుందంటే - వీటిని చూసి అమెరికన్‌లే నవ్వేటంతబాగా!

హాస్యధోరణిలో చెప్పేటందుకు ఏదీకూడా, ఎంత పవిత్రమైన దైనప్పటికీ - అతీతంగా మాత్రం ఉండటంలేదు. నిజానికి అది ఎంత పవిత్రమైనదైతే, అంత బలవత్తరమైన హాస్యం సృష్టించబడుతోంది. మతగురువుల్ని గూర్చిన జోక్స్ ఎన్నో ఉన్నవి. క్షవరం చేసుకుంటూ తాను చేయవలసిన మతబోధనుగూర్చి ఆలోచిస్తూ గడ్డం కోసుకున్నానని చెప్పిన మత గురువుతో, మరో మతగురువు: ""జాగ్రత్త! ఆనక మతబోధనుగూర్చి చెపుతూ, క్షవరాన్నిగూర్చి ఆలోచిస్తే, మతబోధలోనే కోతపడుతుంది సుమా!" అంటాడు.

స్త్రీ పురుషుల కలయికలోని ప్రాముఖ్యతకూ, కుటుంబ జీవనానికీ, స్త్రీలూ, పిల్లల ఉచ్ఛస్థాయికీ, జీవితవిధానం, అందులోని కష్టాలూ మొద

లైనవాటికీ, అన్నిటినీ మించి హాస్యంపట్లచూపే ఆపేక్షనూ - హాస్యం సాధనంగా ఉపయోగపడుతోంది. ఐశ్వర్యంకన్నా, హాస్యాన్ని అనుభవించటం, హాస్యరసాన్ని ఆస్వాదించి ఆనందించటానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వబడుతోంది. మతగురువు మతబోధనలోనూ, డాక్టరు చికిత్సలోనూ, ప్లీడరు తన వాదనల్లోనూ, ఉపాధ్యాయుడు తన పాఠాల్లోనూ హాస్యాన్ని మిశ్రితం చేస్తూనే ఉన్నాడు. ఒక మనిషినిగూర్చి నీచమైన అభిప్రాయాన్ని వెల్లడించటమంటే - అతను హాస్యాన్ని ఆస్వాదించలేని అసమర్థుడుగా పేర్కొనటం! అమెరికన్ విధానంలో హాస్యమనేది ముఖ్యాంగంగా భావించబడుతోంది.

హాస్యం సర్వసమానత్వానికి సహాయపడుతుంది; అమెరికన్‌లు యీ సర్వసమానత్వంలో గాఢవిశ్వాసాన్ని కలిగి ఉన్నారు. హాస్యం - స్వేచ్ఛకొక చిహ్నంగాకూడా ఉన్నది. ఎందుకంటే, సాధారణ పౌరుడుకూడా తన నాయకుణ్ణిగూర్చి స్వేచ్ఛగా మాట్లాడగలడు గనుక. నాయకుడు అనవసరంగా విపరీత పరిణామాలకు పెరగకుండా, సాధారణ పౌరుడు సైతం ఆ యా హద్దుల్లో ఉండేవిధంగా నాయకుణ్ని తగ్గించివేయ గలుగుతూన్నాడు. పై పటాటోపాన్ని ఎదుర్కొని లోని లొటారాన్ని ఎత్తి చూపేందుకు హాస్యం మంచి సాధనంగా ఉంటూన్నది. అమెరికన్ తనను చూసి తానే నవ్వగల స్థోమతును సంపాయించ గలగటంతో, తనలోపాల్ని గుర్తించి సరిజేసుకోగల సామర్థ్యాన్నికూడా పొందగలుగుతున్నాడు. కొత్త పరిచయాలూ, స్నేహాలూ ప్రోత్సహించబడే దేశంలో - ఉద్విగ్న సహితమైన కలయిక సాధించటంలో హాస్యం ఎంతో త్వరితగతిని పని చేయ గలుగుతోంది. కనుకనే అమెరికన్ ఏ ప్రాంతంలో ఉన్నప్పటికీ స్వగృహంలో ఉన్నంతగా ఆనందించ గలుగుతూన్నాడు. హాస్యం గాఢ విశ్వాసానికి వ్యాకరణంవలె, సోదరత్వానికి సంగీతంవలెనే అమోఘంగా పనిచేయ గలుగుతోంది.

## అమెరికన్ అంటే ఏమిటి?

"నిన్ను నేను అర్థం చేసుకోలేకుండా ఉన్నాను" హెన్రీజేమ్స్ ట్రిస్ట్రామ్ సతిచేత ఇలా పలికించాడు: "నీవు నిరాడంబరంగా ఉన్నావో, లోతు మనిషివో తెలియటంలేదు" చాలామంది యూరపియన్‌లను సందిగ్ధావస్థలో పెట్టిన విషయమే ఇది। సాధారణంగా వారు - అమెరికన్‌లు పిల్లలలాటి వారనే అభిప్రాయానికి వొస్తూంటారు. ఐతే ఎవరూకూడా ఏ సమాజాన్నీ పరిపక్వమైనదిగానూ, మరొకదాన్ని అపరిపక్వంగానూ నిక్కచ్చిగా అంచనాలు వేయలేదు. ప్రతిదానికీ సకారణ వాదనంటూ ఉన్నది.

ఐతే అమెరికన్‌లు ఎక్కడికి వెళ్ళినా వాళ్ళను గుర్తించగలిగే చిహ్నాలనేవి ఏమిటి? ఒక తరగతి ప్రయాణీకులుచేసే గోలా, రొదా తమను గూర్చి తామే పొగుడుకోవటమూ, డబ్బు నీటివలె ఖర్చుచేయటం మొదలైన వాటివల్ల వారు ఏర్పరిచే అభిప్రాయాలుకాదని మా అభిప్రాయం. ఇలాటివారి ధోరణినిగూర్చి చెప్పవలసిన విషయమొక్కటే: ఇంటిదగ్గిరి సామాజిక కట్టడులూ, ఆచారాల బంధనాలనుంచి విడివడటంతో వారు అనుభవించే స్వేచ్ఛను ప్రదర్శించేందుకు వారుచేసే ప్రయత్నమే అది।

అమెరికన్‌లు తమతోపాటు తాము ఫలానా అని గుర్తించేందుకు వీలుగాఉండే తత్వానికి సంబంధించిన ఫలితాన్ని తమతో తీసుకొని వెళ్తారు. ఇది దుస్తుల ధారణకన్న ప్రాముఖ్యతతో కనిపిస్తుంది. తత్వం తనొక తరగతికి చెందాననే విషయాన్ని విస్మరించిన విధంగా, తానెంతో తెలుసుకోవాలని కుతూహలపడుతున్న ధోరణిలో ఉంటుంది.

దీనికి తోడుగా సత్యాన్ని తెలుసుకునేందుకుగాను ఆ సత్యాన్ని నిరూపించే అంకెలపట్ల శ్రద్ధచూపటం, తెలివితేటలుకన్న శారీరకమైన కాయకష్టానికి అనువుగా హుషారుగా ఉండటం, అన్నిటినీమించి స్నేహపూర్వకంగా ప్రవర్తించాలనే తీవ్రవాంఛలు అమెరికన్‌లో స్పష్టంగా కనిపిస్తాంటవి. (ప్రస్తుతానికి మనం గమ్ నవలటం, విశేషంగా పొగతాగటం, ప్రతి

దాన్నీ కాన్సాన్సిటీలో లేదా కొయ్‌హక్‌తో పోల్చాలనే తహతహ మొద లైన గుణగణాలను విస్మరిద్దాం).

ఇదంతా ఒక్క మాటలో చెప్పాలంటే - అసాధారణమైన పోటీలుండి, అదేవిధంగా అసామాన్యమైన అవకాశాలు ఉండటంతో అందువల్ల కలిగే ఫలితాలే, అమెరికన్ శీలాన్ని తీర్చిదిద్దినవని చెప్పవొచ్చు.

ఐతే ప్రత్యేక గుణగణాలు కలిగిన అమెరికన్ అంటూలేడు. ఐతే, 170,000,000 అమెరికన్లలోని ఆ యా గుణగణాలన్నిటినీ కలిపి, ఆ మొత్తాన్ని 170,000,000 తో భాగించి నట్లయితే వొచ్చే సరాసరి ఫలిత మేమిటో యీ అధ్యాయంద్వారా వివరించే ప్రయత్నం జరిగింది.

---

# ఆరో అధ్యాయం

## సమాజం

లోగడ వర్ణించిన శీల విశేషాలు కుటుంబ, జీవనాల ఆధారంగా అమెరికన్‌లు ఏర్పరుచుకొన్న సమాజం ఎలాటిది ? ఒకచిన్న సమాజాన్ని ముందుగా పరిశీలించటం తేలిక. అంచనాల పట్టీలను యాదాలాపంగా చూసిన ఫలితాలకు అనుగుణంగా లేకుండా - చాలామంది అమెరికన్‌లు చిన్న సమాజాలలో జీవితాలను గడుపుతూంటారు. జనాభాలెక్కల సంఘం వారు 2,500 కు పైగా ఉన్న సమాజాల నన్నిటినీ నగర సమాజాలుగా పేర్కొన్నారు. ఐతే 2,500 జనాభావున్న పట్టణం పల్లెగాకన్న పట్టణం గానే కనిపిస్తుంది. 25,000 లేదా ఒక్కోసమయంలో 50,000 జనాభావున్న పట్టణంలో నివసించే ప్రతివ్యక్తీ - దాన్నుంచి తనను తాను ఒక యూనిట్‌గా గుర్తిస్తూ, అదంతా తనకు బాగా తెలిసినట్లే భావిస్తాడు. 37% ప్రజలు పల్లెల్లో జీవిస్తున్నారు (రాజకీయపరంగా ఇవి 1,000 దాకా

ఉన్నవి) ; 22% మంది చిన్ననగరాలలోను, 25,000 జనాభాఉన్న పట్ట ణాల్లోనూ నివశిస్తూన్నారు ; 41% మంది మహాపట్టణాల్లో ఉంటున్నారు. అమెరికన్‌లలో చాలామంది స్వభావసిద్ధంగా చిన్నపట్టణాలకు సంబంధిం చిన వారుగానే ఉంటున్నారు ; కాస్మాపాలటానిజమ్ బలవంతాన వారిమీద పడినా వారు మారేందుకు ఇష్టపడరు. యుద్ధారంభంనుంచీ వారు పట్టణాల పరిసరాల్లోఉండే పల్లెలకు. ఎంత త్వరగా గృహనిర్మాణం జరుగుతే అంత త్వరితగతిలో పారిపోతున్నారు. తమ వ్యవహారాలను తామే చూసుకో వాలనే తీవ్రవాంఛలు గలవారు కనుక. సమాజం ఎంత చిన్నదిగా వీలైతే అంత తేలిగ్గా దాన్ని నిర్వహించే అవకాశం ఉంటుంది కనుక, వారు పెద్ద సమాజాన్నికూడా ఏ విధానంలోనైనా సరే చిన్నచిన్నవిగా రూపొందిం చేందుకు ప్రయత్నిస్తూన్నారు.

ఒక చిన్నపట్టణంలో ప్రవేశిస్తూన్న విషయం సూచనప్రాయంగా తెలు స్తుంది - ఆ యా రోటరీ, కివానిస్, లయన్ క్లబ్‌ల మూలంగా. ఈ సంస్థలు సమాజానికి ఉపయుక్తంగా ఉండేపనుల నిర్వహణకు నెలకొల్ప బడినవి : ఒకపార్కును నిర్మించటం, లేదా కులాసా కాలక్షేపానికి అవసర మైన వాటిని స్థాపించటం, చిన్నపిల్లలు నేరస్థులుగా మారటమనే సమస్యను పరిష్కరించేందుకు ప్రయత్నించటం, స్కౌట్ సంస్థలకు అండదండలుగా ఉండటం, బీదవారికి ఉచితనేత్ర వైద్యం చేయించటం, హైస్కూలు పిల్ల లకు యూనిఫారాలు కుట్టించటం మొదలైన పనులు చేస్తుంటవీ సంస్థలు.

నెమ్మదిగానూ, ఒకోసందర్భంలో నమ్మలేనంత వేగంగానూ అమెరి కన్ భూభాగం ఆధునికమైన ఫాక్టరీలతోనూ, అన్నికిటికీలూ, స్టెయిన్‌లెస్ స్టీల్‌తోనూ, నిరాడంబరంగానూ, హుందాతనంతోనూ ఉండే గృహాల తోనూ విలసిల్లుతూన్నది ; ఐతే యీ నూతన నిర్మాణాలకన్న పురాతన నిర్మాణాలే అత్యధికంగా ఉంటూన్నవి. మురికిపేటల్లో బీదసాదలు శిధిల గృహాలలో, పెయింట్ రాలిపోయి వెలవెలబొయ్యే ఇళ్ళల్లో నివశిస్తూం

టారు. సాధారణంగా పెద్దబజార్లు అందంగాను, అనేక వృక్షచ్ఛాయల లోనూ, పచ్చికమైదానాల పక్కగా పోతూంటవి ; ఇళ్ళన్నీ గోడలవెనుక దాగిఉండక, వీధిలోకి తొంగిచూస్తూ స్నేహపూర్వకంగా కనిపిస్తవి. గోడల వెనుక దాగిఉండటమనేది అమెరికన్ పద్ధతిగా పరిగణించబడదు. ఏదో మహాఐశ్వర్యవంతులు అలా ఉంటారు ; ఐతే అలాటివారు అరుదు.

స్వాభావికంగా ప్రతి పట్టణమూ ఒక వ్యాపారకేంద్రంగా ఉంటూన్నది: అమెరికాలోని పెద్దబజార్లు యీ విషయాన్ని మరుగు పరచలేవు. ప్రతి స్టోర్స్ముందూ కనిపించే బోర్డులు కొట్టొచ్చినట్లుగా ఉంటవి ; రాత్రులందు ఎంతో కాంతివంతమైన ఫ్లొరిసెంట్ లైట్లకాంతి - ఎరుపు, ఆకుపచ్చ, నీలం రంగుల్లో విస్తరించి చూపరులదృష్టిని ఆకర్షించే విధంగా ఉంటుంది. కొద్దిదూరంలో అనేక గృహాల్లో సేవాధర్మాన్ని పాటించే అనేక సంస్థ లుంటవి. ఈ సంస్థలు - బాంకులు, పోస్టాఫీసు, టెలిఫోన్ ఎక్స్చేంజ్, ఎలక్ట్రిక్ కంపెనీ, ఫైర్, పోలీస్స్టేషన్లూ, కోర్టులూ, పట్టణానికి సంబంధించిన కార్యాలయాలూ, రైల్వేస్టేషన్, బస్స్టాండ్, సినిమా హాలులు, చిల్లర అంగళ్లూ మొదలైనవి - పట్టణంలోని ప్రజలమీద ఆధారపడేవీ, అదేవిధంగా పట్టణంలోని ప్రజలు ఆధారపడవలసినవిగా ఉంటూన్నవి. బట్టల దుకాణాలూ, హార్డ్వేర్షాపులూ, ఆహారదినుసులనమ్మే అంగళ్ళూ ప్రాముఖ్యతగా కనిపిస్తవి; ఐతే ఎలక్ట్రిక్ సామానులూ, డ్రైక్లీనింగ్ షాపులుకూడా తగినంత ప్రాముఖ్యతను ప్రదర్శిస్తూంటవి. అమెరికన్ సంస్థగా పేరొందిన డ్రగ్స్టోర్ - అమెరికన్ అభిరుచులకు అనుగుణంగా ఉండే అనేక రకాల ఐస్క్రీమ్లనూ, స్నాక్స్, కాండీలనూ, టాయిలెట్ సామానులనూ, పుస్తకాలూ, మాగజైన్లనూ, గృహోపకరణాలనూ, చుట్టలూ, సిగరెట్లనూ, ఆటవస్తువులనూ, మందుమాకులనూ అమ్ముతూంటుంది.

ఈ షాపులకు పై భాగాల్లో పట్టణంలోని ప్రజలకు అవసరమైన సేవా సంస్థలు - డాక్టర్లూ, లాయర్లూ, ఫొటోగ్రాఫర్లూ, దంతవైద్యులూ, మంగళ్లూ, నిర్మాణనిపుణులూ, ఇన్సూరెన్సు కంపెనీలూ, ఎస్టేట్ ఏజెంట్లు మొదలైనవి ఉంటవి.

రాజవీధికి దాపులోనే ప్రాముఖ్యతతో కనిపించే చర్చిలూ, ఉచిత పుస్తక భాండాగారాలూ, వై. ఎమ్. సి. ఎ. మొదలైనవి - విద్యా సంస్కరణతోపాటు వినోదకరమైన ఆటపాటల ప్రాముఖ్యతా, మతైక ప్రాముఖ్యతను పట్టణ జీవితవిధానంలో మిళితంచేసే విధంగా ఉంటవి.

ఈ పైభాగపు గదుల్లోనూ, వ్యాపారకేంద్రం చుట్టూఉన్న పురాతన భవనాల్లోనూ క్లబ్‌లూ, లాడ్జ్‌లూ ఇరికి ఉంటవి. ఈ లాడ్జ్‌స్‌కు ఉన్నపేర్లు గమ్మత్తుగా - ఎక్సు, ఈగిల్స్, మూస్, ఔల్స్ మొదలైన జంతునామాలుంటవి. దినదిన ప్రవర్ధమానమౌతూ, అభ్యుదయపథాన పయనించే సమాజంలో - చిన్నదైనప్పటికీ అందులోని సభ్యులమధ్య విశేష సంబంధ బాంధవ్యాలుండటం అవసరం. రోగగ్రస్థులూ, బలహీనులకు యీ సమాజాలు ఎంతో సహాయ సానుభూతులను అందిస్తూన్నప్పటికీ, ఇంటినుంచి బైటపడేవానికి స్వర్గతుల్యంగాకూడా ఉంటున్నవి: అతనికి స్త్రీలు వొస్తారనే భయంలేని ప్రదేశం, ఒక కోటలాటిది ఇవ్వబడటంవల్ల, ప్రశాంతంగా కాలం గడపగలడు. అంతేగాక స్నేహమనేది అభివృద్ధి కావటంతో వ్యాపార సంబంధమైన, లేదా రాజకీయ సంబంధమైన బేరసారాలు సాఫీగా కొనసాగే అవకాశాలనుకూడా కల్పిస్తూన్నవి.

## సామాజికుడు

చిన్నపట్టణంలో నివశించే వ్యక్తి - ఒక వందవిధానాల్లో సమాజానికి కట్టివేయబడిన విధంగా ఉంటున్నాడు. ఉదాహరణగా 10,000 జనాభావున్న ఏ న్యూ ఇంగ్లండ్ పట్టణంలోని దంపతుల్నో తీసుకుందాం: ఎలక్ట్రి

కల్ భాగాలు తయారుచేసే ఫాక్టరీలో, జాన్ డివిజినల్ సూపర్‌వైజర్, అతను తనభార్య మేరీతోపాటు బ్రిడ్జ్‌క్లబ్‌లో సభ్యుడు; ఈ క్లబ్ కంట్రీ క్లబ్‌తో కలుస్తూంటుంది; ఇందులోకూడా ఈ దంపతులు సభ్యులే. ఈ సామాజిక సంస్థలన్నీ సుమారుగా డబ్బున్న మధ్యతరగతి కుటుంబాలన్నిటితోనూ సంబంధాల్ని కలిగి ఉన్నవి. వారు చర్చ్‌కి వెళ్ళటమేగాక, యువతీ యువకులైన దంపతుల తాలూకు క్లబ్‌లనుకూడా దర్శిస్తూంటారు.

జాన్ యజమాని రోటరీక్లబ్ సభ్యుడు; జాన్ లయన్స్‌క్లబ్ సభ్యుడు. సేవలనిచ్చే క్లబ్‌లలోకూడా వరసక్రమాలనేవి ఉన్నవి; ఆ ఎక్కువ తక్కువ లనేవి ఒకోపట్టణంలో ఒకోవిధంగా ఉంటూన్నవి. స్కూల్ బోర్డ్‌లో సభ్యుడుగాఉన్న జాన్‌కు, లయన్స్ క్లబ్‌లోని సభ్యత్వం చాలా ఉపయోగపడుతూన్నట్లు తోస్తుంది. క్లబ్‌లోనే అతను స్కూల్ సూపరింటెండెంటుతో మాట్లాడవొచ్చు. అంతేగాక స్కూళ్ళనుగూర్చి ఇతరులు ఏమనుకుంటున్నారో తాను తెలుసుకోగలడు; లేదా బోర్డ్‌కు ఎదురయే సమస్యలపట్ల ఇతరుల అభిప్రాయాలూ, ఆతృత ఎలావున్నవోకూడా తెలుసుకోవొచ్చు.

సభ్యులు పాల్గొనే ఇతర కార్యక్రమాలు ఇవి: కాలేజిలోని పాత విద్యార్థి సంఘం, తానూ, లేదా హైస్కూలు పాతవిద్యార్థిసంఘం, తనభార్యా కలిసి పాల్గొనే డాన్సులు (సాయంత్రంపూట దంపతులు ఉభయులూ కలిసి ఆనందించే క్రీడ ఇదే!): అప్పుడప్పుడు కలుసుకునే ది రాడ్ అండ్ గన్ క్లబ్, చర్చ్‌ఛాయిర్, ప్లాంట్ మేనేజర్ల తాలూకు జాతీయసభ, రిపబ్లికన్‌పార్టీ సభలూ మొదలైనవి.

మేరీ జీవితంకూడా తీరిక లేకుండానే ఉంటూంటుంది. అనేకమంది గృహిణులవలెనే ఆమెకూడా తన ఇంటిపనులన్నీ చూసుకుంటుంది - చివరకు బట్టలుతికే పనికూడాను - ఆమెకు ఎలక్ట్రికల్ వాషర్, డ్రయర్, మాంగిల్, ఐరన్‌చేసే సాధనాలన్నీ ఉన్నవి. దినచర్య నంతటినీ జాగ్రతగా కారక్రమ విధానంలో అమర్చుకుంటూ, వంటపనీ, బట్టలుతికేపనీ,

కుట్టుపనీ, తోటపనీ మొదలైన వాటిని ఇతర పనులతోపాటే నిర్వర్తించు కునే విధంగా చూసుకుంటుంది.

ఆమె టేబుల్‌మీద వివిధ సంస్థలకు సంబంధించిన ధనసేకరణా కార్య క్రమాల తాలూకు వివరాలూ మొదలైనవి ఒక గుట్టగాపడి ఉంటవి. ప్రతి సంవత్సరమూ వై. ఎం. సి. ఎ. వారు ధనసేకరణ కార్యక్రమాన్ని అమలు జరుపుతారు ; పట్టణంలోని ప్రజలందరి జీవితాలు ఆధారపడిన యీ సంస్థకు తగిన ఆర్థికసహాయాన్ని చేయటం పురజనుల బాధ్యత. పట్టణం కాస్త పెద్దదైతే వై. డబల్‌యూ. సి. ఎ. కూడా ఉంటుంది. సంస్థకు సంబం ధించిన వాటిల్లో - బాయ్ అండ్ గరల్ స్కౌట్స్, మానసిక చికిత్సా కేంద్రం, కుటుంబ సేవాసమాజం, ఆసుపత్రి, బాలబాలికల సహాయోద్యమం ఇంకా ఇలాటివి అనేకం ఉన్నవి. సంవత్సరంలోని ఇతర సమయాల్లో ఆమె - రెడ్‌క్రాస్ తరపున ఇరుగు పొరుగుల్ని దర్శించటం, అంగవైకల్య మున్న పిల్లల్నీ, అంధులనూ మొదలైన వారిని దర్శించటం చేస్తూంటుంది. ఇలాటి అనేక సంస్థలు రాష్ట్రముఖ్యపట్టణంలో ఉండి అక్కడున్నించే రాష్ట్ర మంతటా సేవలు చేస్తూండటంవల్ల ఒక సమాజానికి సంబంధించిన నిధిని పోగుచేయలేదు. ఇలాటి వాటికి సహాయపడటంలో ఆ యా పట్టణాల్లోని మహిళలు ఎంతో తోడ్పడుతూంటారు. అప్పుడప్పుడు ప్రత్యేక విజ్ఞప్తులు- పాఠశాలకు సంబంధించిన కట్టడాల మరామ్మత్తులాటివికూడా వొస్తూంటవి. ఐతే ఇలాటివాటి బాధ్యత కేవలం స్కూల్‌బోర్డ్ వారిదేనని - మేరీ, తన భర్తతో చెప్పవొచ్చు. కాని బోర్డుకు ధనంలేదు. కనుకనే మహిళలు అనేక విధానాల్లో డబ్బు పోగుచేస్తారు. ఈ విధంగా సమాజం ఎప్పుడూ ఉప యుక్తమైన కార్యాలకు ఆర్థిక సహాయం చేస్తూనే ఉంటుంది.

ఇలాటి సేవాసమాజాల రక్షణ బాధ్యతలను ప్రభుత్వమే వహించి తగిన ఆర్థికసహాయం చేసేందుకు పన్నులను విధించరాదా ? అత్యంత శక్తివంత మైన ప్రభుత్వపు పిడికిటిలో ఉండేందుకు అమెరికన్‌లు ఇష్టపడరనేది

చరిత్రే చెపుతోంది; సాధ్యమైనంతవరకూ కళ్ళేలను తామే చేతుల్లో ఉంచుకొనేందుకు ప్రయత్నిస్తారు వారు. స్వచ్ఛందసేవకులను అందించే పౌరులుండగా, ప్రభుత్వమే అన్నిటికీ పూనుకొని భారమైన పన్నులు వేయ టానికి అమెరికన్‌లు అంగీకరించరు, కొన్నినగరాలలో చివరకు అగ్ని మాపక దళాన్నికూడా స్వచ్ఛందసేవకులే నిర్వహిస్తున్నారు; సైరన్ కూయగానే వారు తమతమ కార్లలోవొచ్చి నిప్పునార్పే పనిలో నిమగ్ను లౌతూంటారు. సమాజమే చికిత్స నివ్వాలనే సిద్ధాంతాన్ని వారు అంగీక రించక, తమంతట తామే ఆరోగ్యాన్ని ఇన్‌సూర్ చేసుకుంటున్నారు; ఇలాటి సంస్థ 1100 లక్షల పౌరులకు రక్షణ నిస్తూన్నది.

దైనందినంగా మేరీ చేసేపనులకు తోడుగా, మరికొన్ని విరాళాల నిచ్చేందుకూ్కడా ఆమె ఆహ్వానించ బడుతూంటుంది: తినుబండారాలు అమ్మకానికిగాను ఒక కేక్ ఇవ్వటం, లేదా ఆమె సభ్యురాలుగాఉన్న చర్చి సమాజంవారు ఖండాంతరాలలోని బీదసాదల ఉపయోగార్థం పంపే పాత దుస్తులకు, తన దగ్గర కాస్త మంచిస్థితిలోఉన్న పాతగుడ్డల నివ్వటం, హైస్కూల్ లైబ్రరీకి పుస్తకాలను ఇవ్వటం, పక్కనున్న నగరంలో ఆట పాటల పోటీలకు ఒక పిల్లలజట్టును తీసుకొని వెళ్ళటం, ఏ వేలంపాటకో పోస్టర్లను తయారు చేయటం, వాటిని స్టోర్స్ కిటికీలలో ప్రదర్శించటం, పిల్లల ఆరోగ్యాన్ని పరిశీలిస్తూండే వైద్యాలయాలకు తమ పిల్లల్ని తీసుకొని రమ్మని ఆ యా తల్లులకు టెలిఫోన్ చేయటం మొదలైన పనులుకూడా ఆమె చేస్తూంటుంది.

ఐతే యీ దంపతులు పాల్గొనే పౌరసంబంధమైన కార్యక్రమాలే మొత్తం చిత్రాన్ని సృష్టించటంలేదు. వారు సమాజంలో లెక్కలేనన్ని మార్గాల్లో సంబంధ బాంధవ్యాలను కలిగిఉంటూ, వాటి నన్నిటినీ అంగీక రించినట్లే భావించబడుతూన్నారు. ఈ కార్యక్రమాలన్నీ వారి కాలాన్ని హరించి, విశ్రాంతి తీసుకొనే సమయాన్ని బాగా తగ్గించివేసి నట్లయితే,

తమ ఆత్మలనే సమాజంతో మిళితం చేసేందుకు వారు సిద్ధపడుతూంటారు. ఇలాటి మూకుమ్మడి కార్యక్రమాల్లో పాల్గొనేవ్యక్తి - తాను ఒంటరిగాడనే భావాన్ని జారవిడిచి, తనకు ఎంతో సంబంధమున్న సమాజంలో ఐక్యమై పోతాడు. "స్వార్థాన్ని విడిచి సేవచేయి" అనేది రోటరీ నినాదం. "నిన్ను నీవు ప్రేమించే విధంగా, నీ ఇరుగు పొరుగుల్నికూడా ప్రేమించు" అని చర్చి ఆదేశం. దైనందిన జీవితంలో ప్రతిరోజూ తాము అనుభవించేదే కనుక, యీ వేదాంతాన్ని జాన్ దంపతులు అవగాహన చేసుకున్నారు.

ఒకరి కొకరు చేదోడు వాదోడుగా ఉంటూ సహాయ పడటమనే దాని ద్వారా వ్యక్తి సమాజంలోని తన స్థానాన్ని గుర్తిస్తూ, తన అవసరాలను తృప్తిపరుస్తూ సామాజికులపట్ల గౌరవమర్యాదల్ని పెంపొందించుకుంటూ, తన కొక రక్షణ ఉన్నదనే భావంలో ఉంటున్నాడు. అలాటివ్యక్తి తాను ఏకాకి అనిగానీ, తనకు తగిన రక్షణలేదనికానీ భావించలేడు : అమెరికన్ నాగరికత విషయంలో సామాజిక శాస్త్రజ్ఞులు యీ విషయాన్ని నొక్కి వక్కాణించారు.

ఐతే యీ విధానంలోని పెద్ద లోపమిది : చాలామంది - ముఖ్యంగా తక్కువ ఆదాయమున్న పౌరులు ఇందులో పాల్గొనటంలేదు. ఈ సంస్థల ద్వారా వారెంతో సహాయాన్ని పొందుతూన్నప్పటికీ, అనేక సందర్భాలలో వాటికి సహాయపడలేక పోతున్నారు. తగినంత వ్యవధి లేకుండటం, సామాజిక సేవచేసే వారిపట్ల వారికిఉన్న గాఢవిశ్వాసమూ కారణాలు. తక్కువ ఆదాయమున్న పౌరులు, సామాజికసేవ ఎలా జరుగుతుందో సరిగా తెలుసుకోలేకా, తాముకూడా ఆ యా సంస్థలకు ధనసేకరణ ఎలా చేయాలో, ఎందుకు చేయాలో తెలియకా, బోర్డుసభలకు రాకపోవటం జరుగుతోంది. ఈ సమస్యా పరిష్కారానికి తరతమ భేదాలు విస్మరించే వరకూ విద్యాస్థాయి పెరగట మొక్కటే మార్గం.

## స్వచ్ఛంద సమాజము

యునైటెడ్‌స్టేట్స్‌ను అర్థం చేసుకోదలచిన పరిశీలకుడు ముందుగా చిన్న సమాజాలనూ, వాటికి సంబంధించిన స్వచ్ఛంద సేవకులున్న సంఘాలనూ చూడవలసి ఉంటుంది.

వ్యక్తిత్వాలను నిలబెట్టుకుంటూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవిస్తూ, సామాజికంగా సమాజానికి కట్టుబడిఉంటూ, తమ పలుకుబడుల్ని సమాజం మీద ప్రసరింపజేసే ఉద్దేశ్యాన్ని అనుభవ పూర్వకమైన పద్ధతిలో నడిపేందుకు స్వచ్ఛంద సేవాదళాలు తగినవి. దీన్నే నైతిక వేదాంతాన్ని నిత్యజీవితంలో అనుసరించటమని జక్విస్ బర్జన్ అన్నారు: "మేము అన్నిటికీ భగవంతుడే బాధ్యుడు కనుక మా బరువు భారాలు ఆయనవేనని అనము. వాటిని మేమే భరిస్తాము" అన్నారాయన.

సామాజికంగానూ, ఆర్థికంగానూ, మతైకంగానూ, నైతికంగానూ స్థాయీ భేదాలున్న రకరకాల పౌరులతో పరిచయాలు పొందేందుకు యీ సమాజాలు తగిన అవకాశాలను కలిగిస్తూన్నవి. క్లబ్‌లోని డిన్నర్ల లోనూ, చర్చి తాలూకు వేడుకల్లోనూ వారు కలిసి భోజనాలుచేస్తూ, సామాజిక జీవనంలో వ్యాపారాన్ని నడుపుతూ, వారు ఒకరి నొకరు ఎంతో ఆకర్షించుకుంటూ ఎంతో దగ్గరవుతూండటంతో ప్రజాస్వామ్యం ముందుకు సాగుతోంది. కాలాన్నీ, ధనాన్నీ విరాళంగా ఇస్తూండటం వ్యక్తిగతమైన స్థాయినికూడా పెంచుతోంది. తామున్న వాతావరణానికి తాము బానిసలు కాకుండా, దానికి తగినంత సహాయాన్ని చేస్తున్నామని ఆ యా దాతలు భావించ గలుగుతూన్నారు. (కలసి కట్టుగా చేసేపనులు కూడా యీ వాతావరణంలో ఇమిడి ఉన్నవి). ఈ విధంగా వారు - తాము కోరిన విధంగా రూపొందినామనీ, అమెరికన్స్‌పట్ల అచంచల విశ్వాసాన్ని కలిగి ఉన్నామనీ ఆలోచిస్తూ కూర్చోకుండా క్రియాహూపాన

సాధిస్తున్నామనీ, కేవలం భావాలకుగాక, వాటి ఫలితాలకు ప్రాధాన్యత నిస్తున్నామనీ - వారి నమ్మకం.

ఈ విధమైన స్వచ్ఛంద సేవకదళాల కారణంగా - నిరంకుశత్వానికి తావు లేకుండా పోవడమేగాక, నిరాటంకంగా క్రౌర్యాన్ని ప్రదర్శించే ఏ రాజకీయ పక్షం నుంచైనా తమను తాము కాపాడుకునేందుకు సమాజమం దంతటా నిరాటంకమైన సంబంధం గాఢంగా ఏర్పడింది. వ్యక్తిగతంగా ప్రతి ఒక్కరూ శక్తిహీనులే। ఐతే ఆ వ్యక్తి ఒకదళంలో లేదా సమాజంలో సభ్యుడుగాఉన్నప్పుడు శక్తివంతుడే అవుతాడు. సమాజాలు అనేకం ఉండి, వాటివాటి ఉద్దేశాలు వేరువేరుగా ఉండటంవల్ల ఒకదాన్నొకటి సరిదిద్దుకుంటూ సక్రమమార్గంలో సామాజిక జీవనం విలసిల్లేట్లు చేయగలుగుతూన్నవి. హాస్యాస్పదమూ, శక్తివంతమైన ప్రమాదకరంగా ఉండే కూక్లుక్స్‌క్లేన్‌లాటి వాటికి - వ్యతిరేకంగా ఒక వంద, వేయి సమాజాలు - నిర్మాణ కార్యక్రమాల్ని కొనసాగించేవి ఉన్నవి.

వృత్తులు చేసుకునే వారి తాలూకు సంఘాలు - కార్మిక సంఘం: వైద్య వృత్తిలో ఉన్నవారి సంఘం, కర్షక సంఘం మొదలైనవీ, వ్యాధుల్ని పార ద్రోలేందుకు లేదా విద్యావ్యాప్తి చేసేందుకు ఏర్పడిన పరోపకార సంఘాలూ, మతైక సమాజాలూ, జాతీయ సేవాదళాలూ. అనుభవాలను పంపిణీ చేసుకొనే 'డాటర్స్ ఆఫ్ దీ అమెరికన్ రివల్యూషన్' మొదలైనవీ, పురాతన సైనికుల సమాజాలూ, చిహ్నమాత్రంగా ఉండే మాసన్స్ మొదలైన సంఘాలూ, కులాసాకు ఏర్పడిన సమాజాలూ, మహిళా సమాజాలూ మొదలైనవి ఎన్నో ఉన్నవి.

పౌరులు శ్రద్ధ చూపేది - క్రీడలు, వృత్తులు, హాబీలూ మొదలైన వాటన్నిటికీ ప్రత్యేక సంఘాలు ఉంటూనే ఉన్నవి. ఒకానొక అమెరికన్ పట్టణంలోని పౌరుల్లో 41% మంది ఒక సమాజంలోనో లేదా పెక్కు సమాజాలలోనో సభ్యులుగా ఉన్నారని అంచనాలు వేయబడినవి; సామాజిక

అర్థికరంగాలలో పై స్థాయిలో ఉన్నవారు 72% దాకానూ, తక్కువ స్థితిలో తక్కువ సంపాదనలో ఉన్నవారు 22% దాకానూ సభ్యులుగా ఉన్నారు. ఒకేవ్యక్తి వివిధరంగాలలో పాల్గొనటంవల్ల - అందరివ్యక్తుల తాలూకు ఆయా పాత్రలన్నీ కలిసి ఎంతో గజిబిజిగా ఉండేవిధంగా రూపొందుతోంది.

సామాజిక కార్యక్రమాల్లో ఇరుక్కొని పోయినవారు - యీ కార్యక్రమాలు చాలా ఎక్కువగా ఉన్నవనీ, సమాజాలు అత్యధికంగా ఉన్నవనీ ఫిర్యాదు చేస్తున్నారు: వారు సరిగానే చెప్పారు. ఐతే కొన్ని సమాజాలు నిరుపయోగకరంగా ఉంటూన్నవనికానీ, హానికరంగా ఉంటూన్నవనికానీ చెప్పటం అర్థంలేనిమాట.

సమాజానికి అత్యంతోపయోగకరంగా ఉండే సంఘాలను స్థాపించి వాటిని సక్రమంగా నడపటమనే విషయంలో మహిళలు, పురుషుల్ని మించారు: ఎందుకంటే కష్టమైన ఇంటిపనుల్ని నిర్వహించటమేగాక, సమాజానికి అవసరమైన ధనసేకరణ, సేవలను అందించటమేగాక, వారి స్వంతసంఘాలనుకూడా ఏర్పరుచుకున్నారు. 'మెన్ వోటర్స్' లీగ్ కాదు కాని, 'లీగ్ ఆఫ్ వుమెన్ వోటర్స్' ఉన్నది; ఇది ప్రధాన సమస్యల విషయంలోని సత్యాలనూ, అంకెలనూ సేకరించి, ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉండేట్లుచేస్తూ, స్థానికంగానూ, జాతీయంగానూ ఎంతో సేవ చేస్తున్నది. ఇక జనరల్ ఫెడరేషన్ ఆఫ్ వుమెన్స్ క్లబ్స్ (వీటిల్లోని 15,000 క్లబ్‌లకు 11,000,000 మంది సభ్యులున్నారు) - ఉచిత గ్రంథాలయాలను స్థాపించటంలోనూ, బాలనేరస్థులకుగాను ప్రత్యేకమైన న్యాయస్థానాలను ఏర్పరచటంలోనూ, వయోజన విద్యావ్యాప్తి మొదలైన సంస్కరణలను అమలు జరపటంలోనూ ప్రముఖపాత్రలను తీసుకున్నవి. పల్లెలలోని 'హోమ్ డిమాన్‌స్ట్రేషన్ గ్రూప్స్' ప్రభుత్వ వ్యవసాయశాఖ సహాయంతో పనిచేస్తూంటవి. ఒకానొక ఫ్రెంచ్ మహిళ ఇలాటి సమాజాన్ని దర్శించి - అక్కడి మధ్యవయస్కులైన రైతు మహిళలు పుష్టికర

ఆహారం, పరదేశ రాజకీయ పథకాలూ, జాతీయ ప్రభుత్వవిధానం మున్నగు విషయాలను చర్చిస్తూండటం చూసి ఆశ్చర్యపోయింది.

## స్వచ్ఛంద సేవాతత్వం

స్వచ్ఛంద సేవాతత్వం ఇంత విరివిగా కనిపిస్తూండటంవల్ల అదెంతో ముఖ్యమైనదనే విషయం స్పష్టమౌతూన్నది. ఐతే ఇదంతా ఎక్కణ్ణుంచి వొచ్చింది ?

పిలిగ్రిమ్స్‌గా ప్రసిద్ధి కెక్కిన స్త్రీ పురుషులు 1607 లో ఇంగ్లండ్‌నుంచి, హాలెండ్‌కు పయనమైనప్పుడు తమకు "ఆ భగవానునితో ఒడంబడిక" జరిగినట్లే భావించి అందుకు కట్టుబడి ఉండాలని నిశ్చయించుకున్నారు. నిజమైన చర్చ్‌కి సంబంధించిన స్వచ్ఛంద సేవాదళం ఒకటి ఉండాలని వారు నమ్మారు - ఆ కాలంలో ఆంగ్లేయులు రాజుగారివలెనే విశ్వాసపాత్రులుగా ఉంటూ, చర్చ్ సర్వీస్‌కు తప్పనిసరిగా రావలసిఉన్నది. అలా రాని పక్షంలో కఠినశిక్షలకు పాత్రులయేవారు.

నెదర్‌లండ్స్ వొదిలి అమెరికా వెళ్లాలని వారు నిశ్చయించుకొని న్యూ ఇంగ్లండ్ తీరప్రదేశానికి జేరి, అక్కడ ప్రభుత్వంకానీ, ఆఫీసర్లుకానీ లేరని తెలుసుకోగానే - తిరిగి వారొక సమాజంగా ఏర్పడవలసిన పద్ధతి అవసరమైంది. తమను అట్లాంటిక్ మహాసముద్రం దాటించిన ఓడలోనే మేఫ్లవర్ ఒప్పందం జరిగి, కొన్నిచట్టాలు, తాము ఏర్పరుచుకొనే వాటికి బద్ధులై ఉండాలనే నిర్ణయం జరిగింది. అవసరం కలిగినప్పుడు వారొక గవర్నర్‌నూ, కొంతమంది ఆఫీసర్లనూ ఎన్నుకున్నారు. తమ జాతిని వొదిలి 3,000 మైళ్ళు వొచ్చికూడా తమను తాము చెప్పుకోదగినంత విజయవంతంగా పరిపాలించుకున్నారు. ఆధునిక ప్రజాస్వామికానికి యీ పద్ధతి సుదూరంగా ఉన్నది : ఎందుకంటే ఓటుచేసేహక్కు తాము అనుమతించిన వారికే ఉండేది. ఐనప్పటికీ, తమ వ్యవహారాలను వారు కౌశలంతోనూ, విజ్ఞానంతోనూ పరిష్కరించుకో గలిగారు.

ఈ విధంగా ఆ తొలిరోజులనుంచీ న్యూఇంగ్లండ్ లో స్థిరనివాసాలను ఏర్పరుచుకున్నవారు స్థానిక వ్యవహారాలను చూసుకుంటూ వొచ్చారు. కాని ప్రజల అవసరాలనేవి క్లిష్టంగా మారుతూ, పెరగ సాగాక తాము మొట్టమొదటిగా ఏర్పరుచుకొన్న సమాజాల్లాటివి అవసరమైనవి. మొదట్లో చర్చ్ సమాజాలు తలలెత్తినవి: ఎందుకనంటే వలసలు వొచ్చినవారు చర్చ్‌కి సంబంధించిన సంఘాలవారేకదా! ప్రసిద్ధి చెందిన థామస్ హూకర్ సమాజం మాసెచుసెట్స్‌నుంచి కనెక్టికట్ కు మారింది; ఇలాటివి చాలా సమూహాలు ఏర్పడినవి.

సరిహద్దుప్రాంతం విస్తరించసాగాక, అనేక కుటుంబాలు బతికేందుకూ, ఉచ్చస్థితిని అందుకునేందుకూ పశ్చిమానికి కదిలిపోవలసి వొచ్చింది; ఆ సమయంలో స్వచ్ఛంద సేవాదళాల అవసరం ఏర్పడి, అమెరికన్ జీవితంలో కేంద్రస్థానాన్ని ఆక్రమించి, యీ నాటికీ ఆ స్థానంలోనే ఉంటూన్నది. విపరీతంగా పెరిగిపోయిందనే అనుమానాన్ని రూపుమాపుతూ, తెలివిగా కదిలి ముందుకుసాగే ధోరణిని నిరూపిస్తూ, కొత్తకొత్త సంబంధాలను ఏర్పరుచుకునేందుకు సంసిద్ధమౌతూ ఈ స్వచ్ఛంద సేవాదళాలే - 'అమెరికన్' అనే పదానికి శోభనిస్తూన్నవి.

న్యూఇంగ్లండ్ లోని ఒక చిన్నపట్టణం లేదా అదే నమూనాలో నిర్మించబడింది. ప్రభుత్వంవల్లగాక స్వచ్ఛంద సేవాదళాల సహాయంతోనే నిర్వహించబడుతూన్నవని అనిపిస్తుంది. రాజకీయ వృక్షంనుంచి ఏరుకోవాల్సిన ఫలాలంటూ లేవు. పురుషులు వొంతుల ప్రకారం ఆఫీసుల్లో అనేక సందర్భాలలో ఉచితంగానే పనిచేస్తూ - పట్టణానికి సంబంధించిన వ్యవహారాలను చూస్తూ, అందుకు కృతజ్ఞతకన్న విమర్శల్నే అధికంగా అందుకుంటూ ఉంటారు. వ్యాపారులూ, వ్యవసాయదారులూ రాజకీయాలలో ప్రవేశించాలనే కుతూహలంతో నైతేనేమి, తమ స్థాయిని పెంపొందించుకొనే ఉద్దేశంతోనైతేనేమి, తమవిధుల్ని నిర్వర్తించాలనే బాధ్యతతో

నైతేనేమి ఇలాటి ప్రజాసంబంధ కార్యాలయాల్లోని ఉద్యోగాలను అంగీకరిస్తున్నారు.

ప్రభుత్వమనేది స్థానికమైనదిగానే ఆరంభమౌతోంది: అమెరికన్ ప్రవర్తనను విశదీకరించటంలో ఇది కేంద్రీకృతమైన సత్యమవటంవల్ల దీన్ని ఎన్నడూ విస్మరించరాదు.

అమెరికన్ చరిత్రలోని ప్రతి క్లిష్టసమస్యనూ స్వచ్ఛందసేవాదళాలే నిర్ణయిస్తూన్నవి. 1765 లో బ్రిటిష్ ప్రభుత్వం స్టాంప్‌యాక్ట్‌ను అమలుజరిపేందుకు ప్రయత్నిస్తే - వలస లన్నిటినుంచీ స్వచ్ఛంద సేవాదళాలు 'సన్స్ ఆఫ్ లిబర్టీ' అనే పేరుతో ముందుకు ఉరికి, ఇది అక్రమమైన సుంకమనీ, తమకు ప్రాతినిధ్యం లేకుండానే అమలు జరుపబడుతోంది కనుక ప్రతిఘటించటం తమ బాధ్యతఅనీ - దీన్ని పోరాడేందుకు సిద్ధపడ్డారు. అధికారంలోఉన్న అనేకమంది ఉన్నతోద్యోగుల తాలూకు బొమ్మలను తగలబెట్టటం, స్వాతంత్ర సూచకమైన స్తంభాలను ప్రతిష్ఠించటం, కొన్ని వృక్షాలను స్వాతంత్ర్యంకొరకై అంకిత మివ్వటమేగాక - స్టాంపుల్ని మంటపెట్టటం, స్టాంప్ మాస్టర్సును ఉద్యోగంలో ప్రవేశించకుండా చేయటం మొదలైన పనులు చేశారు. వీరికి ఉత్తర ప్రత్యుత్తరాలనూ, వార్తలనూ అందించే కమిటీ లుండటంవల్ల, వలసలన్నిటిలోని సమాజాలనూ కూడగట్టుకోగలిగిన అవకాశాలు ఏర్పడి, విప్లవంనాడు ఇలాటి కమిటీల ఆవశ్యకతా, వాటి అనుభవమూ ఎంతో ఉపకరించింది: జాన్ ఏడమ్స్ అన్నట్లుగా "ఈ కమిటీలే మొత్తం విప్లవాన్ని నడిపినవి". పదేళ్ళపాటు 'సన్స్ ఆఫ్ ది లిబర్టీ' - స్వాతంత్ర్యం మీది ప్రజాభిప్రాయాన్ని సేకరించటం, స్వాతంత్ర్యపత్రం ఏ భాషలో ఉండాలో నిర్ణయించటం, ఈ కమిటీలకూ, సమాజాలకూ అవసరమైన ఉద్విగ్నమైన సంస్కృతిని అందివ్వటం జరిగింది: ఇవన్నీ కలిసి స్వాతంత్ర్య పోరాటాన్ని విజయవంతం చేసినవి.

రెండో క్లిష్టసమస్య - బానిసల కందరకూ స్వాతంత్ర్యాన్ని సంపాయించటంకూడా అదే పద్ధతిలో నిర్వహించబడింది. బానిసత్వాన్ని రూపుమాపేందుకు కంకణం కట్టుకొన్న సమాజాలు - కార్యసాధనకు వొత్తిడి చేసినవి : వీటిల్లో ముఖ్యమైనదీ, చిత్రమైనదీ ఐన అండర్ గ్రౌండ్ రైల్ రోడ్ ఎసోసియేషన్ కార్యసాధనకు పూనుకొన్నది. అంతర్యుద్ధం ఆరంభమయేందుకు చాలా ముందుగానే - ఆ ఎసోసియేషన్ రహస్యంగానూ, చట్టబద్ధంగానూ అనేక వేలమంది బానిసలకు స్వాతంత్ర్యాన్ని సాధించి ఇచ్చింది.

ఇక స్త్రీల ఓటింగ్ హక్కులకొరకూ, సమానత్వంకొరకూ - చట్టబద్ధమైన పోరాటాన్ని యీ స్వచ్ఛంద సేవాదళాలే నిర్వహించినవి. 'లైసియమ్ మువ్‌మెంట్' అనే పేరున వెలువడిన స్వచ్ఛంద సేవాదళం వయోజన విద్యకొరకు పాటుబడింది : ఆ తరువాత పబ్లిక్ స్కూల్ సిస్టమ్‌లో ఎంతో అభివృద్ధి తేబడింది. ఇదే విధానంలో లేబర్ మువ్‌మెంట్‌కూడా నడపబడి, వర్థిల్లే జాతి తాలూకు భాగ్యంలో కార్మిక కర్షకులకూ్కడా భాగం సాధించబడింది.

రాజకీయంగానూ, సామాజికంగానూ సాధించబడిన యీ విజయాల తాలూకు రుజూలు - స్వచ్ఛంద సేవాదళాలను సాధనంగా ఉపయోగించటమనే విధానాన్ని బలపరిచినవి : పారిశ్రామికంగా నాగరికతను పెంపొందించుకునే జాతీయతలో స్వచ్ఛంద సేవాదళాలను ఉపయోగించటం బాగా ఉపకరించగలదనీ, క్లిష్టసమస్యల పరిష్కారమార్గంగా ఉండగలదనీ నమ్మబడింది.

మతైక, నైతిక పునాదులు ప్రముఖపాత్రలను వహించినవి. మహిళలు సరిసమాన హక్కులకొరకు, లేదా మద్యపాన నిషేధం కొరకు, లేదా మంచి గృహాలు, మంచి తోటల కొరకు పోరాడినప్పుడు వారు అనుసరించవలసిన నైతిక పద్ధతుల్ని విస్మరించలేదు. కార్మికులూ, కర్షకులూ తమకు

జాతీయ సౌభాగ్యంలో అధికపాలున్నదనీ, ఇది నైతికమైన హక్కనీ నమ్మారు.

నైతిక విలువల్ని నిర్ణయించటంలో క్రైస్తవమత ప్రాధాన్యతను గమనించటమనేది అమెరికన్ పద్ధతిగా ఉంటూండటంవల్ల, నిజం చెప్పాలంటే ప్రభుత్వమే మతానికి సంబంధించినదిగా భావించబడుతోంది. ప్రజలందరూ ఆ సృష్టికర్త చేత తయారు చేయబడినవారు కనుక, వారికి కొన్ని ప్రాథమిక హక్కులున్నవి - అని స్వాతంత్ర్యపత్రంలో పేర్కొనబడింది. ఈ హక్కులకు ప్రధానకర్త భగవంతుడే కావటంవల్ల-అమెరికన్‌లు మతైకంగానూ, రాజకీయంగానూ యీ హక్కులను కాపాడుకోవలసిన బాధ్యతల్ని కలిగి ఉన్నారు. ఆ తరువాతి కొద్ది చరిత్రలోనూ - రాజకీయ, మతైక స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఒకదానిలో మరొకటి మిళితమై పోవటాన్ని అమెరికన్‌లు గమనించారు : తమకు నచ్చిన విధానంలో పూజాపునస్కారాలూ, ప్రార్థనలూ జరిపే నిమిత్తం వారు ప్రత్యేకమైన సమాజాలను ఏర్పరుచుకోవటం జరిగినవి.

పూజా విధానంలోని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అంటే - పరిపాలనలోని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలే నన్నమాట : అదేవిధంగా, పరిపాలనలోని స్వేచ్ఛాస్వాతంత్ర్యాల అర్థం పూజావిధానం వరకూ కొనసాగుతుంది. పౌరబాధ్యతల్ని నిర్వహించని పౌరుడు, తన నైతికబాధ్యతల్ని విడనాడినట్లే భావించబడుతోంది. ఇందుకు విరుద్ధంగా తన పౌరబాధ్యతల్ని నిర్వహించే పౌరునికి గౌరవ ప్రతిష్ఠలు పెంపొందుతూన్నవి. సమాజానికి సంబంధించిన సమస్యల్లో జోక్యం కలిగించుకోవటం, వాటి పరిష్కారమార్గాలను ఆలోచించి, బాధ్యత వహించటం నైతిక విలువగా భావించబడుతోంది.

చిత్రమేమంటే - ఒకపక్క రాజకీయాలూ, మతమూ మిళితమై ఉన్నప్పటికీ, మరొకవైపు బలవత్తరమైన నిశ్చయం - చర్చిని ప్రభుత్వంనుంచి వేరుపరిచే ఉంచింది. నాయకులకు మతవిశ్వాసాలు ఉండాలి - అంటే

సృష్టికర్తయిన ఈశ్వరునిచే సృష్టింపబడిన మానవులందరూ సరిసమానులే నసీ, వారి నైతిక చట్టాలే యీ పృథ్విని పరిపాలిస్తున్నవనే గాఢవిశ్వాసం ఉండాలి; ఐతే చర్చికి సంబంధించిన విషయాలను విడిగా ఉంచాలని అమెరికన్‌ల ఆకాంక్ష. ఇక్కడే వివిధ విషయాలకు సంబంధించిన వివిధ విభాగాలు ఏర్పడే అమెరికన్ పద్ధతి చూడననవుతుంది; ఆ యా అవసరా లనుబట్టి వేరువేరు సమాజాలూ, ఎసోసియేషన్స్ అవసరమౌతూన్నవి. కొత్తసమస్యలు - ఉదాహరణకు పసిపిల్లల్లో వొచ్చే పక్షవాతం, లేదా స్వాభావిక సౌభాగ్యమైన గనులు మొదలైనవి వృథాకావటం, లేదా మంచి అభిరుచులున్న సంగీతాన్ని ప్రజలకు అందించటం - మొదలైనవి ఎదురైనప్పుడు, వీటిని పరిష్కరించేందుకు ఒకో కొత్త ఎసోసియేషన్ అవసరమౌతూన్నది. ప్రతిఒక్కరూ ఇలాటి అనేకసమాజాల్ని సభ్యత్వాన్ని స్వీకరిస్తూ, కమిటీలలో సభ్యులుగా ఉండి అవసరమైన ఆర్థిక సహాయాన్ని కూడదీస్తున్నారు. అత్యంత క్లిష్టసమస్యలతో నిండిఉన్న యీ ప్రపంచంలో- అమెరికన్‌లు అనేక ఎసోసియేషన్‌లలో సభ్యులుగా ఉంటూ, ముఖాముఖీ ఆయా సమస్యల్ని పరిష్కరించేందుకు ప్రయత్నిస్తూ, సామాజికమైన ఉత్సాహాన్నీ, బాధ్యతల్నీ నిర్వహించటం జరుగుతోంది.

## మతం

ప్రపంచంలో అమెరికాలోతప్ప వేరెక్కడా మతం బలవత్తరమైన స్వభావం గలదిగా ప్రదర్శన లివ్వలేదు: ఏ ఆధునాతనరాష్ట్రంలోకూడా మతం ఇంత గొప్పపాత్ర వహించి ఉండలేదు. అమెరికాలో వివిధ పూజావిధానాలను అనుసరించే సమాజాలు 250 కి పైగాఉన్నవి ; వీటిల్లో కొన్నిట్లో సభ్యులు మిలియన్లలో ఉన్నారు; మరికొన్నిట్లో బహుకొద్దిమంది మాత్రమే ఉన్నారు. కొంతమంది- 'యునిటేరియన్స్' పద్ధతికి సంబంధించినవారు మేధావులూ; మరికొంతమంది తమ గాఢ విశ్వాసాన్ని ప్రదర్శించేందుకు కేకలువేస్తూ, శరీరం అలిసిపొయ్యేట్లుగా దాన్ని అష్టవంకర్లూ తిప్పేవారూ ఉన్నారు,

ఇలాటి విశ్వాసాలు గలవారందరూ చర్చిలో సభ్యులుగా ఉంటూ మొత్తం మీద దాదాపు 10 కోట్లమంది ఉన్నారు. అమెరికన్ చరిత్రయంతంతటా చర్చి సభ్యత్వం క్రమంగా పెరుగుదలనే సూచిస్తోంది: ఇటీవలి కాలంనుంచీ పూర్వమెన్నడూ ఎరుగనంత అభివృద్ధి కనిపిస్తోంది. 1950 - 1954 మధ్య చర్చికివెళ్ళే జనంలో 90 లక్షల పెరుగుదల గమనించబడింది.

మతైకవిశ్వాసాలూ, అనుసరణపద్ధతులూ అభివృద్ధిచెందటం సమాజానికే కొత్తశోభలనిస్తూ, వివిధమతాలపట్ల సహనాన్ని సమకూరుస్తోంది. ఇలాటి వివిధపద్ధతులు ఆచరణలో ఉన్నచోట్ల ఆధ్యాత్మిక విభేదాల ప్రాధాన్యత తగ్గటం ఒక చిత్రం. వివిధమతాచారాలనూ, ఆయా ప్రజావిధానాలనూ పరిహసించే జోక్స్ ఎన్నో ఉంటూ, ఆయావిభేదాలను హాస్యంలో మిళితం చేసి విస్మరించేట్లు చేయగలుగుతూన్నవి. ఎప్పుడన్నా యీవిభేదం వెర్రి తలలువేయటం జరుగుతే - ఒక మతైకశాఖ రాజకీయంగా ప్రాముఖ్యతను పొందుతుందేమోననే భయంతో ఆధ్యాత్మిక విభేదం పెంపొందకుండా జాగ్రత వహించబడుతోంది.

దాదాపు 7 కోట్లమంది అమెరికన్లు ఏచర్చికీ సంబంధం లేకుండా ఉన్నారు. యూరప్‌లోవలె - వీరికీ, చర్చికి సంబంధించిన ఇతర శాఖలకూ మధ్య విభేదమనేది లేదు. వీరిలో చాలామంది ఒకప్పుడు సభ్యులుగా ఉంటూ, ఉత్తరోత్రా ఆసభ్యత్వాన్ని వొదులుకున్నారు. చాలామంది పెద్ద పెద్ద పట్టణాల్లో నివశిస్తూ, తేలిగ్గానిర్వహించబడే సమాజాల్లో లేకుండటం జరుగుతోంది. మరికొంతమంది- బోధనలనూ, పూజావిధానాలనూ ప్రతి ఘటిస్తూ చర్చి నిజస్వరూపాన్ని మరుగుపరిచేదిగా భావిస్తున్నారు. ఇంకొంత మంది- శాస్త్రీయ విజ్ఞానానికీ, మతానికీ పొత్తు కుదరదనే అభిప్రాయంలో ఉన్నారు; ఐతే యీఅభిప్రాయంపట్ల శాస్త్రవేత్తలమధ్యనే భేదాభిప్రాయా లున్నవి. ఇంకొందరు - ముక్తికి ఎన్నో రాజమార్గాలుండటంవల్ల, ఏ మార్గాన్ని ఎన్నుకోవటమో, ఏదిసరైనదో గ్రహించటం కష్టమనే భావంలో

ఉన్నారు. మరికొందరు తమ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించేందుకుగాను, ఎందు లోనూ జేరక విడిగా ఉండటం జరిగింది; ఐతే ఇది అమెరికన్ ప్రజాస్వామ్యాన్ని అపార్థంచేసుకోవటమే అని చెప్పేందుకు విచారపడవలసి వొస్తోంది. ఎక్కువమంది నిర్లక్ష్యభావంతో- అటు శతృత్వమూ చూపక, ఇటు మిత్రత్వమూ ప్రదర్శించక - చివరకు యీవిషయాన్నిగూర్చి ఆలోచించక, తాము ఎందులోనూ కల్పించుకోకుండా ఉండటమే ఉత్తమ మార్గంగా భావిస్తున్నారు.

జాతీయ ఐక్యతతో- మతం సంఘర్షించకుండా చూడటమనేది ప్రధాన విషయంకనుక - అనేక విశ్వాసాలకు కూడలి అవసరమైంది; అంతేకాని మతం ఆయా వివిధ విశ్వాసాల కారణంగా జాతీయతను ఛిన్నభిన్నాలు చేయకూడ దనేది అమెరికన్ పద్ధతుల్లో అనుసరించబడింది. "మానవుని భ్రాతృత్వం- భగవంతుని పితృత్వం" అనే నినాదాన్ని అన్ని గాఢవిశ్వాసాలూ గుర్తించి, గౌరవిస్తూన్నవి. అమెరికన్‌లు ఆధ్యాత్మిక విషయాల మీది భేదాభిప్రాయాలను చర్చించేందుకు కలిసికట్టుగా తయారై ఫలితంగా విడిపోవటం జరుగుతోంది. అమెరికన్ చరిత్ర తిరగేస్తే (మొదటి 13 సంవత్సరాలూ విడివిడి వలసలుగా ఉండి, ఆతరువాత అంతర్యుద్ధంతో జాతి విచ్ఛిన్నమైనది) - మామూలుపద్ధతి, తత్వం ఇదే ననేది స్పష్టమౌతుంది.

దీని ఫలితంగా యాత్రీకులు - అమెరికన్‌లు తెలివిగలవారు కాదనీ, ఆలోచనా రహితులనీ భావించటం జరుగుతోంది నిజమేమిటంటే - అన్ని అభిప్రాయాలనూ, మతాలనూ, సంస్కృతులనూ కూడగట్టి, సారం పిండి, ఏకంచేయటానికి విశ్వప్రయత్నాలు జరపటంలో- చిన్నచిన్న తగవులూ, అభిప్రాయభేదాలను గూర్చి పట్టించుకోకుండటం జరిగింది. ప్రార్థనసమయంలో ద్రాక్షాసవం రక్తమౌతుందనేది ముఖ్యమా? లేక భగవంతుని సృష్టిలో మానవులందరూ సోదరులనేది ముఖ్యమా? ఎంతచెడినా - చర్చికి

వొచ్చేజనం కేవలం మతాభిమానంతోనే రావటం, అదికూడా సామాజికపు కట్టుబాట్ల వొత్తిడివల్లా లేదా సామాజికంగా ఉండే అనుకూలతల్ని విని యోగించుకునేందుకే జరుగుతోంది; అంతేకాని, వారికి నిజమైన మతావేశ మనేది లేకపోవచ్చు.

ప్రతివిషయంలోవలెనే మతవిషయంలోకూడా అమెరికన్-ఫలితాలను చూడాలని కోరుతాడు. మతం - మనుషుల్ని మంచివాళ్ళనుచేసి, వారిచేత మంచిపనులు చేయించి, మంచి ఆలోచనలూ, మంచిప్రవర్తనల్ని వారిలో కలిగించ గలుగుతే, అప్పుడది బలపరచవగిందే! మతం - నైతికస్థాయిని పెంచి, శాంతిని నెలకొల్పి, చివరకు వ్యక్తిగత విజయానికైనా ఉపకరిస్తే చాలు; మతం యీపనులన్నిటినీ చేస్తూనే ఉన్నది.

చర్చికి వెళ్ళిన దంపతులు శాంతియుత జీవితాన్ని గడిపేందుకు ఎక్కువ అవకాశాల్ని కలిగిఉంటున్నారని అంచనాలలో తేలింది. మతవిశ్వాసాలు లేనిదంపతుల్లో, ఆ విశ్వాసాలున్న వారిలోకన్న మూడురెట్లు దాంపత్య విచ్ఛే దాలు జరగటం లేదా దాంపత్య జీవితంలో అపజయం ఎదురవటం జరుగు తోంది.

చర్చ్‌లనుంచే సమాజ సంస్కరణ ఉద్భవించింది. ఇతర కారణాలు ఉన్నప్పటికీ- సామాజికమైన సువార్తలే - స్థిరనివాసాలు ఏర్పడేందుకూ, సామాజికమైన అంచనాలను సేకరించి, ఆయా సామాజిక సేవావిధానాలను వృత్తులుగా నిర్ణయించేందుకూ, దోహదం చేసినవి. ఏదో పైపైన చూసే పరిశీలకునికి- తూర్పు హార్‌లెమ్, న్యూయార్క్ మొదలైన తావుల్లోని బ్రహ్మాండమైన ఆరోగ్య కేంద్రాలలో మతంతాలూకు ఎలాటిఛాయా కని పించదు; ఈ కేంద్రాలు లక్షమందికి శిక్షణ, వ్యాధినిర్ణయం, వ్యాధిబారి పడ కుండటం, ఆరోగ్య సమస్యలపట్ల జాగ్రతలు వహించటం మొదలైనవాటిని అందిస్తూ, 23 ఏజెన్సీలతో కలిసికట్టుగా పనిచేస్తున్న ప్రణాళికల్ని అమలు జరుపుతూన్నవి. ఐతే మానవత్వపు విలువలు స్పష్టమౌతూన్నవి; వ్యాధి

గ్రస్థతను పారద్రోలి ఆరోగ్యవంతమైన మానవజీవితాలు సమాజానికి అంకితమివ్వబడటంలోని నైతిక విలువ గమనించదగింది. యునైటెడ్ స్టేట్స్‌లో- మతమనేదానిపట్ల ప్రజల దృక్పథం ఆధ్యాత్మికమైనదిమాత్రమే కాదు; దాని తాలూకు రుజూలు వైతికవిలువల్లో చూడనవుతవి.

కార్యసాధన పథకంలో మానవుడు తనస్థితిని పైస్థాయికి జరపగలడే కాని, అమరుడు కావటమనేది అసంభవం. వ్యక్తిపరంగానూ, సామాజిక పరంగానూ మానవత్వపు పరిపూర్ణతను అందుకోవటం అత్యవసరమనే విషయాన్ని చర్చి నొక్కి వక్కాణిస్తూ, అలాటి ప్రణాళికల్నే మానవాళి శ్రేయస్సుకొరకు అమలుజరుపమని ఆదేశిస్తూ ఉన్నది.

## యునైటెడ్‌స్టేట్స్‌లో తరగతులంటూ ఉన్నవా ?

ఈ ప్రశ్నకు ప్రతిసామాజికశాస్త్రవేత్తా తనధోరణిలో జవాబు చెప్పేట్లుగా తోస్తుంది. అమెరికన్ విధానాన్ని తరగతులవారీ విభజన లేకుండానే వర్ణించటం సాధ్యమనీ- నిజానికి అలాటి తరగతులనేవి లేవనీ మార్గరెట్ మీడ్ అంటుంది. యాంకీసిటీనిగూర్చి తీవ్రంగా పరిశీలించిన లాయిడ్ వార్నర్, పాల్‌లక్టలు ఆరుతరగతుల్ని పేర్కొన్నారు- చాలాచాలా పై స్థాయినుంచీ, చాలాచాలా క్రిందిస్థాయివరకూ విభజించి, ఏడువిషయాలు- కుటుంబం, జట్టు, స్నేహబృందం, ఆర్థికస్థోమత, విద్యావ్యాసంగం, మత విశ్వాసాలు, రాజకీయ దృక్పథం మొదలైనవాటి కలయికలను అనుసరించి సమాజంలోని ప్రజలను 89 మెట్లుగా పేర్కొన్నారు. ఐతే వీటిల్లోని ప్రతి తరగతీ - ఆరు పెద్దతరగతుల్లోనూ దేనికో ఒకదానికి చెందుతుంది. వీటి మధ్య గోడపెట్టినట్లు విభజనలేదు; ఆయా తరగతులు అటు పైకికానీ, ఇటు కిందికికానీ జరుగుతూనే ఉంటవి. ఇదంతాచూస్తే అమెరికన్ సమాజంలో సుడులుతిరిగిన మెట్లులాటివి ఉండి, సామాజికులందరూ వాటిమీద అటు ఇటు నడవటం జరుగుతూనే ఉన్నదనటం సమంజసం.

మధ్యతరగతిలోని పైస్థాయివారు నిశ్చలమైన పౌరులుగానూ, సమాజంలో కార్యసాధనలో నాయకులుగానూ ఉంటున్నారు. వీరిపైన కొద్ది మంది ధనవంతులు, లేదా గొప్పస్థానాల్లో ఉన్నవారు ఉండి, మంచిపనులు తమ పేళ్ళమీద జరిగేందుకుగాను తగిన ఆర్థికసహాయాన్ని చేస్తారేకాని, వారు ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకొని కలిసిపోరు. వీరికింద-సామాజిక జీవనంలో తగిన పాత్ర ధరించని, జోక్యం కలిగించుకోని, ఎక్కువకాలం నిరుద్యోగంలో ఉంటూ, చట్టాన్ని అతిక్రమిస్తూ, శిథిలగృహాలలో ఉంటూ, అమాయకత్వంలో, కుటుంబజీవితానికి అనర్హులుగా ఉండే తరగతులవారీ జనం ఉన్నారు. ఇలాటి అసమర్థతలు చికాకుపరచటంవల్ల, ఒకరికొకరికి పడక యీవ్యత్యాసం పెరిగి తరగతిలోని జనాభా మరింతగా విడివడటం జరుగుతోంది. చర్చిలోనూ, పాఠశాలల్లోనూ నామకః సమానత్వ మనేది ఉన్నప్పటికీ- పైతరగతులవారు, కిందితరగతులవారిని ప్రతిఘటించటం జరుగుతూనేఉన్నది. తక్కువ వసతులున్న విద్యార్థులు- తమ కుటుంబాలు మచ్చబడినవని త్వరలోనే తెలుసుకొని, ఆమచ్చ తమభాగంగా తమక్కూడా దాపరించిందని భావిస్తున్నారు. ఇలాటి పరిస్థితుల్లో వారి ఆలోచనలు వార్ని బాలనేరస్థులుగా చేస్తున్నవి.

ప్రజాస్వామ్యం సరిగ్గా పనిచేసేందుకు సామాజికంగా సమానత్వమూ, స్థాయీ ముఖ్యమైనవే; అమెరికన్ ఆదర్శాలు యాంత్రికంగా సమానత్వాన్ని వెదజల్లినవి. ఐనప్పటికీ తరగతీ, స్థాయీ మొదలైనవి పై అంతస్తులను అందుకునేందుకు ప్రోత్సహిస్తవి. అమెరికన్‌ల కలలలోని రెండు ముఖ్య ప్రాథమిక సత్యాలకూ ఒక సమన్వయం ఉన్నది; అందుకనే అబ్రహాం లింకన్ కడు బీదవాడుగాపుట్టినా జాతికంతకూ గొప్పస్థానం - యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్ అయ్యారు!

చాలావివాహాలు సామాజికంగా సమానస్థాయిలో ఉన్నవారిమధ్య జరుగుతూన్నప్పటికీ, తగినన్ని దాంపత్యాలు అసమానులమధ్యకూడా జరుగు

తూండటంవల్ల సామాజికంగా కదలిక ఉంటూన్నది. పరిశీలనల్లో తేలిన విషయమిది: చిన్నచిన్న వ్యాపారస్థుల్లో దాదాపు సగంమంది, అధిక ఆదాయాలున్న కుటుంబాలతో వివాహ సంబంధాలు చేసుకున్నారు; ఐతే 40% మంది దినభత్యం సంపాయించుకునేవారి కుటుంబాలలోని వనితల్ని పెళ్ళాడారు. యువతీ యువకులు స్వేచ్ఛగా తిరుగుతూండటంవల్ల వివాహ నిశ్చితార్థాలు జరుగుతూ, ఒక కుటుంబానికీ, మరొక కుటుంబానికీ మధ్య ఉండే స్థాయీభేదాన్ని తెలుసుకునేందుకు ఆధారపడదగిన అవకాశాలు లేకుండా ఉన్నవి.

తరగతులవారీ మానవులమధ్య ఉండే భేదాన్ని తగ్గించేందుకు, లేదా తుడిచివేసేందుకున్న పలుకుబడులలో కొన్ని యీక్రింద పేర్కొనబడినవి:

తక్కువ ఆదాయాలున్న మనుషులు పౌర లేదా సామాజిక సేవా తత్పరతలో ముఖ్యపాత్రల్ని వహించటంద్వారా, ఆ తక్కువతనం పూరించబడుతోంది.

పెద్దపెద్ద పట్టణాల్లో, ఎల్లప్పుడూ ఉండే కదలికే కలిసి ఒక వ్యక్తి తాలూకు అంతస్థును సరిగ్గా అంచనావేయటం అసంభవ మనిపిస్తున్నవి.

బేస్‌బాల్ ఆటగాళ్ళూ, కార్మికనాయకులూ, బహుమతులకోసం పాటుబడి పోరాడేవారూ, వినోదాలను సమకూర్చేవారూ- ఇలాటివారి కివ్వబడే అత్యధిక వేతనాలవల్ల- సమాజం కేవలం మంచికుటుంబంలో పుట్టినవారినీ, ధనవంతులనూ, ఉన్నతవిద్యను అభ్యసించినవారినీమాత్రమే సత్కరించటం లేదనేవిషయం తేటతెల్లమౌతున్నది.

దుస్తుల ధారణా, మాట్లాడేవిధానం, అనుభవించే వినోదాలూ, ప్రవర్తన పద్ధతులూ మొదలైనవి అందరు అమెరికన్లసట్లా ఒకేవిధంగా ఉంటూన్నవి.

సరిసమానహక్కులు అనేకరంగాలలో ఉన్నవి- విద్యాభ్యాసం, వినోద కార్యకలాపాలు, ఓట్లు, మిలటరీ సర్వీస్, జ్యూరీబాధ్యతలు, ప్రభుత్వోద్యోగాలకు ప్రయత్నించటం, చట్టం, పోలీసు రక్షణ మొదలైనవి.

ఈ కారణాలన్నిటిపల్లా-మార్క్సు పేర్కొన్న తరగతుల మధ్య ఉండే పోరాటమనేదే అసలు లేదు. కార్మికులు తమ యజమానులపట్లా, యాజమాన్యంపట్లా ప్రతిఘటనాభావాన్ని కలిగివుండొచ్చు: వృత్తినిర్వహణలో తాను అంతకన్నా పై స్థానానికి వెళ్ళే అవకాశాలు లేనప్పుడు వారికి బాధ కలగవొచ్చు. బీదరికంతో బాధపడటం, నిరుద్యోగం, చేసేపనిలో ఆనందం లేకుండటం, నిశ్చలమైన సంసార జీవనం లేకుండటం మొదలైనవి సామాజిక చిత్రణలోని భాగాలు; ఐతే అవకాశాలకూ, సానుకూలతలకూ ఎన్నో భేదాలు ఉంటూనేఉన్నవి. కాని విశిష్టమైన తరగతులంటూ మాత్రం లేవు.

అమెరికన్ సమాజం నీగ్రోల విషయంలో సరిసమాన అవకాశాన్ని కలిగించటంలో మాత్రం అపజయాన్ని పొందింది. వీరిని నిరాదరిస్తూ, తమ జాతే బానిసలుగా వీరిని ఆఫ్రికాలో అమ్మటంనుంచీ, జిమ్ క్రోవిజమ్ దక్షిణభాగాన గొడవచేసి నీగ్రోలకు ద్వితీయస్థాన పౌరసత్వాన్ని సాధించటం వరకూ జరిగిన కథంతా ప్రపంచమంతటికీ తెలిసిందే। ఐతే ఇటీవల జరిగిన అభివృద్ధులను గూర్చి ప్రపంచానికి అంతగా తెలియదు. ఉదాహరణకు:

1860 లో నీగ్రోల్లో నిరాక్షరాస్యులు 97% ఉంటే, 1952 లో 10% కన్న తక్కువ ఉన్నారు.

అన్ని జర్మన్ విశ్వవిద్యాలయాల్లోనూ ఉన్న జర్మన్‌లకన్న, యునైటెడ్ స్టేట్స్ కాలేజీలలో ఎక్కువమంది నీగ్రోలు (128,000 మంది) ఉన్నారు.

రష్యాలోని 216,000,000 మంది రష్యన్‌లకన్నా, ఆఫ్రికాలోని 193,000,000 మంది నీగ్రోలకన్నా - యునైటెడ్‌స్టేట్స్‌లోని నీగ్రోలకు స్వంత స్వశక్తి చోదితవాహనాలు అధికంగా ఉన్నవి.

సాయుధ దళాలలో నీగ్రోలు జేరటం అధికమైంది.

1940 నుంచీ నీగ్రోల వేతనాలు 4 రెట్లు పెరుగుతే, శ్వేతజాతీయుల వేతనాలు $2\frac{1}{2}$ రెట్లు మాత్రమే పెరిగినవి.

1930 నుంచీ కాలేజీలలో జేరిన నీగ్రోలసంఖ్య 25.00% అధికంగా ఉన్నది. 1900 నుంచీ ఉన్నత విద్యాభ్యాసంలో నీగ్రోల సంఖ్య శ్వేత జాతీయుల సంఖ్యకన్నా ఆరురెట్ల వేగంతో పెరిగింది.

పబ్లిక్ స్కూల్స్‌లోనూ, ప్రజాసౌకర్యార్థం ఏర్పడిన తావుల్లోనూ - నీగ్రోలకు విడిగాచేసిన ఏర్పాట్లను తొలగించాలని సుప్రీంకోర్టు ఆజ్ఞల్ని జారీచేసింది.

దాదాపు 200,000 మంది నీగ్రోలకు స్వంతక్షేత్రాలు సరాసరిన 70.89 ఎకరాల వరకూ ఉండేవి ఉన్నవి.

1900లో నీగ్రోలలో సుమారు 1% మంది మాత్రమే పరిశ్రమల్లో ఉన్నారు. ఇప్పటి అంచనా 30% కు పైగా ఉన్నది - అంటే 1,500,000 మంది కార్మికులున్నారు. జాతీయ యూనియన్‌లలోని 16,000,000 మంది సభ్యులలోనూ 1,250,000 మంది నీగ్రో సభ్యులున్నారు.

పన్నులపైన ఆధారపడిన 93 సిటీ కమీషన్‌లూ, 345 అర్థాధికార సంస్థలూ, జాతుల మధ్యఉండే సంబంధాన్ని పెంపొందించేందుకు ప్రయత్నిస్తూన్నవి.

దక్షిణదేశంలోని నీగ్రోలు, శ్వేతజాతీయుల ఓట్లతో ఎన్నికై సిటీ కౌన్సిల్స్‌లో సభ్యులయ్యారు. వారు శాసనసభల్లోనూ, కాంగ్రెస్‌లోనూ సభ్యత్వాలను సంపాయించారు. రాల్ఫ్‌బంచ్ యునైటెడ్ నేషన్స్‌లో అండర్ సెక్రటరీగా ఉన్నారు. డిపార్ట్‌మెంట్‌స్టోర్సు, టెలిఫోన్ కంపెనీ, ఫెడరల్ ప్రభుత్వమూ - ఇంకా అనేక సంస్థలు విభేదాలను చూపకుండా నీగ్రోలకు ఉద్యోగాల నిస్తూన్నవి. మేరియన్ ఏండర్‌సన్, లూయీ ఆంమ్‌స్ట్రాంగ్ మొదలైన కళాకారులు జాతీయ జీవనానికి శోభను సమకూర్చుతూ, ప్రపంచ ప్రసిద్ధిని సాధించారు. ఏ జాతీయ రాజకీయపార్టీ కూడా నీగ్రోలను విస్మరించి అధికారంలో నిలవలేదు.

దురభిమానమనే వ్యాధి, అంతటా వ్యాపించి ఉన్నది; దీని పునాదులు మానవుని తొలిదశవరకూ ఉన్నవి: ఆ రోజుల్లో కొత్త వ్యక్తులు అంటు

వ్యాధుల్లాటివారనీ. వారిని చేరనివ్వటం సామాజిక జీవనానికి ప్రమాదకరమనీ భావించేవారు. ఇలాటి అనేక మంది కొత్తమనుష్యుల్ని కూడగట్టి అమెరికా నిర్మాణం జరిగింది. ఐతే కొంతమంది వ్యక్తుల ఆశయాలు ఫలించక, తమకు తగిన విజయం, కీర్తిప్రతిష్ఠలు, స్నేహాలూ లభ్యమవలేదనే నెపంమీద, ఇదంతా జాతివైషమ్యమని అనటం అసమంజసం.

ఈ ప్రాపంచిక మనస్తత్వానికి నీగ్రో ఎరయ్యాడు. ఐతే ఇటీవల యంత్రాల ఐశ్వర్యం, ఫాక్టరీలోని ప్రజాస్వామ్యాలవల్ల ఆతనికి మేలు కలిగింది. లక్షలాది నీగ్రోలు రెండు ప్రపంచయుద్ధ సమయాలలోనూ, ఆ తరువాత కూడా ఉత్తరదిశకు నివాసాలను మార్చుకోవటంతో (1910–1945 సంవత్సరాల మధ్య ఇలా వెళ్ళినవారు 30 లక్షల మంది) ఇది సాధ్యమైంది. దక్షిణాన పరిశ్రమలు ఉన్నప్పటికీ, అవి తగినంత వేగంగా అభివృద్ధి కానందువల్ల ఆయాఫలితాలకు కట్టబడకుండా తప్పించుకోవటం కుదరదు.

ఇప్పటికీ, దక్షిణాన కొంతమంది నీగ్రోలు, శ్వేతజాతీయులకన్న ఉన్నత పదవుల్లో ఉన్నారు. జాతివిభేదాలలోని ముఖ్యమైన భాగాలలో ఒకటి – నీగ్రోలలో పై మధ్యతరగతి ఒకటి ఉద్భవించటం; విద్యాసంస్కారముండి, ధనవంతుడైన ఇలాటి నీగ్రోనుచూస్తే – నీగ్రో అమాయకుడూ, ఆశయాలులేనివాడూ అనే అభిప్రాయం తుడిచిపెట్టుకుని పోతుంది; పురాతనపుటభిప్రాయాలను పటాపంచలుచేసి, సరిసమానహక్కుల కొరకై చేసే పోరాటంలో నాయకత్వాన్ని వహించగల సామర్థ్యం అతనిలో స్పష్టంగా కనిపిస్తుంది.

## మంచి సమాజం

ప్రభుత్వమూ, చట్టమూ సమాజపరంగా ఎలా ఉన్నదీ చర్చించేందుకు ఎక్కువ తావులేదు. స్వచ్ఛంద సేవాదళాల సేవనుగూర్చి, వారు స్థానిక

ప్రభుత్వంలో తగినపాత్రలను నిర్వహించి ఉచితంగానో, లేక కొద్దివేత నానికో పనిచేయటాన్నిగూర్చి ఇంతకు క్రితమే చర్చించాము. ఉన్న అధి కారమంతా ఒకే వ్యక్తికి అప్పగించబడకుండా, నిర్ణయాలను ఒక బోర్డ్ చేయటం – న్యూ ఇంగ్లండులో ఐతే సమాజమే నిర్ణయాలను చేయటం జరుగుతోంది. ఇందువల్ల ఒక వ్యక్తి మహోన్నతాధికారి కావటానికి ఆస్కారం లేదు: అధికారం పంపిణీ జరగటంవల్ల సాధారణ పౌరులు వృత్తిచేసుకుంటూ, తమ కొద్ది విరామవేళల్లోనూ సామాజిక సేవ చేసుకునే సావకాశాలు ఏర్పడుతూన్నవి. సామాన్యంగా ఏ 25,000 జనాభాయో ఉన్న పట్టణం మేయర్‌గారు, ఆ ఉద్యోగాన్ని తీరికవేళల్లోనే నిర్వహిస్తాం టారు. మామూలు పనివేళల్లో ఆయన్ను చూడాలంటే ఆయన పనిచేసే ఏ డ్రగ్‌స్టోర్స్‌లోనో, లేదా ఇన్సూరెన్స్ ఆఫీసులోనో కలుసుకోవలసి ఉంటుంది.

దాదాపు 117,000 స్థానిక ప్రభుత్వాలున్నవి; వీటిల్లో సగానికి పైగా స్కూల్ జిల్లాలలో ఉంటున్నవంటే – స్వపరిపాలనకు ప్రజలు ఎలాటి స్థానాన్నిచ్చారో స్పష్టమౌతుంది.

ఏ 5,000 జనాభాయోఉన్న చాలా సమాజాల్లో స్థానిక పోలీసులుంటూ లేరు. నిజానికి వారి అవసరమూలేదు. సమాజం పెరిగినకొద్దీ నేరాలు అధికమవటం, నేరాలు జరగకుండా కాపాడటం మొదలైన సమస్యలు విషమంగా తయారవుతూంటవి. చిన్న సమాజంలో ఎవరెవరో తేలిగ్గా తెలిసిపొయ్యే అవకాశముంటుంది; కాని, అలాటి అవకాశం పెద్దపట్టణం తాలూకు సమాజంలో ఉండదు. ఒంటరితనం, అధమస్థితి, తానెవరో తెలి యక పోవటం మొదలైనవి నేరాలను ప్రోత్సాహపరుస్తవి. శిథిలగృహాలూ అమాయకులైన తల్లిదండ్రులూ, మురికీ, రోగగ్రస్తత మొదలైన వాటి మీద నేరాలు విజృంభిస్తవి. మురికి పేటల్ని తుడిచివేయటం, జీవితస్థాయిని పెంపొందించటం మొదలైనవి నేరాలు జరగకుండా చేయటానికి అనుస

రించవలసిన మంచిపద్ధతులు. కుటుంబ సమస్యల్ని గూర్చిన సలహాలను సమాజంలోని ఏజన్సీలద్వారా పరిష్కరించుకునేందుకు ప్రయత్నించటం వల్ల, అయాసమస్యలు ప్రమాదకరంగా పరిణమించకుండా చూసుకోవచ్చు. స్వచ్ఛందసేవాదళాలు తగినన్ని అవకాశాలు లేని సామాజికులకు బాసటగా నిలిచి సహాయపడేందుకు సిద్ధంగా ఉంటూన్నవి.

నివాసమున్న పట్టణం అమెరికన్ జీవితంలో ఒక ముఖ్యమైన చిహ్నం. అనేక సందర్భాలలో నివసించే ఏ పెద్దపట్టణమో యీ తెగకు లెక్కరాదు; కాని, స్వగ్రామమే యీ కోవకు చెందుతుంది. అది కేవలం నివాసం మాత్రమే కాకుండా - ఆ సమాజమంతా ఏకకుటుంబీకులకు ప్రాతినిధ్యం వహించినట్లే ఉంటుంది: సామాజిక నాయకులు పితృత్వాన్నీ, భ్రాతృత్వాన్నీ వహించేవారుగానూ, ఒకరికొకరికున్న సంబంధబాంధవ్యాలు సాలెగూటిలోని దారాలవలె ఉంటూ, ఏకమై తమకు తాము కాపాడుకొనేతత్వం మాతృత్వంవలెఉంటూ - సామాజిక తత్వమనేది వంటబట్టి, స్థానికమైన గర్వకారణమౌతున్నది.

సమాజమనేది కంటికి కనిపించని అపురూపమైనది కాదు: అది సజీవమైనది. అనేక వ్యక్తిత్వాలను అది నలిపి, సామాజిక అవసరాలను తీరుస్తూ, ఆ వ్యక్తి సంబంధించిన ముఠాలు వరకూ పాకుతుంది; రాల్ఫ్ లింటన్ ఇలా అన్నారు:

"జీవితం సామాజిక విభాగాలలో ఒకటి, అది తగినంత పెద్దదిగా ఉండి జీవితానికి వైవిధ్యాన్ని ఇస్తోంది; ఐతే సమాజంలోని అనేకమందితో సంబంధబాంధవ్యాలను ఏర్పరుచుకునేందుకు వీలుగా ఎంతో చిన్నదిగానూ ఉంటూన్నది. ఇలాటిదే మానవాళిలో అత్యధిక భాగానికి తృప్తికరమైన జీవితంగా కనిపిస్తుంది"

అమెరికన్‌లలో అత్యధికసంఖ్యాకులపట్ల నిశ్చయంగా ఇదే జరుగుతోంది. తమకూ సమాజంలోని వివిధ భాగాలకూ - కుటుంబం, చర్చి, పట్టణం, ఇరుగు పొరుగులు, వృత్తి, కార్మిక సంఘం, సమాజం తాలూకు

క్లబ్, రాష్ట్రం, ప్రాంతం, జాతి - మొదలైనవాటికి తెగనిబలవత్తరమైన సంబంధమున్నదని వారు నమ్ముతున్నారు.

ప్రజాస్వామ్యంలోని సమాజంలోని ఏకత్వమనేది - కలిసికట్టుగా ఉండటంకన్న విడివిడిగాఉంటూ, సమాజం అనేక చిన్నసమాజాలుగా మారి, స్వపరిపాలనలోని అధికారం విభాగాలు చేయబడటం ద్వారా - సాధించబడుతూన్నదని వారి విశ్వాసం, ఇలాటి పద్ధతిలో వాదప్రతివాదాలూ, సంఘర్షణలూ, ఒత్తిడులూ మొదలైనవి ఉండటం తప్పవు. ఐతే అది అత్యంత శక్తివంతంగా ఉంటుంది, ఎంతో కదలిక ఉండటంవల్ల బలవత్తరంగా ఉంటూ, ప్రతిఒత్తిడికీ చలిస్తూ, అవసరమైన మార్పులను గమనిస్తూ, తనను తాను సక్రమవిధానంలో నడుపుకుంటూ-చివరకు కలిసికట్టుగా పని చేయవలసిన అవసరం మరిలేదనుకున్నప్పుడు దానంతటదే అంతరిస్తూ ఉంటుంది,

ప్రభుత్వమే వొచ్చి ఏదోచేయాలనేదాకా అదివేచిఉండదు; తన సమాజంలోనుంచే తగిన శక్తి సామర్థ్యాలను అది తయారు చేసుకుంటుంది. మురికిపేటలు అమెరికన్ పట్టణానికి పెద్ద తలనొప్పిగాఉంది. చికాకుపరుస్తున్నావా? ఒక ఆర్గనైజేషన్ 'ఏక్షన్' అనే పేరుగలది ఉద్భవించి - ఇరుగుపొరుగుల అభివృద్ధిని ఆశయంగా పెట్టుకుంటుంది. నేరాలు జరగటమనేది ఒక విషమసమస్యగా పరిణమిస్తున్నదా? సమాజంలోని మతైక సామాజిక, వినోదకర, విద్యాసమాజాల తాలూకు ప్రతినిధులను కూడగట్టుకొని, ఏమి చేయాలనేది నిర్ణయిస్తుంది.

సమాజం మానవులకు సంబంధించినదనే భావం అమెరికన్ వ్యక్తిత్వములో గాఢంగా పాతుకొనిపోయింది. ఈ భావం తాలూకు పునాదులు మానసికమైనవీ, చారిత్రాత్మకమైనవీను. స్థానిక సమాజమనే క్లిష్టమైన అల్లిక ప్రాముఖ్యతను అర్థంచేసుకొనేవరకూ, యునైటెడ్‌స్టేట్స్‌నుగూర్చి ఎవ్వరూ అర్థంచేసుకోలేరు.

---

# ఏడో అధ్యాయం

## విద్య

అమెరికన్ జీవితంలోని అనేక దృక్పథాలూ, సంస్థలవలెనే – పాఠశాలల కూడా మతంలోనే పునాదులున్నవి. 17 వ శతాబ్దంలో గవర్నర్ బెర్క్లే వర్జీనియాలో పబ్లిక్ పాఠశాలలంటూ లేనందువల్ల అక్కడి యువకులు చెడిపోలేదనీ, అపాయకరమైన విజ్ఞానం వారి దరికి జేరలేదనీ గొప్పలు చెప్పుకున్నప్పటికీ, 1647 లోనే న్యూ ఇంగ్లండ్ సైతాను బారి నుంచి తప్పించుకునేందుకు అనుకూలమైన వాతావరణాన్ని కల్పించే విధంగా, మతబోధకులుగా యువకుల్ని తయారుచేసే పథకాలు అమలు జరిపింది. కొత్త కొత్త పట్టణాల స్థాపనకై గ్రాంట్లు మంజూరు చేయబడి నప్పుడు, న్యూ ఇంగ్లండ్ అంతటా, ఆ తరువాత పశ్చిమదేశ భాగంలోనూ, పాఠశాలలకొరకై కొంత భూమి కేటాయించబడింది. తొలిదశలోని పాఠశాలలు చాలా మోటుపద్ధతుల్లో ఉండేవి; భాషలోని ప్రాథమిక పాఠాలనూ, కొద్దిగా గణితశాస్త్రాన్నీబోధిస్తూ సంవత్సరంలో కొద్దినెలలపాటే తెరిచి ఉంచబడేవి. ఐతే ఇవి ప్రతివారూ విద్యను నేర్వటానికి హక్కున్నదనే ఆదర్శాన్ని వెలిబుచ్చినవి. ప్రపంచంలోని మొట్టమొదటి పబ్లిక్ విద్యావిధానానికి ఇవి దారితీసినవి. యునైటెడ్‌స్టేట్స్‌లోనే మొట్టమొదటి పబ్లిక్ లైబ్రరీ వెలిసింది; స్త్రీవిద్యావ్యాప్తిలో ఉన్నతవిద్యాసౌకర్యాలు కూడా యునైటెడ్‌స్టేట్స్‌లోనే మొట్టమొదట ప్రవేశపెట్టబడినవి.

విద్యాసంస్కారం పొందాలనే తహతహే చాలా మందిని యూరప్ నుంచి అమెరికాకు తరిమింది; వీరి బరువుభారాల నన్నిటినీ అమెరికా వహించి, సౌలభ్యమైన విద్యావిధాన పథకాలను ప్రవేశబెట్టి - సర్వజనసమ్మతమైన సంస్కృతితాలూకు చిహ్నాలను ఏర్పరచింది.

యునైటెడ్ స్టేట్స్‌లోని విద్యావిధానం - ఒక విధానమేకాదు. ఫెడరల్ ప్రభుత్వానికి దానిమీద కంట్రోలులేదు. విద్యావిధానానికి ఒక యజమాని కానీ, విద్యావ్యాప్తికై ప్రత్యేకించబడిన కౌన్సిల్‌కానీ, ఉపాధ్యాయులుగా ఉండేవారిని ఎన్నుకోవటంలో ఒక సామాన్య పద్ధతిగానీ, గ్రాడ్యుయేట్స్ అయేందుకు ఒక సామాన్య అంతస్థును అందుకోవటమనే నియమంకానీ, పాఠ్యగ్రంథాలుగా ఉండదగిన పుస్తకాలుగానీ లేనందువల్ల - ఇది ప్రజాస్వామ్యంలో బలవత్తరమైన ఆయుధంగా ఉంటూన్నది. సామాన్య పద్ధతుల్ని అతిక్రమించటం-లేదా తమకు అనుకూలమైన పద్ధతుల్ని అనుసరించటం - ప్రతిజిల్లాలోని స్థానికపాఠశాలలూ, చాలా చిన్న కాలేజీ లేదా, పెద్దవిశ్వవిద్యాలయం అనుసరిస్తూనేఉన్నవి. అత్యధికమైన విధానాలుండడం, స్థానికమైన కంట్రోల్ ఉండటమనేవి - యీ విధానాన్ని అర్థంచేసుకునేందుకు ఉపకరిస్తూన్నవి.

విద్యాప్రాధాన్యత, దాని ఫలితాలూ మొదలైనవాటిమీది గాఢవిశ్వాసమే అమెరికన్ విధానానికి కేంద్రీభూతంగా ఉన్నవి. ఈ నాడు పాఠశాలకు వెళ్ళటమనేది ఏ 3 సంవత్సరాల వయస్సులోనో, లేక అంతకన్నతక్కువ వయస్సులోనో ఆరంభమై, జీవితాంతంవరకూ వయోజన విద్యగా విస్తరించి ఉన్నది; తుది దశాబ్దాలలోని వారికి క్రొత్త క్రొత్త విధానాల ద్వారా విద్యాబోధన జరుగుతూనేఉన్నది.

## విద్యాలయం : గృహం

విద్యావిధానంలోని ఆరోగ్యకరమైన చిహ్నాలలో యీ రోజుల్లో మనుష్యులు విద్యాలయాలపట్లచూపే శ్రద్ధ ఒకటి. ఈ శ్రద్ధ ఒకో సమయంలో బలమైన విమర్శగా, లేదా ముఖ్యమైన వాదాంశంగా రూపొందుతూండటం కద్దు విద్యాలయాలు పిల్లలు ప్రజాస్వామ్యంలో బతకటమెలాగో బోధిస్తూ, అర్థరహితమైన విషయాలను బోధించరాదు. ప్రాథమిక సూత్రాలను చదవటం, ఆలోచించటం నేర్పుతే చాలని మరొకరు అంటారు.

తల్లిదండ్రులు పాఠశాలల్లో ఏదోలోపమున్నదని తలుస్తారు: సమాజంలో ఉన్న అసంతృప్తిని ఉపాధ్యాయులు గుర్తిస్తున్నారు - తత్కారణంగా పరిశోధనలూ, ప్రయోగాలూ ఎడతెరిపిలేకుండా జరుగుతూన్నవి; వీటిల్లో కొన్ని విజ్ఞానవంతంగానూ, మరికొన్ని మూర్ఖంగానూ ఉంటూన్నవి. ఈ విధంగా విద్యాలయ నిర్మాణమనేది ఒకపక్క జరుగుతూ, తిరిగి కూల్చబడుతూ, మళ్ళీ నిర్మించబడుతూనే ఉన్నది; ఇది ఎప్పటికప్పుడు పరిపూర్ణ రూపాన్ని ధరిస్తుందనుకోవటం, అలా కాకుండటమూ జరుగుతూ, శక్తివంతంగా ముందుకు సాగిపొయ్యే జాతి తాలూకు అవసరాలను పరిపూర్ణంగా తీర్చలేని స్థితిలో ఉంటూన్నది.

విద్యావ్యాప్తి విషయంలోని వివిధ భేదాభిప్రాయాల్లో కొన్ని కేవలం సాంకేతికమైనవీ, మరికొన్ని చదువునేర్పటంలో ఉత్తమపద్ధతీ లేవనే ప్రశ్నను ఎదుర్కొనేవీను. ఇక మిగతావి ప్రాథమికమైన సాంస్కృతిక విభేదాలు - వ్యాపారం, పనిపాటలు, మతం, స్త్రీలక్లబ్‌లు, పౌరస్వాతంత్ర్య సమాజాలు - మొదలైనవి భేదాభిప్రాయాలతో విద్యారంగంలోకి ప్రవేశించాలనిచేసే ప్రయత్నాలు. ఈ విధమైన లాగటం, వొదలటం, బహుముఖంగా ఉన్న విధానానికీ, ప్రజాస్వామ్యంలో తప్పనిసరియైన పద్ధతులకూ తార్కాణాలు. చిన్నతనంలో నేర్చినవిద్యలే పెద్దతనంలో ఆ పిల్లల్ని పౌరులుగా చేస్తవి కనుక, ఆ భావిపౌరులను రూపొందించే విధానంమీద అనేక అభిప్రాయాలూ, పలుకుబడుల ఒత్తిడులూపడుతూన్నవి. ఇటీవల న్యూయార్కు స్టాక్ ఎక్స్‌ఛేంజ్‌వారు ఆర్. సి. ఎ. షేరు తాలూకు కొటేషన్‌ను ప్రకటించినప్పుడు వీధిలోనుంచి పెద్ద గోల - చిన్నపిల్లల సంతోషపూర్వకమైన కేకలు వినిపించి ఆశ్చర్యపడ్డారు. పదకొండేళ్ళ వయస్సున్న చిన్నపిల్లలు, బడిలో స్టాక్ మార్కెట్టునుగూర్చి నేర్చుకొని, వారివద్దగిరఉన్న చిన్నచిన్న మొత్తాలను కూడగట్టి ఆర్. సి. ఎ. లో ఒక షేర్ కొన్నారు! అందుకూ ఆ గోల!

మొత్తంమీద విద్యావేత్తలు తమచుట్టూఉన్న సామాజికమైన ఒత్తిడులపట్ల విశాల హృదయాన్ని ప్రదర్శిస్తున్నప్పటికీ, వీరికీ సమాజానికీ మధ్యఉండే బిగువు తప్పదు. విద్యావేత్తలు తమ పాత్రలపట్ల ఎంతో శ్రద్ధ వహిస్తూ, తమ ముందున్న అవకాశాలు రోజురోజుకూ విశాలమవటం గ్రహించి, తమచేతులమీదుగా రూపొందేపౌరులు తమతమ గురుతర బాధ్యతలనూ, తీరిక వేళలనూ సక్రమంగా ఉపయోగించేందుకు శిక్షణ నివ్వవలసి ఉంటూన్నది కనుక, వారికీ వారి సమానులైన విద్యార్థి విద్యార్థినుల తల్లిదండ్రులకూ మధ్య భేదాభిప్రాయాలూ, సంఘర్షణలూ తప్పటంలేదు.

విద్యతాలూకు గొప్ప శక్తిమీద అమెరికన్‌లకు గాఢ విశ్వాసం - అకారణమైనంత అధికంగా ఉండటంవల్లనే, ఆ అభిప్రాయానికి అనుగుణంగా విద్యావిధానం నడుపబడవలసి ఉంటోంది. ఐతే వేరొకపక్క విపరీతమైన తెలివితేటలున్నవారిని - ఏ ప్రొఫెసర్ మతిమరుపుతనాన్నో వెక్కిరించటం, ఎగతాళి పట్టించటం జరుగుతూనే ఉన్నది. గౌరవమూ, అసహ్యించుకోవటమూ యీ రెండూ ఎలా సాధ్యమౌతూన్నవి? గౌరవం - తరతరాలుగా ప్యూరిటన్ ఫాదర్స్ దగ్గర్నుంచి వొస్తునేఉన్నది. అసహ్యించుకోవటమనేది - ఆత్మవిశ్వాసంతో సరిహద్దుప్రాంతాన్ని ఆక్రమించుకొన్న సమయంలో, కర్మవీరులు మాత్రమే గణనకెక్కిన విధానాన్ని అనుసరించటంవల్ల వొచ్చిపడింది.

తరగతులవారీ వొచ్చే ఆధిక్యత తాలూకు సూచనలు ఎలాటివైనాసరే, దాన్ని అమెరికన్‌లు పోరాడుతారు. విద్యాధికుడైనవాన్ని వారు గౌరవిస్తారు: ఐతే ఆ విద్యాధికుడు సమాజంలో కలతలను రేపటం, అతనికన్న తక్కువ విద్య నభ్యసించినవారు, ఎంతో కష్టపడి సంపాయించుకొన్న స్వాతంత్ర్యాన్ని భంగపరచటం, లేదా అతని విద్యాధిక్యతవల్ల పన్నులు మరింత భారమవటం ఇంకా ఇతర ప్రమాదాలు వాటిల్లుతవేమోనని వారిభయం. పిల్లలు తమ ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులు ఆదేశించారనే మిషతో తల్లి

దండ్రులు విధించిన ఆంక్షలను అతిక్రమించటం లేదా ప్రవర్తనలో, వ్యాకరణంలో పాఠశాల తాలూకు పలుకుబడులను ప్రదర్శించటాన్ని తల్లి దండ్రులు ఎదుర్కొంటారు. ఐతే మరొవైపు తన బిడ్డను తల్లి స్వయంగా ఉపాధ్యాయునికి - వేరొక పెంపకపు తండ్రికి అప్పగించిన విధంగా అప్ప గించటం, ఉభయులూ ఎంతో బరువు తగ్గినట్లు నిట్టూర్చటం జరుగుతూనే ఉన్నది. అనేకసార్లు తాము ఇంటివగ్గర కనిపెట్టలేకపోయిన అనేక విష యాలను, ఉపాధ్యాయునిలో కనిపెట్టగలగటంతో బిడ్డనుగూర్చినభయం అధికమౌతున్నది. అంతకన్నా దారుణమేమంటే - కాలేజీలో ప్రవేశించాక- (అంతకు ముందుకూడానేమో?) కుర్రవాడు పొగతాగటం, మత్తుపదార్థా లను సేవించటం, రాత్రులు చాలా పొద్దుపొయ్యాకకాని ఇంటికి రాకుం డటం మొదలైన వేషాలకు ఉపాధ్యాయునిదే బాధ్యత అని భావించబడటం:

తమ సంతానం అమెరికన్ జీవితవిధానానికి అలవడాలనే ఉద్దేశంతోనే తల్లిదండ్రులు వారిని పాఠశాలకు పంపుతారు. పాఠశాల కొన్ని మార్పు లను పిల్లలకు అలవరచాలి. కనుక విద్యాలయం ఒక తరానికీ, మరొక తరానికీ, మధ్యఉండే బలవత్తరమైనశక్తికి చిహ్నంగా ఉంటూ, నిజానికి అభ్యుదయానికి సంబంధించిన అభిప్రాయాలను అందిస్తూ సంస్కృతికి అవసరమైన కలయికను సరఫరా చేస్తున్నది. విద్యాలయం చేయకలిగిన దానికన్నా అత్యధికంగా చేయాలని భావించబడుతోంది: కుటుంబానికి సంబంధించిన పనులెన్నో విద్యాలయం పరంగా జరగాలని ఆశించబడు తోంది - లైంగిక విజ్ఞానం, ఆరోగ్యసూత్రాలు, మంచి మర్యాదలు, బిడ్డల పెంపకం మొదలైనవి ఉదాహరణలు, తమ అధికారాన్ని అప్పగించి నందుకు తల్లిదండ్రులు ఏదోనేరం చేసినట్లు బాధపడతారు; ఏ తేలికైన హృదయంతో వారీ అధికారాన్ని అప్పగించారో అందుకూడా నేరం చేసిన విధంగా బాధచెందుతారు. కనుకనే యీ నేరాలన్నిటినీ ఉపాధ్యాయుల మీదమోపి, వారిని నిందించటం జరుగుతోంది.

ఉపాధ్యాయుని లేదా ఉపాధ్యాయిని వ్యక్తిగత జీవితం ఎంతో నియమబద్ధంగా ఉండాలని, పిల్లల తండ్రులు కోరుతారు: ఐతే అతని లేదా ఆమె ఇంత కష్టతరమైన జీవితాన్ని గడిపినా, తగిన విధంగా బహూకరించటం లేదు. ఉపాధ్యాయిని తన విద్యార్థుల విద్యార్థినుల నందర్నీ సరిసమాన దృష్టితో చూడాలని భావించబడుతోంది; కాని ఉచ్ఛస్థాయిలో ఉన్న కుటుంబాలలోని పిల్లలపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపాలని వారుకోరటం, అనేక సందర్భాలలో అలాగే జరగడం కద్దు; అదే విధంగా తక్కువస్థాయిలో ఉన్న విద్యార్థులపట్ల తగిన శ్రద్ధచూపకుండటం, వారు అవసరమేలేదనే ధోరణిలో వారు ప్రవర్తించటంకూడా జరుగుతోంది; ఐతే ఉపాధ్యాయ ఉపాధ్యాయినుల్లో అనేకులు యీ విభేదాలను పాటించక ఎంతోకష్టపడి, అనేకులకు ఉత్సాహప్రోత్సాహాలనిచ్చి, తగిన ఆవేశాన్నివ్వటం జరిగింది: అలాటివారు - వారిని జీవితాంతం స్మరిస్తూఉంటారు.

పూర్వచరిత్రలు ఏవైనప్పటికీ అనేక కుటుంబాలలోని బాలబాలికలను కూడగట్టిన విద్యాలయాలు - సమాజంలో గొప్ప ప్రజాస్వామికశక్తిని, అమలు జరిపినవనే అనాలి. వీరు - ఒకరికొకరు అలవడటం, సామాజిక - ఆర్థిక అంతస్థులనుదాటిన గాఢమైత్రిని పెంపొందించుకోవటం, ఒకరితో మరొకరు సరిపెట్టుకుంటూ వయసులో పెరిగినప్పటికీ, స్నేహభావంతోనే హాయిగా జీవితాన్ని గడపగలగటం జరుగుతోంది. ఆటపాటలూ, చదువు సంధ్యలూ యీ సామాజిక అంతస్థులను ఒకేమట్టానికి దింపేవిగాఉంటూ, ఎక్కువ తెలివితేటలుగల, లేదా బలసంపత్తిగల పిల్లవానికి, తన కుటుంబ స్థాయిని మించిన సామాజికస్థాయిని అందుకునేందుకు ఎక్కువ అవకాశాలను సృష్టిస్తూన్నవి. ముఖ్యంగా ఆటపాటల్లోనూ, క్రీడారంగాల్లోనూ వలసవొచ్చిన వారి సంతానం ఎంతోవేగంతో నిచ్చెనమెట్లను ఎగబాకినవిధంగా పైపైకి వెళ్ళటం జరిగింది.

## ప్రజాసామ్యం : విద్య

చిన్న చిన్న పిల్లలు నీలంరంగు దుస్తులుధరించినవారిని తన మొదటి తరగతి విద్యకై వెళ్ళిననాడు చూసిన క్షణంనుంచీ, 18 సంవత్సరాల అనంతరం కాలేజీడిప్లొమాలు తీసుకునేందుకు వేదికపైకివెళ్ళి తన ఎదుట ఉన్న వేలాది ముఖాలనుచూసేవరకూ, ఈ గ్రవాని జీవితంలో - కుటుంబం తరువాత పాఠశాలే కేంద్రీభూతమైన సత్యంగా ఉంటూఉన్నది. తన ఉపాధ్యాయుల తాలూకు వ్యక్తిత్వాల పలుకుబడులు బాలురమీద గాఢంగా హత్తుకొంటవి; కొన్ని సంవత్సరాల అనంతరం ఆయా ఉపాధ్యాయుల ముఖాలనూ, వారి అలవాట్లనూ, వారి దయ లేదా ఓర్పులేమిని అతను గుర్తుంచుకోగలడు.

పాఠశాలలో బోధించబడే వివిధ శాఖల తాలూకు విద్యలనేగాక, ఇతర విద్యార్థుల విషయంలో తాను ఏ విధంగా ప్రవర్తించవలసిందీ కూడా బాలుడు నేరుస్తాడు. మొదటి తరగతిపిల్లవాడు ఇతర పిల్లల చేతుల్లోని ఆటవస్తు వుల్ని బలవంతంగా లాక్కోలేడు; అథవా కోపగించుకొని సాహసమేదన్నా చేస్తే తన శరీరంకూడా కొంత చెడిగాని బైటపడదని తెలుసుకుంటాడు. లింగభేదాలూ, వాటి మద్యఉండే సంబంధ బాంధవ్యాలనుగూర్చి కూడా అతను తెలుసుకుంటాడు. ఇదివరకుకన్న కొంచెం తక్కువగానే కావొచ్చు-మొగపిల్లలకన్న ఆడపిల్లలకు ప్రత్యేకవసతులున్నవి; ఆడపిల్లలు సుకుమారంగా ఉన్నప్పటికీ, క్రీడారంగంలోనూ, చదువు సంధ్యల్లోనూ అనేకసార్లు మొగపిల్లల్ని ఓడించటం జరుగుతోంది. ఆడపిల్లలకు పాఠాలు కఠినంగా ఉండొచ్చు: ఎందుకంటే తమ విజయాలను చిటారుకొమ్మ వరకూ కొనసాగించకూడదనే విషయాన్ని వారు నేర్చుకోవలసి ఉన్నది: అలాగాక వారు మొగపిల్లలకన్న చాలాదూరం వెళ్ళినట్లయితే జీవశాస్త్రం తాలూకు అవసరాలను తీర్చుకునే అవకాశాల నెన్నిటినో పోగొట్టుకోవలసి వొస్తుంది.

సమూహ పరంగా తానే పనులనూ, ఆటపాటలనూ పాఠశాలలు అత్య ధికంగా బోధిస్తూండటంవల్ల, ఒకప్పుడు ఎంతో ప్రాముఖ్యత వహించిన 'పోటీ' అనేది చాలావరకు తగ్గింపబడింది. విద్యార్థులందరూ కలిసి-ఉదా హరణకు ఏ ఆఫ్రికానుగూర్చో నేర్చుకోమని ఆదేశించబడుతారు. వారు బొమ్మల్ని తెచ్చి, దేశపటాలు గీసీ, ఆటలాడీ, ఆ పాఠ్యభాగాన్నిగూర్చి కథలు చెప్పుకుంటారు. ఇక ఉపాధ్యాయునికి అధికారంతోకానీ, అధికార దండంతోకానీ పని ఉండదు; ఆయన పిల్లల్ని తరుమనవసరంలేదు, సక్రమమైన మార్గంలో నడిపించగలడు. విద్యనుగూర్చిన నున్నితాభిప్రాయ మిదే। తనతోపాటే పథకాన్ని వేసేందుకు విద్యార్థుల సహాయాన్ని కోరటం, వాద ప్రతివాదాలను నడిపి, ఏ విషయాన్నిగూర్చి నేర్చుకోవాలి, ఎప్పుడు, ఎట్లు అనే విషయాలను నిర్ణయించుకోవటం మొదలైనవి ఉపా ధ్యాయులు చేయగలుగుతున్నారు.

ఈ విధమైన అభ్యుదయకరమైన విద్యతాలూకు వేదాంతం, వెర్మాంట్‌లో పుట్టిన జాన్ డీవే (1859 - 1952) తాలూకుదని యీ నాడు అందరికీ తెలిసిన విషయమే। కలిసికట్టుగా, సామాజికంగా పనులుచేసి నేర్చుకొనే విధానం పల్లెలంతటా కనిపించేదాన్ని, ఆయన విద్యారంగంలో ప్రవేశపెట్టి ప్రపంచానికంతకూ ఆదర్శప్రాయుడయ్యాడు. డీవే అభిప్రాయంలో పాఠ శాల - జీవితానికి విద్యార్థిని రూపొందించేదికాదు; అది విద్యార్థి జీవితంలో కేంద్రీభూతమైనభాగం, పాఠశాల సమాజంతాలూకు చిన్నమూనా, విద్యా ర్థులు పాఠాలను కంఠతాపెట్టటంకన్న, ఎక్కువగా పనిచేయాలి, నేర్చు కునే విధానంలో వారు ప్రముఖపాత్రను నిర్వహించాలి. ఫలితంగా జీవితాను భవంలో వారు సంసిద్ధులౌతారు; పనులుచేసి నేర్చుకొనే విధానం వారికి అలవడుతుంది.

విద్యాభ్యాసమనేది కేవలం పాఠశాలలలోని ఒక గదిలోనే జరిగేరోజులు గడచిపోయినవి. అగ్నిమాపకదళశాఖకు, లేదా పోస్టాఫీసుకు పిల్లల్ని తీసు

కొనివెళ్ళటం, ప్రకృతిరామణీయకతను వారికిచూపటం, లేదా ఎక్స్‌కర్షన్స్‌కు వారిని తోడ్కొనివెళ్ళటం - యీ విధంగా ప్రజలు నివశిస్తూన్న ప్రపంచాన్ని గూర్చిన అనుభవాలు వారికి కలిగించటం మొదలైనవి విద్యాభ్యాసంలో ఒక భాగంగా ఉన్నవి. అన్నిటినీమించి - బాలకుడు అభ్యసించే పాఠ్య భాగంకన్న, బాలకుడే కేంద్రభూతమైన ముఖ్యబిందువుగా పరిగణించబడు తున్నాడు. వాడి ఆవసరాలనుతీర్చి, ప్రజాస్వామ్యంలో అతగాడి పాత్రకు తగినవిధంగా అతణ్ణి రూపొందించటం పాఠశాల ముఖ్యకర్తవ్యంగా ఉంటూన్నది. అంతేగాని ఇన్నిగంటలసేపు చదవటం లేదా రాయటం లేదా లెక్కలు చేయించట మనేవి ముఖ్యవిషయాలుగావు.

పిల్లవాడు పెరుగుతూండగా నేర్చవలసిన విషయాల తాలూకు ఆరోగ్య కరమైన యీ ప్రాధాన్యత - డీవేకన్న తక్కువస్థాయి విద్యాసంస్కర్తల దృష్టినుంచి ఎంతో ఛండాలమంతాకూడి, నామకః అభ్యుదయవిద్యావిదాన మనబడే మకుటం కిందికి జేరింది. కాని, డీవే సిద్ధాంతాలనుంచి అతి వాదంగా ఉన్నవాటిని తొలగించి నట్లయితే, ఎల్లప్పుడూ అభ్యుదయగతిని పయనించే ప్రజాస్వామ్యంలో స్వాతంత్ర్యాన్ని సాధించే గొప్పశక్తులను గుర్తించక తప్పదు.

యువకులలో స్వచ్ఛమైన ప్రజాస్వామ్య సంబంధాలు లేనిపక్షంలో - అది నేరాలకూ, బాధ్యతారహిత జీవితానికీ, చేసబట్టైన పోటీకీ, అనవసర మైన గొప్పలు కుప్పుకునేందుకూ దారితీస్తుందనే విషయం రుజువైనది. బలవత్తరమైన విరుద్ధశక్తులనేవి లేనట్లయితే, పాఠశాలను ప్రజాస్వామ్యం చేయటంవల్ల ఆరోగ్యకరమైన సామాజిక జీవనానికి మంచిపునాదులు పడగలవు.

విద్య నేర్చేవిధానంలోనే సమస్యా పరిష్కారాలుకూడా జరగాలని డీవీ సిద్ధాంతం నొక్కి వక్కాణించటం ఒక ముఖ్యమైన విషయం. ఒక

ఊహ చేయగల పనిఅనేది సమస్యను ఎదుర్కొని పరిష్కరించేందుకు ముఖ్యమని ఆయన నిరూపించారు. కనుక అర్థమున్నదని వారికి తోచినసమస్యల్నే ఎన్నుకొని వాటిమీద పనిచేయటానికి పిల్లలు ప్రోత్సహించబడాలి. ఉదాహరణకు పిల్లవాడు తమ పట్టణానికి నీరెలా సరఫరా అవుతూన్నదని ఉపాధ్యాయుణ్ని అడిగాడనుకుందాం: ఈ ప్రశ్నకు జవాబుగా కొన్ని వాక్యాలు వల్లించటంకాదు - ఉపాధ్యాయుడు చేయవలసింది. తన తరగతిలోని బాలురు నీటిసరఫరానుగూర్చి తెలుసుకొనే కుతూహలమున్నదో లేదో నని వారిని ప్రశ్నించాలి. చాలామంది అలాటి కుతూహలాన్ని కనబరిచినట్లయితే - ఉపాధ్యాయుడు వారి నందరినీ వాటర్‌వర్క్సుకు తీసుకొనివెళ్ళటం, రిజర్వాయర్ చూపటం. ఏ యే విధానాల్లో నీటిసరఫరా జరుగుతూన్నదో వివరించటం - అవకాశాలూ, వీలూ ఉంటే వాతావరణ పరిస్థితులూ, వర్షం ఎలా సంభవిస్తూన్నదీ, భూమిమీదపడిన నీటిని లెక్కకట్టి, ఎంతనీరు నిలవ ఉంచవలసిందీ, వాననీరు నదులుగా ఎలా ప్రవహిస్తూన్నదీ, ప్రకృతి ఏర్పరిచిన సరస్సులలో ఎలా నిలవ ఉంటూన్నదీ, ప్రపంచంలోని ముఖ్యమైన మహానదులు ఎలా ప్రవహిస్తున్నవీ మొదలైన విషయాలను గూర్చి చర్చించటంద్వారా సుబోధకరమౌతూన్నది. ఇదిగాక దృశ్యీకరణ - సినిమాలు, బొమ్మల పుస్తకాలూ, దేశపటాలూ మొదలైనవికూడా తగిన పాత్రలు ధరించగలవు.

ఈ విధంగా పిల్లవాడు సమస్యలను తనంతటతానే ఎలా పరిష్కరించుకో గలడో తెలుసుకుంటాడు; సరైన ప్రశ్నలు అడగటం, వాటికి జవాబుల్నికూడా తనకుతానే తెలుసుకోవటంకూడా జరుగుతుంది. పాత పద్ధతుల్లో ఉపాధ్యాయుడు అడిగే ప్రతిప్రశ్నకూ ఒకేఒక్క సరైన జవాబు ఉంటుందనే భావం ఉండేది; ఈ కొత్తపద్ధతిలో ఒకోసమయంలో సరైన జవాబనేది ఉండదనీ, కనుక సమస్యలలోనే జీవించటం నేర్చుకోవాలనీ, సముద్ర తరంగాలవలె ముంచెత్తే సమస్యల తాకిడికి తట్టుకుంటూ, బహూశా

జీవితాంతంవరకూ వాటిని జయించకపోయినా మునిగిపోయిందేమీ లేదనే భావాన్ని అవగాహన చేసుకోవాలి. ఈ శతంలో ఇది నిజంగానే అద్భుత మైన విద్యావిధానం.

పౌరుల కొరకు ఏర్పరుచబడిన పాఠశాలలు యీ క్రింది విషయాలలో కూడా ప్రయత్నాలు చేస్తవి :

వినోదాలమీదా, కొత్త సృష్టులపట్లా పిల్లవాని కౌశలాలను ప్రోత్సాహ పరచటం,

వాడి శక్తిసామర్థ్యాలనుబట్టీ, గమనాన్నిబట్టీ ముందుకు సాగేందుకు అనుమతించటం.

పిల్లవాని ఆరోగ్యం విషయంలో తగినశ్రద్ధ వహించటం : అవసర మైతే ఆరోగ్యలోపాలను సరిదిద్దమని వాడి తల్లిదండ్రులకు చెప్పటం : ఒకవేళ వారికి ఆ సామర్థ్యం లేనట్లయితే, ఆరోగ్య రక్షణావసరాలను తీర్చే విధానాలను అన్వేషించి అమలు జరపటం.

ఆరోగ్య ఆవశ్యకతనుగూర్చి పిల్లవానికి తెలియజెపుతూ, క్రీడారంగాల ద్వారానూ, ఆటపాటలద్వారానూ పిల్లవాని ఆరోగ్యాన్ని పెంపొందింప జేయటం,

తన చుట్టూఉన్న వాతావరణాన్నిగూర్చి వివరిస్తూ సామాజిక జీవనాన్ని గూర్చి వాడికి అర్థమయేట్లు చెప్పటం.

ప్రజాస్వామ్యాన్ని - ముఖ్యంగా ప్రజాస్వామ్యంపట్ల అమెరికన్ దృక్ప థాన్నిగూర్చి - వాడికి బోధించటం, దానిపట్ల వాడి కుతూహలాన్ని పెంపొందింప జేయటం.

తాను సామాజిక జీవిగా ఉంటున్నానని వాడు క్షుణ్ణంగా అర్థం చేసు కునేట్లు చేయటం; పెరిగి పెద్దయినా సామాజికంగా తన బాధ్యతల్ని వాడు విస్మరించకుండా - సామాజిక శ్రేయస్సుకొరకై స్వచ్ఛంద సేవలను అందించేందుకు వాణ్ణి ఉద్యుక్తుణ్ణి చేయటం.

వ్యవసాయమూ, పరిశ్రమలకు అవసరమైన వృత్తివిద్యా కౌశలాలను వాడికి అందించటం.

ప్రతి విద్యార్థిపట్లా ప్రత్యేకశ్రద్ధ చూపుతూ, వాడి అవసరాలను తీర్చేందుకు ప్రయత్నించటం.

సమాజంలో పాఠశాల ముఖ్యభాగమనీ, సామాజిక జీవనాన్ని కేంద్రీకరించిన స్థానమనీ వాడికి అర్థమయేట్లు చెప్పటం.

ఆధునిక విద్యావిధానం తాలూకు ఆశయాలను తల్లిదండ్రులు అర్థం చేసుకునేందుకు సహాయపడటం.

ఇవిగాక సాధారణమైన చదువు - చదవటం, వ్రాయటం, లెక్కలు చేయటం, చరిత్ర, భూగోళం, కళలు, భాషలు, శాస్త్రీయ విజ్ఞానం - ఇలాటి వన్నీను. ఐతే పాఠశాలలు గురిచూసిన స్థానాలకన్న తక్కువ ఎత్తులను అందుకుంటూన్నవంటే ఆశ్చర్యమేమిటి ?

## పాఠశాలల్ని నడిపే దెవరు ?

ఏ ఇతర సమాజమూ ఇంత ధనాన్నీ, శక్తినీ విద్యావ్యాప్తికై వినియోగించలేదు. నాలుగోవంతు జనాభా విద్యావ్యాప్తిలో ప్రత్యక్ష సంబంధాల్ని కలిగి ఉన్నది. 165,000 విద్యాలయాల్లో 10 లక్షలకు పైగా ఉన్న ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులు 9 లక్షల కోట్ల డాలర్ల ఖర్చుమీద 165,000 విద్యార్థ, విద్యార్థినులకు విద్య నేర్పుతున్నారు. విద్యార్థులసంఖ్య, జనసంఖ్య పెరగటాన్నిబట్టి మాత్రమే పెరగటంలేదు; ఎక్కువమంది పై చదువులకు - హైస్కూల్, కాలేజీ, గ్రాడ్యుయేట్ విద్యాలయాలకు వెళ్ళటంద్వారా యీ సంఖ్య పెరుగుతూన్నది. యునైటెడ్‌స్టేట్స్‌లో 14 - 17 సంవత్సరాలమధ్య వయసున్న మొగపిల్లలూ, ఆడపిల్లల్లో నూరింట 75 మందికి పైగా హైస్కూల్స్‌కు వెళ్తున్నారు; ఇలాటి రికార్డ్ ప్రపంచంలో మరెక్కడా కానరాదు. హైస్కూల్స్‌లో చదివి ఉత్తీర్ణులైన వారిలో

నూరింట 40 మంది ఇంకా పై చదువులకు వెళ్తున్నారు. 16-వ ఏట వరకూ ఉచిత నిర్బంధ విద్యాసౌకర్యాలు చేయబడినవి.

ఎలిమెంటరీ, సెకండరీ పాఠశాలల్లోని విద్యార్థుల్లో నూరింట 12 మంది, ప్రైవేట్ పాఠశాలలకు వెళ్తారు; ఈ ప్రైవేటు పాఠశాలల్లో అత్యధికభాగం చర్చిచేత నిర్వహించబడుతూన్నవి. ఐనప్పటికీ హైస్కూలుకు సంబంధించిన అమెరికన్ విద్యావిధానం బలవత్తరంగానూ పౌరసంబంధంగానూ ఉంటూన్నది. ఇది ఏ విధంగా అమలులో ఉంచబడి నిర్వహించబడుతోంది?

ఇది ఫెడరల్ ప్రభుత్వంచేత నిర్వహించబడటంలేదు. ఇంత గొప్ప ఉద్యమాన్ని నడిపేందుకు జాతీయ విద్యాశాఖకు సంబంధించిన మంత్రిత్వమంటూలేదు. యునైటెడ్‌స్టేట్స్ విద్యాశాఖ - ఆరోగ్యం, విద్య, సంక్షేమాల శాఖలో ఒక భాగంగా ఉన్నది; ఆ యా రాష్ట్రాలకు గ్రాంటులను మంజూరు చేస్తూ, విద్యావ్యాప్తిలో పరిశోధనల్ని చేయిస్తుంది. ప్రజా విద్య మీద ఫెడరల్ ప్రభుత్వం 4% ఖర్చును మాత్రమే భరిస్తూ ఉన్నది.

యునైటెడ్‌స్టేట్స్‌లో ఒకే విద్యావిధానం లేదు. 50 విడివిడి పాఠశాలా విధానాలు (కొలంబియా రాష్ట్రాన్నికూడా లెక్కలోకి తీసుకొన్నట్లయితే 51) ఉన్నవి. కాన్‌స్టిట్యూషన్ విద్యావిధానాన్ని ఆ యా రాష్ట్రాలకు - అంటే ప్రజలకే వొదిలేసింది. అంతకన్న యునైటెడ్‌స్టేట్స్‌లో 60,000 విద్యాలయ విధానాలు - అంటే ఎన్ని స్కూల్ జిల్లాలున్నవో అన్ని - ఉన్నవనటం సమంజసం. ఎందుకనంటే - ఆయా రాష్ట్రాల అజమాయిషీలలో భేదాలున్నప్పటికీ, ఎక్కువ అధికారం విద్యార్థ విద్యార్థినుల తల్లిదండ్రులకూ, ఇతర ఓటర్లకూ వొదిలివేయబడింది: వీరే పాఠశాల ఆధ్వర్యాన్ని వహించవలసిన సంఘాన్ని ఎన్నుకుంటారు. పాఠశాలలను నడిపేందుకు అవసరమైన ఆర్థిక సంపత్తిని సమకూర్చే నిమిత్తం ఏ యే పన్నులు వేయవలసి ఉంటుందో, వాటిని అనుమతించటంకూడా వీరి వొంతే! వీరు - తల్లి

దంత్రులూ - ఉపాధ్యాయ ఉపాధ్యాయినులున్న ఎసోసియేషన్‌లను కూడా నడుపుతారు; ఇందువల్ల గృహజీవనానికీ, విద్యాలయ జీవనానికీ ఉండే సంఘర్షణలను చాలవరకు తగ్గించటమేగాక, పాఠశాలాభివృద్ధికి అవసరమయే ధనసేకరణకుగాను విధించే పన్నులను, జాగ్రతగల ఓటర్లు అనుమతించని సందర్భాలలో, ఆ ధనసేకరణకుకూడా ఉపకరించటం జరుగుతోంది. సరాసరిన స్థానికమైన సుంకాలద్వారా విద్యాలయాలకు అవసరమైన ఆర్థిక సంపత్తిలో 60% సమకూర్చబడుతోంది; మిగతా 40% ఆర్థిక సహాయమూ - ఆ రాష్ట్రప్రభుత్వం - పెట్రోల్, మత్తుపదార్థాలమీది సుంకాలూ, ఇతర పన్నులద్వారా వసూలు చేసిన ధనంలోనుంచి ఇవ్వబడుతోంది.

ఈ 40% రాష్ట్రానికి సంబంధించిన విద్యాశాఖనుంచి లోకల్‌బోర్డ్‌లకు సరఫరా చేయబడినప్పటికీ, చాలా విధానాలు కేంద్రీకృతమై ఉంటూ, ఆయా సమాజాలు తమ అవసరాలను నిర్ణయించుకునే అవకాశాలను ఇస్తున్నవి. స్థానిక విద్యాలయం తాలూకు ఆధ్వర్యం సమాజంలోని ప్రతినిధులచే నడుపబడుతోంది. గ్రామసీమల్లో యీ ప్రతినిధులు వ్యవసాయదారులనుంచి ఎన్నుకోబడటం సహజమే। నగర సీమల్లోని ప్రతినిధులు వ్యాపార సంస్థలనుంచీ, వృత్తిచేసుకొనే పెద్దమనుషులనుంచీ - ఇటీవల కార్మికులనుంచి కూడా ఎన్నుకోబడుతున్నారు. అనేక సందర్భాలలో మహిళలు అత్యధికంగా ఎన్నుకోబడుతున్నారు. సమాజం తాలూకు దృక్పథాలను ప్రసరింపజేస్తూ, నిర్వాహక వర్గంలోని ప్రతినిధులు విశేష సౌకర్యాల నిమిత్తం సకాలంలో సుంకాలను విధించటం, లేదా విద్యావ్యాప్తికొరకై కొత్తకొత్త విద్యాలయ స్థాపనకు బాండ్లను అమ్మే ప్రయత్నాలు చేయటం జరుగుతోంది. సమాజపు అవసరాలను తీర్చటమనే సదుద్దేశం ఉండటం వల్ల, ఆయా అవసరాలు ఏర్పడినపుడు స్వచ్ఛంద సేవాదళాలు పనిచేస్తూ, కొత్త విద్యాలయ కట్టడాలకు, లేక ఉపాధ్యాయ ఉపాధ్యాయినుల వేతనా

లను పెంచేందుకు అవసరమైన ఆర్థిక సంపత్తిని సమకూర్చటం జరుగుతోంది.

విద్యాశాఖకు సంబంధించిన రాష్ట్రకమీషనర్ - విద్యాలయ నిర్వాహకులను అది చేయమనీ, ఇది చేయమనీ అధికార పూర్వకంగా ఆదేశించటానికి మారుగా, నిర్వహణ కార్యక్రమాన్ని స్వయంగా నడుపుతూ, మంచిమాటలతో నిర్వాహకులకు సంతృప్తికరంగా ఉండేవిధంగా ఆదేశించటం జరుగుతోంది. ఐతే దైనందిన కార్యక్రమం, ఉపాధ్యాయుల కివ్వవలసిన వృత్తి శిక్షణ, నిర్వహణ మొదలైన పనులు రాష్ట్రప్రభుత్వం నియమించిన సూపర్‌వైజర్లు నిర్వహించటాన్ని బోర్డువారు హర్షిస్తారు.

స్థానికంగా ఏర్పడిన బోర్డ్‌వారికి ఇంత గొప్పఅధికారాన్ని ఇవ్వటం అధునాతన విద్యావిధానాన్ని నిరుత్సాహపరుస్తుందనే వాదమొకటి ఉన్నది. ఐతే స్థానిక విద్యాలయమనేది - అమెరికన్ జాతి రూపొందని కాలం నుంచీ తరతరాలుగా వొస్తూనే ఉన్నది. నిజానికి అప్పటికి అమెరికన్ భూఖండంలో రాష్ట్రాలుకూడా ఏర్పడలేదు; సమాజంలోని సంతానానికి ఏ యే విద్యలను, ఏ యే విధానాలలో నేర్పాలనే విషయాన్ని సమాజమే నిర్ణయించుకుంటూ రావటం ఒక ఆచారంగానే ఉండిపోయింది. ఐతే సరైన విద్యావిధానమేది ? ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులకు శిక్షణలనిచ్చే కాలేజిలోని కమీషనర్‌గారు, దీర్ఘ పరిశీలనల అనంతరం నిర్ణయించే విధానమా ? లేక సమాజమే పూనుకొని తన అవసరాలను గుర్తించి, తదనుగుణంగా తనసంతానానికి నేర్పవలసిన విద్యల విషయమైచేసే నిర్ణయమా?

ఈ రోజుల్లో తల్లిదండ్రులు కమిటీలలో సభ్యులుగాజేరి పాఠశాలకు సంబంధించిన అనేక సమస్యలనుగూర్చి చర్చించి, నిర్ణయాలకు వొచ్చే విధానం ప్రోత్సహించబడుతూన్నది. ఈ జవాబులు ఆ యా సమాజాలను బట్టి భేదిస్తూ ఉంటవి. న్యూయార్క్ రాష్ట్రంలోని స్కార్స్‌డేల్‌లో ఎక్కువ మంది పిల్లలు హైస్కూలునుంచి కాలేజి చదువులకు వెళ్తుంటారు గనుక, హైస్కూలు చదువువారిని కాలేజి చదువుకు తగిన విధంగా

తయారు చేయవలసి ఉన్నది. పల్లె ప్రాంతాలలోని ఎక్కువమంది మొగ పిల్లలు చదువు పూర్తయాక వ్యవసాయమే వృత్తిగా జీవిస్తారు గనుక, వారికి శాస్త్రీయమైన వ్యవసాయ విధానాన్నిగూర్చీ, వారు నివశించే ప్రపంచాన్నిగూర్చిన విజ్ఞానం మొదలైన వాటిని విద్యాలయం ఇవ్వవలసి ఉంటుంది ; ఆడ పిల్లలకు బలమైన ఆహారాన్ని తయారు చేయటం, గృహకృత్యాలు నేర్పటం, పిల్లల పెంపకాలను గూర్చిన విజ్ఞానం అవసరమౌతుంది.

## వృత్తివిద్యల్లో తరిఫీదు

అనుభవపూర్వకమైన దానికి అంకితమైన అమెరికన్‌లు వృత్తివిద్యల్లోని తరిఫీదుకు ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు. ఒకప్పుడు విద్యార్థ, విద్యార్థినులను కాలేజి చదువులకుగాను తరిఫీదులనిచ్చే హైస్కూళ్లు ఇప్పుడు అనేక వృత్తి విద్యలు - వడ్రంగం, కమ్మరపని, స్టెనోగ్రాఫీ, బుక్‌కీపింగ్, జర్నలిజం, వ్యవసాయం మొదలైన వాటిల్లోకూడా శిక్షణలనిచ్చే ఏర్పాట్లు చేయబడినవి. వృత్తివిద్యలను ప్రోత్సహించే ఫెడరల్‌ప్రభుత్వసహాయంతో- యువతీ యువకులైనవారు - 14 ఏళ్ళపైబడినవారికి, వారు ఉత్తరోత్రా జీవితంలో చేబట్టబొయ్యే వృత్తిననుసరించి, లేదా అప్పటికే కొంత శిక్షణను పొందినవారికి, ఆయావృత్తుల్లో వారు ఉత్తీర్ణులయే అవకాశాలను కల్పించే విధానానికీ అనుగుణమైన శిక్షణలనిచ్చే ఏర్పాట్లుచేయబడినవి.

వ్యవసాయశాఖలో శిక్షణనుపొందే కుర్రవాడు - తన క్షేత్రం తాలూకు వైశాల్యాన్ని గుర్తించటం, దాని సారాన్ని అంచనాకట్టటం, తాను ఏయే పంటల్ని పండిస్తే లాభసాటిగా ఉంటుందో నిర్ణయించుకోవటం, దాంతోపాటు పందుల పెంపకంలో శ్రద్ధవహించి - ఆరునెలలకు 2,000 పౌనుల బరువుండేవిధంగా వాటినిసాకటం మొదలైన పనులుచేస్తాడు. ఆ తరువాత ధాన్యాల్ని క్షేత్రంమీదపండిస్తూ, ఇటుక్షేత్రానికీ, అటుమార్కెట్‌కూ అనుకూలంగా ఉండేవాటినన్నిటినీ ఉత్పత్తిచేస్తాడు. చివరకు తానుకూడా కొంత

స్వంతభూమిని కొనుక్కొని తన తండ్రితోపాటు వాటాపెట్టుకొని పని చేస్తాడు.

వీరందరూ కలిసి ఒక జాతీయ సంస్థమాదిరి రూపొంది. భావి అమెరికన్ వ్యవసాయదారులుగా తాము అవతరించవలసి ఉంటుందని గుర్తించి, వృత్తివిద్యల్లో తరిఫీధుపొందే విద్యార్థులందరూ ఎంతో ఉత్సాహంగా తాము ప్రజాసేవచేసే అలవాటును అలవర్చుకొని - పల్లెప్రాంతాల్లో తాము నాయకత్వం వహించేయోగ్యతల్ని సంపాయించుకుంటారు.

అమెరికాలో చదువుల్ని హఠాత్తుగా మానివేయటమనే దానికి వృత్తి విద్యలతాలూకు తరిఫీదు కొంతకారణం. ప్రపంచంలోకల్లా హైస్కూల్ విద్యలో యునైటెడ్ స్టేట్స్ అత్యున్నతసంఖ్యను సూచిస్తున్నప్పటికీ, వీరిలో నాలుగోవంతుమంది - ఎక్కువ తెలివితేటలులేని కారణంగానూ, పాఠశాలకు తప్పనిసరిగా వొచ్చితీరాలనే నియమం అంతగాపాటించనందు వల్లనూ, పైచదువులు సాగించటంలేదు. చాలామందికి చదువంటే విసుగెత్తటంవల్ల, ప్రతివారాంతంలోనూ నాలుగురాళ్లు సంపాయించుకుందామనీ, స్వేచ్ఛగా ఒకరిమీద ఆధారపడకుండా జీవితాన్ని గడపాలనీ వాంఛిస్తూ కొత్త గుడ్డలూ, కారూ ఉండాలనే ఆశయంతో వృత్తుల్లో ప్రవేశించటం జరుగుతోంది.

విజయానికి దారితీసే బాటల్ని అందరికీ అందుబాటులో ఉంచుతూ, తక్కువ ఆర్థికస్థితిలో ఉన్నపిల్లవాడు తెలివితేటలున్నవాడైతే వాణ్ని స్థిరమైనమార్గాన నడిపిస్తూ, ఒకవేళ వాడికి అదివరకే వృత్తిలోకొంత కౌశలముంటే దాన్ని అభివృద్ధిచేసుకునే అవకాశాల నివ్వటంద్వారా, హైస్కూల్ విద్యనుంచి అనేకులు నిష్క్రమించకుండా గట్టిప్రయత్నాలు చేయబడుతున్నవి. ఒక సమూహానికి ఇలాటి ప్రణాళిక ఒకటున్నదనే సత్యమే - పనివాడికి - ఆర్థిక విధానం స్నేహపూర్వకంగానూ, ఆశయసిద్ధికి అనుగుణంగానూ ఉన్నదనే భావాన్ని కలిగిస్తున్నది.

## ఉన్నతవిద్య

పబ్లిక్ విద్యాలయాలు స్థానిక పరిపాలనలోనే ఉంటూ, రాష్ట్రప్రభుత్వం నడిపే వివిధ విద్యాశాఖలు - ఉపాధ్యాయ, ఉపాధ్యాయినుల కాలేజీలు మొదలైన వాటితో సంబంధ బాంధవ్యాలను కలిగిఉంది. స్థానిక ప్రమాణం నుంచి జాతీయ ప్రమాణంవరకూ అనేక సమావేశాలను ఏర్పరుస్తూ ఉన్నది. ఐతే ఉన్నతవిద్య విషయంలో పెద్దపెద్ద విశ్వవిద్యాలయాలనుంచి, జిల్లాస్థాయిలోని కాలేజివరకూ తాము ఏర్పరిచిన వివిధ విద్యాశాఖలూ లేదా శిక్షణలను ఇవ్వగలిగిన ఆయా శాఖలను నిర్వాహకులే ఏర్పరుస్తారు. అత్యుత్తమ విద్యార్థుల్ని రూపొందించాలనే కుతూహలం, పట్టుదలలతో విద్యాప్రణాళికల్నిమారుస్తూ కొత్తకొత్త విధానాలను కనుగొంటూ, ప్రత్యేకమైన ఏర్పాట్లుచేసి, ఆయాశాఖల్లో గొప్పగా ఉత్తీర్ణులయే అవకాశాల్ని గలిగిస్తూ, ఇతర పోటీదార్లనుమించి ఒక నూతనత్వాన్ని స్థాపించగలుగుతున్నారు. ఒక కాలేజి తాను బోధించగలిగే అత్యుత్తమ గ్రంథాల జాబితాను తెలియపరుస్తూ విజ్ఞానాన్ని పరిపూర్ణంగా సంపాయించేందుకు ఒక మార్గాన్ని చూపుతుంది. మరొక కాలేజి - చదువుకుంటూనే ఉద్యోగం లేదా వృత్తిలోఉండే అవకాశాలను ఇస్తున్నది. మరికొన్ని సంస్థలు ఏ ఫుట్‌బాల్ ఆటలోనో ప్రావీణ్యతలను స్థాపించి, అందువల్ల గొప్పకీర్తిని సంపాయించవొచ్చన్నదే తమ ప్రత్యేకత అని చాటుతూన్నవి.

ఒక విధానాన్ని అంటిపెట్టుకొనిఉన్న అమెరికన్ కాలేజి లేదా విశ్వవిద్యాలయమనేదిలేదు. యునైటెడ్‌స్టేట్స్‌లో దాదాపు 2,000 ఉన్నత విద్యాలయాలున్నవి; ఐతే వీటిల్లో ఏ రెండూ ఒకేవిధమైనవికావు. ఈనాడు ఈ ఉన్నత విద్యాలయాల్లో 3,000,000 మంది విద్యార్థ విద్యార్థినులున్నారు. (రెసిడెంట్స్ కమీషన్‌వారు - జనాభాలో మూడోవంతు మందికి ఉన్నతవిద్య లేదా వృత్తివిద్యలను అభ్యసించేందుకు తగినంత తెలివితేటలున్నవనీ, కనుక 1960 నాటికి ఉన్నతవిద్యల నభ్యసించేవారిసంఖ్య

4,600,000 కు పెంచాలని వాంఛిస్తున్నారు.) ఐనప్పటికీ యూరప్‌లో హైస్కూల్ చదువులు పూర్తిచేసినవారిలో 20 మందిలో ఒక్కరు మాత్రమే కాలేజి చదువులకు వెళ్తూండే - యునైటెడ్‌స్టేట్స్‌లో హైస్కూల్ విద్య పూర్తిచేసిన ప్రతి నలుగురులోనూ ఒకరు కాలేజి చదువులకు వెళ్తున్నారు. ప్రపంచంలో మరెక్కడా యునైటెడ్‌స్టేట్స్‌లోవలె అత్యధిక సంఖ్యాకులు ఉన్నతవిద్యనభ్యసించడంలేదు.

మిగతా విశ్వవిద్యాలయాల కన్నా - ఏ రెండు మూడు విశ్వవిద్యాలయాలో అత్యుత్తమవిధానంలో విద్యనేర్పుతుందనే బయటి ప్రపంచం తాలూకు భావన పొరపాటు. దాని పరిమాణాన్నిబట్టీ, ఆయా రాష్ట్రాలనూ, ప్రాంతాలనుబట్టీ, ఆయానమ్మకాల్నిబట్టీ విభాగాలు చేయబడినప్పటికీ, యునైటెడ్‌స్టేట్స్‌లో విజ్ఞానాన్నిచ్చే కేంద్రాలు అనేకం ఉన్నవి. మహాపట్టణాలనుంచి దూరంగా, ఏ మారుమూలనో ఉన్న చిన్నకాలేజీలో విద్యనేర్పేవిధానం నాణ్యమైనదిగా ఉండటం అనేక సందర్భాలలో జరుగుతోంది. ఇటీవలి అంచనాల ప్రకారం - శాస్త్రీయసంబంధమైన విజ్ఞానాన్నిచ్చే 50 కాలేజీలలోనూ, 39 చాలా చిన్నవనీ; దేశపరిపాలనలోని ఉన్నతాధికారుల్లో 88% మంది చిన్న కాలేజీలలో గ్రాడ్యుయేట్లయి వొచ్చినవారేననీ తేలింది.

సంస్కరణ విధానంలో కనబడే విద్యాలయాల్లో చాలావరకు - మనం అనుకున్నట్లు - ప్రైవేట్ సంస్థలచే నడపబడుతూన్నవి. ఉదాహరణగా - జాన్‌హాప్‌కిన్స్ - ఇది యూరప్‌పియన్ విధానంలో గ్రాడ్యుయేట్ శిక్షణ నివ్వటాన్ని మొట్టమొదటగా ప్రవేశపెట్టింది: స్వార్త్‌మోర్ - ఇదిఇంగ్లీషు ఆనర్స్‌కోర్స్‌ను అమెరికన్ విధానంలో ప్రవేశపెట్టింది: ఏంటియక్ - ఇది చదువుసాగిస్తూనే పనిచేసుకుంటూ కాస్తోకూస్తో సంపాయించుకునే పద్ధతిని ప్రవేశపెట్టింది; బెన్నింగ్‌టన్, సారాలారెన్స్ - ఇవి జాన్‌డ్యూయీ సిద్ధాంతాలను అనుసరించిన విద్యాబోధనను మొట్టమొదటిసారి కాలేజిస్థాయిలో ప్రవేశపెట్టినవి.

విద్యాసంస్థలలో మూడింట రెండుపాళ్లు ప్రైవేట్ సంస్థలుగా ఉంటూ, విరాళాలమీద నడపబడుతూన్నవి. మిగతావి - పట్టణానికి లేదా రాష్ట్రానికి సంబంధించినవై ఉండి, పన్నులు వసూలుచేయటం ద్వారా నడపబడుతూ న్నందువల్ల, తక్కువ ఫీజులకు చదువుచెపుతూ, ఎక్కువమంది విద్యార్థ విద్యార్థినుల్ని ఆకర్షించగలుగుతూన్నవి; ప్రైవేట్ సంస్థల ఖర్చులు దినదినాభి వృద్ధి అవుతూండటంవల్ల స్కూల్ ఫీజుల్ని కూడా ఎప్పటికప్పుడు పెంచు తూండవలసివొస్తోంది. కొన్ని సంస్థలు - కార్నెల్ లేదా సిరాక్యూజ్ మొద లైనవి కొంతవరకూ రాష్ట్రానికి సంబంధించినవిగానూ, మరికొంతవరకూ ప్రైవేట్ సంస్థకు సంబంధించినవిగానూ ఉంటూన్నవి. కొన్ని ఒకే రంగా నికి సంబంధించిన విద్యను అందిచ్చేవిగా ఉంటూన్నప్పటికీ - దాదాపుఅన్ని సంస్థల్లోనూ వివిధరంగాలకు సంబంధించిన విద్యాసౌకర్యాలు చేయబడే ధోరణి స్పష్టమౌతుంది. అమెరికన్ యూనివర్సిటీలో - వేదాంతం, చట్టం వైద్యం, పురాణాలు మొదలైనవి బోధించటం ఎంతపరిపాటో - పశువైద్యం నర్సుల శిక్షణ మొదలైనవి ప్రవేశపెట్టటం ఒక వింతగా ఉండదు. అన్ని వృత్తులకూ ఒకే సామాజిక వాతావరణాన్ని కల్పించటంద్వారా - అమెరి కన్ సంస్థలు ఒక సామాన్యమైన నిచ్చెనద్వారా అందరూపైకి ఎగబాగే అవకాశాలను కల్పిస్తూన్నవి.

కాలేజీలూ, యూనివర్శిటీలూ - సమాజానికి సంబంధించిన ఇతరసంస్థల వలెనే, ప్రముఖపాత్రవహించే "సామాజిక - ఆర్థిక" ముఠాల అదుపులో ఉండే ధోరణిని సూచిస్తూన్నవి. విరాళాలమీద నడపబడే ప్రైవేట్ కాలే జీలు, ఆధిపత్యాన్నివహించే సంఘాన్ని ఎన్నుకోవటంద్వారా, విరాళాలు సక్రమంగా అందేట్లు చేసుకోగల్గుతూన్నవి. రాష్ట్రాలచే నడపబడే సంస్థలు రాజకీయంగా బలమైనవారితో సంబంధాలను కలిగిఉన్నవి. ఈ రెండూ కూడా సమాజంమీద ఆధారపడుతూ, ఫుట్ బాల్ మొదలైన ఆటపాటల తాలూకు ఆవేశాలను కూడగట్టుకుంటూ ముందుకు సాగుతూన్నవి.

ముందుకు సాగుతూన్న గుణగణాలున్న అమెరికన్ అండర్ గ్రాడ్యుయేట్ శిక్షణకు ఉద్దేశించబడిన విషయాలను యీ విధంగా క్రోడీకరించవొచ్చును: ఉపన్యాసాలద్వారా బోధనచేయటంకన్న. వ్యక్తిగతమైన శిక్షణనుఇస్తూ. సమూహంగా వాదప్రతివాదాలు చేయటంద్వారా శిక్షణనివ్వటం; క్లిష్టతరమైన అనేకసమస్యలతోకూడిఉన్న ప్రపంచంలో జీవితాన్నిగడిపేందుకు తగినవిధంగా విద్యార్థుల్ని రూపొందింపజేస్తూ - వారికీ ఆర్థికవిధానం, ప్రభుత్వం, అంతర్జాతీయతా మొదలైనవాటిని బోధించటం; ఒడుదుడుకులు ఉండని జీవితంలో లలితకళల అవసరమూ. వాటిస్థానాలనుగూర్చి చెప్పటం; ఉత్తరోత్రా ఒక వృత్తికితగిన శిక్షణను అందించటం; ఆడపిల్లయితే ఆమెను మాతృత్వానికీ, పిల్లలపెంపకానికీ సంసిద్ధురాలిని చేయటం.

వివిధశాఖలుగా విస్తరించిన ఈ విధానంలో ఎవరో మహామేధావులు పాయింట్లుద్వారా 'మేటి' అనిపించుకొనే పద్ధతి కనిపెట్టాడు. వారంరోజులు క్లాస్‌పనులుచేస్తూ. రోజుకు ఒక్క గంటచొప్పున పనిచేసిన విద్యార్థికి టరమ్‌కు ఒక పాయింటు; రోజుకు మూడేసి గంటలచొప్పున ఐదుకోర్సులకు టరమ్‌కు 15 పాయింట్లు - గ్రాడ్యుయేట్స్ 120 పాయింట్లు : ఎంత సులభం ! ఈ లెక్కన హార్‌వర్డ్‌లోని సామాజికశాస్త్రపఠనం - పొడుక్క్‌లోని ఉన్నిపోగుచేసే శిక్షణతో సమాప్తమౌతుంది. విద్యార్థులు తమ ఇష్టానుసారంగా ఒక విశ్వవిద్యాలయంనుంచి మరొకదానికి మారే సౌకర్యం ఏర్పాటు చేయబడింది.

ఐతే ఇలాటి సమానత్వమొకటి నిజంగానే ఉన్నదని ఎవ్వరూ నమ్మలేరు. కాని ఎకడమిక్‌బుక్‌వర్క్ ఎంతో సులభసాధ్యం చేయబడింది. ఇక విద్యార్థులు ఒక సంస్థనుంచి మరొకసంస్థకు మారుతూఉండొచ్చు; క్రొత్త సంస్థ - పాతసంస్థ ఇచ్చినపాయింట్లను గుర్తించక తన గర్వాన్ని ప్రదర్శించినప్పటికీ. లేదా వేరొక సంస్థలోని తరగతిని తగ్గించినప్పటికీ ఇది సాధ్యమే. కొత్తసంస్థ తనస్థాయిని సూచించేవిధానాన్ని ఏర్పరచుకొని -

A అంటే అత్యుత్తమం అనీ, B అంటే మంచిఅనీ, C అంటే ఫర్వాలేదు అనీ; D అంటే శిక్షణఎంతో అవసరమనీ (లేదా మరొకసారి పరీక్షకు కూర్చోవలసి ఉంటుందనీ) E లేదా F అంటే అపజయమనీ ఏర్పర్చ వొచ్చు. ఒక విద్యార్థి ఎక్కువశిక్షణలను పొందవలసిఉన్నా, లేదా ఎక్కువ అపజయాలను ఎదుర్కొన్నా, స్థాయినినిలబెట్టుకొనేందుకు ఆ విద్యార్థి ఎండా కాలపు శిక్షణాలయాలలో జేరేందుకు అనుమతించబడతాడు. ఇలాటి విద్యా ర్థులనూ, పై స్థాయికి వెళ్ళాలని ఉద్దేశించే బోధకులకూ, నాలుగేళ్ళ కాలేజీ చదువును మూడేళ్ళలోనే పూర్తిచేయాలనే విద్యార్థులకూ ఎండాకాలపువిద్యా లయాలు ఏర్పడి, ఎంతో అభివృద్ధిని పొందుతూన్నవి.

శిక్షణలనిచ్చేవారు దారిచూపుతూ, అంకుశంతో ముందుకు నడిపించటమే గాక, విద్యార్థి బాగోగులను పరిశీలించే హేమాహేమీలు ఎంతోమంది అందుబాటులో ఉంటున్నారు. మాధ్యమికయుగంలోని ఏ రాజకుమారునికీ ఇలాటి హేమాహేమీలలో సగంమంది సేవలుకూడా లభించిఉండవని నిస్సందేహంగా చెప్పవొచ్చు. మొదట్లో కాలేజీ 'డీన్' ఉంటాడు; అయన కాలేజిలోని విద్యార్థులందరికీ పితృసమానుడు: ఎంత నిష్కర్షగాఉంటాడో, ఒకో సమయంలో అంత అలుసుగానూ ఉంటూంటాడు. పురవాసులు కోప గించుకొనే చెడుపనులేమైనా విద్యార్థులు చేసినట్లయితే, డీన్ కల్పించుకొని తన విద్యార్థుల్ని తగిన విధంగా శిక్షించేందుకు నిర్ణయిస్తాడు; పురవాసులు ఇంతతో శాంతించాక, ఆ శిక్ష నిజానికి అంతకఠినంగా ఉండకుండా ఎలాగో సమర్థిస్తూ, శిక్షించేప్పుడుకూడా - తానుకూడా ఒకప్పుడు విద్యా ర్థినేనని, ఉత్తరోత్రా పెరిగిపెద్దయాక తాముచేసిన అల్లరిపనుల్ని గూర్చి తప్పక నవ్వుకోవలసివుంటుందనే అభిప్రాయాన్ని వారికి కలిగిస్తాడు. శిక్షను అనుభవించినప్పటికీ డీన్ ప్రేమాస్పదుడనీ, తాము ఆశించే ఆదర్శప్రాయ మైన పితృత్వం ఆయనలో మూర్తీభవించిందనీ, తాము అల్లరిపనులు చేయ టంవల్లనే యీ సత్యాన్ని కనుగొనగలిగామనీ, తాము పరిపూర్ణతను సంపా

యించేందుకు ఆయనమీద తిరుగుబాటుచేయవలసి వొచ్చిందనీ అభిప్రాయ పడతారు.

పరిశ్రమలను మేనేజిమెంట్ స్వాధీనపరుచుకొన్న విధంగానే, మేనేజర్ల తిరుగుబాటు విశ్వవిద్యాలయాలనుకూడా తుడిచివేసింది. ఉత్పత్తిదారుడూ, వస్తువును వ్యయపరిచేవాడూ - ప్రొఫెసర్, విద్యార్థి వీరిమధ్యగా అనేకమంది ప్రత్యేకప్రతిభలున్నవారు విద్యార్థులు ఉత్తీర్ణులయేందుకు సేవలను అందిచ్చే ఉద్దేశంతో బయలుదేరుతున్నారు; ఒకప్పుడు ఎంతో సులభంగాఉన్నదాన్ని ఇప్పుడు వివిధభాగాలుగాచేసినా పూర్వంకన్నా ఎంతో శక్తివంతంగానూ, బలవత్తరంగానూ రూపొందింపజేశారు.

అమెరికన్ జీవితంలోని ప్రతివిభాగంలోనూ వొచ్చిపడేఇబ్బంది - కాలేజి విద్య ఎంతోపెద్దచేద్దామని ప్రయత్నించటంవల్లనే! వాటి ఆదర్శాలు సుస్థిరమైనవి; కాని వాటిని ఆచరణలో పెట్టేందుకు మొండిగా ఉండే మానవులతో వ్యవహరించవలసివొస్తోంది. కొన్ని దశాబ్దాలుగా విద్యావేత్తలు క్రీడారంగంలోని పోటీల ద్వారా ఆదర్శాలను అందుకోవాలనే పురాణాభిప్రాయాన్ని వెల్లడిచేస్తూనేఉన్నారు. ఐతే ఇప్పుడు ఆరోగ్యకరంగాఉండే శరీరానికూ్కడా ఎంతోచేయవలసిన పనిఉండటంవల్ల ఉత్తమతరగతికిచెందిన ఒక వైద్యాలయం, అనుభవజ్ఞులైన డాక్టర్లూ, నర్సుల పర్యవేక్షణలు అవసరమైనవి; కాలేజికిరాకపూర్వమే చిన్నతనంలో దాపరించిన రోగగ్రస్తతను నివారణచేసుకోనివారికూ్కడా ఇక్కడ వైద్యసహాయం లభ్యమౌతూన్నది. పురుషుడు - స్త్రీ, రాత్రి - పగలు - వలె ఇప్పుడు శరీరమూ, మనస్సు విడివిడిభాగాలుగా గుర్తించబడటంలేదు. కనుక ఒక మానసికశాస్త్రవేత్తకూడా అందుబాటులో ఉండవలసిన అవసరమున్నది. సామాజికమైన కర్మకాండ కొంత జరగాలి; ఇందులో యువతీయువకులు గాయపడకుండా సెక్స్ అంచులవద్ద కలుసుకోవటం జరగవలసిఉన్నది. ఇలాటి సందర్భాలలో చేసి నేర్చుకోవటమనేది అపాయకరమైనదిగా పరిణమిస్తూఉండగలదు!

ఐతే ఎవరుపకితేవారు, ఏదిపకితేఅది నేర్వగలరనే నమ్మకంలోని నటన సరైనమోతాముల్లో అది అందివ్వబడితే—ఉదాహరణలుగా - భోజనం, పని, ఆటపాటలు, వ్యక్తి - సమాజం, దేశము—పట్టణము, సెక్స్ - మతం, వేగము - విశ్రాంతి, మనస్సు - దేహం - పఠనంద్వారా విజయమూ: సౌఖ్యమూ ప్రాప్తిస్తవనేది కలకాలం జీవించగలిగే ఒకానొక జానపద గాథ ! కనుక కాలేజి జీవితంలో కొంతపఠనమూ, కొంతక్రీడారంగంలో వ్యాయామమూ, అనేకసందర్భాలలో సంపాదనఉండే పనిపాటలూ, ప్రొఫెసర్లతో కొంతసంబంధబాంధవ్యమూ, తద్వారామరికొన్నిపాయింట్లు సంపాయించుకొనే అవకాశమూ, కొంతకఋప్పగోయతనమూ, పురుషుడైతే తన పురుషత్వాన్ని నిరూపించేందుకు కొద్దిఅల్లరిచిల్లరపనులూ మొదలైనవన్నీ కలిసి విద్యార్థి జీవితాన్ని రూపొందిస్తున్నవి.

విద్యార్థి జీవితంలో - వార్తాపత్రికల్ని ఎడిట్ చేయటం (దినపత్రిక లేవా వారపత్రిక) విద్యాలయానికి సంబంధించిన మేగజైన్స్, వార్షికసంచికలను ప్రచురించటం, డిబేటింగ్‌లలో పాల్గొనటం, అనేకక్రీడలలో కొన్నిటిలో విద్యాలయానికి సంబంధించిన జట్టులతో బైటిఊళ్లకు వెళ్ళిరావటం, ఈ జట్టులను పర్యవేక్షించటం, క్లాస్ఆఫీసర్లుగా సేవజేయటం, నాట్యాలూ మొదలైన సామాజిక కూడళ్లను అమర్చటం, నాటకాలలో పాల్గొనటం, నేపథ్యసంగీతాన్ని పాడటం, బాండుమేళాల్లోనూ, సంగీతకచ్చేరీలలోనూ పాత్రవహించటం, సాహిత్యం, శాస్త్రీయమండలిలోని వాదోపవాదాలలో పాల్గొనటం, ఫ్రెంచ్, లేదా జర్మన్, లేదా స్పానిష్ క్లబ్‌లలో సభ్యుడుగా జేరటం మొదలైనవి ఎన్నోఉంటవి.

ఇన్ని రంగాలలో ఎంతో ఉత్సాహంగా విద్యార్థులు పాల్గొనటాన్ని చూసి యాత్రీకులు ఆశ్చర్యచకితులౌతూంటారు. ఐతే ఇన్ని రంగాలలో విద్యార్థులు పాల్గొనేఅవసరాన్నిగూర్చి ఆలోచిస్తే, విద్యాలయానికి ఆవలి జీవితానికి అనుగుణంగానే ఇదంతాజరుగుతూన్నదనే తర్కాన్ని ఒప్పుకో

వలసేఉంటుంది. ఒక ముఠాకుచెందిన విద్యార్థులతో, మరొకముఠావారు "విద్యార్థి ప్రభుత్వానికి ఫలానావారిని బలపరుస్తే, మీ ముఠానుంచి ఫలానా వారినిమేము ఫుట్‌బాల్‌టీమ్ మేనేజరుగా బలపరుస్తాము" అంటారు. ఇందువల్ల ఇవ్వటం పుచ్చుకోవటమనే వ్యాపారం లేదా రాజకీయపంథా అనుసరించటం జరుగుతూన్నది.

విజ్ఞానసాధనలోకల్లా అత్యంతకౌశలమైనదీ, ముఖ్యమైనదీ, ఎంతో గౌరవాన్నీ, పారితోషికాన్నీ సంపాయించిపెట్టేదీ - బహుజనుల్ని కూడ గట్టి ఆధ్వర్యాన్ని వహించగలగటం. ఈ కళ వ్యాపారాన్నీ, విశ్రాంతినీ కలిపేదనే విషయాన్ని కాలేజీవిద్యార్థులు త్వరలోనే తెలుసుకుంటారు; కనుక తనతోటివారితోకూడి ఒకకంచానతినటం, ఒకమంచాన పరుండటం, క్రీడారంగంలో కలిసికట్టుగా ఉండటం, తమతమ బలాబలాలతోపాటు, బలహీనతల్నికూడా తెలుసుకోవటం, నిజమైన విజయమువేది లభ్యమై నప్పుడు కాస్త సడలించటం అవసరమనీ, దానిని ఆచరణలో పెట్టాలనీ వారు ప్రయత్నిస్తూనేఉంటారు. ఈ కళలు విద్యాలయసృష్ట్యా గొప్పవిగా భావించబడినప్పటికీ, సామాజికపరంగా ఎంతో విలువైనవిగా ఉంటూ, అండర్‌గ్రాడ్యుయేట్ విజ్ఞానంలో ఒక ముఖ్యభాగంగా పరిగణించబడు తూనేఉన్నది. ఇందువల్ల యాత్రికులకు అమెరికన్ కాలేజివిద్యార్థులు అంత తెలివితేటలున్నవారు కారనేభావన కొంచెం వింతగానే ఉంటుంది. ఈ విద్యార్థులు కాలేజీలకు వొచ్చింది తాము పండితులు అవాలని లేదు; ఇంద్ర జాలంలాంటి ఆ సిద్ధాంతం - సరిసమానపాళ్లల్లో జీవితాన్ని గడపగలిగే విధానాన్ని నేర్చేందుకు।

## వనితలు : విద్య

జీవితంలో ఒక ముఖ్యభాగం - స్త్రీలు. తూర్పుభాగాన్ని మినహాయిస్తే మిగతా కాలేజీలన్నిటా విద్యార్థ, విద్యార్థినులుకలిసే విద్యాభ్యాసం చేయటం

జరుగుతోంది. మొగపిల్లలూ ఆడపిల్లలూ ఒకే క్లాసులోఉండి చదవ టం. ఒకే టేబిల్ మీద భోజనాలుచేయటం, ఒకే రకం పాఠ్యపుస్తకాలను పఠించటం, ఒకే రకం ఉత్సాహాలతో ఉండటం. పచ్చిక మైదానంమీద హాయిగా కూర్చొని జీవితాన్నిగూర్చి చర్చించటం మొదలైనవి చేస్తూ ఉంటారు. ప్రేమపెళ్లిళ్లను సమాజం అంగీకరించినా, యువతీయువకులకు తగిన సహాయమంటూ చేయదు; ఐతే కాలేజి నిర్వర్తించేపనుల్లో ముఖ్య మైనవాటిల్లో ఒకటి ఇది; వారి వారికి నచ్చిన భాగస్వామిని ఎన్నుకొనే అవకాశం ఉండేవిధంగా, వారిని సరిసమాన వయస్కులలో, వివిధ జాతు లలో తమ తమ అనుభవాలను స్వేచ్ఛగా చెప్పుకుంటూ, వాదప్రతివాదాలు చేసుకుంటూ, తాము ఎరిగిన వ్యక్తి ఎలాటి తత్వంగలవాడో పరిపూర్ణంగా తెలుసుకునేందుకూ, తమకు నచ్చిన పక్షంలో వారు దంపతు లయేందుకూ తగిన సావకాశాల్ని కలిగించటం జరుగుతోంది.

ఈ రోజుల్లో అనేక సందర్భాల్లో కాలేజీలో చదువుసాగిస్తూ ఉండగానే విద్యార్థ, విద్యార్థినులు వివాహాలాడటం జరుగుతోంది. ఇతరత్రా వారిని తలక్రిందులుచేసే సమస్యలనుంచి విడివడి, జీవశాస్త్రరీత్యా సంసిద్ధులైఉండిన వారు గడుపవలసిన జీవితాన్ని వారు గడపగలుగుతున్నారు. యుద్ధకార ణంగా షిఫ్ట్‌ఏర్పరచబడటంవల్ల మామూలుగా కాలేజీవిద్య నభ్యసించేందుకు గాను వొచ్చేవారికన్నా 4-5 సంవత్సరాలు వయసులో పెద్దగాఉన్నవారు రావటం జరిగింది; ఆ పద్ధతి ఇంకా కొంతవరకూ సాగుతూనేఉన్నది. ఈ రోజుల్లోని అండర్‌గ్రాడ్యుయేట్లలో 16% మంది వివాహితులు. ఐతే కొన్ని కాలేజీల నిర్వాహకులూ, తల్లిదండ్రులూ ఇలాటి అభిప్రాయంపట్ల తమ ఏవగింపునూ, కోపాన్నీ వెల్లడిచేస్తున్నారు.

ఇక కాలేజీవిద్యార్థిని విషయం - ఆమె కొన్నిరోజులపాటు పనిపాటలు చేసుకోవలసి ఉండటంవల్ల ఆమె పాఠ్యభాగాలు క్లిష్టంగా ఉంటవి; గ్రాడ్యు యేట్లయిన అనేకమంది ఆడపిల్లలు లా లేదా మెడికల్ కాలేజీల్లో చదివే

తమ తమ భర్తలను ఉద్యోగాలుచేసి పోషిస్తూ, ఆ తరువాత జీవితశేషాన్ని గృహిణిగా, మాతగా, సామాజిక సేవకురాలుగా గడుపుతూంటారు. కనుక ఆమె రెండు రకాలవృత్తి లేదా ఉద్యోగాలకు తగిన విధంగా వారు చదువులు, నేర్వవలసిఉంటుంది. వృత్తిరీత్యా ఆమె చదువే ఆమె వివాహానికి అవసరమైన కట్నమేగాక, ఆమె ఇన్సూరెన్స్ పాలసీకూడాను. ఆమె వివాహమాడే పక్షంలో మంచిభర్త లభిస్తాడు. ఏదైనా అవాంతరం వొచ్చిపడి ఆమె వివాహమాడక పోయినప్పటికీ, లేదా కోరిన భర్త లభ్యమవనప్పటికీ, ఒకరిమీద ఆధారపడి జీవితాన్ని గడపవలసిన దుర్ఘటనకు ఆమెలోనవదు; ఆమెకు మంచి ఉద్యోగమొకటి గ్యారంటీగా దొరుకుతుంది.

కనుక తాను అవలంభించబొయ్యేవృత్తిని ఎన్నుకొని ఆమె అందుకు తగిన విధంగా విద్యనభ్యసిస్తుంది. అనేక సందర్భాలలో ఆమె ఉపాధ్యాయినిగా ఉండగోరుతుంది; ఎందుకంటే ప్రతిముగ్గురు అధ్యాపకుల్లోనూ ఒకరు స్త్రీ: ఐతే ఏ ఇతర వృత్తులూ ఆమెను ఆటంకపరచేవిగాలేవు: పైకి పాకటం కష్టతరంగా ఉంటూ, పురుషులతో సమానమైన వేతనాలు అరుదుగా లభ్యం అవుతూన్నప్పటికీ, ఆమె వాటికొరకై ప్రయత్నించేందుకు ఏలాంటి అభ్యంతరమూ లేదు. ఐతే తన మాతృత్వం పరిపూర్ణతను పొందాలని వాంఛించే కాలేజి విద్యార్థిని బహుశా మనస్తత్వశాస్త్రం, ముఖ్యంగా బిడ్డల పెంపకాన్నిగూర్చి పఠించేందుకు ఉత్సాహపడుతుంది. గృహసంబంధమైన ఆర్థికవిధానాన్ని కొన్నికాలేజీలు, తెలివితేటలున్నవారికి తగినవిభాగంకాదని తొలిగించినా మరికొన్ని కాలేజిలలో ఆమె దీన్ని నేర్చుతూనే ఉన్నది. తన తోటివిద్యార్థులవలెనే ఆమెకూడా కాలేజి రాజకీయాల్లో పాల్గొంటూనే ఉంటుంది; ఎందుకంటే ఉత్తరోత్రా ఆమెకూడా స్నేహితుల్ని సంపాయించి రాజకీయాలలో తన పలుకుబడుల్ని ప్రసరింపజేస్తుంది.

## గ్రాడ్యుయేట్ స్టడీ

అండర్‌గ్రాడ్యుయేట్ కాలేజీనుంచి, విశ్వవిద్యాలయానికి సంబంధించిన గ్రాడ్యుయేట్ కాలేజీకి ఉరకటం - ఒకవిధంగా హైస్కూలునుంచి కాలేజివిద్యకు ఉరకటమంత హఠాత్తుగా ఉంటుంది. దేశంలోని 278,000 మంది గ్రాడ్యుయేట్ విద్యార్థులూ లా లేదా వైద్యం, వేదాంతం, ప్రభుత్వం - మొదలైన వాటిల్లోకి ఎంతో పోటీఉన్న రంగాలలోకి వెళ్ళాలని చాలా పట్టుదలతో ఉన్నారు. గ్రాడ్యుయేట్ విద్యనభ్యసించేందుకు సీటు దొరకటమే ఎంతోకష్టం; ఆ పోటీలో నెగ్గిన్న తరువాత తమ ఉచ్ఛస్థానాన్ని నిలబెట్టుకోనట్లయితే వెనుకబడిపోవటం తప్పదని వారికి తెలుసు.

రాజకీయాల్లో పాల్గొనేందుకైనా, వినోదకార్యక్రమాలను నడిపేందుకైనా, క్రీడారంగంలో పాల్గొనేందుకైనా ఇప్పుడు వ్యవధిఉండదు. ఒక సంవత్సరక్రితం వీటిని ఎంత ఆతృతతో ఆరాధించాడో, ఇప్పుడు అంత త్వరగా వొదిలించుకొని బైటపడతాడు. ఇప్పుడు హాస్టల్‌లో మరికొంత మంది విద్యార్థుల్తో ఉండటం లేదా మరొక విద్యార్థితో ఒక గదిని పంచుకోవటం కుదరదు; కనుక తనకు తానుగా ఒక గది తీసుకుంటాడు. లెక్చర్లు లేదా వాదప్రతివాదాలలో ఇప్పుడు అతనికిపనిలేనట్లయితే, ఎక్కువ కాలాన్ని పుస్తక భాండాగారంలోకానీ, లేబరేటరీలోకానీ గడుపుతాడు; లేదా ఎంతో విలువైన తన పాఠ్యగ్రంథాల పఠనంలో రాత్రి చాలా పొద్దుపొయ్యే దాకా గడుపుతాడు. అడపాదడపా ఒక సినిమా చూసేందుకు, లేదా పాట కచ్చేరీకి వెళ్ళేందుకు, లేదా ఒక టెన్నిస్‌ఆటకు లేదా ఎవరితోనైనా కాస్సేపు కులాసాగా కబుర్లు చెప్పుకునేందుకు వెళ్తాడు; ఐతే పనిచేయటమే ఇప్పుడు అతని గమ్యస్థానం; అందుకే పాటుబడతాడు.

గ్రాడ్యుయేట్ స్కూల్‌ప్రొఫెసర్ చదవవలసిన పరిమాణాలకూ, హాజరు కావలసిన లెక్చర్లకూ, పరీక్షలూ, టెస్టులలో పాల్గొనవలసి రావటం, దీర్ఘమైన బరువైన రిసెర్చిపేపర్లకూ, ఈ పేపర్లనుగూర్చి ప్రొఫెసర్లూ, విద్యా

ర్థులూ జరిపే వాదోపవాదాల మేలురకం సెమినార్లకూ సముద్రాంతర పరిశీలకులు సదభిప్రాయాన్ని పొందుతారు.

ఇంత నిశితమైన పఠనం ఒక సంవత్సరంపాటు లేదా ఒక్కోసమయంలో రెండు సంవత్సరాలపాటు జరుగుతే - సామాన్యంగా మాస్టర్ డిగ్రీకి అర్హత లభిస్తుంది. పి. హెచ్. డి. డిగ్రీకి కావలసిన కనీస కాలం మూడేళ్లు: ఐతే చాలామంది విద్యార్థులకు ఇంకా ఎక్కువకాలం కూడా పడుతూఉంటుంది. వైద్యంలో ఆరితేరేందుకు అక్కడేఉండి లెక్చర్లకు హాజరవుతూ, లేబరేటరీలో పనిచేస్తూ కొన్ని సంవత్సరాలు గడపవలసి ఉంటుంది.

అమెరికన్ విద్యావిధానం హైస్కూల్‌నుంచి కాలేజికి, కాలేజినుంచి గ్రాడ్యుయేట్‌స్కూల్‌కూ - హఠాత్తుగా ఎందుకు మారుతుందో తెలుసుకొనే కుతూహలం ఉండకపోదు. ప్రతివిషయానా తాము రూపొందించిన వస్తువు సుదీర్ఘమైనదీ, చాలావరకు పరిపూర్ణతను అందుకొన్నదీ అన్న విషయంపట్ల ఆందోళనచెందిన విధంగా, కనుక దాన్ని విరుద్ధవిధానంలో సరిజేయవలసి ఉంటుందని గ్రహించటం జరిగినట్లు తోస్తుంది. మొదటి స్థితిలో హఠాత్తుగా సామాజికస్వేచ్ఛ ఇవ్వబడి, విద్యార్థిమీద కుటుంబ ఆధ్వర్యంకూడా తొలిగించబడుతోంది: రెండోస్థితిలో విజ్ఞానస్వాతంత్ర్యం ఇవ్వబడి - హఠాత్తుగా నీటిలోపడేసినట్లూ - 'చేతనైతే నీ అంతట నీవే యీది ప్రాణాలు కాపాడుకో; లేదా మునిగి చావు' అన్న విధానంలో జీవన్మరణసమస్యను ఎదుర్కొనేట్లు రూపొందించబడింది.

గ్రాడ్యుయేట్ స్కూల్స్‌లోని ఇబ్బందులు ఇవి: ఆయా రంగాల్లో పరిపక్వత లేకుండానే ఎంతో కృషిచేయవలసిన అవసరం, యాంత్రికమైన రిసెర్చ్‌పద్ధతీ, విపరీతంగా పఠించవలసి ఉండటం, చాలాతక్కువ దూరదృష్టిను, ముందు ముందు కాలేజీ ప్రొఫెసర్ అయ్యేందుకు పి. హెచ్. డి. డిగ్రీ అవసరమౌతూన్నది: ఐతే పి. హెచ్. డి. డిగ్రీ సుశిక్షణను ఇచ్చి,

బోధనావిధానకళకు సంబంధించకుండా ఉన్నది. ఈ డిగ్రీ విద్యార్థిని బోధకుడుగా ఉండగోరటంలేదు. అందుకు మారుగా ఎక్కువ పరిశోధనను నడపాలని కోరుతూన్నది. ఈ విధానాన్ని అనుసరించినప్పటికీ ఆ కారణంగా కాకపోయినా, ఎక్కువమంది బోధకులు యీ డిగ్రీవల్ల తయారవుతున్నారు.

## జనరంజకమైన విద్య

విశ్వవిద్యాలయాలు మరింత విశాలదృష్టితో జనులందరూ తమ శక్తి వంచనలేకుండా విద్యాసౌకర్యాలను పొందే విధంగా సేవలు చేయాలని ప్రెసిడెంట్స్ కమీషన్ కోరింది.

రాష్ట్రాలకు సంబంధించిన గొప్పవిశ్వవిద్యాలయాలన్నీ యీ ఆదర్శాన్ని అందుకునేందుకు అప్పుడే ఎన్నో ప్రయత్నాలు చేసినవి; వివిధ రంగాలలో విద్యావ్యాప్తి టెలివిషన్‌ద్వారా, పోస్టుద్వారా, తమ తమ క్లాసులను రాష్ట్రములోని వివిధ భాగాలకు విస్తరించటం ద్వారా, తర్కాలూ, వాదప్రతివాదాలూ, చదువులు నేర్చిన మతాలను ప్రోత్సాహపరచటం ద్వారా ఇది జరుగుతోంది. 800,000 మంది వయోజనులు విద్యాలయాలకు వెళ్ళకుండానే విద్యాభ్యాసంచేసే ఏర్పాట్లుచేయబడినవి; పోస్టుద్వారానూ, టెలివిషన్‌ద్వారానూ విద్యావ్యాప్తి 30,000,000 మందికి అందుబాటులో ఉంటూన్నది.

ఈ లోగా వయోజనవిద్యావ్యాప్తి దేశమందంతటా ఋతువులో పుష్పించిన విధంగా విస్తరించింది. 1826 లో జోసియా హాల్‌బ్రుక్ మెసాచుసెట్స్‌లో లిసియమ్ మువ్‌మెంట్‌ను ఆరంభించింది మొదలూ విద్యాగంధమనేది అమెరికన్ సంస్కృతిలో లోతుగా పాతుకానిపోయింది 1874 లో చౌట్యుక్ మువ్‌మెంట్ వొచ్చి - 1904 కు పర్యటనలుచేసే తః కంపెనీలను దేశంలోని నలుమూలలకూ పంపింది, తెల్లవారేటప్పటికి

ఖాళీప్రదేశంలోనో ఒక దేరావేయబడటం ఎండాకాలంలో ఒక వారం రోజులపాటు పురజనులకు ఉపన్యాసాలూ, సంగీతం, పుస్తకపఠనం, పర్యటన విశేషాలూ మొదలైనవి లభ్యమౌతూంటవి.

ఈ రోజుల్లో వయోజనవిద్యకు పబ్లిక్‌స్కూల్స్ కేంద్రంగాఉంటూ, పురజనులు చదువుసంధ్యలను కొనసాగించేందుకు వీలుగా రాత్రిపూట విద్యాబోధనా సౌకర్యాలు సమకూర్చబడినవి. వీటిలో 30 లక్షలకు పైగా వయోజన విద్యార్థులుంటున్నారు: వీరికి లెక్కలు మొదలూ, లోహాలమీద పనిచేయటంవరకూ, స్పానిష్ మొదలైన భాషలు నేర్పటం దాకా జరుగుతోంది.

అనేక సంస్థలు ప్రత్యేకమైన ప్రణాళికల్ని ప్రవేశపెడుతూన్నవి. వై. యం. సి. ఎ., వై. డబల్‌యూ. సి. ఎ. తాలూకు యూనియన్‌లూ ముతాలూ లేదా ప్రత్యేకంగా ఏర్పడిన ఎసోసియేషన్లు అనేక ఉపన్యాసాలను ఏర్పరచటం, ఉద్గ్రంథాల పఠనం, అంతర్జాతీయ పరిస్థితుల్ని చర్చించటం మొదలైన వాటిని ఏర్పాటుచేస్తవి. వ్యవసాయశాఖ విస్తరించిన సర్వీస్‌లో 70 లక్షల మంది గ్రామవాసులకు అచ్చువేయబడిన కరపత్రాలూ, ప్రదర్శనలూ అందుబాటులోఉంటూ, అనేక ఉపన్యాసాలకు హాజరవటం లేదా 4 H క్లబ్స్ (చేయి, హృదయం, గృహం, ఆరోగ్యం) లో సభ్యులుగా జేరటం ద్వారా - గ్రామీణ బాల బాలికలకు తగినంత వినోదం లభ్యమవటమే గాక, వ్యవసాయంలో అత్యుత్తమ పద్ధతులుకూడా అలవడటం జరుగుతోంది. దేశం నలుమూలలకూ పర్యటన గ్రంథాలయం - చక్రాలమీద దొర్లుకుంటూవెళ్లి అధునాతన సాహిత్యగ్రంథాలనూ, కావ్యాలనూ, వినోదించదగిన సాహిత్యాన్ని వ్యవసాయమే వృత్తిగా జీవించే వారికి అందిస్తూన్నది.

పబ్లిక్ లైబ్రరీ (ఇలాటివి 7,000 ఉన్నవి) ఒక విద్యాసంస్థగానేఉంటూ న్నది; ఎందుకంటే లైబ్రరీ ఇంటికి తీసుకొనివెళ్ళి చదువుకునేందుకు

గాను పుస్తకాన్ని ఎరువివ్వటమేగాక, పాఠకులకు తమకు కావలసిన పుస్తకాలను ఎలా ఎన్నుకొని, కనుక్కోవాలో సలహాలనివ్వటం, పుస్తకాలగూర్చిన చర్చల్ని ఏర్పరచటం, బాల బాలికలకు కథలుచెప్పే గంటల్ని అమర్చటం, చర్చావేదికల్ని ఏర్పరచటం, ఫిలిం ప్రోగ్రాములూ, పాఠ్యపట్టికలూ, ఎగ్జిబిషన్లూ, అంధులు చదివే బ్రెయిల్లీపుస్తకాలూ సంస్కృతిని పెంపొందించుకొనే మీటింగులూ, ప్రత్యేకశ్రద్ధఉన్నవారికి లేదా ప్రత్యేకశాఖమీద కుతూహలమున్నవారికి-ఉదాహరణకు స్థానికచరిత్ర, లలితకళలూ మొదలైనవి తగిన గ్రంథాలను సమకూర్చటం మొదలైన పనులు కూడా నిర్వర్తిస్తూంటుంది.

ఈ వయోజన విద్యాప్రణాళికలోని పునాదిరాళ్లు - వలసదారులు తండోపతండాలుగా అమెరికాకు రావటంతో ఆరంభమై, వీరినందరినీ అమెరికన్లుగా రూపొందించే ప్రణాళికను ప్రవేశపెట్టటంగా ఉంటూన్నది. ఈ విధంగా జనులందరూ అమెరికన్‌పౌరులుగాఅయే అవకాశాలు ఏర్పడినవి. సాయంసమయాలలో పబ్లిక్‌పాఠశాలల్లో ఇంగ్లీషు, అమెరికన్‌చరిత్ర, భూగోళమూ, ప్రభుత్వం మొదలైన విషయాలనుగూర్చి వీరునేర్చుకుంటారు. ఈ క్లాసులకు తప్పకరావాలనే బలాత్కారమేమీలేదు; స్వచ్ఛందసేవకులవలె రావటం, విజ్ఞానసాధనలోనిరుచిని చవిచూడటం, అనేకులు ఇందులో జేరి, తెలుసుకోవటమనేది తమజన్మహక్కనే విషయాన్ని గ్రహించటం ద్వారా ప్రజాస్వామ్యమనేది సక్రమమార్గంలో అనుసరించబడుతోంది.

ఐతే విద్యావిధానాన్ని సరైన ప్రజాస్వామ్య పద్ధతులమీద నడిపించటంలో యునైటెడ్‌స్టేట్స్ విఫలత ఇది: వివిధ రాష్ట్రాలలోని విద్యాసౌకర్యాలలో ఎన్నోభేదాలున్నవి; కొన్ని రాష్ట్రాలలోని విద్యాలయాల్లోని విద్యావిధానం, మరికొన్ని రాష్ట్రాలలో వాటికన్న మేలురకంగా ఉండటమూ, ముఖ్యంగా దక్షిణాన నీగ్రోల చదువుసంధ్యలకు తగినన్ని అవకాశాలు లేకుండటమూను. 1954–1955 సంవత్సరాలలో సుప్రీంకోర్టు తీర్పులు

రాకపూర్వం దక్షిణరాష్ట్రాలలో నీగ్రోలకూ, శ్వేతజాతీయులకూ వేరు వేరు విద్యాలయాలు ఉండేవి. ఇలాటి విధానం కొనసాగించేందుకు ఇక చట్టం సమ్మతించనప్పటికీ, ఈ విభేదాన్ని సరిదిద్ది సర్వసమానత్వం పాకేందుకు బాధాకరమైన చుట్టుతోవను అనుసరించక తప్పటంలేదు.

## విద్య : స్వేచ్ఛాప్రపంచం

రెండవ ప్రపంచయుద్ధానంతరం అంతర్జాతీయ విద్యావిధానంలో ఉద్వేగ్న పూరితమైన మార్పులొచ్చి ఒక తిరుగుబాటు జరిగింది. 35,000 మంది సముద్రాంతర విద్యార్థులూ, 15,000 మంది ప్రత్యేక కౌశలమున్నవారూ ఇప్పుడు యునైటెడ్‌స్టేట్స్‌లో చదువులు సాగిస్తున్నారు. దాదాపు 10,000 మంది అమెరికన్ విద్యార్థులు ఇతర దేశాలలో చదువులు సాగిస్తున్నారు. ఫుల్ బ్రైట్ చట్టం స్మిత్ - మండ్ట్ చట్టం, ఎడ్యుకేషనల్ ఎక్స్‌ఛేంజీ చట్టం మొదలైన అనేకచట్టాలు, ఫెడరల్ ప్రభుత్వపు ధనాన్ని అంతర్జాతీయమైన మార్పులతో విద్యావిధానాన్ని కొనసాగించే అవకాశాలకొరకై వెచ్చించే అధికారాన్నిచ్చి, ప్రపంచచరిత్రలో ఒక ప్రముఖఘట్టాన్ని స్థాపించినవి. అంతర్జాతీయ విద్యాసంస్థ స్వచ్ఛందసేవకులచే నడపబడుతూ, అమెరికన్స్‌కూ, సముద్రాంతర విద్యార్థులకూ వారివారి ప్రణాళికల్లో ఎంతో సహాయపడుతూన్నది. అనేక సందర్భాలలో కాలేజీలు లేదా విశ్వవిద్యాలయాలు స్కాలర్‌షిప్‌లనుఇచ్చి, ఫీజులేకుండానే చదువుసాగించే అవకాశాలను కలిగిస్తూన్నవి.

కాలేజీ, విశ్వవిద్యాలయాల్లోని విద్యార్థ విద్యార్థినులూ, ప్రొఫెసర్లేగాక, హైస్కూల్స్‌లో చదివే చిన్నవారూ, కార్మికులూ, పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలోని ప్రతినిధులూ ప్రత్యేక కౌశలమున్నవారుకూడా ఇలాటి సాంస్కృతిక మార్పులలో పాల్గొంటూనే ఉన్నారు. ఫెడరల్ ప్రభుత్వం తాలూకు విద్యాశాఖాధికారులు - ఉపాధ్యాయ ఉపాధ్యాయినులకూ, నాయ

కులకూ, ప్రత్యేక కౌశల్యమున్నవారికీ ఎన్నో ప్రత్యేక ప్రణాళికల్ని ఏర్పరిచారు; ఇందులో 8.000 మంది జేరుతారు. దాదాపు 3.000 మంది అమెరికన్‌లు పరదేశాలలో ఉపాధ్యాయవృత్తిని అవలంభించేందుకు పంపబడుతున్నారు; అదే విధంగా పరదేశాలనుంచి అనేకమంది ఉపాధ్యాయులు అమెరికన్ సమాజంలో ఉపాధ్యాయులుగా ఉండేందుకు వొస్తున్నారు. విద్యాశాఖవారు అంతర్జాతీయంగా విద్యారంగాలలో ఇచ్చిపుచ్చుకోవటాల్ని ప్రోత్సాహపరుస్తూ, ఇతర దేశాలలో విద్యావిధానాలూ, ఆయాధోరణులూ ఎలా ఉంటవో వాటిని గూర్చిన అమూల్యమైన భోగట్టాలను అందజేస్తూ ఉంటారు.

కాలేజీ లేదా విశ్వవిద్యాలయానికి సముద్రాంతర విద్యార్థులు వొచ్చినప్పుడు, ఈ రోజుల్లో ఇది ఎంతో పరిపాటిగా జరుగుతూండటంవల్ల - చుట్టూఉన్న సమాజం వీరినుంచి, వీరివీరి దేశాలనుగూర్చి ఎన్నో విషయాలను విని, నేర్చుకునే అవకాశాల్ని సద్వినియోగ పరచుకుంటోంది. దేశంలోని మారుమూలల్లోఉన్న అనేకపట్టణాలు యీ విధానంలో ఇతర జాతీయతల్నిగూర్చి తెలుసుకోవటం వారితోడి సాన్నిహిత్యాన్ని సాధించటంకూడా జరుగుతోంది. ఇందువల్ల సముద్రాంతర విద్యార్థులకు రెండవ స్వగృహం లాంటిది ఏర్పడినట్లయింది.

ఎండాకాలంలో ప్రత్యేకమైన ప్రాక్‌దేశాలకు సంబంధించిన కోర్స్‌లు కొద్దిమంది విద్యార్థులకు ఏర్పరచబడటంవల్ల వారివారిమాతృభాషల్లో కూడా సేవచేసే అవకాశాలు లభ్యమౌతూన్నవి. అంతేగాక అమెరికన్ జీవితాన్ని గూర్చిన ఉపన్యాసాలను వినేందుకూ, అమెరికన్ విద్యార్థులతోపాటు చర్చల్ని సాగించేందుకూ, పరిసరాలలోని సామాజిక జీవనంలోకి ప్రవేశించేందుకూ-డా అవకాశాలు ఏర్పడుతూన్నవి.

అంతర్జాతీయ వ్యవహారాల్లో, అంతరాంతరాల్లో జరిగే అభివృద్ధి ప్రణాళికల విషయంలో యునైటెడ్‌స్టేట్స్ తనవిశ్వాసాన్ని విద్యావ్యాప్తిపరంగా

పరిగణిస్తూన్నది; మంచిఏదో తెలుసుకుని మానవుడు ఆచరించవలసిన అవసరాన్నీ, అనేకవిషమ సమస్యల్ని పరిష్కరించుకుంటూ, దుర్గుణాలను తొలగించుకొని మానవుడుగా చలామణి అయేందుకు విజ్ఞానమిచ్చే అధికార ప్రాబల్యాన్నీ అమెరికా గుర్తించింది. అమెరికన్ విద్యావిధానంలోని పరిశోధనలూ, స్థానికమైన అనుపు ఆజ్ఞలూ - అంతర్జాతీయంగాకూడా అమెరికాకు ఎంతో సహకారంలభ్యమై అనుపాజ్ఞల ప్రస్తావనేలేకుండా, కలిసికట్టుగా ఉండే అవకాశాలున్నవనే సూచనను రూఢిచేస్తున్నవి. వేరువేరు విధానాలను అనుసరిస్తూన్నప్పటికీ, సంబంధబాంధవ్యాలను నిలబెట్టుకోవాలంటే ఒకరి అభిప్రాయాలను మరొకరితో మార్చుకోవటమనేది ఎల్లప్పుడూ జరుగుతూనే ఉండాలి. అంతర్జాతీయంగా విద్యావిధాన పద్ధతి చేసేది ఇదే!

ఇందుకు విరుద్ధమైన తార్కాణాలను అధిగమించి, యీనాడు యునైటెడ్ స్టేట్స్ సంస్కృతిని పెంపొందించే కార్యక్రమంలో ఎంతో ఉత్సాహంతో ముందుకు సాగుతూ, చరిత్రలో ఉత్సుకతోకూడిన క్షణాలను నిరూపిస్తున్నది. పూర్వంవలె ఇప్పుడు సంస్కృతికి పరిధిలులేవు. ఇప్పుడిది అందరికీ అందుబాటులో ఉండేట్లూ, లభ్యమయేట్లూఉన్నది; తత్ఫలితాలేమిటో ముందు ముందు తెలుసుకుందాం.

అమెరికన్లు ఎప్పుడూ 'మేధావి' అనే పదం విషయంలో సిగ్గుపడుతూనే ఉన్నారు. ఈ పదాన్నే మార్క్స్ ఉపయోగించి, మొత్తం సమాజాన్ని కొన్ని తరగతులుగా విభజించి, సమాజమంటే దురభిప్రాయం కలిగేట్లు చేశాడు. ఈ పదం ఒక ఉత్తమ తరగతి సామాజిక విభాగమున్నదనే సూచనను చేయటంవల్ల, అమెరికన్ అభిప్రాయం దాన్ని అంగీకరించలేదు. ఐనప్పటికీ ఎన్నో ఊహలున్న మానవునికి పూర్వం ఎన్నడూ ఎరగనంత గౌరవమర్యాదలు ఇవ్వబడుతూనే ఉన్నవి. ప్రభుత్వంలో ఊహలున్న మనుషులు - ఆర్థికవిధానం తెలిసినవారూ, అంచనాలు వేయగలవారూ, సామాజిక శాస్త్రవేత్తలూ - శాస్త్రీయపద్ధతుల్లో రాజకీయాలను

నిర్మిస్తూ, పూర్వం ఏదో ఊహించిచేసే పద్ధతిని తొలిగిస్తున్నారు. ఆయా ఫలితాలకు ఎంతో తృప్తిజెందిన జనాభాలో అత్యధికులైన మధ్యతరగతి అమెరికన్‌లు - విజ్ఞానాన్నీ, శాస్త్రీయపద్ధతుల్నీ ఎంతో గౌరవిస్తూ మంచిజీవితానికి అవి అత్యవసరమనే నమ్మకాన్ని కలిగిఉన్నారు. విజ్ఞానమే అధికారం; ఐతే ఇప్పటి విజ్ఞానం మానవాళినే సర్వనాశనం చేసే స్థితివరకూ వొచ్చే అధికారానికి దారితీసింది గనుక, మానవాళిని కాపాడే విజ్ఞానం, ఇంకా ఉన్నతమైనది అవసరమైనది ముందుకు ఉరికిస్తోంది.

అమెరికన్ల దృష్టిలో భూమ్యాకాశాలుకలిసే స్థలాలు యీ ప్రపంచంలో లెక్కలేనన్ని ఉన్నవి ముఖ్యంగా టెక్నాలజి యీ నూతన ప్రపంచానికి తలుపులు తెరచింది. తమ తరంలోనే తాముకన్న స్వప్నాలు సత్యాలవుత వని గ్రహించి, కొంచెం ఆశ్చర్యపడినా, ఎంతో కుతూహలంతో నూతన ప్రపంచ ప్రాంగణాలలోకి ఎంతో జాగ్రతగా అడుగులిడుతున్నారు. తమను నడిపించేందుకు, వారు - విద్యావేత్త, శాస్త్రకారుడు, చిత్రకారులవైపు చేతులు జాపుతున్నారు. ఉప్పెనవలె వొచ్చిపడే విద్యార్థ విద్యార్థినుల ధాటికి విద్యావిధానం తాలూకు పునాదులే కదిలిపొయ్యేభీతి ఏర్పడేట్లున్నది. ఐతే యీ విధానం ద్వారా సమాజంలోని ప్రతిఒక్కరికీ విద్యాసౌకర్యం, అను భవం లభ్యమౌతూండటంవల్ల వెనుదిరగవలసినపనే ఉన్నట్లుగా భావించ బడటం లేదు.

---

# ఎనిమిదో అధ్యాయం

## రాజకీయాలు

అమెరికన్ రాజకీయాలు అభిప్రాయాలమీద ఆధారపడి ఏర్పడలేదు: హక్కులుపరంగా ఏర్పడినవి. పెద్ద రాజకీయపక్షాలను 'లిబరల్స్' అనీ

'కనసర్‌వేటివ్స్' అనీ విభాగించటానికి ప్రయత్నించటం అపార్థాలకు దారి తీస్తుంది; వారు ఆ రెంటికీ సంబంధించి ఉంటూ, దేనికీ చెందకుండా ఉన్నారు. తరగతివారీగా ఏర్పడిన పక్షాలు కావవి; కొంతమంది హక్కులను కాపాడేందుకుగాను కలిసికట్టుగా పనిచేస్తూ, విడిపోతూ, తిరిగిఏర్పడుతూంటవి. 'పరిశ్రమ' 'కార్మికులు' ఒకరికొకరు విరుద్ధంగా ఉంటారని తలచటం సబబుకాదు; ఎందుకంటే పరిశ్రమ, కార్మికులూ అనేక ముఠాలుగా ఏర్పడిఉన్నారు. ఒక పెద్ద వ్యాపారం, మరో చిన్న వ్యాపారంతో ఘర్షణ పడుతుంది. వ్యాపారులూ కార్మికులూ పైస్థాయిల్లో ఉద్యోగాలుండాలనీ, ఉత్పత్తి జరగాలనీ కోరుతారు; కాని, కార్మికులకు సంబంధించిన చట్టాల విషయంలో వారి అభిప్రాయాలు భేదిస్తవి.

దీని ఫలితమిది: ఘర్షణ, పోరాటం కలిపి ఒక క్లిష్టమైన రూపాన్ని ధరిస్తుంది. శామ్యూయల్ రూబెల్ అన్నట్లుగా - అమెరికన్‌లు ఏకమయేందుకుచేసే పోరాటంలోనే ప్రజాస్వామ్యపు బలాతిశయం ఇమిడిఉన్నది. దినదినప్రవర్ధమానమయే జనాభాలో అత్యధికులకు అత్యధికంగా లాభసాటిగాఉండే విధానాన్ని అభివృద్ధిచేయటం జరుగుతూన్నదని అనుభవం నిరూపిస్తూన్నది.

రాజకీయ నాయకుడు యీ ఘర్షణలనన్నిటినీ తూచి, తీర్మానాలు చేసుకొని, కలిసికట్టుగా ఏర్పరచే సిద్ధాంతాలు సర్వజనసమ్మతంగా ఉండేట్లూ, ఏ ఒక్కరికీ మితిమీరిన సౌకర్యాలు లభ్యంకాకుండానూ జాగ్రతవహించవలసిఉన్నది. పరదేశీయులు అమెరికన్ రాజకీయాలలో ఊహలూ, అభిప్రాయాలూ తక్కువని అభిప్రాయపడతారు. ఇలా ఎందుకు జరుగుతోందంటే - పరదేశీయులు కేవలం సిద్ధాంతాలమీద ఆధారపడిన రాజకీయ పక్షాలకు అలవడిఉంటూ - అంతకుపూర్వమే ఏర్పరిచిన విధానంద్వారా సమస్యలన్నీ పరిష్కరించగలమనే అభిప్రాయంలో ఉంటూ, ఆ కఠినమైన విధానాన్ని అనుసరించటమే పనిగా అలవడి ఉండటంవల్ల, ఇక అమెరికన్‌ల

అభిప్రాయమిది: ప్రతిసమస్యా ప్రత్యేకతను కలిగివుంటూ దాన్ని భేదించేందుకు దానిలోనే సమస్యా పరిష్కారబీజాలు ఉన్నవనీ, సరిగ్గా అర్థం చేసుకొని, దాన్ని తృప్తికరమైన ఫలితాలతో పరిష్కరించవొచ్చనీను.

అమెరికన్ రాజకీయపద్ధతుల్లో ఊహలూ, అభిప్రాయాలూ తక్కువైనప్పటికీ, ప్రాథమికసత్యాలనేవి కొన్ని ఆధారంగా ఉన్నవనీ, వాటికి అందరూ సమ్మతించారనే భావించబడుతోంది.

1. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వం ప్రజాప్రభుత్వం; ప్రజలచేతనే ప్రజల కొరకు నడపబడుతూన్నది. ఆ ప్రభుత్వాధికారాలను ప్రజలేఇస్తారు; ఆ హక్కు ప్రజలకే ఉండటంవల్ల, ఎన్నికల సమయాల్లో యోగ్యులైన వారిని ఎన్నుకొంటూ, అధికారాలను చేతులు మార్చుతూ, తమకు అవసరమైన, కావలసిన విధంగా చట్టాలను ఏర్పరచటం, లేదా సవరించటం జరుపుతారు.

2. ఈ అధికారం ఏదో పవిత్రతను గూర్చిన మానవుని శాశ్వతమైన విశ్వాసంనుంచి వెలువడటంలేదు; కేవలం మానవుని తార్కిక సిద్ధాంతాల మీద ఆధారపడి, ఏదో ఆదర్శాలకోసమై పాటుపడే ధోరణిలో కాకుండా ఆయా పరిస్థితులనుబట్టి మార్పులుచెందుతూ, తదనుగుణంగా అమరుతూ, ఏ 'ఇజమ్'కూ సంబంధం లేకుండా ఏర్పడుతోంది. సోషలిజమ్ మెల్లిగా పాకుతూంటూ వొచ్చిపడుతోందని అమెరికన్లు ఫిర్యాదులుచేస్తున్నప్పటికీ, వారు 'సోషలిస్టిక్' లేదా 'కేపిటలిస్టిక్' లేదా 'కోఆపరేటివ్' లేదా అధికారయుతమైన పద్ధతుల్ని ఆయావ్యక్తుల అవసరాలనుబట్టి అనుసరిస్తూనే ఉన్నారు.

3. బహుజనుల నైతికమైన తీర్పులే ప్రజాసంబంధమైన కార్యకలాపాలను విశ్వాసనీయంగా నడిపించగలిగిఉన్నవి. ఈ ఆదర్శసంబంధమైన భావన - ప్రజాభిప్రాయాల సేకరణ కార్యక్రమాలలో బలపడి, కాంగ్రెస్‌లోని తమ ప్రతినిధులకన్న ప్రజలే ముందంజలు వేస్తున్నారని ఆ ఫలితాలు స్పష్టీకరించినవి.

4. చెడ్డదైనాసరే ప్రభుత్వమనేది అత్యవసరమైనది. అది అన్నివేళలా విస్తరించేందుకు విశ్వప్రయత్నాలు చేస్తూనేఉంటుంది. కనుక, దాన్ని ఎదిరి పోరాడి అదుపాజ్ఞల్లో ఉంచవలసిన అవసరం ఎంతో ఉన్నది. అనేక పనుల్ని స్వచ్ఛందసేవాదళాల ద్వారానూ, లేదా స్థానికమైన శక్తిసామర్థ్యాల తోనూ ఎంతవరకూ చేసుకునేందుకు అవకాశాలుండి, ఆచరణలో ఉండ గలవో, అంతగానూ ప్రభుత్వం బలహీనమౌతూనేఉంటుంది. మానవుల సద్గుణసంపత్తితో సమాజం రూపొందుతూందన్న టామ్‌పైనీ మాటల్ని మనం నమ్మాలి; అలాగే మానవుల వ్యసనాల కారణంగా ప్రభుత్వం ఏర్పడుతూన్నది.

కనుక స్వచ్ఛందసేవాదళాల సహాయంతోనూ, స్థానిక బలాతిశయాల తోనూ పనులుచేసుకొని పోవటాన్ని గూర్చి ఎంతో నొక్కి చెప్పవలసి ఉన్నది: అది జరిగిననాడు రాజకీయంగా మారేదాన్ని, సామాజికంగానే ఉంచటం జరుగుతుంది.

5. అనుసరించటమనేది సుఖాన్నివ్వగలదు; ఐతే ఇంతకుపూర్వం జరిగిన తిరుగుబాటుతో కొత్త అనుసరణలు ఏర్పడుతూనే ఉన్నవి. ఇప్పుడు ప్రభుత్వంచేసే అనేకపనులను అమెరిన్‌లు సమ్మతించే వాటిని - ఒకప్పుడు కాకున్నా మరొకప్పుడైనా అలాటి మార్పులు అత్యవసరమని వాదించినవే; బాలురకు సంబంధించిన కార్మికచట్టాలూ, అంతస్థులవారీగా ఆదాయపు పన్ను విధించటం, నిరుద్యోగాలకు భీమా మొదలైనవి కొన్ని ఉదాహరణలు. స్ట్రీట్ కార్లను నడిపేవారికి రోజూ 12 గంటలపని ఉండటం, అవసరమైన మార్పులతో సోషలిజమ్‌ను ప్రవేశపెట్టటమేనని ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ అభిప్రాయపడ్డారు. ఏ రాజకీయ ఆదర్శానికీ లోబడక, ప్రస్తుత పరిస్థితుల్లో అత్యవసరంగా కనిపించేదాన్ని చేసితీరాలనే పట్టుదలే ఇందుకు కారణం; అది పరిశ్రమలను అదుపులో పెట్టేదైతేనేమి, కార్మికులకూ, వ్యవసాయదారులకూ సంబంధించినదైతే నేమి, పనిగంటలూ - కూలికి

సంబంధించినదైతే నేమి, అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాల విషయమైతేనేమి - పద్ధతి మాత్రం ఒక్కటే!

6. స్వాతంత్ర్య పత్రంలోని వాగ్దానం ప్రకారం ప్రతి ఒక్కరూ సరి సమానంగానే జన్మించిఉండటంవల్ల అమెరికన్‌లకు తరగతులవారీగా పోరాడవలసిన అవసరమేలేదు. కఠినంగాఉండే తరగతులు లేవని అమెరికన్‌ల వేదాంతం; ఐతే ఎక్కడన్నా ఒక సౌకర్యమనేది ఉన్న తావున వారు దాన్ని గుర్తించినప్పటికీ, అలాటి దాన్ని వారొక సవాలుగా తీసుకుంటారేకాని, తమ హక్కులకు భంగం వాటిల్లచేస్తుందని భయపడరు. భాగ్యవంతుల మేడల్ని పడగొట్టడమెందుకు-ఏమో ఒకనాడు తామే వాటిని ఆక్రమించుకోవటం జరుగుతుందేమో? ఈ విధంగా బలశాలుర బలాతిశయాల్ని రూపుమాపేందుకు మారుగా, అలాటి బలాతిశయాల్ని అందరూ స్వాధీనపరచుకోవాలనే ధోరణిలో, సంస్కరణ ఆచరణలోనికివాస్తోంది; సామాజికమైన తిరుగుబాటుకు మారుగా, సామాజికమైన సృష్టి ఆరంభమైంది. ఇదంతా ఒక గొప్ప విలాసమైనప్పటికీ ప్రకృతిసిద్ధంగానూ, జనబాహుళ్యంనుంచీ లభ్యమైన వాటిద్వారానూ, తత్వరీత్యా అదృష్టవశాత్తూ ఏర్పడిన క్లిష్టతవల్లనూ, స్వచ్ఛందసేవాదళాల శక్తిసామర్థ్యాల ద్వారానూ, నిర్మించబడిన అంతస్థుపైన మరొక అంతస్థు నిర్మించే అవకాశాలు లభ్యమైనవి; అంతేకాని ఇదికాదని ఆ మొత్తాన్ని పడగొట్టి, తిరిగి పునాదుల దగ్గర్నుంచీ నిర్మించుకొనే అవసరం లేకపోయింది.

ఈ విధంగా జనులమధ్య జరిగే పోరాటాలు సాగుతూన్నప్పటికీ అమెరికన్ రాజకీయ జీవితంలో స్నేహపూర్వకమైన ధోరణి ఏర్పడింది. గవర్నర్ పట్టణానికి వొచ్చిచేసే ఉపన్యాసంలో: "మీరూ, నేనూ లాటి సామాన్యులకుగాను ఉద్దేశించబడిన పనులు జరగాలని మనమంతా కోరుతున్నాము." ఇలాటి మాటలు అంటాడు; ఆ మాటలు ఆయన హృదయాంతరాళంనుంచి వెలువడినవే। ఆయన పరదేశాలలో జన్మించి, ఈ

దేశానికి వలసవొచ్చినవారి పుత్రుడుగా దిగుమతయి, క్రమంగా ఆర్థికంగా మెట్టుమెట్టుగా ఎగబాకి, ఇప్పుడు రాజకీయంగాకూడా మెట్టుమెట్టుగా పైకి రాగలిగినప్పుడు, ఆ మాటలు ఆయన నాలుకచివర్లనుంచి రావలసిన అవసరమేమున్నది?

ఘర్షణలలో కూడా ఎదుటిపక్షంవారు ఒప్పుకొనే విషయాలు అనేకం ఉంటవి; అందరూ సమానులేనన్నది సర్వజనసమ్మతం. ఇక మిగిలినప్రశ్న ఇది: ఎలా సమానులు? మార్క్స్ చెప్పిన తరగతులవారీ పోరాటమనేది కేవలం ఊహాచిత్రమేననేది సుస్పష్టం. ఆలోచించగల మానవులు సామాజిక పరిస్థితులలో తరగతులవారీ పోరాటమనే పీడకలను ఎలా విశ్వసిస్తారో అర్థంకాదు. ఈ సర్వసమానత్వాన్ని ఆచరణలో పెట్టేందుకుగాను అమెరికన్లు అనుసరించేమార్గాలు - ఎప్పుడూపోరాడుతూ, తిరిగి ఏకమౌతూ సమస్యాపరిష్కార మార్గాలను అన్వేషించటం - ఒక ఉత్తమ పద్ధతిగా ఎందుకు పరిగణించబడరాదు? ఇతరులచే ఎందుకు అనుసరించబడరాదు?

7. అధికారం ప్రమాదకరమైంది కనుక - దాన్ని వివిధ భాగాలు చేయటం అత్యుత్తమ పద్ధతి. స్థానికమైనదీ, జిల్లాకు సంబంధించిందీ రాష్ట్రానికి సంబంధించిందీ, ఫెడరల్ ప్రభుత్వోద్యోగులకు సంబంధించిందీ, స్వచ్ఛంద సేవాదళాలకు సంబంధించిందీ, రాజకీయపక్షాలకు సంబంధించిందీ - యీ విధంగా విభజించబడింది. సాధ్యమయినంతవరకూ, ఆచరణయోగ్యమైనంతదాకా పని - స్వచ్ఛందసేవాదళాలద్వారా ఉచితంగా జరుపబడుతోంది. ప్రభుత్వంలోకూడా అంచలవారీగా యీ అధికారం విభజించబడి, పరిశీలిస్తూ, సరితూచుతూ అది ఎప్పటికప్పుడు సరిజేయబడుతూనే ఉన్నది.

ప్రభుత్వంపట్ల అమెరికన్ల ధోరణిని లింకన్ ఇలా వివరించారు: "సామాజికులకు అవసరమైనదీ, చేయదగిందీ ఉన్నప్పుడూ, దాన్ని వారు చేసుకోలేనప్పుడు, లేదా తమంతట తాము అంతబాగా చేసుకోలేనప్పుడు,

వ్యక్తిగతంగానూ, విడిగానూ అది వారికి సాధ్యపడనప్పుడు - ప్రభుత్వం దాన్ని నిర్వర్తించటం న్యాయం".

## రాజకీయ పక్షాలు

కాన్‌స్టిట్యూషన్‌లో రాజకీయపక్షాల ప్రస్తావన లేనందువల్ల, వాటంతటవే - ఆయా రాష్ట్రాలలోని చట్టాలను అతిక్రమించకుండా అభివృద్ధి చెందవలసి ఉన్నవి. ఎన్నికలను ఒక క్రమపద్ధతిలో ఉంచే ఫెడరల్ చట్టాలు కూడా కొంతవరకూ రాజకీయపక్షాలను దెబ్బతీస్తవి. అభివృద్ధిచెందిన పద్ధతి బిగువైనదికాదు. ఉదాహరణకు పార్టీసభ్యులు ఎవరు? ఓటర్లలో 70% మంది రాజకీయపక్షాలలో సభ్యులుగా ఉంటూన్నప్పటికీ, వీరిలో చాలా మంది ఎన్నికల సమయంలో ఓట్లువేయటం, స్థానికమైన ఉద్యోగాలకు ఎన్నికల సమయాల్లో హాజరుకావటం లేదా ప్రెసిడెంట్ ఎన్నికనే రాజకీయ జ్వరం వ్యాపించినప్పుడు ప్రదర్శనలు చేయటం మినహా మరెలాంటి పాత్ర వహించటం లేదు.

ప్రభుత్వంలోవలెనే రాజకీయపక్షాలు కూడా కింది నుంచి పైకి అమర్చబడుతూన్నవే కాని, పైనుంచి కిందికి కాదు. స్థానికమైన ప్రతిపక్షమూ, తన పార్టీని ఆర్గనైజ్‌చేసుకొని, దాని కమిటీ ఎంత ఉండాలో నిర్ణయించుకొని, స్థానికకార్యాలయానికి ఉద్యోగుల్ని ఏరి, వారే ఎన్నికయేట్లు ప్రయత్నిస్తుంది.

ప్రతిస్థాయిలోనూ పార్టీపై వారి సహాయమూ, ఆజ్ఞలు లేకుండానే దానంతటదే పనిచేసే స్వేచ్ఛను కలిగిఉన్నది. రాష్ట్రానికి సంబంధించిన ప్రతిపార్టీ తన నిబంధనలను ఏర్పరుచుకొని, గవర్నర్‌పదవికీ, కాంగ్రెస్ పదవులకూ తన అభ్యర్థులను తానేనిర్ణయించుకొని, ఎన్నికచేసుకుంటుంది. జాతీయసంస్థకు, రాష్ట్రసంస్థలమీద శిక్షణచర్యలు తీసుకొనే అధికారం లేదు. చివరకు ప్రెసిడెంట్ తనకు ఇష్టమైనవారిని కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టేందు

కూడా వీల్లేదు. 1938 లో ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ చేసిన ఇలాటి ప్రయత్నం విఫలమైనది. ప్రెసిడెంట్ రాజనీతికి విరుద్ధాభిప్రాయాలు గలవారైనప్పటికీ, లేదా తమ పక్షంవారి అభిప్రాయాలకు విరుద్ధాభిప్రాయాలు గలవారైనప్పటికీ, కాంగ్రెస్ సభ్యులుగా ఎన్నికలయే అవకాశాలు ఉన్నవి.

పార్టీనుంచి పంపివేయబడటమనే దేమీలేదు. అమెరికన్ రాజకీయ పార్టీలలో బైటికి పంపబడటంలేదు; లోనికి తీసుకొని స్థానమివ్వటమే ఒక ప్రత్యేకత. ప్రతి పార్టీలోనూ అనేక రకాలవారు ఎన్నెన్నో ఆశయాలతో చేతులు కలిపి, కలిసికట్టుగా ఎన్నికలలో విజయాన్ని సాధించేందుకూ, తమ శ్రమకు ఫలితంగా ప్రెసిడెంట్ పదవిని సాధించేందుకూ ప్రయత్నాలు చేస్తారు. ప్రతి పెద్దపార్టీవారూ చాలామందిని రకరకాల ఓటర్లనూ అభ్యర్థించవలసి ఉంటుంది - కార్మికులనూ, కర్షకులనూ, కేథలిక్‌లనూ, ప్రొటెస్టెంట్లనూ, నీగ్రోలనూ ఇంకా ఇతర చిన్నచిన్న జాతులనూ, ఉత్తర రాష్ట్రాలవారినీ, మధ్యరాష్ట్రీయులనూ, దక్షిణ రాష్ట్రాలవారినీ, వ్యాపారస్థులనూ, వృత్తుల్లో ఉన్నవారినీ, ఐశ్వర్యవంతులనూ, బీదవారినీ, లిబరల్స్‌నూ, కన్సర్వేటివ్స్‌నూ, జాతీయ దృక్పథమున్నవారినీ, అంతర్జాతీయ దృక్పథమున్నవారినీ - ఇలా ఎన్నోరకాల ఓటర్లను అభ్యర్థించవలసి ఉంటుంది.

ప్రతిపార్టీ యుద్ధభయం లేకుండా హామీ ఇవ్వాలి; అదే సమయంలో యుద్ధం తప్పనిసరైతే విజయాన్ని సాధించేందుకు సిద్ధపడీ ఉండాలి. ఓటర్లనుంచి రాబట్టే పన్నులభారాన్ని తగ్గించటం, ఓటర్లకు ఎంతో మేలు చేయవలసిన అవసరముండటం, దేశీయ ఆర్థికస్థితిని పెంపొందింప జేయటం, ఆహారపదార్థాల ధరలు పెరగకుండానే క్షేత్రాలమీది ఆదాయం పడిపోకుండా కాపాడటం, కమ్యూనిజమ్‌ను అణగద్రొక్కటం, దేశానికి హానికలిగించే కార్యక్రమాలను రూపుమాపటం, పౌరస్వాతంత్ర్యాన్ని బలపరచటం. తన ప్రతికక్షియులకన్న తాము బాగా చేయగలమని ఆ యా పార్టీలవారు చేయవలసిన వాగ్దానాలు.

తక్కువ ఆదాయమున్నవారు డెమాక్రెటిక్ పార్టీవైపు మొగ్గుతున్నప్ప టికీ, ఏ పార్టీవారూ కార్మికుల క్షేమానికి పాటుబడే ప్రణాళికల్ని ప్రవేశ పెట్టలేదనటం పొరపాటు. కార్మికులందరూ కలిసికట్టుగా ఒక పార్టీని బల పరిచేందుకు సిద్ధమైనప్పుడు, ఆయా ఫలితాలనుబట్టి, ఆర్థికవిధానరీత్యా ఏర్ప డిన ఏ ఇతర ముఠావారూ కూడా, కార్మికుల ముఠాలవలెనే మూకుమ్మ డిగా ఓట్లువేయటం జరగటంలేదని తేలింది. కనుక రెండు పార్టీల వారికీ తమ తమ ఓట్లనువేసే పద్ధతిని కార్మికులు ప్రవేశపెట్టి ఆచరిస్తున్నారు.

డెమాక్రెట్ల చేతుల్లో ప్రభుత్వం అధికంగా, అదుపాజ్ఞల్లో ఉంటూ, ఎక్కువ వ్యయమౌతుందనీ, రిపబ్లికన్స్ చేతుల్లో యీ అదుపు తక్కువగా ఉండి, ఆర్థికవిధానం పెంపొందుతుందనీ ఓటర్ల అభిప్రాయం. ఐతే ఇటీ వలి బడ్జెట్లలో యీ విషయంలో పెద్ద తేడాలు ఉభయపక్షాలపట్లా కనిపించ టం లేదని తేలింది. అణచివేయబడటం జరుగుతుందేమోననే అభిప్రాయం డెమోక్రాట్స్‌కు అనుకూలంగాఉంటే, మంచికాలం రిపబ్లికన్స్‌కు అను కూలంగా ఉన్నది. ఓటరు కార్మికుడవనీ, వ్యాపారికానీ, కర్షకుడవనీ, వృత్తిదారుడవనీ ఇలాటి అభిప్రాయాలకు లోనౌతూనే ఉంటాడు. రిపబ్లి కనులు దేశసౌభాగ్యాన్ని పెంపొందించే ధోరణిని కనబరుస్తే, డెమాక్రాట్స్ ఆ ఐశ్వర్యాన్నిపంచే ధోరణిని ప్రదర్శిస్తున్నారు. ఐనప్పటికీ, ఏ పార్టీవారూ మధ్యతరగతి, తక్కువ ఆదాయమున్నవారి ఓట్లతో తప్ప ఎన్నికలలో విజయాన్ని సాధించలేరు. కనుక వారు స్థూలదృష్ట్యా భేదించక, స్వల్ప విష యాలలో మాత్రమే భేదాభిప్రాయాలను కలిగిఉంటున్నారు. ఉభయులూ కొత్త పద్ధతిలో చట్టాలను చేస్తామంటారు; రెండిటా లిబరల్ పక్షమే ప్రాధాన్యత వహిస్తూన్నది.

ఈ ఆదర్శాలను పట్టుకొని వేళ్ళాడకుండా ఉండటంవల్లనే అమెరికన్ రాజకీయ పక్షాలు సరళంగా ఉన్నవి. దక్షిణంనుంచివొచ్చే డెమోక్రాట్స్ తాబూకు కన్సర్వేటివ్ ధోరణులూ, ఉత్తరదిశనుంచివొచ్చే లిబరల్స్ - ఉభ

యులూ కలిసి కాంగ్రెస్‌లోని కన్సర్వేటివ్ రిపబ్లికన్‌లతోపాటు కొన్ని సమస్యలమీద ఓటుచేయగలుగుతూ, తమ పక్షంవారిని బలపరచని సందర్భాలు కూడా ఉన్నవి. చెల్లాచెదరైపోయిన వాటిని కూడగట్టటమే అమెరికన్ పద్ధతిగా ఇక్కడ కూడా సాక్షాత్కరిస్తుంది. అవర్గాలనేవి మాధ్యమిక యుగంలో కోటలవలె ఉంటూన్నవి. అవసరమైనప్పుడు స్వస్థానాన్ని సంరక్షించుకునే యుద్ధాలకు అవి ఉపయోగపడుతవి. అమెరికన్ రాజకీయ పక్షాల పద్ధతి - ద్రవరూపంలోఉంటూ, పరిసరాలనుబట్టి గతులు మారుతూ, ఎప్పుడూ అవసరమైన మార్పుల్ని పొందుతూ, ప్రజాకోర్కెలకు అద్దంవలె ఉన్నది; అంతేకాని, అది వేదాంతి ఊహించిన ప్రపంచం, నిర్ణయించిన ప్రాపంచిక విధానంవలె, ఒక స్వప్నంవలె మాత్రంలేదు.

అమెరికన్ రాజకీయాలలో స్పష్టమైన వామపక్షం అంటూ లేదు - ఎందుకని? ఎందుకంటే ఉభయపక్షాలవారికీ ఏ కొనలోనూ ఓట్లు (లేదా కొద్ది మాత్రం ఉన్నవి) లేవు; తరగతులవారీ సమాజాన్ని అమెరికా గణించలేదు; అలాటిదాన్ని రూపుమాపేందుకు ప్రయత్నించింది; ఆర్థికవిధానం విశేషజనాలకు లాభసాటిగా ఉండేట్లుగా విస్తరించబడుతూన్నది.

## ప్రెసిడెంటును ఎన్నుకొనే ఆచారం

ఒకప్పుడు ఎంతో దూరాన, రహస్యంగాఉండే జాతీయఆచారం, యీనాడు టెలివిషన్‌ద్వారా ఇంటింటా విస్తరించి, దాని ఫలితాలను ప్రజలమీదా, ఆ ఆచారంమీదా ప్రసరించింది. రాజకీయాలు విశ్రాంతిమందిరాల్లో కూడా ప్రవేశించి, అభ్యర్థిని ఎన్నికచేసుకునేందుకు ప్రతి ఓటరూ తన సంసిద్ధతను చూపుతూన్న సమయంలో - ప్రజాభిప్రాయం రాజకీయాలను తలక్రిందులు చేసేటంత బలవత్తరంగా ఉండటంవల్ల, రాజకీయ పద్ధతులూ, యంత్రాంగాన్ని గూర్చిన విజ్ఞానం ద్వారా ఓటర్లకు మరింత భోగట్టా లభ్యమౌతున్నది.

ఆచారమని పిలువబడేది చిత్రమైనసిద్ధాంతం. అది ఆదిమనివాసుల సంగ్రామనాట్యాన్ని. ఆధునిక యంత్రాంగంతో కలపగలదు. గత రిపబ్లికన్ కన్వెన్షన్ 1,323 డెలిగేట్లకూ. డెమోక్రాట్స్ కాన్వెన్షన్ 2,744 (అర్ధ ఓట్లను కూడా అనుమతిస్తే) డెలిగేట్లకూ స్థానాల్ని ఏర్పరచింది. వీరుగాక అనేకులు ఇతరులూ ఉన్నారు. వీరిలో చాలామంది ఒకర్నొకరు ఎరుగరు; ఐతే వారిమధ్య పరిచయాలు ఏర్పడవలసిన అవసరమున్నదని వారికి తెలుసు. కనుక పిల్లలు తమ గొప్పచూపి ఆకర్షించేందుకుచేసే చిలిపి పనుల్లాటివి. వీరూ చేస్తారు. వారు తమసైజుకాని టోపీలను ధరించటం. లేదా పెద్దపెద్ద బాడ్జీలను ధరించటం చేస్తారు. చిత్రమైన సాధనాలతో చిత్రమైన శబ్దాలు చేస్తారు. పెద్దపెద్ద బానర్లను చూపుతూ. దానిమీద తమ అభ్యర్థి పేరును. లేదా ఆయన ముఖాన్ని ప్రదర్శిస్తారు. వీధుల్లో తిరుగుతూ. కేకలువేస్తూ. ప్రజల్లో స్వాభావికమైన ఆతృతను పెంపొందింప జేసేందుకూ చిత్రమైన ఇతర పిల్లల్ని తమవైపు ఆకర్షించుకునేందుకూ ప్రయత్నిస్తారు. కలిసికట్టుతనం లేకుండటమూ. దాని అవసరాన్ని గ్రహించటం వల్లనే ఎలాగైనాసరే యీ కూడలిని సాధించాలనే తీవ్రవాంఛతో వారు ఉద్రేకాలద్వారానైనాసరే దాన్ని అందుకోవాలని విశ్వప్రయత్నం చేస్తారు.

ఈ పద్ధతివల్ల వారి ఆశయం నెరవేరుతుంది; తమ అభ్యర్థిని ప్రజలు బలపరచే విధానం సాధ్యమవటం, ఆ అభ్యర్థి తన పక్షాన్ని కూడగట్టుకొని ఎన్నికలలో విజయాన్ని సాధించటం జరుగుతుంది. రాజకీయ వ్యాపారాలు జరిగే పొగతోనిండిన గదుల్లో ఏంజరిగినప్పటికీ. ప్రజాభిప్రాయాన్ని అది ఏవిధంగానూ మార్చలేదు. జనహితుడైన అభ్యర్థిని ఎన్నికలకు నిలబెడితేనే తప్ప. ఎన్నికల్లో విజయం చేకూరదు. సామాన్యంగా జనాభా ఎక్కువగా ఉన్న రాష్ట్రంలోనుంచే యీ అభ్యర్థి ఎన్నికలకు నిలుస్తాడు; ఇందువల్ల ఎక్కువ ఓట్లతో ఎన్నికల సంరంభం ఆరంభమవగలదు. అనేక సందర్భాలలో ఆ రాష్ట్రగవర్నరే. అభ్యర్థిగా నిలబడటంవల్ల. ఆ రాష్ట్రం తాలూకు సమస్యలన్నీ ఆయనకు బాగా తెలిసిఉండటం, అవే జాతీయసమస్యలకు

మారురూపాలుగా ఉండటం జరుగుతోంది. ఇలాటివారు యూరప్ ఉత్తర దిశనుంచి వొచ్చిన ప్రొటెస్టెంట్ మతస్థులైన పురుషులే. కాని, యూరప్ తూర్పు, దక్షిణ దిశలనుంచి వొచ్చిన కాథలిక్ మతస్థులుకూడా గవర్నర్లవుతూ, క్రమంగా వైట్‌హౌస్‌లోకి కూడా ప్రవేశించే అవకాశాలు ఎన్నో ఉన్నవి.

ప్రెసిడెంట్ పదవి మహోత్కృష్టమైన బహుమతిగా భావించబడుటవల్ల ప్రతిరాజకీయపక్షమూ తమ తమ అభ్యర్థులను ఎన్నుకోవటంలో ఎంతో శ్రద్ధవహిస్తుంది. ప్రెసిడెంట్ పదవితోపాటు వైస్‌ప్రెసిడెంట్ పదవికి అభ్యర్థిని ఎన్నిక చేసుకోవటంలో, చాలా తొందరపాటు ఉంటుంది: ఎందుకంటే అప్పటికే ప్రతివారూ విసుగెత్తి, ఎంతో అలసిపోయి ఉండటంవల్ల. ఎంత త్వరగా వీలైతే అంతత్వరగా ఇంటికివెళ్దామనే తొందరలో ఉంటూండడంవల్ల, ఇది హడావిడిగా జరుగుతుంది. ప్రెసిడెంట్ లిబరల్ ఐతే, వైస్‌ప్రెసిడెంట్ కన్సర్వేటివ్ కావొచ్చు; లేదా కన్సర్వేటివ్‌లు బలపరచేవాడైనా ఐఉండొచ్చు. ఇందువల్ల ఏర్పడే చిత్రమైన ఫలితం - కక్షలేమైనా ఉంటే అవి మాయటం. ప్రెసిడెంట్ ఏ కారణం చేతనైనా మరణిస్తే ఆ స్థానం తమ అభ్యర్థికి లభ్యమౌతుందనే ఆశానూ.

కన్వెన్షన్ కమిటీ తాలూకు నిర్ణయాలతో ఒక అంగీకారమైన వేదిక ఏర్పరచబడుతుంది. ఇక్కడ కూడా పార్టీలోని అనేక కక్షలు ఒక దానితో మరొకటి సంఘర్షించి, చివరకు ఎవరినీ నొప్పించకుండే విధంగా రూపొందుతుంది.

ఈ రోజుల్లో ప్రెసిడెంట్‌గా నిలబడే అభ్యర్థి కేవలం రాజకీయ నాయకుడు మాత్రమేగాక, తన పార్టీని కూడగట్టుకోగలిగిన సమర్థుడు కూడా ఐఉండాలి. తాను ప్రెసిడెంట్ పదవికి అర్హుడనే విశ్వాసంతోఉన్నా ఎంతో అణకువను ప్రదర్శించగలిగినవాడూ, నిరాడంబరంగాఉన్నా హుందాతనంతో ప్రవర్తించగలిగినవాడూ, అన్ని విషయాలనుగూర్చి తెలిసినవాడూ,

ఐతే, మేధావిగా గణనకెక్కనివాడూ, సానుభూతితో చూడగలవాడూ, కాని, మరీమెత్తని హృదయం లేనివాడూ, ప్రపంచంలోని మహోన్నత పదవిని కూడా చాలా తేలిగ్గా సమర్థించగలవాడూ, అదేవిధంగా సామాన్య ప్రజానీకంతోకూడా సర్దుకుపోగలవాదే - ప్రెసిడెంట్ పదవికి అర్హుడుగా భావించబడుతూన్నాడు.

ప్రెసిడెంట్ ఎన్నిక రాజకీయమైనదిగా ఉండి, అందరు అమెరికన్‌లూ అందులో పాల్గొంటూనే ఉన్నారు. జాతీయసమస్యల నెన్నిటినో యీ ఎన్నిక ముందుకు లాగి, వివిధ రాజకీయపక్షాలలోనివారిని కలిపి, రాబోయే నాలుగేళ్లలోనూ దేశానికి అవసరమైన మార్పులుచేస్తూ, దేశీయత విడివడ కుండా ఉండగలదనేహామీ ఇందువల్ల లభిస్తూన్నది. సర్వజన సమ్మతుడైన వానికి, ఆ రాష్ట్రంలోని ఓట్లన్నీ లభించటంవల్ల, నిజమైన పెద్దపోటీఅనేది పెద్దపెద్ద రాష్ట్రాలలోనే జరుగుతూంటూంది. కనుక అభ్యర్థి పెద్దపెద్ద పట్టణాల్లోని ఓట్లను సంపాయించేందుకూ 531 ఎలక్టోరియల్ ఓట్స్‌లో మెజారిటీని సంపాయించేందుకూ ప్రయత్నిస్తాడు.. ప్రతిసెనెటర్‌కూ !! కాంగ్రెస్ ప్రతినిధికి ఒకటి చొప్పున యీ ఓట్లు ఉంటవి. న్యూయార్క్ రాష్ట్రానికి 45, నెవడా రాష్ట్రానికి 3 ఉన్నవి.

ప్రెసిడెంట్ ఉద్యోగంలో ఉండగానే ఇతర అభ్యర్థులు ఆ స్థానాన్ని ఆక్రమించే ప్రయత్నాలు చేస్తూనేఉంటారు. కనుక అన్నివిధాలా వారు పల్లె పల్లెకూ తిరుగుతూ, తలుపులు తడుతూ, పసిపాపలను ముద్దాడుతూ, పాఠశాలల్లో, క్లబ్బుల్లో ఉపన్యాసాలలో, ప్రదర్శనల్లో పాల్గొంటూ ఆశయాన్ని అందుకునే అనేక ప్రయత్నాలు చేస్తూనే ఉంటారు.

తాము ఓట్లు వేయాలనుకున్న అభ్యర్థుల్ని చూడాలని ప్రజలు కుతూహల పడుతూంటారు. గోడమీది పిల్లివాటంగా ఉండే అభ్యర్థిని వొదిలేసి, తమతో అనురాగపూర్వకంగా కరచాలనం చేసిన అభ్యర్థికే ఓట్లు వేయటం జరుగుతుంది. ప్రజలు తమలో తాము మాట్లాడుకుంటూ వెల్లడిచేసే అభి

ప్రాయాలుకూడా ప్రముఖపాత్రలు వహిస్తవి. అన్నిటికన్నా ముఖ్యమైనది ఓటర్ తాలూకు సామాజిక ఆర్థికపరిస్థితులు.

దక్షిణ వాసులకు భిన్నంగా ఉత్తరరాష్ట్రాలవారు, పురాతన యూరప్ నుంచి వలసవొచ్చిన ప్రొటెస్టెంట్లు రిపబ్లికన్ అభ్యర్థికే ఓట్లువేస్తారు; పోతే కాథలిక్కులూ, ఇటీవల వలసలు వొచ్చినవారూ డెమాక్రాటిక్ అభ్యర్థికి ఓట్లువేస్తారు. ఇక నీగ్రోలు తరతరాలుగా రిపబ్లికన్‌లుగా ఉన్నప్పటికీ, రూజ్‌వెల్టు ప్రణాళికతో డెమోక్రాట్స్‌వైపు మొగ్గటం, ఆ తరువాత ఐసెన్‌హోవర్ పాలనలో పౌరహక్కులు సంపాయించటంవల్ల, తిరిగి రిపబ్లికన్‌లు కావటం జరిగింది. ప్రస్తుతపరిస్థితుల్లో ఉభయ రాజకీయపక్షాలూ దాదాపు సరిసమానంగా ఉండటంవల్లా, అటూ ఇటూ ఊగులాడేఓట్లు మితి మీరి ఉంటూండటంవల్లా ఎన్నికల ఫలితాలను నిర్ణయించేవి నీగ్రో ఓట్లే కావొచ్చును.

వలసలు వొచ్చినవారి సంతానం క్రమంగా నిచ్చెనమెట్లెక్కుతూ, పట్టణాలలోని మురికిపేటలనుంచి, పట్టణసరిహద్దుల కావలఉండే ప్రదేశాల లోకి కాపురాలుమారి, వ్యాపారస్థులుగా, లేదా వృత్తిచేసుకొనే కార్మికులుగా మారి, క్రమంగా మధ్యతరగతి ప్రజలవుతారు. మార్క్స్ సిద్ధాంతాల ప్రకారం వారు రోజు రోజుకూ ఆర్థికంగా దిగజారి, మరింత బీదవారవటానికి మారుగా, పెంపొందిన గృహసౌకర్యాలలో, పెరిగిన ఆర్థిక స్థితిగతుల్తో, తమ సంతానానికి మరింత విద్యాసౌకర్యాలతో హాయిగా గడిపే అవకాశాలు అందుబాటులోకి వొస్తవి. కాలక్రమేణా స్థానిక రాజకీయాలూ, క్రమంగా రాష్ట్రరాజకీయాలుకూడా వారి అదుపులోకి వొస్తవి. రూజ్‌వెల్టు పాలనలో ఫెడరల్ ప్రభుత్వోద్యోగాలలోని ముఖ్యమైన స్థానాలను కూడా వీరు ఆక్రమించుకోగలిగారు.

దక్షిణాన తరతరాలనుంచీ, ఉన్న డెమోక్రెటిక్ అభిమానం ఎంతో పెంపొందటం ఆరంభమవటంవల్ల, కాలక్రమేణా దక్షిణదిశకూడా మిగతా

దేశంవలెనే రాజకీయంగా పెంపొందుతుంది. కర్షకుల ఓట్లు (పశ్చిమానా, ఉత్తరానా) తరతరాలుగా ఉండే రిపబ్లికన్ అభిమానం, న్యూడీల్‌తో దెబ్బ తిని విభాగాలై, నిశ్చయంగా తెలియని ధోరణిలో పడింది; ఐతే యీ మార్పు ఉభయ రాజకీయ పక్షాలలో ఏదీ మొగ్గుచూపకుండాఉండే విధంగా రూపొందుతోంది.

ఇక కార్మికులు డెమోక్రాటిక్ పార్టీకి విశ్వాసపాత్రులుగానేఉంటే, మధ్య తరగతి పౌరులుగా మారిపోయి, గోడమీది పిల్లివాటంగా ఉంటూ, నాయకులు తమను వేరొక దిక్కుగా నడిపించేందుకు ప్రయత్నించినప్పటికీ, చాలామంది రిపబ్లికన్‌పార్టీకే తమ ఓట్లను వేయటం జరుగుతోంది. వారి అభివృద్ధే వారిని రాజకీయంగా జ్ఞానులనుచేస్తూ, ఎంతో జాగ్రతగా మసలుకొనేట్లు చేయటంవల్ల, తమ యూనియన్‌లోని నాయకులే రాజకీయంగా ఎక్కువ అధికారాలను చేజిక్కించుకుంటారేమోననే భయం వారిని వేధిస్తూ ఉన్నది.

ప్రతిచోటా ఎక్కువ సంపాదన ఉండటంవల్ల యజమానులకూ, కార్మికులకూ మధ్యఉన్న అగాధం చాలావరకు పూడ్చబడింది. అభివృద్ధీ, మధ్య తరగతి ప్రజానీకం విస్తరించటం - యీ రెండూ ప్రజల్లో అత్యధికుల్ని ఒక తావునజేర్చినవి. ఆధునికమైన రాజమార్గాలవలెనే అన్ని దారులూ ఎంతో ఉత్తమ మైనవిగా ఉంటూ, దాదాపు ఎక్కడా మురికిగుంటలు లేకుండా చేయబడినవి.

ఐతే ఒక వ్యక్తి తన ఓటును ఎటువేయవలసిందీ నిర్ణయించుకోవట మెలా?

కొంతవరకూ వంశపారంపర్యత - తన తండ్రి ఏ మార్గాల నడిచిందీ, లేదా తాను సామాజికంగానూ, నైతికంగానూ ఏపార్టీకి సంబంధించిఉన్నదీ దాన్నిబట్టి ఒకోసమయంలో తన స్నేహితులూ, ఇరుగుపొరుగులూ మాట్లాడేదాన్నిబట్టీ, లేదా ఆయా అభ్యర్థులుచెప్పేమాటలూ, చేసే చేష్టన్ని

అనుసరించి, తన ఆర్థిక పరిస్థితుల్నిబట్టీ, అభ్యర్థివేసిన ప్రణాళికా పథకం తన స్థితిగతులకు, ప్రమాదకరంగా పరిణమిస్తుందా, లేక అభివృద్ధికి దోహదమౌతుందా అనే దాన్నిబట్టీ, తాను నివశించే ప్రదేశం - పల్లా, పట్టణమా, లేక మురికి పేటా, పట్టణపరిసరప్రాంతమా అనేదాన్ని అనుస రించి, అభ్యర్థి అతని హృదయాంతరాళంలో రూపొందించే ప్రతిమను బట్టి అంటే అతను భావించే నాయకుని లక్షణాలు ఎంతవరకూ అభ్యర్థిలో కాన నౌతవనేది - అభ్యర్థికి లభ్యమయే స్థానాన్నిబట్టీ, ఆయన అధికారాన్ని దుర్వినియోగంచేస్తాడా, లేక దాన్ని కాపాడుకోగలుగుతాడా అనేదీ, లేక ఆదర్శప్రాయుడైన తండ్రివలె, లేదా అస్యహించుకోదగిన యజమానివలె కనిపిస్తాడా అనేదాన్నిబట్టి తన ఉత్సాహంతో అభ్యర్థిఏర్పరచే ప్రణాళికపట్ల ఉండే అభిప్రాయాన్ని అనుసరించి, అరణ్యాలలో లభ్యమయే వాటిని ఉత్ప త్తిలో ఉపయోగించి దేశసౌభాగ్యాన్ని పెంపొందించటం, పౌరహక్కుల్ని కాపాడటం, కమ్యూనిజాన్ని ఎదిరిపోరాడటం మొదలైనవాటినిబట్టి పెద్ద వ్యాపారం, ఎక్కువమంది కార్మికులు, అధికమైన పన్నులు, మేనేజ్‌మెంట్ సక్రమంగా లేకుండటం, మొదలైనవాటిపట్ల తన ద్వేషాన్ని ప్రకటించేం దుకు గాను ఓటు ద్వారా ఆ పనిచేయటం.

అభ్యర్థులు మాట్లాడేదాన్ని టెలివిషన్‌లోచూస్తూ, వారి ఉపన్యాసాలను వార్తాపత్రికల్లోనూ, మేగజైన్లలోనూ చదువుతూ, ఎంతో ఆలసిపోయి - చివ రకు ఓటువేసేందుకు ఎన్నికలస్థానం జేరేసమయంలో ఎటు మొగ్గువామా అనే నిర్ణయంలేక, ఓటువేసేసమయంలో అటు రిపబ్లికన్ పార్టీకి లేదా ఇటు డెమోక్రాటిక్ పార్టీకి ఓటువేస్తూ ఇంతా ఏకుస్తే తాను ఓటుచేసే పార్టీకే అంకితమై పొయ్యాననే భావనలో ఉంటాడు.

అమెరికన్ చరిత్రనుంచీ, మతైకవిశ్వాసాల నుంచీ, వృత్తుల నుంచీ నైసర్గిక సత్యాలనుంచీ అవతరించినవే యీ రెండు రాజకీయపక్షాలూను; యీ రెంటిస్థాయీ అమెరికన్‌లస్థాయికి అనుగుణంగాఉంటూ, మూలపదా

ర్థపు విలువలనూ, విశ్వాసాలనూ అతిక్రమించనివిగాఉంటూ, ఇక్కడ విశదపరచవలసిన అవసరంలేకుండా ఉన్నవి. ప్రతినాలుగేళ్లకూ ఒకసారి జరిగే ప్రెసిడెంట్ ఎన్నిక తాలూకు హైరాను - అమెరికన్‌లమధ్య వృత్తి రీత్యా, మతైకవిశ్వాసాలరీత్యా, ఉండే విభేదాలు ఎలాటివైనప్పటికీ, ప్రాథమిక సత్యాలపట్ల వారి కలిసికట్టుతనానికి ఒక గొప్ప తార్కాణంగా ఉంటూన్నది. అత్యద్భుతమైన, సువిశాలమైన యీ పోటీ - అమెరికన్‌లు సర్వస్వతంత్రులుగాఉంటే వాదోపవాదాలుచేసి, అభిప్రాయభేదాలను బైట పెట్టే సావకాశాలు ఎన్నోఉన్నవనేదానికి ఇవి తార్కాణం. ఎన్నికలు జరిగే భారీయెత్తు - అమెరికన్‌ల గొప్పతనానికీ, అనేక రకాల అభిప్రాయాలకూ తార్కాణం; ఎన్నికలు పుట్టించే వేడి అమెరికన్‌లు పోరాడటంలో చూపే శక్తిసామర్థ్యాలకూ, అలాటి అభిప్రాయాలనే ఒక సవాలుగా తీసుకొని, వాటిని పడగొట్టే సామర్థ్యతకూ నిదర్శనం. ఒకోపార్టీ - ఎదుటిపార్టీ వారు రిపబ్లిక్ పునాదుల్నే పడగొట్టేందుకు నడుంకట్టిన శత్రువులేనన్న విధంగా ఎదురొడ్డి పోరాడటం జరుగుతోంది; దీన్నిబట్టి అమెరికన్‌లుకోరుకొనే దారికి ఏవైనా అడ్డంకులనేవి సంభవించేపక్షంలో, అవసరమైనప్పుడు వాటినన్నిటినీ ఎదుర్కొని పోరాడే ధైర్యసాహసాలున్నవనేది ఋజువవుతోంది.

ఐతే ఎన్నికలు పూర్తయి వోట్ల లెక్కింపులో గెలిచే అభ్యర్థి నిర్ధారణ అవుతూన్న సమయంలోనే, పరాజయాన్ని పొందిన అభ్యర్థి ప్రజల ఎదుటికి వచ్చి గెలిచిన అభ్యర్థికి తానూ, తన పార్టీవారూ అండగానిలబడతామని వాగ్దానం చేస్తాడు; ఇంతకు ముందు ఆగర్భశత్రువువలె, ఎదురాడి పోరాడి వోడిన అభ్యర్థి, హఠాత్తుగా ప్రజల విశ్వాసాన్ని కాపాడేందుకు కంకణం కట్టుకొన్న నిశ్చయాన్ని బైటపెడతాడు.

1956 లో అడ్లీస్టీవెన్‌సన్ "మనను విడదీసే శక్తులుకన్న, కలిపే శక్తులు ఎంతోగాఢమైనవీ, బలపత్తరమైనవీను" అన్నారు. "ఈ రాత్రి

మనం రిపబ్లికన్‌లమూ కాదు; డెమోక్రాట్లమూ కాదు, మన మందరమూ అమెరికన్‌లము". ఈ విధంగా అంతస్థులనేవి అంతరించటం, యుద్ధ సమాప్తి జరగటం, తగిలినగాయాలు మానుముఖం పట్టటం, చేరిన చెత్త చెదారాన్ని శుభ్రపరచటం, తిరిగి వ్యాపారంలో ప్రవేశించటం జరుగుతుంది.

## రాష్ట్రాలూ — కాన్‌స్టిట్యూషనూ

ఫెడరల్ ప్రభుత్వం ఏర్పడేందుకు పూర్వం - 14 రాష్ట్రాలు (వెర్‌మాంట్, ఫెడరేషన్‌లో సభ్యత్వమున్న మరో 13 రాష్ట్రాలూను) ఉండేవి: వెర్‌మాంట్, టెక్సాస్, కాలిఫోర్నియా రాష్ట్రాలు యూనియన్‌లో జేరక పూర్వం సర్వస్వతంత్రమైన రిపబ్లిక్‌లుగా ఉంటూండేవి. మొదట్లో యూనియన్‌లో ఉన్న 13 రాష్ట్రాలకూ, కాన్‌స్టిట్యూషన్‌ను సంతకంచేసే ముందు 180 సంవత్సరాల చరిత్రన్నా ఉన్నది: ఆ కాలంలో వారు రాష్ట్ర సభల్లో తమ వ్యవహారాలను తామే పరిష్కరించుకుంటూ, ఒకో సమయంలో గవర్నరులతో తీవ్రఘర్షణపడుతూ, మరోసమయంలో బ్రిటన్ ప్రస్తావనే లేకుండానూ గడిపేవారు. ఇక్కడ వారికి ప్రభుత్వాన్ని నడిపే విద్య, కళ బాగా అబ్బినవి. జఫర్‌సన్, పాట్రిక్‌హెన్రీ, జాన్ ఆడమ్స్, మడిసన్ మొదలైనవారిదృష్ట్యా చూస్తే, ప్రభుత్వాన్ని నడపటంలో వీరికి సుశిక్షణ అలవడిందనే చెప్పవలసి ఉంటుంది.

రాష్ట్రాలన్నీ కలిసి ఫెడరల్ ప్రభుత్వాన్ని సృష్టించినవి. అది వారి పసిపాప. తల్లిదండ్రులవలె ఆ పసిపాప పెరగటాన్ని వారు గమనిస్తూ, వాడి బలాతిశయాన్ని ఎలా ఉపయోగించాలో తెలియక, ఎందుకైనా మంచిదని ఒక దెబ్బతీసేరీతిగా, రాష్ట్రాలు భయపడుతూనే తమ పాపవిషయంలో నిర్లక్ష్యత చూపినవి.

వారికన్న బాగా పెరిగి, బలవంతుడుగా రూపొందిన ఆ పాప - తనపట్ల రాష్ట్రాలకు తగినంత గౌరవమర్యాదలులేవని గ్రహించకతప్పలేదు. అనేక

బహుమానాలతో వారిని ఋజుచేస్తినప్పటికీ తాను చెప్పిన విధంగా వారు నడుచుకోవాలని అతను తీవ్రంగా వాంఛిస్తాడు.

దీని ప్రాముఖ్యతంతా ఒక పక్క బలవత్తరమైన ఫెడరల్ ప్రభుత్వం ఏర్పడటంతోనూ, మరొకవైపు మహానగరాలు విలసిల్లటంతోనూ, నీరసించిపోయింది. ఐనప్పటికీ ఫెడరల్ ప్రభుత్వానికిలేని అనేక అధికారాలు కాన్‌స్టిట్యూషన్‌కు ఉండినవి. పౌరులకు ఓటుచేసే హక్కును ఇచ్చినది జాతి అనటంకన్నా కాన్‌స్టిట్యూషన్ అనటం సమంజసం. కాన్‌స్టిట్యూషన్‌లో పేర్కొన్న విధంగా, ప్రభుత్వాధికారాలన్నీ అక్కణ్ణుంచే ప్రవహిస్తూంటవి.

రాష్ట్రానికి విశ్వాసపాత్రుడుగా ఉండే పౌరునికి - విశ్వాసపాత్రతలో అదొకవిభాగంమాత్రమే. పల్లెప్రాంతాలుగాఉన్న ఉత్తరదిశలోని న్యూయార్క్ రాష్ట్రం, న్యూయార్క్ మహానగరంతోనూ, వాషింగ్‌టన్, ఓరిగాన్ పర్వతశ్రేణులచేత విభజించబడి, పశ్చిమభాగాన్ని పారిశ్రామికంగానూ: తూర్పుభాగాన్ని వ్యావసాయికంగానూ భాగించినప్పటికీ - యీ భేదాలు ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ, అన్నిటినీ కలిపిఉంచే సంస్కృతి ఆయా విభేదాలను తోసిపుచ్చుతున్నది.

రాష్ట్రశాసన సభలు సామాన్యంగా రెండేళ్లకొకసారి సమావేశమౌతూ కొద్దినెలలపాటు పనిచేస్తవి. ఆయా ప్రతినిధులు ఇతరకాలాల్లో వేరే పని పాటలు చూసుకుంటూండటంవల్ల, సమావేశానికిగాను వారికయ్యే ఖర్చులకు మాత్రమే సరిపడేటంత పైకం ముట్టుతూంటుంది. ఐతే ఇలాటిపద్ధతి చెడుత్రోవలు అవలంబించటాన్ని ప్రోత్సహిస్తుంది. శాసనసభసభ్యుడు ఒకానొక పరిశ్రమకయ్యే ఖర్చులను పెంచివేసి ఆ బిల్లు అనుమతించబడేట్లు చూడటంద్వారా, కొంతలంచాన్ని పొందవచ్చు. కాని రాష్ట్రముఖ్య పట్టణాల్లోని వార్తాపత్రికల్లోని వార్తలూ, ఆదాయపు డైరెక్టర్‌కు తన సంపాదనంతా ఎలాఎలా లభ్యమైనదీ రిపోర్టురాసిపంపే పద్ధతీ, అందులో ఏదైనా సరైన

సంజాయిషీ చెప్పలేనివి ఉన్నట్లయితే ప్రాసిక్యూషన్‌కు గురికావటం - మొదలైనవి సభ్యుణ్ణి చాలావరకు అదుపాజ్ఞల్లో ఉంచుతూనే ఉంటవి.

పాఠశాలల్లోని స్థాయిని ఉత్తమంగా ఉంచేందుకూ, రోడ్లనిర్మాణానికీ, న్యాయస్థానాలను సక్రమంగా నడిపించేందుకూ, జైళ్లూ, సంస్కరణశాలలూ సరిగా పనిచేసేందుకూ, అంధులూ, మానసికంగా దెబ్బతిన్నవారూ, వికలాంగులూ మొదలైనవారూ, తమనుగూర్చి తాము జాగ్రతవహించలేనివారూ, నిరుద్యోగులూ, ముసలితనంలో వేరే ఆధారాలేమీ లేక బాధపడేవారూ, పోలీసులూ రహదార్లను కాపలాలు కాసేవారూ, రాష్ట్రంలోని పార్కులనూ, విశ్వవిద్యాలయాలనూ, గ్రంథాలయాలనూ, యాత్రికులనూ, రాష్ట్రంలోని వివిధ పరిశ్రమలనూ గూర్చిన వివిధాంశాల జాగ్రతలను తీసుకుంటూ, ప్రయాణసౌకర్యాలూ, విద్యుచ్ఛక్తి మొదలైనవి సరఫరాచేయటంలోనూ రాష్ట్రప్రభుత్వం జాగ్రతవహిస్తూంటుంది. న్యూయార్క్‌లాటి గొప్ప రాష్ట్రానికి ఎంతో ఖర్చుఉంటూ, విదేశవ్యవహారాలుమినహా - మిగతా అన్ని విషయాలనూ సమర్థిస్తూ పౌరసౌకర్యాలను అత్యధికంగా అందజేస్తూన్నది.

ఫెడరల్ ప్రభుత్వాధికారాలను నిర్ణయించి, మిగతావాటన్నిటినీ ఆయా రాష్ట్రాలకు లేదా ప్రజలకే వదిలివేయటాన్ని కాన్‌స్టిట్యూషన్‌చేసి ఉండటంవల్ల, ఆ పద్ధతి మార్చాలని ఎవ్వరూ ఎన్నడూ తీవ్రంగా ఆలోచించలేదు. ఎందుకంటే కాన్‌స్టిట్యూషన్ కఠినంగా ఉండటంవల్ల దాన్ని అనేక విధాలుగా తిప్పే అవకాశాలున్నవి. కాన్‌స్టిట్యూషన్ సృష్టికర్తలకు ఫెడరల్ ప్రభుత్వ సేవావిధానాలు - ఎలా ఉంటవో స్పష్టంగా తెలియకపోయినా రైలు మార్గాలను అదుపాజ్ఞల్లో ఉంచటం దగ్గర్నుంచీ, అందరికీ అనుకూలంగా ఉండే పెన్షన్ పద్ధతివరకూ, కాన్‌స్టిట్యూషన్ తాలూకు విశాలమైన ఛత్రంకిందికి తీసుకొనిరాబడినవి.

కాన్‌స్టిట్యూషన్ నిర్మాణానికి పూనుకున్నవారు ఉత్తరోత్రా అత్యవసరంగా ఉండేవాటన్నిటికీ తగినవిధంగా దాన్ని అమర్చారనీ, పోతే దాన్ని

ఎటుబడితే అటు తిప్పే అవకాశం ఉండటంవల్ల, చాలా అరుదుగా అవసరమైన మార్పులు చేసుకోవటం ద్వారా ప్రజల అవసరాలన్నీ తీరుతూన్నవనీ అమెరికన్‌ల గాఢవిశ్వాసం. అలాటి కాన్‌స్టిట్యూషన్‌ను వేరొకరికొరకు గాను తుడిచివేయుటమవేది ఒక పిచ్చిగా ధ్వనిస్తుంది. రాజకీయ విజ్ఞానంతో కాన్‌స్టిట్యూషన్ చిటారుకొమ్మ అని అమెరికన్‌ల నమ్మకం.

అమెరికన్‌లు కాన్‌స్టిట్యూషన్‌ను ఎందుకు గౌరవిస్తున్నారు?

అది నిర్ణయించబడి వ్రాయబడింది - ఎవ్వరైనాసరే దాన్ని చదువుకో వచ్చును. అది సువిశాలమైనది - కొత్తగా ఏర్పడే అనేక క్లిష్టపరిస్థితులకు అనుకూలంగా అది అమరగలదు. గత 170 సంవత్సరాల చరిత్రా రుజావు చేసిన విధంగా అది అనుభవపూర్వకంగా పనిచేయగలదు. వివిధాభిప్రాయాలుండి అనేకమార్గాల నవలంబించిన జాతిలోని వివిధ ప్రజను కలిసికట్టుగా ఉంచగల విచిత్రశక్తి దానికిఉన్నది. టోరీల హక్కులను కాపాడే వ్యక్తికి అందులో స్థానమున్నది; దేశవిద్రోహచర్యలు చేసిన నేరాన్ని ఎదుర్కొనే కమ్యూనిస్టు కాన్‌స్టిట్యూషన్ శరణుజొచ్చి, కవచంవలె దాన్ని ధరించ గలడు; బడికివెళ్ళే కుర్రాడు కూడా తన స్వేచ్ఛకు కాన్‌స్టిట్యూషన్ కారణమని గ్రహిస్తున్నాడు; వలస వచ్చినవాడు, తనను అమెరికన్ పౌరుడుగా స్వీకరించే శిలాశాసనమనే విధంగా దాన్ని చూస్తున్నాడు. ఎన్నో తారుమార్లను తట్టుకొని, ఎంతో అలజడి దెబ్బలను కాచుకొని కాన్‌స్టిట్యూషన్ మాత్రం సుస్థిరంగా మనగలిగింది; కమ్యూనిజమ్ కానీ, ఫాసిజమ్‌కానీ ప్రపంచంలో రేపిన దుమారాలకూ, దురాక్రమణలకూ కాన్‌స్టిట్యూషన్ చలించక, అది సుస్థిరంగా ఉన్నంతకాలం అమెరికాకు ఎలాటిభయమూ ఉండదనే హామీని ఇచ్చింది. ప్రభుత్వానికి సంబంధించిన మూడు శక్తులనూ అది క్షణక్షణాన అదుపాజ్ఞల్లో ఉంచుతూ, స్వేచ్ఛను సక్రమంగా ఉండేట్లు చేయగలిగింది. అదే విధంగా న్యాయస్థానాల్లోని న్యాయాధిపతులు

కూడా చట్టంమీదికన్నా కాన్‌స్టిట్యూషన్‌మీదనే ఎక్కువగా ఆధారపడి తమ తీర్పులను జారీచేయటం జరుగుతోంది.

రాజకీయ ఆయుధంగా కాన్‌స్టిట్యూషన్‌కుఉన్న ప్రత్యేక సుగుణమేమంటే - అది ఫెడరల్ ప్రభుత్వానికి పౌరులందరిమీదా ప్రత్యక్షాధికారాన్ని కలిగిఉంటూ, రాష్ట్రాలకు సంబంధంలేని సమానాంతరత్వాన్ని కలిగిఉంటూన్నది. సుప్రీంకోర్టుద్వారా సజీవయుగళగీతాలను సమన్వయించి, అన్ని విభేదాలనూ అంతరింపజేసి రాజీచేయటం లేదా నిర్ణయించటాన్ని జరుపుతూన్నదీ.

## న్యాయస్థానం — పౌర స్వాతంత్ర్యం

అమెరికన్ విధానంలోని గొప్పతనం - అది, రాష్ట్రానికి సంబంధించిన న్యాయస్థానాలమీద ఆధారపడని ఫెడరల్ న్యాయస్థానాలను స్థాపించి, కాన్‌స్టిట్యూషన్, ఫెడరల్ ప్రభుత్వపు టాజ్ఞలమీద బయలుదేరిన ఫిర్యాదులను విచారణ చేయించటం. ప్రతిపౌరుడూ, యీ రెండు న్యాయస్థానాల ఆజ్ఞలకూ బద్ధుడవుతూ, యీ రెంటిద్వారా న్యాయాన్ని అర్థించవచ్చు.

ఫెడరల్ విధానంలో సుప్రీంకోర్టుఉంది (ఒక ప్రధాన న్యాయమూర్తి, ఎనిమిదిమంది సహాయన్యాయమూర్తులూ) వాషింగ్‌టన్‌లో పనిచేస్తుంది. 10 సర్క్యూట్ కోర్ట్సు ఆఫ్ అపీల్, దాదాపు 100 జిల్లాకోర్టులు ఉంటవి. ఒక రాష్ట్రానికీ మరొక రాష్ట్రానికీ తగాదా ఉన్నప్పుడు, లేదా ఒక రాష్ట్రవాసి మరొక రాష్ట్రవాసిమీద దావాచేసినప్పుడు, ఫెడరల్ న్యాయస్థానాల ద్వారా వీటిని తీర్మానించుకోవచ్చును. ఫెడరల్ ప్రభుత్వపుటాజ్ఞల్ని విశదీకరించటం, వాటిని అమలు జరపటం మొదలైనవాటిల్లో న్యాయస్థానాలు ప్రముఖపాత్రవహిస్తూ - చట్టనిర్మాతలూ, ఆజ్ఞల్ని అమలు జరిపేవారూ, కాన్‌స్టిట్యూషన్ ఇచ్చిన అధికారాలను అతిక్రమించారో లేదో నిర్ణయిస్తూంటుంది.

సుప్రీంకోర్ట్ నిర్వర్తించే పనుల్లో ముఖ్యమైనది - మారిపోయ్యే కాలానికి అనుగుణంగా కాన్‌స్టిట్యూషన్‌ను అమలు జరుపుతూండటం. ఈ పద్ధతివల్ల - సుస్థిర ప్రభుత్వం సక్రమంగా పనిచేసేందుకు పునాదిరాళ్లగా పనిచేసే కాన్‌స్టిట్యూషన్‌పట్ల అమెరికన్‌లకు గాఢవిశ్వాసం, అత్యధిక గౌరవం ఉంటూ న్నవి: లంగరువేసిననావ సుస్థిరంగాఉంటూ, సముద్ర కెరటాలకు అనుగుణంగా అటూ ఇటూ ఊగుతూ దెబ్బతినకుండా ఉండే విధంగా ఉన్నదని కాన్‌స్టిట్యూషన్‌ను పేర్కొనవచ్చును. ప్రభుత్వానికి అత్యధికమైన సామాజికబాధ్యతల్నీ, మానవుని హక్కులనూ ఇచ్చినవి ఈ శతాబ్దపు నిర్ణయాల ధోరణి.

ఇటీవలి అనేక నిర్ణయాలనుచూస్తే యీ ధోరణి స్పష్టమౌతుంది; విద్యాలయాల్లోనూ, పౌరసంబంధంగాఉండే ప్రయాణసౌకర్యాలలోనూ శ్వేత జాతీయులతోపాటు నీగ్రోలకూకూడా ప్రవేశాన్ని యీ నిర్ణయాలు కలిగించినవి.

1954 లో సుప్రీంకోర్టు నిర్ణయమిది: "పౌరసౌకర్యార్థం ఏర్పడిన విద్యారంగంలో 'విడివిడిగా - కాని సమానంగా' అనే దానికి స్థానంలేదు. విడివిడిగా ఉండే విద్యాసౌకర్యాలనేవి ఎప్పుడూ సమానత్వానికి సుదూరంగానే ఉంటవి." ఇందువల్ల తగాదాలురేగి, పోట్లాటలు జరిగిన సంఘటనలకు ఇవ్వబడిన ప్రచారం అత్యధికంగా ఉన్నప్పటికీ, ఎలాటి సంఘటనా జరగకుండానే అనేక విద్యాలయాలు - శ్వేతజాతీయులకే ప్రత్యేకించబడిన వాటిల్లో నీగ్రోలకూకూడా స్థానాలను ఇచ్చినవి. కొన్నిరాష్ట్రాలు చట్టసమ్మతంగానే తెలివిగా ఇలాటి కలయికను తప్పించుకోవాలని ఎత్తులు వేసినా, యీ కలయిక ధోరణిమాత్రం ముందడుగు వేస్తూనేఉన్నది.

ఇటీవలి రెండేళ్ల అంచనాలుచూస్తే, జాతివిచక్షణద్వారా జరిగిన ఎన్నబాటులోని ఆటంకాలు వెయ్యికన్న ఎక్కువగా జీవితంలోని వివిధ రంగాలలో తొలిగించబడినవని తేలింది. ఒకానొక దక్షిణవాసి, యీ పరిశీలనను

ముగిస్తూ ఇలా అన్నాడు: "దక్షిణదేశం ఘనీభవించి విడిగా ఉండవల సిందే అనే అభిప్రాయం అర్థంలేనిది....ప్రజఅందరి కలయికా ఎన్నటికీ కుదిరేది కాదనే దాన్ని యీ పరిశీలనలు ఖండిస్తూన్నవి."

నీగ్రోలు స్వేచ్ఛగా శ్వేతజాతీయులతో కలిసి వ్యవహరించటమనేది – నివాసాలలో, ప్రజారోగ్యరీత్యా, ప్రైవేట్ వ్యాపారసంస్థల్లో ప్రజాప్రయాణ సౌకర్యాలు మొదలైన వాటిల్లో కూడా జరుగుతూనే ఉన్నది. ఇదిగాక 164 కాలేజీలూ, విశ్వవిద్యాలయాలు నీగ్రోలకూ కూడా స్థానాల్ని కల్పించి, ద్వారాలు తెరిచినవి; చాలామంది నీగ్రోలు ప్రజాసంబంధ కార్యాలయోద్యో గులుగా ఎన్నుకోబడటం, లేదా నియోగించబడటం జరిగింది.

చాలామంది అభిప్రాయపడినట్లుగా 'జిమ్‌క్రో' పురాతన సంస్థకాదు; 20 వ శతాబ్దపు తొలిరోజుల్లో కనుగొనబడింది: అది యీనాడు నిష్క్రమణకు ఉపక్రమించి, చాలాదూరం వెళ్ళిపోయింది. విశాల హృదయులైన దక్షిణవాసులకు తెలుసు - ఇలాటి పద్ధతిని సమాజం నిలపలేదనీ, దాన్ని అనుసరిస్తే అందరికీ కీడు వాటిల్లుతుందనీను.

లూసియానా రాష్ట్రంలో మాత్రం 1948 లో 1,672 నీగ్రోఓట్లు - 1952 లో 108,724 ఐనవి; ఇలాటి మార్పులే ఇతర రాష్ట్రాలలోకూడా సంభవించినవి.

అన్నిటికన్న విచిత్రమైన చిహ్నం ఇది: ఫ్లారీడా కూ క్లుక్స్‌క్లాన్ తాలూకు గ్రాండ్ డ్రాగన్ నీగ్రోసభ్యులకు ప్రవేశాన్నిచ్చింది.

ఇంతకాలంగా నీగ్రోలను అణగద్రొక్కిన - బీదరికం, అమాయకత్వం, రోగగ్రస్థత, అవకాశాలు లేకుండటం మొదలైన విషవలయంమీద చివరకు పెద్దఎత్తున పోరాటం ఆరంభమైంది. నీగ్రోలు వెనుకబడి ఉండటానికి కారణం - జీవశాస్త్రరీత్యా సామాన్య విషయమేననీ, వారు నివశించే నికృష్ట జీవిత కారణంగానే వారు అనారోగ్యంగా ఉండటమూ, నేరస్థులుగా మారటమూ జరుగుతూన్నదనీ, అంతేకాని అవకాశాలు లేనందువల్ల ఇలా సంభ

వించట-లేదనీ అనేకమంది శ్వేతజాతీయులు తలపోయటం జరిగింది. చాలామంది శ్వేతజాతీయులు బీదరికంలో ఉంటికూడా, నీగ్రోను బలిపశువుగా ఉపయోగించుకుంటూ, తన తక్కువతనాన్ని నీగ్రోతో పోల్చుకొని కొంత ఓదార్పును పొందుతూండటం. ఇప్పటికీ రాజకీయజ్ఞులు ఈభావాలనే ఆధారం చేసుకొని తమకు అనుకూలంగా దీన్ని ఉపయోగించి, ఎక్కువ ఓట్లను సంపాయించే ప్రయత్నాలు చేయడం జరుగుతూంది. అనేక సందర్భాలలో పోలీసులూ, న్యాయస్థానాలూ నీగ్రోలను భయపెట్టి బెదిరించటం, వ్యాపారి నీగ్రోను తనకు అనుకూలంగాఉండే విధంగా ఉపయోగించుకోవటం జరుగుతూన్నప్పటికీ - పత్రికలు నీగ్రోలు జీవించే నికృష్ట జీవితాన్నిగూర్చికానీ, వారికి జరిగిన అన్యాయాలూ, అక్రమాలనుగూర్చికానీ తగినంతగా ప్రచారం ఇవ్వలేదు.

ఐనప్పటికీ పత్రికలు - న్యాయచట్టాన్ని అనుసరించని తీర్పుల విషయంలో తమ అభిప్రాయాల్ని బాహాటంగానే వివరిస్తూన్నవి; ఇలాటి చట్టానుసరణలేని తీర్పులు - సరిహద్దు ప్రాంతం విస్తరించిన విషయాలలో ఉద్భవించి, వర్ధిల్లి అటు శ్వేతజాతీయులకూ, ఇటు నీగ్రోలకూకూడా వర్తించినవి: ఐతే 1951 లో ఇవి రంగంనుంచి విరమించినప్పటికీ, అన్యాయాలూ, అక్రమాలూ, క్రూరత్వాలూ మొదలైనవి వేరొకరూపంలో ఆచరణలో పెట్టబడుతూనే ఉన్నవి.

పౌరస్వాతంత్ర్యం విషయంలోని మరొకవిభాగంలో - సామ్రాజ్యతత్వం పెంపొంది, అసహనత్వం వర్ధిల్లే కమ్యూనిజమ్ ప్రపంచాన్నంతనూ భయపెట్టేదిగా రూపొందటంవల్ల - విశ్వాసపాత్రత ఎంతో ముఖ్యమైనదిగా గుర్తించబడింది. దేశంలోని శాంతిభద్రతలకు ముప్పువాటిల్లజేసే పనులు చేసే వారిని అదుపాజ్ఞల్లో ఉంచేందుకుగాను ఏర్పడిన సమితికి ఇవ్వబడిన అపార అధికారాలు; యీ అధికారాలను దుర్వినియోగపరిచినట్లయితే, ప్రభుత్వోద్యోగులను వారివారి ఉద్యోగాలనుంచి తొలిగించటమేగాక, వారికి

పరెక్కడా ఉద్యోగాలు దొరక్కుండా చేయగలగటం, వారి జీవితాలనే సర్వ నాశనం చేయటం కూడా జరగగలదు. ఈ చట్టం స్వచ్ఛంద సేవాదళాలను విరుత్సాహపరచటంకూడా చేస్తూన్నది; ఎందుకంటే కొంతమందివాలంటీర్లు ఒక దళంగా ఏర్పడేందుకు భయపడతారు-ఉత్తరోత్రా వారివారి కులగోత్రాదులు విచారించబడి, ఆ దళాన్నే ప్రభుత్వం నిషేధించటం, శిక్షించటం, జరుపుతుందేమోనని. ఈ విధానం ఐదేళ్లపాటు పనిచేశాక, దేశక్షేమకరం కాని కార్యకలాపాల విషయంలో 40,000 పేజీల రిపోర్టునైతే తయారు చేసిందేకాని, ఎలాటి తుదినిర్ణయమూ, చర్యా తీసుకోలేదు. నిజానికి అమెరికన్‌ల రక్షణను భయపెట్టేదేదైనా ఉన్నట్లయితే, సరైన విచారణ జరగని కారణంగా గాక, వేరేకారణాలవల్లనైతేనేమి యీ విధానం ఆయా కారణాలను సరిగ్గా తెలుసుకోలేక అపజయాన్ని పొందిందనే అనాలి.

అమెరికన్‌లు అందరూ కలిసికట్టుగాఉన్న జాతి అనే సత్యం పౌరులందరికీ అవగాహనకావటంవల్లా, తమచుట్టూఉన్న ప్రమాదకరమైన కమ్యూనిష్టులసంఖ్య అల్పమవటంవల్లా, ఒకపక్క ప్రమత్తులుగా ఉండవలసిన అవసరం ఉన్నప్పటికీ, వేరొకపక్క పౌరహక్కులకు భంగం వాటిల్లకుండా చూసేందుకూ, యీ పౌరహక్కుల మీదనే అమెరికన్‌ల శారీరక, మానసిక బలాతిశయాలూ, ప్రపంచానికి నాయకత్వాన్ని వహించగల శక్తిసామర్థ్యాలూ ఉండటంవల్లా, కనుకనే పరదేశాల్లోని కమ్యూనిష్టుల దురాక్రమణ, దుర్మార్గచర్యలను ఎదిరిపోరాడవలసిన బాధ్యతలు ఉండటంవల్లా-దేశంలోని కమ్యూనిష్టుల భయం చాలావరకు తగ్గిపోయింది. పౌరహక్కులను సంరక్షించేందుకుగాను - అమెరికన్‌లు తిరిగి స్వచ్ఛందసేవాదళాలవైపే తిరుగుతారు. తమ అభిప్రాయాలతో ఏకీభవించనివారికి, వాక్స్వాతంత్ర్యాన్ని నిరాకరించేవారికీ, అల్పసంఖ్యాకులకు ఉద్యోగాలివ్వకుండటం, లేదా ఓటువేసేహక్కు లివ్వకుండటం మొదలైన చర్యలనూ, కార్మికులు ఒక సంఘంగా ఏర్పడేందుకు ప్రతికూలించే శక్తులనూ - ఎదురొడ్డి తీవ్రంగా

పోరాడేందుకుగాను ఏర్పడినవాటిల్లో ది సివిల్ లిబర్టీస్ యూనియన్ ప్రఖ్యాతి జెందిన సంస్థ. దేశంలోని న్యాయవాదసంఘాలు. న్యాయవాదికి ప్రతిఫలం ఇచ్చుకోలేనివారి కేసుల్లో ఉచిత సలహాలనుఇస్తూ. న్యాయవాది సహాయం లభ్యం కానందువల్ల తనకు న్యాయం జరగలేదనేచింత ఎవ్వరికీ లేకుండా చేసిందీసంస్థ.

## అమెరికన్ ప్రజాస్వామ్యం

ఐతే యునైటెడ్‌స్టేట్స్ ఆఫ్ అమెరికాలో ప్రజాస్వామ్య ప్రభుత్వ ప్రత్యేక లక్షణాలేమిటి?

మొదటిది – స్థానిక పరిపాలన. తమకు తాము పరిపాలించుకునే అవకాశాన్ని ప్రజలకే ఇవ్వటం; ఐతే ఒకోసమయంలో అంతర్జాతీయ సమస్యలు తీవ్రరూపాలనుదాల్చే కారణంగా. తాత్కాలికంగా స్థానిక సమస్యల ప్రాముఖ్యత తగ్గుతూ ఉంటుంది.

రెండోది – స్వచ్ఛందసేవాదళాలసేవ: ప్రభుత్వకార్యకలాపాలను పరిశీలిస్తూ. ప్రజాక్షేమంకొరకై చేయవలసిన పనులవిషయంలో తగిన సలహాల నిస్తూ. చట్టనిర్మాతలకు. నిర్మాణకార్యక్రమంమీద పలుకుబడులను ప్రసరింపజేస్తూ. ప్రభుత్వకార్యకలాపాల్లో జోక్యం కలిగించుకుంటూ - ఇతర జాతీయతల్లో ప్రభుత్వమే పూనుకొనవలసిన అనేకపనులను వీరే నిర్వహిస్తూంటారు. రాజకీయనిర్ణయాలు సామాన్యప్రజకు అందుబాటులోలేని యీ శకంలో - అనేక నిర్ణయాలు రాజకీయరంగాలనుంచి విరమించి ప్రభుత్వనిర్వాహక వర్గంలోకి ప్రవేశించిన కాలంలో. యీ స్వచ్ఛంద సేవాదళాలు - ప్రభుత్వ నిరంకుశత్వాన్నీ. విస్తరించి ఉండటంవల్ల ఏర్పడే అనేక క్లిష్టసమస్యలనూ సరిదిద్దుతూ. ఒక విధంగా ప్రభుత్వం ప్రజలనుంచి దూరమైపోకుండా ఉండేట్లు చేయగలుగుతూన్నది.

మూడోది – ఎడతెరిపిలేకుండానూ. ఒక్కొకసమయంలో అతికఠినంగానూ ఉండే ప్రభుత్వాన్ని గూర్చిన విమర్శలు - ప్రభుత్వచర్యలను విశదీ

కరిస్తూ, విమర్శిస్తూండే పత్రికలు, ప్రముఖ వ్యక్తులూ, వీధిమూలల్లో నిల ఒడి చర్చించి, ఖండించే విమర్శకులూ, కాంగ్రెస్‌సభ్యులూ, స్వచ్ఛంద సేవా దళాలూ - చివరకు సముద్రాంతరదేశాలనుంచివొచ్చే యాత్రీకులూ మొద లైనవారి తీవ్రవిమర్శలూను.

యునైటెడ్ స్టేట్స్ విశ్వమానవసౌభ్రాతృత్వాన్ని అనుసరించేందుకుగాను మొట్టమొదట్లో వాక్‌స్వాతంత్ర్యంద్వారా పత్రికాస్వాతంత్ర్యాన్నిచ్చింది; మతాన్ని ప్రభుత్వాన్నుంచి విడిగాఉండేట్లుచేసిన మొదటిదేశం; క్రూరశిక్షల్ని తొలగించినవాటిల్లో ప్రథమతాంబూలాన్ని అందుకున్నదేశం; ఉచిత పౌర విద్యావిధానాన్నీ, జైళ్లసంస్కరణనూ, ఉచిత గ్రంథాలయాల్నీ ప్రవేశ పెట్టిన మొట్టమొదటి దేశం!

నాలుగోది – ఒకానొకతెగ లేదా తరగతి మనుషులకు ప్రత్యేకసౌకర్యా లను కలిగించే ప్రభుత్వంగాగాక, ప్రజాప్రభుత్వంగా ఏర్పాటు చేయబడింది.

ఐదోది – అమెరికన్ ప్రభుత్వం తన పౌరుల ఉత్సాహాలను క్రియా రూపాన పెట్టేందుకు స్వశక్తిమీద ఆధారపడింది. సాధారణంగా అది చాలా మందగతిలో పనిచేస్తూ, పౌరులభిన్నాభిప్రాయాలను సమన్వయించుకుంటూ గందరగోళంగా ఉండే విధానాన్ని అనుసరించవలసివొచ్చినప్పటికీ చివరకు సఫలీకృమౌతుంది.

ఆరోది - వ్యాపారవ్యాసంగాలమీద ఆధారపడిన ప్రభుత్వమవటం. ఇలాటిది అరుదైన సామర్థ్యరహితమనే అభిప్రాయం అనేక సందర్భాలలో వెల్లడిచేయబడింది. ఐతే కాస్త పేరున్న ఏ సంస్కృతిఐనాసరే, ఘనమైన ఆర్థికవిధానంమీదనే నిర్మించబడాలి; అది సుస్థిరంగా నిలవాలంటే మరొక మార్గం కూడా లేదు. నిరంకుశప్రభుత్వాలు ఏదో వొక కుప్పమీదనే నిర్మించ బడుతూంటవి. అవి బానిసల కృషిని వినియోగించటం, , తాము జయించి ఆక్రమించిన దేశాలలోని పరిశ్రమలను తుడిచివేసి వాటికి సంబంధించిన యంత్రాలనూ, ఇతరభాగాలనూ స్వదేశానికి తరలించటం, లేదా తాము బలి

పశువులను గావించదలచుకొన్న కొన్ని సమాజాలను లేదా కొన్ని తర గతుల వ్యక్తుల తాలూకు ఆస్తిపాస్తుల్ని అక్రమంగా, అన్యాయంగా భుక్తం చేసుకోవటం చేస్తవి. ప్రజాస్వామ్య ప్రభుత్వం వ్యక్తిగతమైన ఆస్తిపాస్తుల రక్షణభారాన్ని వహిస్తుంది; అధిక లాభాలా, విశేషాదాయాలమీద అత్యధి కంగా పన్నులు వేసినప్పటికీ, ప్రభుత్వరాబడికి మూలకారణమైన ఆస్తినష్టాలు మాత్రం జరగకుండా కాపాడుతుంది. ఎందుకనంటే, ఐశ్వర్యమనేది ఒక పీడవలె ఆ ప్రభుత్వంచూడదు. కాని, తనకు అవసరమైన శక్తిసామర్థ్యా లకు ఆ ఐశ్వర్యమే మూలకారణమనీ, దానినుంచే ఇంకెన్నో లాభాలు ఉండగలవనే దృష్టితోనే ఉంటుంది. భాగ్యవంతమైనదేశం, విశేషోత్పత్తి ఉన్నదేశమే - ప్రజాసామ్య విధానం ఇవ్వగలిగిన లాభాలనన్నిటినీ తన ప్రజలకు అందజేయగలుగుతుంది.

ఈ విధంగా యునైటెడ్ స్టేట్స్‌లో రాజకీయాలూ, ఆర్థికవిధానాలూ ఒక దానితో మరొకటి మిళితమై నేతలో పడుగుపేకలు కలిసిపోయిన విధంగా ఉంటూన్నవి. ప్రభుత్వం క్రమవిధానాన్ని ప్రవేశపెట్టినప్పుడుకానీ, పన్నుల భారాన్ని అధికం చేసినప్పుడుకానీ ఆర్థికంగా బలవత్తరంగా ఉన్నవారు ఖూనీ జరుగుతోందన్నంతగా గగ్గోలు పెడతారు. ఐనప్పటికీ వారుకూడా ప్రభు త్వపు సేవలనూ, రక్షణనూ కోరుకోక తప్పటమూ లేదు.

ఐతే యీ ఆర్థిక విధానం ఎలా పనిచేస్తున్నది?

---

# తొమ్మిదో అధ్యాయం

## పుష్కలమైన జీవితం

విప్లవాత్మకమైన యుగంలో మనం నివశిస్తున్నాం. మొదటి విప్లవం జరిగిన నాటికి రాజకీయ ప్రజాస్వామ్యం పరిపూర్ణంగా తెలుసుకోబడనప్ప

టికీ, లభ్యమైనదనే నమ్మకం ఉండేది: అదే విధంగా యీ నాడు ఆర్థిక ప్రజాస్వామ్యం తాలూకు అనేక న్యాయాలు సుస్థిరంగా ఉంటూ ఉత్పత్తి. వాదకాలు కొత్తస్థితికి వొచ్చినవని గ్రహించటం జరిగింది.

ప్రపంచ జనాభాలో యునైటెడ్‌స్టేట్స్ జనాభా 7% ఐనప్పటికీ, ప్రపంచోత్పత్తిలోనూ, సేవలలోనూ 40% ఉత్పత్తి అమెరికాలో జరుగుతూన్నది. దేశీయమైన ఉత్పత్తిని, అక్కడి జనాభాతో భాగించినట్లయితే యూరప్‌లోని అత్యధికోత్పత్తి జరిగే ఏ దేశంతో పోల్చినా రెట్టింపు: ఇండోనేషియాతో పోలుస్తే ఇది పదింతలు. 1890 లోని ఉత్పత్తికన్నా 1940 లోని ఉత్పత్తి ఐదురెట్లు పెరిగింది; ఈ నిష్పత్తిలోనే దేశోత్పత్తి ముందుకుసాగుతూ, రోజురోజుకూ ఎన్నో వస్తువులు మరింత పుష్కలంగా లభ్యమవటంతోపాటు, ప్రజల ఆదాయం కూడా పెంపొందింది, ఆయా వస్తువుల్ని వారు కొనుక్కోగలిగిన స్థాయిలో ఉంచుతోంది. గత 80 సంవత్సరాలుగా కార్మికుని ఉత్పత్తి ఏటా 2% చొప్పున వృద్ధిజెందుతూనే ఉన్నది.

1820 - 1930 మధ్య దేశంలో విద్యుత్‌సరఫరా 40 రెట్లు పెరిగింది. 1910 లో జరిగిన పనికిగాను 21% మంది కార్మికులుండేవారు. 1940 కల్లా వీరు 11% మంది మాత్రమే ఉన్నారు. తక్కువ మానవశక్తితో ఎక్కువ సరుకులు ఉత్పత్తి అవుతూన్నవి.

యుద్ధానంతరంనుంచీ దేశంలోని ఉత్పత్తిమీది పెట్టుబడి 2,330,00,000 కోట్ల డాలర్లున్నది; ఉత్పత్తి ద్విగుణీకృతమైనది. కొత్తకొత్త అవసరాలకు అనుగుణంగా ఉక్కు, విద్యుత్‌శక్తి ఉత్పత్తిదారులు, తమ ఉత్పత్తిని అధికం చేశారు, వ్యవసాయంలో కూడా ఉత్పత్తి అత్యద్భుతంగా పెంపొందింది. 1820 లో దేశంలోని జనాభాలో 72% మంది పంటలు పండిస్తేనే కాని, దేశీయులందర్నీ పోషించటం సాధ్యమయేదికాదు. 1950 లో 11%

మంది మాత్రమే వ్యవసాయంలో ఉంది. దేశానికి అవసరమైన ఆహారాన్ని ఉత్పత్తి చేయగలుగుతున్నారు.

సాంకేతిక శాస్త్రాభివృద్ధి (టెక్నలాజికల్) మాల్థస్ ఊహించిన న్యాయాలు సరైనవికావని రుజూచేసింది: భూసారం పెంపొందించబడటం కార్మికశక్తీ, పెట్టుబడులూ అత్యధికాలవటం, సరళమైన శక్తివంతమైన గర్భనిరోధక పద్ధతుల్ని పెంపొందించటం ఇందుకు కారణాలు. ఆకలినీ, వ్యాధినీ జయించటమనేది మానవునిచేతుల్లోనే ఉన్నదనే విషయం చరిత్రలో మొట్టమొదటసారి రుజువయింది.

ఏ ఆర్థికవిధానమైనప్పటికీ మూడు ప్రాథమికసత్యాలమీద ఆధారపడి ఉంటుంది - స్వాభావికంగా లభ్యమయే ఖనిజాలూ మొదలైనవీ, కార్మికులూ, పెట్టుబడీను. ప్రకృతిప్రసాదించిన అనేక ఖనిజాలు, యునైటెడ్ స్టేట్స్‌లో అత్యధికంగా లభ్యమవటంవల్లనే దేశం భాగ్యవంతంగా ఉన్నదనే అభిప్రాయం ఎక్కువగా ఉంటూన్నది. ఐతే జనాభా పరంగా చూసినట్లయితే స్వాభావికంగా లభ్యమయే ఖనిజాలు - యునైటెడ్‌స్టేట్స్ ఆఫ్ సోవియట్ రష్యాకన్నా, పశ్చిమజర్మనీకన్నా - యునైటెడ్‌స్టేట్స్ ఆఫ్ అమెరికాలో ఎక్కువగా లభ్యమవటంలేదు. నిజానికి 1930 లో కన్న యీ నాడు అమెరికాలో ఎక్కువగా లభ్యమయే సహజఖనిజాలేమీలేవు; ఆ నాడు అమెరికన్ ఉత్పత్తి అమెరికా అవసరాలకే సరిపడకుండా; ప్రజలకు తీరని కోరికలుగానే పరిణమించింది.

కనుక ఇప్పటి ఉత్పత్తి కేవలం సహజసంపత్తి కారణంగా ఏర్పడింది కాదు. న్యూ ఇంగ్లండ్ రాష్ట్రంలో సహజసంపత్తి ఎంతో వెనుకబడి ఉన్నప్పటికీ, 19.వ శతాబ్దంలో పరిశ్రమలను పెంపొందించటంవల్ల దేశంలోకల్లా అది భాగ్యవంతమైన రాష్ట్రమైంది; అదే విధంగా దక్షిణ దేశంలో సహజ ఖనిజసంపత్తి అత్యధికంగా ఉన్నప్పటికీ, - బానిసలచేత పని చేయించి కేవలం ముడిసరుకుల్ని మాత్రమే అందిస్తూండటంవల్ల దేశంలో

కల్లా బీదరికాన్ని అనుభవించే భాగంగా ఉన్నది. స్పెయిన్ దేశీయులు దాదాపు దేశమంతా దేశదిమ్మరులవలె తిరుగులాడినా, జతికేందుకు తగిన విధంగా పెంపొందలేకా, ఉత్పత్తిద్వారా ఆర్థికవిధానాన్ని సరిదిద్దుకోలేకా అపజయాన్ని ఎదుర్కోవలసి వొచ్చింది. సహజంగా లభ్యమయే ముడిసరకుల వలెనే మానవుని మేథస్సూ శ్రమా కూడా అవసరం; లూకోనైట్ లాటి నాణ్యత లేని ఖనిజాలను ఉపయోగించి ఉత్పత్తి జరుగుతూన్నదంటే మానవుని మేథస్సులోనుంచే సరుకుల సరఫరా కూడా ఉద్భవిస్తున్నదా అనిపించగలదు.

వలసవొచ్చినవారు మానవశక్తి అవసరాల్ని తీర్చగలిగినా, ఆ నాడు కార్మికులు చాలా అరుదుగానే ఉంటూం దేవారు; అదేవిధంగా పెట్టుబడి కూడా తగినంతలేదు; దాన్నికూడా దిగుమతిచేసుకోవలసి ఉండేది. కార్మికులు తక్కువగా దొరుతుతూండటంవల్ల వారి కూలీ చాలా అధికంగా ఉంటూ ఎంతో పెట్టుబడి అవసరమైంది. అంతకన్నా యాంత్రికమైన ఉత్పత్తి కూడా అత్యవసరమైంది. వొచ్చినలాభాలేవో తిరిగి యంత్రాంగాన్ని పెంచేందుకుగాను పెట్టుబడిలోకి వెళ్ళినవి. కొత్తకొత్త విధానాల అన్వేషణలో ఎక్కువ ఉత్పత్తి చేసేందుకు అనుకూలంగా ఉండే యంత్రాలు కనుగొనబడసాగినవి. ఇప్పటి అమెరికన్ పెట్టుబడి సరిగ్గా సరిపోతూ, పని గంటల్ని తగ్గించేందుకు సదా ప్రయత్నం చేస్తూనే ఉన్నది.

అభివృద్ధి అనేది యీ విధానంలో ప్రత్యేక లక్షణం — ఉత్పత్తిలో అభివృద్ధి, తయారయే రకరకాల వస్తువులూ, వాటి సంఖ్యల్లో అభివృద్ధి; ఉత్పత్తి విధానాల్లో అభివృద్ధి, ఒకో కార్మికుడు చేసే ఉత్పత్తిలో అభివృద్ధి, తయారైన వస్తువుల్ని కొనగలిగే ప్రజాశక్తిలో అభివృద్ధి।

## పుష్కలతనిచ్చే ఆర్థికవిధానం

యూరప్‌వలెనే యునైటెడ్‌స్టేట్స్ కూడా క్రమంగా ముందుకు వెళ్ళగలిగినప్పటికీ, వస్తువులు దొరకటంలేదనే అభిప్రాయాన్ని ఇతరదేశాలలో

వలె వినరాకుండా, పుష్కలంగా ఉత్పత్తిని సాగించటంవల్ల ఉత్పత్తిలో మిగతా ప్రపంచంలోని దేశాలన్నిటిలోకీ మిన్నఐంది. పారిశ్రామికయుగా రంభంలో ఎంతో విభేదాలుండీ, ఒక తరగతి ప్రజానీకం ఉచ్చదశలో ఉంటూ, వారి లాభాలకొరకే పాటుబడటమంటూ జరిగినప్పటికీ - ఉత్త రోత్రా ప్రజలందరి సంక్షేమం కొరకు, ప్రజలందరూ శక్తివంతంగానూ, ఉత్సాహకరంగానూ స్వభావసిద్ధంగా లభ్యమయే ఖనిజాలను - ఒకవిధంగా నిర్లక్ష్యంగా కూడా, పరిశ్రమల్లో ఉపయోగించటం జరిగింది.

అమెరికన్ ఉత్పత్తి ఇంతగా పెంపొందేందుకు మరికొన్ని కారణాలు కూడా ఉన్నవి. ఉత్పత్తి అనేకవేలమంది వ్యాపారుల చేతుల్లో ఉన్నప్ప టికీ, మార్కెట్‌లో చలామణిఅయే సరకుల మార్పులకు అనుగుణంగా, ఉత్పత్తి కూడా మారుతున్నప్పటికీ - ప్రభుత్వానికి ఆర్థిక విధానం దెబ్బ తినకుండా కాపాడవలసిన బాధ్యతఉండటంవల్ల తదనుగుణంగా ఉత్పత్తిని మందగింపుచేయటం లేదా ఆపివేయటం కూడా జరిగింది. ప్రభుత్వానికి పన్నులు విధించే హక్కుఉన్నప్పటికీ, ఆస్తుల్ని స్వాధీనపరచుకొనేహక్కు లేదు. కనుక వ్యక్తులూ, వ్యక్తుల సమాజాలూ సరుకులఉత్పత్తిలోనూ, ప్రజా సేవలోనూ, తగిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కలిగిఉంటున్నారు. ఐతే దేశం లోని ఆర్థిక విధానం దెబ్బతినకుండా ఉండేందుకు - కార్మికులు, వ్యవ సాయం, ఉత్పత్తి సమాజాలూ ఒకదానితో మరొకటి సరితూగవలసిన అవ సరం ఉంటూనే ఉన్నది.

అన్నిటికన్నా ముఖ్యమైనది - భాగ్యమనేది గొప్పశక్తి గలదనీ, దాన్ని మరింత భాగ్యోపేతంగా రూపొందించేందుకు ఉత్పత్తిని సాధనంగా ఉప యోగించాలేకాని, భాగ్యాన్ని కూడబెట్టటం కూడదనీ అమెరికన్‌ల గాఢ విశ్వాసం. పెట్టుబడీ, కార్మికశక్తీ ఒకదానితో మరొకటి ఘర్షణపడకుండా కలిసికట్టుగా పనిచేసే ప్రశాంతవాతావరణంలో - ఉత్పత్తి ఎంత ధనాన్న యినా భరించగలదనేది అనుభవపూర్వకంగా తెలిసివొచ్చిన పాఠం. అందు

కనే ఉత్పత్తి కేవలం ఒకరిచేతుల్లోనే ఉండకుండా ఉండేందుకుగాను ది షెర్మన్ చట్టం; పరిశ్రమకు గొడ్డలిపెట్టుగా పరిణమించే ధరలు తగ్గింపు జరగకుండా ఉండేందుకు-కమోడెటీక్రెడిట్ కార్పొరేషన్; కార్మికులు సంఘాలు ఏర్పడేందుకు తగిన ప్రోత్సాహాన్నిచ్చేందుకుగాను ది వేగ్నర్ చట్టం; ఆ శక్తి అత్యధికమవకుండా ఉండేందుకుగాను టాఫ్టహార్ట్లే - మొదలైన వాటిని ఆయా సందర్భాన్నిబట్టీ, పరిస్థితులను అనుసరించీ అమెరికా ప్రవేశపెట్టింది. అమెరికా టివిఏను నిర్మించి ప్రభుత్వమే తపాలాశాఖను నడిపేందుకు అవకాశాన్ని కలిగించింది. ఐతే కొన్ని మిలియన్ల ఎకరాలను ప్రైవేట్ పారిశ్రామికులకు వొదలేసి, పశ్చిమదిశలో రైలు మార్గాల నిర్మాణం జరిగేట్లు చేసింది; ఒక్కరి పరంగానే అన్ని పరిశ్రమలూ ఉండకూడదనే భావాన్ని ప్రవేశపెట్టేందుకే - టెలిఫోన్, టెలిగ్రాఫ్ సర్వీసులను ప్రైవేట్ సంస్థల అధ్వర్యానికి వొదలటం, కాని ప్రజాసౌకర్యార్థం ఒక వైపున వాటిని అదుపాజ్ఞల్లో ఉంచటం జరిగింది. అదే విధంగా రైలు మార్గాలూ, విమాన యానాలుకూడా సక్రమంగా అదుపులో ఉంచబడినవి.

అమెరికన్ ఆర్థికవిధానం ఏదోపురాతనమైనదనీ, ఆడమ్స్మిత్, రికార్డోల కాలంనుంచీ బతికివొస్తున్నదనీ అభిప్రాయపడటం ఒక నాగరికతా లక్షణంగా ఉన్నది. ఐతే లూయీ ఎలెన్ వాదం ప్రకారం - అమెరికన్ ఆర్థిక విధానం సోషలిజమ్ విధానాన్నికూడా దాటిపోయి, ప్రైవేట్ వ్యాపార సంస్థలను ప్రభుత్వంతోపాటు కలిసిమెలిసి సాగించే పద్ధతికి రావటం జరిగిందనీ, కనుకనే ఆ రెంటిలో ఏ ఒక్కటీ సాధించలేనిదాన్ని ఇదిసాధిస్తున్నదనీను. పెట్టుబడినిగాక, పంపకాన్ని సోషలిజమ్ పద్ధతిమీద జరపటమనేది - ఎక్కువ వేతనాలివ్వటం ద్వారానూ, పెద్దఆదాయాలమీద అధిక పంకాలు వేయటం ద్వారానూ అమెరికా చేసింది. అమెరికన్ సోషలిజమ్ పద్ధతిలో బంగారుగ్రుడ్లుపెట్టేబాతును కోసుకొని తలాకాస్తా తినటం కాదు;

దానిచేత మరింత ఎక్కువగా బంగారుగుడ్లుపెట్టించి. ఆ గుడ్లను పంచు కోవటం।

అమెరికన్ వ్యాపారవిధానం ఒక కొత్త సిద్ధాంతాన్ని కనుగొన్నది - కలిసికట్టుగా పోటీచేయటమే అది! ఒకే వస్తువును తయారుచేసే ఉత్పత్తి దారులు తమ తమ అభిప్రాయాలనూ, వ్యాపార రహస్యాలనూ, కొత్తగా కనిపెట్టిన అనేక యంత్రాంగాలూ, లేదా విధానాలు మొదలైన వాటిని ఒకరి కొకరు చెప్పుకుంటారు. ఆ తరువాత వారు కాతాదారులకోసం పోటీలుపడ తారు. ఇలాటి విధానం స్వతంత్రంగా ఉత్పత్తి చేసుకొనే చిన్నకారు ఉత్పత్తిదారులను వైదొలగించింది.

కొన్ని అనుకూలతలు ఉన్నవనీ, ఆచరణలో వాటిని చూస్తూన్నామనీ అమెరికన్‌లు భావించనట్లయితే వారి ఆర్థికవిధానం ఇంతబాగా పనిచేయ గలదయేదికాదు. ఉదాహరణకు చట్టబద్ధులుగా ప్రవర్తించే పౌరులూ, ఆయా చట్టాలను ప్రవేశపెట్టి, వాటిని ఆచరింపజేయగల ప్రభుత్వమేలేనట్లయితే - కాంట్రాక్టులు సక్రమంగా నిర్వహించబడేందుకు తగినహామీ ఉండేది కాదు; - ఆర్థిక స్తోమత, బాంకింగ్ విధానాలు మంచి పునాదులమీద నిర్మించబడిన కారణంగా - పరిశ్రమకు అవసరమైన ఆర్థికసహాయం, లేదా ధనాన్ని ఒకరి నుంచి మరొకరికి మార్పుచేయటం మొదలైనవి చాలా సులభసాధ్యం చేయబడినవి; ఇక కార్మికులు ప్రతిఉదయమూ హాజరై, ఆటవిడుపుసూచన అయేవరకూ ఉంటూ, తాము ఆధారపడదగినవారుగా చలామణీకావటం, ఇలాటివి ప్రపంచంలోని ప్రతిదేశంలోనూ జరుగుతూనే ఉంటవని భావిం చటం పొరపాటు.

ఎలిపిట్నే ఒక భాగానికి మరొక భాగానికి తేలిగ్గా సరిగ్గా మార్పుచేసు కొనే విధానాన్ని కనిపెట్టిన కాలంలోనే అత్యధికోత్పత్తివల్ల కలిగే లాభా లనుగూర్చి విశదమైనప్పటికీ - అత్యధికోత్పత్తిని అత్యధికంగా సాగించేం దుకు అనుకూలమైన పద్ధతిని ప్రవేశపెట్టినకీర్తి హెన్రీఫోర్డ్‌కే దక్కుతోంది.

కోట్లాది ప్రజలు కొనుక్కోవాలని ఆతృతపడే ఒకానొక వస్తువును ఎక్కువ వేతనాలమీదపనిచేసే పనివాళ్లు తయారుచేస్తున్నారంటే - వారి అధిక వేతనాలు - అత్యధికోత్పత్తివల్లా, కోట్లాది ప్రజ ఆ తయారైన వస్తువుల్ని కొనుక్కొనేందుకు సిద్ధంగా ఉండటంవల్ల సాధ్యమౌతూన్నది. అల్పధరలు ఉత్పత్తిని అత్యధికం చేసినవి; అధికవేతనాలు మార్కెట్లను విస్తరింపజేసి అధికలాభాలకు దారితీసినవి - ఇదే పుష్కలతకు సంబంధించిన రాశిచక్రం.

ఇలాటి విధానంలో, బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు ఏర్పడటం తప్పలేదు. ఇది ధరల్లోగాక, ఉత్పత్తిఅయేవస్తువుల్లో పోటీగాపరిణమించింది. ఫోర్డ్, ఛవర్లెట్, ప్లీమౌత్ కారుల ధరల్లోని తేడాలు దాదాపు లెక్కలోకి రావు. పోతే ఖాతాదారుడు - దాని యంత్రాంగపు నాణ్యతలూ, లేదా తన భార్యకు ఇష్టమైనరంగు లేదా కారు అందచందాలూ మొదలైనవాటినిబట్టి - కారును ఎన్నుకోవటం జరుగుతోంది. ఈ బ్రహ్మాండమైన సంస్థలు ఒకదానితో మరొకటి పోటీచేస్తవి. అల్యూమినియం, స్టెయిన్‌లెస్‌స్టీలుతోనూ, జనరల్ మోటార్స్‌వారు ఉక్కుధర మితిమీరినట్లయితే తామే ఉక్కు ఉత్పత్తికి పూనుకుంటామని బెదరించటంలోనూ, లేదా పెద్దస్టోర్స్‌వారు తాము అమ్మే ఆహారదినుసులూ, పిండిధాన్యాలూ మొదలైన వాటిని తామే ఉత్పత్తి చేసుకుంటామని బెదరించటంలోనూ - ఇలాటి పోటీలు ఉంటవి.

ఇలాటిది గుత్తకు తీసుకొన్న విధానంగా పరిణమిస్తుందా?

చరిత్ర అలాకాదని చెప్పింది. గుత్తవిధానం సాధారణంగా యునైటెడ్‌స్టేట్స్‌లో ఏవగించుకోబడుతుంది. ఒకనాడు ఇలాటి గుత్తవ్యాపార విధానభయం - యునైటెడ్‌స్టేట్స్ ఉక్కుపరిశ్రమ, స్టాండర్డ్ ఆయిల్ కంపెనీలవల్ల కలిగిందికాని, అదంతా గతించిన చరిత్రభాగం కావటంతో ఇప్పుడు ఎవ్వరూ చివరకు తాము గుత్తవ్యాపారాన్ని సాగించగలమనేగాఢ విశ్వాసమూ, శక్తిసామర్థ్యాలూఉన్న బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు సైతం ఇలాటి అభిప్రాయాన్ని ఆహ్వానించటంలేదు. ఎందుకంటే పోటీ

అనేదే వారి ఉత్సాహం; అదే వారిని ముందుకు నడుపుతూన్నశక్తి. గుత్త వ్యాపారమనేది ప్రభుత్వాధీనంలో ఉండకతప్పదు; అలాటి పరిస్థితుల్లో 9.800.000 ఉత్సాహ కేంద్రాలున్న దానితో. వేరెవ్వరూ పోటీచేయలేరనే విషయం వారికి తెలుసు.

ఆటోమొబైల్స్, ఉక్కు, ఆయిల్‌లాటి భారీపరిశ్రమలు నాలుగునుంచీ. ఎనిమిది బ్రహ్మాండమైన కార్పొరేషన్‌ల ఆధ్వర్యంలో ఉంటూన్నప్పటికీ, చిన్నచిన్న పారిశ్రామికులు ఆ పరిశ్రమల్లోనే వర్ధిల్లేందుకింకా అవకాశా లెన్నో ఉన్నవి. నాలుగు ఉక్కు ఉత్పత్తి కార్పొరేషన్లు, వాటి వ్యాపారంలో మూడో భాగాన్ని 80 మంది చిన్న చిన్న పోటీదార్లకు వొదిలేసినవి. పెట్రోల్ పరిశ్రమలోని ఐదు కార్పొరేషన్‌లు ఐదింట మూడొంతులను తాము చేసుకుంటూ, మిగతాదాన్ని 500 మంది మధ్య పంపిణీ చేసింది.

బ్రహ్మాండమైన కార్పొరేషన్లూ, వ్యాపారసంస్థలూ మార్కెట్ మొత్తాన్ని దిగమింగకుండాఉండే కట్టుదిట్టాలెన్నోఉన్నవి. గొలుసుకట్టువలె ఉండే స్టోర్స్‌వారు - ఉత్పత్తిదారులు సరుకుల ధరల్ని పెంచకుండా వారి ఆట కట్టిస్తారు. ఐతే పెద్దపెద్ద పరిశ్రమల్లో - చాలా పెద్ద, శక్తివంతమైన కార్మికసంఘాలుండి. కార్మికుల వేతనాలవిషయంలో ఉత్పత్తిదారులతో బేరమాడి, కార్మికులు కేవలం యాజమాన్యపు దయాదాక్షిణ్యాలమీద ఆధార పడకుండా, వారికి న్యాయాన్ని సమకూర్చుతూ ఎటూ భారమవకుండా ఉండేట్లు చూడబడుతోంది.

అమెరికన్ జీవితవిధానంలో బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు పునాది రాళ్లుగా ఉన్నవనేది - కొంతమంది విమర్శకులు లెక్కచేయక పోయినప్ప టికీ - నిస్సందేహం, అనేకవస్తువులను నాణ్యతగలవాటిని చాలా స్వల్ప ధరలకు యీ కార్పొరేషన్‌లు సరఫరా చేయగలుగుతూనే ఉన్నవి. ఇంత కన్నా నాణ్యాన్ని పెంచేందుకూ, ఉత్పత్తిని అధికం చేసేందుకూ కార్పొ రేషన్‌లు సదా పరిశోధనలను సాగిస్తూనే ఉన్నవి. చిన్నచిన్న వ్యాపార

సంస్థలవలెగాక, యీ కార్పొరేషన్‌లు తమ కార్మికులకు వేతనాలను పెంచ టం, ఇతర సౌకర్యాలను అధికం చేయటం మొదలైన పనులుచేస్తూ, కార్మికులతోడి సంబంధాలను పెంపొందించుకుంటూన్నవి.

అమెరికన్ సమాజంవలెనే - అమెరికన్ ఆర్థికవిధానాన్ని కూడా సర ళంగా, తేలిగ్గా కొద్దిమాటల్లో వర్ణించటం సాధ్యంకాదు: ఎందుకంటే - అది బహుముఖంగా ఉంటూ, ఎప్పటికప్పుడు కొత్తకొత్త పరిశోధనలకు గురవుతూ, సదా వర్ధిల్లుతూనే ఉన్నది. ప్రైవేట్ వ్యాపారాన్నిగూర్చి అమెరి కన్‌లు గోలచేసినప్పటికీ - ఏదోరకమైన అజమాయిషీ, ఆదుపాజ్ఞల్లోఉండా లనే కోరుకోవటం జరుగుతోంది; అప్పుపుట్టటం, గుత్తవ్యాపారం, పారి శ్రామిక విభాగానికి సంబంధించిన యూనియన్, పంటల ధరలూ మొద లైన వాటిని చెప్పుచేతల్లో ఉంచటం లాంటివి. ఇలాటి ఘర్షణపడే అనేక విషయాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొని ఒకోసందర్భాన్నిబట్టి ఒకో పంథా అనుసరిస్తూ ఉండాలి. ఐతే దాని ఫలితమెప్పుడూ - అందరికీ లాభ సాటిగా ఉండే ఆర్థికవిధానమై, ఒక శక్తికి, మరొక విరుద్ధశక్తి ఉండి తక్కెడ ఎటూ మొగ్గకుండాచూస్తూ, ఉత్పత్తిలో శక్తిసామర్థ్యాలన్నిటినీ చూపుతూ, ఎప్పుడూ కావలసినదానికన్నా అత్యధికోత్పత్తి సాగుతూండ టంగానే ఉండాలి.

## ఉత్పత్తి

సువిశాలమైన మార్కెట్ ఉండుటవల్లా, వస్తువుల ధరలు నిర్ణయించ బడి అదుపాజ్ఞల్లో ఉంచబడటంవల్లా, కొంతవరకూ ఇతర ఉత్పత్తి స్థానా లనుంచి సరకుల రవాణా ఖర్చులు తగ్గిఉండటంవల్లా యునైటెడ్‌స్టేట్స్‌కు పంతోలాభిస్తున్నది. రాష్ట్రానికీరాష్ట్రానికీమధ్య కస్టమ్స్ అనే అడ్డం లేకుండటం వల్లా, దేశంలో రవాణాసౌకర్యాలు అత్యధికంగా అభివృద్ధి చేయబడటం వల్లా, స్వదేశానికి అవసరమైన వస్తువుల్ని అత్యధికంగా ఉత్పత్తిదారులు

ఉత్పత్తిచేసి - యీ విధంగా ఒకోపనిలో నిపుణుల్ని రూపొందించి, ఒకో వస్తువు ఉత్పత్తిలో ప్రత్యేకతను గణించుకొని - వస్తువుధరల్ని ప్రజానీకం కొనుక్కోగలిగినస్థాయికి తగ్గించివేయగలిగారు.

స్వేచ్ఛగాఉండే మార్కెట్ అవసరమని అమెరికన్‌లు - సత్యమనేకన్న భావోద్రేకంతో అన్నప్పటికీ - సమాజంలోని వివిధ సమూహాల కొరకై దాన్ని మితిగా ఉంచాలనీ ఎటూ ఎక్కువగా మొగ్గకుండా చేయాలనీ వారు కోరుతారు. పరదేశాల ఉత్పత్తిదారుల పోటీని తట్టుకునేందుకు వస్తువుల ధరల నిర్ణయం, కార్మికులకు కనీసవేతనాలూ సామాజిక రక్షణద్వారా వారికి రక్షణ కల్పించటం, వ్యవసాయదారులకు తరుగుపొయ్యే దాన్నివ్వటం, ప్రజలకు స్వచ్ఛమైన ఆహారం, నాణ్యమైన మందులసరఫరాకు అవసరమైన చట్టాలూ, ద్రవ్యోల్బణం పెరిగిపోకుండా ఉండేందుకు ఋణాల మీద అదుపాజ్ఞలూ, ప్రజలను రక్షించేందుకూ, ఫెడరల్‌ప్రభుత్వపథకాలన్నీ దిగ్విజయంగా కొనసాగేందుకూ అవసరమైన ఆర్థిక సహాయాన్ని పొందేందుకు అంచనాలవారీగాఉండే ఆదాయపుపన్ను విధించేవిధానం, కార్మికులందరూ కలిసికట్టుగావుండి, యాజమాన్యందగ్గర తమవేతనాలూ ఇతర సౌకర్యాలనుగూర్చి బేరమాడేందుకు యూనియన్‌లూ, రైళ్లు నడపబడే విధానం మీద అజమాయిషీ, రైలు రేట్లు పెరిగిపోకుండా అదుపాజ్ఞల్లో ఉంచటం, వాయుతరంగాలనూ, విమానయానాలనూ చెప్పుచేతల్లో ఉంచటం, పెట్టుబడిదారుని పెట్టుబడులకు తగినరక్షణ నివ్వటం - ఇలాటివెన్నో వున్నవి; వీటన్నిటినీ ప్రభుత్వం బాధ్యతవహించి, నిర్వర్తించవసినపనులనీ, అందువల్ల పరిశ్రమలూ, మార్కెట్‌లూ సంరక్షించబడాలనీ ప్రజాభిప్రాయం. బహుముఖంగా ఇలాటికట్టడులు అమెరికన్ ఆర్థికవిధానాన్ని పెడద్రోవల బడకుండా చేయగలిగినవి. ఏమైనప్పటికీ అమెరికన్ విధానం అత్యధికోత్పత్తిగా ఎలా ఫలించిందనే ప్రశ్న ఉండనే ఉన్నది.

ప్రొటెస్టెంట్ నైతికదృక్పథం - మానవులు శ్రమపడి పనిచేయాలనీ, ఉత్పత్తిని దైవఆశీర్వాదంగా భావించాలనేది నమ్మబడింది. తరగతులవారీ విభజన లేకుండటం, సరిసమానమైన అవకాశాలు అందరికీ ఉండటం అమెరికన్‌లందరినీ వ్యాపారానికీ, పరిశ్రమలకూ ప్రోత్సాహపరచినవి. బ్రిటిష్ ప్రభుత్వంనుంచి స్వాతంత్ర్యాన్ని సాధించటం అమెరికన్ ఉత్పత్తిదారులు శక్తివంతంగా ముందడుగువేసే అవకాశాన్నిచ్చింది. పశ్చిమ దిశకు విస్తరించటం, జనాభావృద్ధికావటం, అనేకవస్తువుల అవసరాలను అభివృద్ధి చేసింది.

సామర్థ్యం గణనకు ఎక్కింది. హేమాహేమీలు పరిశ్రమల్లో స్టాప్ వాచెస్ పట్టుకొని నిలబడి - పనివాళ్లు నిలబడిన విధానాలనూ, స్థలాలనూ మార్పులుచేసి చూసీ, కదిలిపొయ్యే బెల్టులద్వారా సరుకులు పనివాళ్లకు అందేట్లుచేసీ, పనివాడు ఎక్కువసార్లు, అనేక కోణాల్లో కదలకుండావుండే ఉపాయాలను ప్రవేశపెట్టారు. ఈ విధానం ఎంత దూరంవెళ్ళిందంటే పనివాడు తాను దాదాపు చేసిందేమీలేదనే ధోరణిలో పడ్డాడు; అందుకని ఇప్పుడీ ఊపు వెనక్కు మళ్ళింది; తాను కూడా కొంతపని చేశాననేతృప్తి కార్మికునికి కలిగేందుకని అతనిచేత తగినంత పనిచేయించవలసివొస్తోంది. ఐతే ఇందువల్ల - కార్మికులు పనిచేసేస్థలాలూ, పనిసాగేపద్ధతీ, పనిచేసే విధానాల్లో ఎంతో అనవసరమైన వృథాఉంటూన్నదనే విషయాన్ని వారు రుజూచేశారు.

ఆయావస్తువుల ఆకారాలనూ, సైజులనూ నిర్ణయించటం అనేక కోట్ల డాలర్లను ఆదా చేయగలిగింది. అంతకు పూర్వం 30 కన్నా ఎక్కువ రకాల హాస్పిటల్ మంచాలుంటే, అవన్నీ ఒకటి రెండు రకాలుగా మాత్రమే రూపొందినవి. కార్ల ఉత్పత్తిదారులు కొద్దిరకాల బాడీలనూ, ఫ్రేమ్‌లనూ, ఇంజన్‌లనూ తయారుచేయటంవల్ల, కొద్ది కొద్ది మార్పులతో వాటిని ఆటొమొబైల్ లైన్స్ అన్నిటా ఉపయోగించే అవకాశాలు లభించినవి.

ఉత్పత్తిఅయ్యే వెలను గూర్చిన ఎకౌంటింగ్, అంచనాలలో చేయ బడే పరిశోధనలూ, ఉద్యోగరీత్యా చేయబడిన విశదీకరణలూ, శాస్త్రీయ పరిశోధనలూ, వ్యాపారం ముందు ముందు ఎలా ఉండగలదో చెప్పగల గటం, వస్తువుల్ని చెడకుండా దాయటంలో అభివృద్ధిచేయబడిన గోడౌనులూ, ఉత్పత్తి ఐనసరుకుల్ని చకచకా రవాణాచేసే పద్ధతులూ - వీటిల్లో ప్రతి ఒక్కటీ ఒక ప్రత్యేకతను కలిగిఉంటూ, అన్నీకలిసి అత్యంత సమర్థ నీయమైన ఉత్పత్తికి దారితీసినవి.

తక్కువ ధరలకు ఉత్పత్తిఅయ్యే పద్ధతిని, అధిక వేతనాలతో జతపర చట మెలాగో అమెరికన్ ఉత్పత్తిదారులు నేర్చుకున్నారు; ఇలాటెది సమ ర్థతకు అగ్నిపరీక్షవంటిది. మరొక పరీక్ష ఇది: సోవియట్ యూని యన్‌లో ప్రతినలుగురు పనివాళ్లమీదా ఒక మేస్త్రీలాటివాడు లేదా వారి తాలూకు ఉత్పత్తిని గూర్చి పరిశీలించే గుమస్తాలాటివాడు అవసరమైతే - యునైటెడ్ స్టేట్స్‌లో ప్రతి 7 మంది కార్మికులమీదా ఒక్కడే అవసర మౌతూన్నాడు.

పురాతనమైన సామర్థ్యంలో - కార్మికుడు చకచకా పనిచేయవలసి వా స్తే, యీ కొత్తపద్ధతిలో కార్మికుడు మరింత సుఖంగాఉంటూ, తృప్తి కరంగా బతుకుతూ ఎక్కువ ఉత్పత్తి చేయగలుగుతూన్నాడు. ఆయా పరి శ్రమలను అనుసరించీ, కార్మికులు చేసేపనినిబట్టీ, ఆయా సమయాలనుబట్టీ ప్రత్యేకతఉన్న సంగీతం, కార్మికుల మనస్తత్వాలకు అనుగుణంగాఉండేది ఫాక్టరీలలో, పరిశ్రమల్లో వినవొతూఉంటుంది. దీని ఫలితాలివి: నరాల బిగువుకు గురికాకుండానూ, కార్మికునికి పనిలో విసుగుజనించకుండానూ ఉండటమేగాక, ప్రమాదాలను తగ్గించటం వస్తువులు నలిగిపోకుండా, పగిలి పోకుండా, చెడిపోకుండా ఉండటం జరుగుతోంది. యజమానులు తమ బాలెన్స్ షీట్స్‌లో ఆయా ఫలితాలను స్పష్టంగా చూడగలిగారు. 5 కోట్ల మంది కార్మికులు ఒకే రకం సంగీతాన్ని ఎన్నుకున్నారు.

ఇదిలా ఉండగా పారిశ్రామిక పరిశోధనలమీద ఏటా 2.6 బిలియన్ డాలర్లు ఖర్చుపెట్టబడుతూన్నవి: ఫలితంగా - అనేక కొత్త ఆవిష్కృతాలు ఉత్పత్తిలో ప్రవేశపెట్టబడుతూన్నవి. జనరల్ మోటార్స్‌వారికి దానంతటదే పనిచేసే ఉత్పత్తిలైన్ ఉన్నది; అది గంటకు 2,000 ఆటోమొబైల్ పిస్టన్స్‌ను తయారుచేస్తుంది. ఒక కంపెనీ తాలూకు 14 బ్రహ్మాండమైన గాజు ఊదే యంత్రాలు అమెరికాకు అవసరమైన బల్బులలో 90% తయారుచేయటమే గాక. దేశానికి కావలసిన ఎలక్ట్రానిక్ ట్యూబ్‌లనన్నిటినీ తయారు చేస్తూన్నవి; ఈ యంత్రాలలో ఒక్కోదానిమీద ఒక్కోపనివాడే పరివోతాడనేది సత్యమే ఐనప్పటికీ, గాజుపరిశ్రమ 40 ఏళ్ల క్రితం నియోగించిన కార్మికుల సంఖ్యకు $1\frac{1}{2}$ రెట్లమందిని యీ నాడు ఉపయోగిస్తూన్నది.

పరిశోధనలు కొన్ని వందల కొత్త కొత్త పదార్థాలను తయారు చేస్తున్నవి - వస్త్రాలలోనేమి, మందుల్లోనేమి - ఇందువల్ల పూర్వం మానవుడు ప్రకృతిమీదా, అడవులూ, క్షేత్రాలమీదా ఆధారపడినంతగా, యీనాడు ఆధారపడనవసరం లేకుండాఉన్నది. ఇప్పుడు బ్రహ్మాండమైన రసాయనిక పదార్థాలను తయారుచేసే ప్లాంట్స్‌నుంచి - ఒకనాడు శాస్త్రకారుడు కలలుగన్న విధంగా - ఎడతెరిపిలేకుండా అనేక వస్తువులు - ఎరువులూ, కృత్రిమమైన రబ్బర్, ప్రింటర్స్ ఇంక్, యీ నాడు ప్లాస్టిక్స్‌నుంచి ఉద్భవించే అనేక కొత్త పదార్థాలకూ, వినూత్నమైన వస్తువులకూ మూలాధారమైన ముడి ప్లాస్టిక్ మొదలైనవి ధారాపాతంగా వొచ్చిపడుతూన్నవి.

రసాయనిక శాస్త్రజ్ఞులూ, భౌతికశాస్త్రజ్ఞులూ ఇప్పటికే ఎన్నో అత్యద్భుతాలను సృష్టించారు; రసాయనిక, భౌతికశాస్త్రకారులు, జీవశాస్త్రజ్ఞులతో కూడా కలిసి పరిశోధనలనుసాగిస్తే - ఎన్నో క్రొత్త విషయాలను పరిశ్రమల్లో ప్రవేశపెట్టడమే గాకుండా, ఎన్నో పదార్థాలు - ప్రకృతి సహజంగా రూపొందించగలిగిన ఆహారాన్ని - కాంతి, గాలి, నీటిసహాయంలో ప్రకృతి అనుసరించిన మార్గాన్నే రూపొందించగలరేమో ననిపిస్తుంది.

క్రొత్త సృష్టులు కార్యాలయ కార్యకలాపాలలో ఒక విప్లవాన్ని రేకెత్తించినవి. ఒకానొక ప్రజాసేవా కార్యాలయం దాదాపు 20 లక్షలమంది కాతాదారుల్ని కలిగిఉండి 270 మంది మనుష్యులు పనిచేసే ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌ను స్థాపించింది; ఇందువల్ల 500 మంది గుమాస్తాలు వారమంతా పాటుబడితే అయేపని, ఇప్పుడు 2 రోజుల్లోనే పూర్తవుతూన్నది. బొక్కలు వేసిన కార్డ్‌లను లోనికిపంపుతూ, దాదాపు అన్నిరకాల ఫిర్యాదులకూ, ప్రశ్నలకూ జవాబుల్ని పంపగలిగే యంత్రం కూడా రూపొందించబడింది.

ఇప్పుడు ఉపయోగంలోఉన్న ఫాక్టరీయంత్రాలు - ముడిసరుకును తీసుకోవటం, క్లిష్టంగా పనిచేసే యంత్రాంగంలో ఎక్కడైనా లోపమున్నట్లయితే దాన్ని కనుగొని సరిదిద్దటం, ఆగటం, తిరిగి పనిచేయటం, రూపొందించబడిన వస్తువును పరిశీలించటం, లోపమున్న వస్తువుల్ని వొదిలివేయటం; తయారైన వస్తువుల్ని లెక్కించటం, ఏ విధానంలో ముడిపదార్థాలు అందివ్వబడినవో ఆ విధానాన్ని 'ఎలక్ట్రానిక్ బ్రెయిన్' గుర్తుంచుకోవటం - చేయగలవు.

వాటంతటవే పనిచేసే యంత్రాలు ఉపయోగంలోకి రానారంభించాక, అదే విధానం కొనసాగించబడుతూ, అనేక పరిశ్రమల రూపురేఖలే మారటం, మరికొన్ని పరిశ్రమల్లో ఎన్నోమార్పులు రావటం జరిగింది; ఐతే ఆటోమేషన్ అనేది ఇప్పుడిప్పుడే ఆరంభమైందనే అనాలి; ఇందువల్ల విద్యుత్‌శక్తి ఖరీదు 1939 లో ఎంతఉన్నదో ఇప్పుడూ అలాగేఉన్నది; కాని జీవితప్రమాణం మాత్రం 90% పెరిగింది.

డిక్టేటింగ్ యంత్రాలువొచ్చాక, స్టెనోగ్రాఫర్స్ విరమించవలసి రావటం, లెక్కలుకట్టే యంత్రాలువొచ్చాక, ఎకౌంటెంట్లను చాలావరకు తగ్గించివేయటం, గాజుఊదటం, కాబినెట్లను తయారుచేయటం మొదలైన నైపుణ్యాలున్న వారి అవసరం మరిలేకుండటం - మొదలైన వాటివల్ల నిరు

ద్యోగులు అధికమౌతారనీ. ఆయా యంత్రాలు ప్రవేశపెట్టటంలో గొప్పకీడు ఉన్నదనీ కొంతమంది పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ఇతరులు - ఇంజనీర్లూ, టెక్నీషియన్లు మరింతమందికావాలనీ, నడుములువిరిగే పనులు యంత్రాలేచేయాలనీ, అదేవిధంగా ఆరోగ్యానికి భంగకరమైన పనులూ, వ్యాధులను పెంపొందించి విస్తరింపజేసే కార్యకలాపాలూ యంత్రాల ద్వారానే జరగాలనీ, ఆటోమేషన్ కారణంగా అత్యధికోత్పత్తి సాధ్యమౌతూన్నది కనుక, పనిచేసే గంటలు తగ్గించబడాలనీ, ఇందువల్ల ఎక్కువ విశ్రాంతికాలం లభ్యమౌతుందికనుక సంస్కృతినిపెంపొందించుకొనేందుకు దాన్ని తగినవిధంగా ఉపయోగించేకునే అవకాశాలు అవసరమనీ వాదిస్తున్నారు.

## కార్పొరేషన్

ఇలాటి సజీవ ఆర్థిక విధానానికి కార్పొరేషన్ బాధ్యతవహించింది. ఒకనాడు - అమెరికన్ శకాల్లోకూడా - యీ కార్పొరేషన్ హద్దూపద్దూలేని దురాశల్కు లోనుకావటం, గుత్తవిధానాలను అనుసరించటం, ఒకపక్క వైభవోపేతమైన ఐశ్వర్యం మరొకవైపు కడుబీదతనం వర్ధిల్లటం, రాజకీయంగా పెడద్రోవలు ప్రోత్సహించబడటం జరిగిన విషయం ప్రపంచం మరచిపోకపోయినా, ఇలాటివన్నీ ముందుముందు కలగబొయ్యే శుభాలకు సూచకాలుగా కూడా పరిణమించినవనే అనాలి.

ఐతే రోజులు ఎంతమారినవి! ఈ రోజుల్లో కార్పొరేషన్ తాను పొందిన కీర్తికి వాణికిపోవటం, ప్రజాసంబంధ కార్యకలాపాలను ప్రజలకు పరిచయం చేసేందుకూ, కార్యకలాపాలు జరిగేవిధానాన్ని వారికి తెలియజెప్పేందుకూ కొంతమంది హేమాహేమీలను నియోగించటం, ప్లాంట్స్ చూడదలచుకొన్నవారిని ఆహ్వానించటం, స్టాక్‌మార్కెట్ విషయంలో వొచ్చే దర్యాప్తులకు ఎంతో ఓపిగ్గా, సగౌరవంగా జవాబు లివ్వ

టం, విద్యాలయాలనుంచివొచ్చే విద్యార్థ విద్యార్థినులకు తమ ప్లాంట్ పని చేసే విధానాలను వివరించి, అంతా చూపటం, ప్రజలందరూ పౌరసేవా తత్పరులయ్యేందుకు ప్రోత్సహించటం మొదలైన పనులు చేస్తున్నది.

యాజమాన్యాన్ని వహించినవారు, కార్పొరేషన్‌లతోసహా లెక్కలు కడితే బహుకొద్దిమంది. వీరిలో 90% మంది - 3। మందికన్న తక్కువ మంది పనివాళ్లను నియోగించుకున్నవారు. ఐతే పై అంతస్థుల్లోఉన్న 5% మందీ - మొత్తం దేశంలోని కార్మికుల్లో 70% మందిని భరిస్తున్నారు. వ్యాపారరంగంలో 20 లక్షల మంది వ్యక్తులు, లేదా వాటాదార్లున్నారు; కార్పొరేషన్‌లు 5 లక్షలున్నవి. కాని యీ కార్పొరేషన్‌లలో సుమారు 200 కార్పొరేషన్‌లు వ్యాపారసంబంధమైన ఆస్తుల్లో సగానికి అధిపతులు. ఒక దానితో మరొకటి కలిసిపోవటం, యాజమాన్యంలో మార్పులు జరగటం, స్టాక్‌మార్కెట్‌లో ఇంటర్‌లాక్ పద్ధతి అనుసరించటం - మొదలైన వాటి కారణంగా బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు మరింత భారీగా పెరిగిపోతూన్నట్లు కనిపిస్తుంది.

ఇలాటి సంస్థలు - విద్యాలయాలూ, చర్చీలవలెనే సామాజిక సంస్థలు ప్రజాభిప్రాయాలూ, వారి అభిరుచులూ; జీవితవిధానాలూ, మొదలైనవి వీటి పలుకుబడులకు లోనౌతూనే ఉంటవి. నిజానికి - విద్యాలయంలో నేర్చుకున్నదాన్నీ, చర్చీలలో వినేదాన్నీ యీ కార్పొరేషన్‌లు ఎంతో పలుకుబడికి లోనుచేయగలిగి సామాజిక జీవితాన్నే మార్పుచేయగలిగినంత బలవత్తరంగా ఉన్నవి.

ఈ బ్రహ్మాండమైన సంస్థలు ఎవరి ఆధీనంలో ఉన్నవి? ఏ విధంగా అదుపాజ్ఞల్లో ఉంచబడుతూన్నవి? వీటిద్వారా లాభములను పొందేదెవరు?

చాలా సందర్భాలలో యాజమాన్యం ఎంతో విస్తరించి ఉండటం, ఆ సంస్థలో నియోగించబడిన పనివారిసంఖ్యకన్న వాటాదారులసంఖ్య అధికంగా ఉండటం జరుగుతోంది. డ్యూపాంట్‌లో 89,000 మంది పనివారుంటే -

166,000 మంది వాటాదార్లున్నారు: జనరల్ మోటార్స్‌లో 514,000 పనివారు (వీరుగాక 88,000 మంది సముద్రాంతర దేశాల్లో ఉన్నారు;) ఉంటే, 656,000 మంది వాటాదార్లున్నారు. జనరల్ ఎలక్ట్రిక్‌లో 210,000 మంది పనివారుంటే, 296,000 మంది వాటాదార్లున్నారు. స్టాక్ మార్కెట్‌లోని వాటాలు 86-90 లక్షలమంది అమెరికన్‌ల పరంగా ఉన్నవి. వీరిలో చాలామంది పూర్వపు అభిప్రాయంలోని పెట్టుబడిదారుని చిత్రానికి భిన్నంగా ఉండే - సన్నకారులు.

కనుక కార్పొరేషన్ యజమానులు దేశమంతటా చెల్లాచెదురుగా విస్తరించి ఉంటూ, దానిమీది ఆజమాయిషీ చలాయించలేని స్థితిలో ఉంటూన్నారు. ఆజమాయిషీ యాజమాన్యాన్ని వహించిన వారిచేతుల్లోనూ బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్ పరంగానూ ఉంటూన్నది. ఐతే వార్షికంగా జరిగే మీటింగుల్లో వాటాదారులు గోలచేయటం, లేదా ఇబ్బందులు పెట్టడం, వారి హక్కులకు భంగకరంగా ప్రవర్తిస్తే గందరగోళపరచటం చేసే అవకాశా లున్నవి కనుక, ఆఫీసర్లు తగిన జాగ్రతలు తీసుకుంటారు. ఆర్థిక ప్రజాస్వామ్యం విస్తరించే యీ శకంలో - మేనేజర్లు సామాజికమైన శాంతి భద్రతలకు బాధ్యతవహించే విధంగా ప్రవర్తించాలనీ, అలా జరగకుంటే ప్రభుత్వమే అడ్డుపడి తగిన కట్టుదిట్టాలు చేస్తుందనీ తెలుసుకున్నారు. కనుక ఐదింతలు పెరిగిన వారి బాధ్యతను అంగీకరిస్తున్నారు. వాటాదారులకు తగినంత లాభాలవాటా రావాలి: పనివారికి న్యాయమైన వేతనాలు అందాలి అందువల్ల ఉత్పత్తి అధికమౌతూ, పని ఎంతబాగా జరిగిందో తెలుస్తూనే ఉంటుంది: ప్రజలకు నాణ్యమైన సరుకులు స్వల్పధరలకు లభ్యమవాలి; ప్రభుత్వానికి తగినంత ధనం పన్నులద్వారా లభ్యమై ప్రజాసౌకర్యాలనూ, దేశాభ్యుదయ కార్యకలాపాలనూ కొనసాగించే అవకాశాల నివ్వాలి. ఇక ఐదోభాగం - ఉత్పత్తిచేసే ప్లాంట్‌లను మార్పుచేసేందుకు

లేదా విస్తరింపజేసేందుకు వినియోగించటంవల్ల - ఉత్పత్తి మరింతగా పెరిగి, పై నాలుగు భాగాలనూ పై అంతస్థులకు పంపితీరుతుంది.

ఎవ్వరూ పథకం వేయనవసరంలేకుండానే, యీ బ్రహ్మాండమైనసంస్థలు ఆర్థికసంస్థలేగాక - రాజకీయ, సామాజిక సంస్థలుగా కూడా రూపొందటం జరిగింది. కార్పొరేషన్ ఆలోచనలు ప్రభుత్వపంథాలకు అనుగుణంగాఉండ టం- సమానాంతరంగా సాగటం దినదినాభివృద్ధిగా ఉంటూన్నది. దాని పరి మాణంలోనూ, క్లిష్టతలోనూ, సహాయసానుభూతుల్ని సాధించటంలోనూ, తన నిర్ణయాలు సమాజంమీదరేపే పలుకుబడులలోనూ – కార్పొరేషన్ కూడా ఒక చిన్న ప్రభుత్వంవలె – ఐతే మరింత చిన్నది కాకుండానూ రూపొందింది.

ఈ బ్రహ్మాండమైన పరిమాణం కొంతమందిని సంతోషపెట్టింది. మరి కొంతమందిని భయభ్రాంతుల్నిచేసింది. అమెరికాలోని ప్రముఖ పౌరుల్లో ఒకరైన డేవిడ్ లిలెన్‌థాల్ – యీ బ్రహ్మాండమైన పరిమాణం కీడుకు మూలమని భావించటం తప్పనీ, ఉత్పత్తి పెరగవలసిన అవసరం ఉన్నది కనుక కార్పొరేషన్ కూడా పెంపొందటం తప్పదనీ, ఇందువల్ల ప్రజలకు రకరకాల వస్తువులు నాణ్యమైనవి లభ్యమౌతూంటవనీ, యీ బ్రహ్మాండ మైన సంస్థలు ఒకదానితో మరొకటి పోటీపడటంవల్ల, కార్మికులు అధిక సంఖ్యాకులుగాఉంటూ, బలవత్తరమైన యూనియన్‌లుగా ఉండటంవల్లా - మరొకవైపు బ్రహ్మాండమైన ప్రభుత్వం ఉండటంవల్లా - అదుపాజ్ఞల్లో ఉంటూన్నవనీ అభిప్రాయపడుతున్నారు. సి. రైట్ మిల్స్ – ఈ బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు సమాజంలో ప్రముఖస్థానాల్ని ఆక్రమించు కొని వాటి నిర్ణయాలను ఎక్స్‌ప్లాయిటేషన్ ద్వారాగాక, ప్రకటనల ద్వారానూ, సూచనలద్వారానూ ప్రజానీకాన్ని తమవైపున నడిపిస్తూ, వారు కోరినదాన్ని ప్రజలచేత చేయించగలుగుతూన్నవనే అభిప్రాయాన్ని వెలి బుచ్చారు, కాని, ఆయన – యీ బలాతిశయానికి అవతలి తక్కెడలో

ఉన్న - కార్మికసంఘాలూ, చర్చ్‌లూ, ఇతర సమూహాలను లెక్కలోకి తీసుకున్నట్లు కనిపించదు.

19వ శతాబ్దపు చివరిభాగంలో బాధ్యతారహితంగాసాగిన వ్యాపారంనుంచి వెలువడిన యీ నాటి బ్రహ్మాండమైన కార్పొరేషన్‌ల తాలూకు పెద్ద వ్యాపారాన్ని పోల్చిచూడకుండానే - నిరాశావాదులు, యీ కార్పొరేషన్‌ల కారణంగా చిన్నచిన్న వ్యాపారస్థులు నాశనమౌతున్నారనీ, వారి పెట్టుబడులతో పోటీచేయలేని సన్నకారు నలిగిపోతూన్నదనీ గోలపెడుతూన్నారు.

ఐతే యీ ఆర్థికవిధానంలో మరికొన్ని లక్షలమంది చిన్నవ్యాపారస్తుల కూ డా ఇంకా చోటున్నది. చిన్నది లేక సుమారైన పట్టణంలోని జీవితంలో - వృత్తులు చేసుకుంటూన్నవారూ, వ్యాపారులూ, చిన్న చిన్న ఉత్పత్తి దారులూ, సరుకులు ఎగుమతి దిగుమతిదార్లూ - తమ కుటుంబీకులతోసహా స్వచ్ఛందసేవల్లో పాల్గొంటూ సామాజికుల ఆరోగ్య సంక్షేమాల కొరకు పాటుబడుతూనేఉన్నారు. మూలసంస్థతాలూకుశాఖ ఎక్కడ ఉండినా, అక్కణ్ణుంచి మేనేజర్లు అడపా దడపా యీ ఊరికీ వొచ్చి పోతూండటం జరిగినా - ఇక్కడ ఈ శాఖలో పనిచేసేవారే నాయకత్వాన్ని వహిస్తూండటం జరుగుతోంది. మూలసంస్థ యాజమాన్యం ఇక్కడి ప్రజల అలవాట్లనుగూర్చీ, వారు దైనందిన జీవితంలో ఉపయోగించే అనేక వస్తువుల్ని గూర్చీ తల బద్దలుకొట్టుకుంటూన్నప్పటికీ - ఇక్కడి శాఖలో పని చేసే వారు మాత్రం తమ ఊరి సామాజిక, ఆర్థికవాతావరణానికే ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తుంటారు. ఇలాటి శక్తులు చిత్రంగానే ఉంటవి.

డ్యూపాంట్ కంపెనీలో క్రీఫర్డ్ గ్రీక్‌వార్ట్ ఇలా అన్నారు: "ప్రజాసంక్షేమాన్నీ, సేవనూ ఆదర్శంగాపెట్టుకోని ఏ వ్యాపారం కూడా వర్ధిల్లదు. వ్యాపారం అభివృద్ధికాసాగాక, దాని నిర్ణయాలు, మితిమీరుతున్న జనసంఖ్య మీద ప్రయోగించబడకతప్పవు; ప్రజావసరాలు కూడా తదనుగుణంగా మారుతూ, దేశకాలాలకు సరిపడేవిగా ఉండటం అవసరం."

రసాయనిక ఉత్పత్తిలో గొప్పస్థానం, బలిమి ఉన్న ఆయన కంపెనీ అవిశ్వాస తీర్మానాలకు అనేకసార్లు గురైనప్పటికీ - నిజానికి తన పోటీ దారులను వ్యాపారరంగంలోకి రమ్మని ఆహ్వానించి, ప్రోత్సహించింది. ప్లాంట్ నిర్మాణానికి అవసరమైన సాంకేతిక నైపుణ్యాన్ని సరఫరాచేసి పోటీ దారుని ప్రవేశపెట్టింది. గుత్తవిధాన మనస్తత్వానికి ఇలాటిది నిజంగా ఎంతో పొద్దెరుదు!

ఈ బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లు ఉత్పత్తిని వివిధశాఖలకు విస్తరింప జేస్తూ, కొత్త కొత్త పద్ధతుల్ని అనుసరిస్తూ, చిన్న చిన్నవాటిని తమలో విలీనం చేసుకుంటూండటంవల్ల, ప్రాతినిధ్యం కూడా పెంపొందుతోంది. ఆలోచనలు పొగలిగిన ప్రతి ఎలక్ట్రికల్ రంగంలోనూ ప్రవేశించిన జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ, జట్ ఇంజన్లనూ, ఎయిర్ కండిషనింగ్ పరికరాలనూ కూడా తయారుచేస్తూ, ఇప్పుడు అణుశక్తి ద్వారా విద్యుత్‌ను రూపొందించే రంగంలో కూడా ప్రవేశించింది. ఈ నాటి కార్పొరేషన్ పంథా - కొద్ది కాలంలోనే అధికలాభాలు పొందటం కాదు; పెట్టుబడులకు రక్షణ ఉంటూ, కలకాలం వర్ధిల్లుతూండటం; సరాసరిన లాభాలు కూడా 4% కన్న తక్కువ గానే ఉంటూన్నవి.

ఫెడరల్ ప్రభుత్వం విధించే సుంకాల వొత్తిడి అధికమవటంవల్ల — యీ కార్పొరేషన్‌లు తమ లాభాల్లో అధిక భాగాన్ని సామాజిక సంక్షేమం కొరకై వెచ్చిస్తూ ఉదారస్వభావాన్ని ప్రకటించటం జరుగుతూన్నది, ఉత్తరోత్రా యీ పరిశ్రమలకు యాజమాన్యాన్ని వహించవలసినవారు కాలేజీలనుంచే రావాలనే సత్యాన్ని గ్రహించటంవల్లా, చాలా కాలేజీలూ, యూనివర్శిటీలూ ద్రవ్యోల్బణంవల్ల దెబ్బతిని ఉండటంవల్లా - యీ కార్పొరేషన్‌లు ఉన్నత విద్యాసౌకర్యాలకొరకు ఇచ్చే విరాళాలను అధికంచేసినవి.

ఇలాటిది స్వార్థపరాయణత్వాన్ని గ్రహించటంవల్లనే జరిగిందని అనుకున్నప్పటికీ, కార్పొరేషన్ అవలంబించినమార్గం ప్రజల మనస్సులమీద

తన పలుకుబడిని ప్రసరిస్తూనే ఉంటుంది. కార్పొరేషన్ కరుణాపూరిత దృక్పథంతోనూ, ప్రజాసేవాతత్పరతతోనూ వ్యవహరిస్తూండటంవల్లనే – అత్యధికోత్పత్తినిచేస్తూ, కార్మికులకు అధిక వేతనాలనూ ఇస్తూ దేశీయ ఆర్థిక విధానాన్ని బలవత్తరంగా ఉంచగలుగుతోందనేది ప్రజాభిప్రాయం.

గమనించదగ్గ విభేదం బహుశా మనకు హెన్రీఫోర్డు ప్రవర్తనలోనూ ఆయన మనమడైన హెన్రీ ప్రవర్తనలోనూ చూడనవుతూంది. మొదటి ఫోర్డ్ పరిశ్రమను తన కుటుంబీకుల మధ్యనేఉంచి, అధిక వేతనాలు ఆశపెట్టాడేకాని, ఎక్కువసార్లు పనివాళ్లను తగ్గించటం, స్థాయిదింపటం జరుపుతూ, వారు చిటాదుకొమ్మకు పోకుండాచూస్తూ, శరీరరక్షకుల్ని నియోగించుకొని, పనివాళ్లమధ్య తగవులూ, ఈర్ష్యలూ రేపుతూండేవాడు. రెండో హెన్రీ ఇలాటి క్రూరమైన పద్ధతికి స్వస్తిచెప్పి కార్మికులలో ప్రశాంత వాతావరణాన్ని సృష్టించాడు. ఈయన వ్యాపారాన్ని ప్రజాసేవలతో మిళితం చేశాడు. తాతగారు సంపాయించి, ఫోర్డ్‌ఫౌండేషన్‌కు ఇచ్చిన ద్రవ్యంతో, ఈయన సామాజిక పరిశోధనలను ప్రోత్సాహపరిచాడు.

కాని గొప్ప ఐశ్వర్యానికి అధిపతి అయేందుకూ గొప్ప పలుకుబడి గలవాడయేందుకూ జన్మించిన ఫోర్డ్ విషయం లాటిది చాలా అరుదు. వేలాది పారిశ్రామిక నాయకులనుగూర్చిన పరిశీలనల్లో తేలినవిషయమిది: యువకుడై తన శక్తిసామర్థ్యాల మీదనే ఆధారపడినవాడు, తన తాతగారికన్నా, తండ్రిగారికన్నా మిన్నగాఉంటూ, యాజమాన్యంలో చిటారుకొమ్మను అందుకోగలడు. భారీవ్యాపారంలో అతనికున్న అవకాశాలు అపారం. గత 50 సంవత్సరాలలోనూ యాజమాన్య కూటమిలో కార్మికుల సంతతి ప్రవేశించటం, రెండింతలకు పైబడింది. కాని యజమాని కుమార్తెను వివాహమాడటంకన్నా, కాలేజిడిగ్రీ ఉండటమే వ్యాపారిగా విజయాన్ని సాధించేందుకు ఎక్కువ నమ్మదగిందిగా ఉన్నది.

ఒక వ్యక్తి విజయాన్ని సాధించటం ఎలాజరుగుతూన్నది? ఉద్రిక్త పూర్వకంగా ఐతే తన మీద తానే ఆధారపడవలసిఉన్నది. తన తల్లి దండ్రుల మీద ఆధారపడకుండా తనమీదతానే ఆధారపడగలగడం జరగాలి. అపజయం ఎదురౌతుందేమోననే భయంవల్ల. దాన్నుంచి తప్పించుకునేందుకు విశ్వప్రయత్నాలు చేస్తాడు. తనకన్న పైస్థాయిలో ఉన్నవారితో పోల్చుకొని చూసుకుంటాడు. ప్రజలతో కలిసి పనిపాటలు చేయటంలో ఆనందాన్ని అనుభవిస్తూ. తానుఎప్పుడూ బిజీగానే ఉంటున్నట్లుగాభావిస్తూ. తన కొరకై పనిచేసే వారితో మంచితనంగాఉంటూ. కొత్త విషయాల పరిశోధనల్లోనూ. సృష్టిలోనూ. తాను పనిచేసేకంపెనీ భవిష్యత్‌నే ఆదర్శంగా ఉంచుకుంటూ. ఉత్పత్తి అయే సరకులూ. కంపెనీ దృక్పథాలకు అనుగుణంగా నడుచుకుంటాడు. అతను తెలివిగలవాడే కాని. మహామేధావి మాత్రం కాడు.

---

# పదో అధ్యాయం

## సుస్పష్టమైన పంపిణీ పద్ధతి

పెట్టుబడిదారీ విధానాన్నిగూర్చి మార్క్స్ చేసిన భయంకరమైన న్యాయాలన్నీ తలక్రిందులైనవి. కార్మికుల జీవనప్రమాణాలు పెరగటం. వారు పని చేసే గంటలు తగ్గించబడటం. ఆదాయం మరింత సబబుగా పంపిణీ చేయబడటం జరిగినవి. మార్క్స్ భావించినదానికి విరుద్ధంగా - వలససామ్రాజ్యాలు చితికిపోతూ. లేదా వాటంతటవే స్వేచ్ఛను పొందుతూండటం. వ్యవసాయం ఎక్స్‌ప్లాయిట్ చేయబడేందుకు మారుగా. తరుగును పూడ్చుతూ కొనసాగించబడటం జరిగినవి.

పనిచేసే గంటలు తగ్గించినప్పటికీ ఉత్పత్తి వెనుక బడకుండా యంత్రాలు పనిచేయటం, ఎక్కువ గంటలు పనిచేసినప్పుడుకన్నా, తక్కువ గంటలు పనిచేసేప్పుడు పని చాలా బాగానూ, చకచకానూ సాగుతోందని రుజూఐంది.

ఒకపక్క పనిగంటలు తగ్గించబడుతూంటే, మరొకపక్క వేతనాలు పెంచబడినవి. పనిచేసేవారి వేతనాలు యీ నాడు పురుషునికి ఏటా 4,200 డాలర్లూ, స్త్రీకి ఏటా 2,700 డాలర్లూ ముట్టుతూ ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నవి. ఈ లోగా జాతీయ ఆదాయం పనిపాటలు చేసుకునేవారి భాగానికి వొచ్చేది క్రమంగా పెరుగుతూనే ఉన్నది. అదే నిష్పత్తిలో కొనుగోలు శక్తి ఏటా 2% వొంతున పెరిగింది; ఒక మనిషి ఒక గంటలో ఉత్పత్తి చేసేది ఇప్పుడు విశాలంగా భాగించబడింది.

కార్మికులు తాము ఉత్పత్తిచేసేదానిలో న్యాయమైన భాగాన్ని పొందేందుకై ప్రభుత్వం అనేకచట్టాలు చేసింది. కార్మికులతరపున మూకఉమ్మడిగా బేరమాడేందుకుగాను యూనియన్‌లను అనుమతించటం, పరిశ్రమల్లో పని చేసే స్త్రీలకూ, బాలబాలికలకూ తగిన రక్షణల నివ్వటం, పనిచేసే గంటలను నిర్ణయించటం, కనీసపు కూలిని నిర్ణయించటం, పనినుంచి విరమించిన, లేదా పింఛన్‌పుచ్చుకున్న కార్మికులకూ, వారికుటుంబాలకూ, తగిన ఆధారాల్ని కలిగించటం, నిరుద్యోగులవిషయమై తగిన జాగ్రతలు వహించి, కట్టుదిట్టాలు చేయటం, వృత్తివిద్యా శిక్షణలను ఇవ్వటం, పరిశ్రమలో ప్రమాదాలు జరగకుండా రక్షణపద్ధతుల్ని అమలుజరపటం, పనిలో ఉండగా గాయపడటం లేదా ప్రమాదాలకు లోనవటం జరుగుతే కార్మికునికి తగిన ప్రతిఫలాన్నివ్వటం మొదలైనవి చట్టరూపాన అమలు జరుపబడుతూన్నవి.

వీటిల్లో అన్నీకాకపోయినా, చాలావరకు ప్రపంచలోకల్లా పెద్దదైన ట్రేడ్‌యూనియన్స్‌చేసిన సూచనలవల్లనే ఏర్పడినవి. దేశంలో వ్యవ

సాయపు పనులు చేసుకొనేవారుగాక. మిగతా కార్మికుల్లో మూడింట ఒక భాగం - 18 మిలియన్‌ల స్త్రీపురుష కార్మికులు యూనియన్‌లలో సభ్యులుగా ఉన్నారు. కార్మికులకూ యాజమాన్యానికీవొచ్చే తగాదాలు స్థానికమైనవిగా ఆరంభమైనప్పటికీ, అనేక సందర్భాలలో వాటిపరిష్కారాలు ఆయా పరిశ్రమకంతటికీ అనువర్తించేవిగా ఉంటూన్నవి;

1955 లో అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్, ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్స్ కాంగ్రెస్ కలిసిపోయినప్పుడు, యూనియన్ సభ్యుల్లో అత్యధిక సంఖ్యాకులు ఒకే నాయకుల కూటమికిందికి వొచ్చారు. జాతీయంగా ఉండే యూనియన్ తాలూకు స్థానిక కార్యాలయంలో ప్రతీ కార్మికుడూ, తనపనిని బట్టి విధిగా సభ్యుడుగా ఉంటాడు; ఉదాహరణకు యునైటెడ్ ఆటో మొబైల్ వర్కర్సు - (అనేక వృత్తులున్న పారిశ్రామిక యూనియన్); లేదా లిథోగ్రాఫర్స్ (ఈ యూనియన్‌లో లిథోగ్రాఫ్‌తాలూకు అనేక శాఖల్లో నైపుణ్యమున్నవారు సభ్యులు). ఇలాటివి స్థానికస్థాయిమీద నడుపబడేవి 70,000 దాకా ఉంది, దేశమంతటా విస్తరించి ఉన్నవి. ఒక వ్యాపారానికి సంబంధించిన, లేదా వృత్తికి, లేదా పరిశ్రమకు సంబంధించిన స్థానికమైన యూనియన్‌లన్నీ - జాతీయమైన యూనియన్‌తో సంబంధబాంధవ్యాలను కలిగిఉంటూ - ఫెడరల్ యూనియన్‌లోని రాష్ట్రాలలోని పరిపాలనా విధానంవలెనే, తమకు తాము పరిపాలించుకుంటూ సర్వస్వాతంత్ర్యతను కలిగి ఉన్నవి. ఫెడరల్‌విధానం లేదా కేంద్రంచేత పరిపాలించబడటమనేది ఒక్క రాజకీయరంగంలోనే గాక, ఇతర రంగాలలో కూడా ఏవగించుకోబడుతూన్నది.

కార్మికుల అందరి తరఫునా మూకఉమ్మడిగా వేతనాలూ, సౌకర్యాల కొరకై యాజమాన్యంతో బేరసారాలు చేయటం యూనియన్ నిర్వర్తించవలసిన పనుల్లో అతిముఖ్యమైనది. ఇలాటి ఎగ్రిమెంట్లలోని ముఖ్యభాగాలు, విరివిగా ఉంటూండేవి ఇవి:

1. ఎగ్రిమెంట్ ధోరణి, అది అమలు జరగవలసిన కాలపరిమితి; అది పునరుద్ధరించబడే నియమావళి; సమ్మెలూ, లాకౌట్లూ జరుగకుండావహించ వలసిన జాగ్రతలు.

2. యూనియన్ హక్కులూ; యాజమాన్యపుహక్కులూ; యూనియన్‌ను గుర్తించటం, దాని నిర్వహణ బాధ్యతలు.

3. ఏదైనా ప్రమాదం జరుగుతే కార్మికునికి చెందవలన ప్రతిఫలం; వేతనాల నిర్ణయం, ఏయే విధానాలమీద వేతనాలు పెంచబడాలో ఆ పద్ధతి; ముసలితనంలో పించనూ, కార్మికుల ఆరోగ్యాన్ని కాపాడేందుకు అవసరమైన నిధులూ, వేతనమిస్తూ ఇవ్వవలసిన సెలవులూ మొదలైనవి.

4. వేతనాల పెంపుదల పద్ధతి, కొత్తగా కార్మికులను అవసరార్థం పనిలో చేర్చుకోవటం, అనవసరమైన కార్మికులను నిలిపివేయటం, అలాటి వారికి తిరిగి ఉద్యోగాలు లభించే ఏర్పాట్లు చేయటం మొదలైనవి.

5. పనిచేసే వాతావరణం - చుట్టూ ఆరోగ్యకరమైన వాతావరణముండటం, ఎవ్వరికీహాని కలుగకుండానూ, ప్రమాదాలు జరగకుండానూ, గాయపడకుండానూ తీసుకునే రక్షణవిధానాలూ; పనిజరగవలసిన వేగం, రోజూ ఎన్నిగంటలు పనిచేయవలసిందీ, వారానికి ఎన్ని రోజులు లేదా ఎన్ని గంటలపని ఉండవలసిందీ - మొదలైనవి.

ప్రజలుకూడా యూనియన్‌లను అంగీకరించటం, అవి అమెరికన్‌ల నిత్యజీవితంలో మిళితమైపోవటమనేవి ఇటీవలి పరిణామాలు. ఐతే యజమానులు రహస్యంగా యీ యూనియన్‌లమీద కారాలూ మిరియలూ నూరుతూనే ఉంటారు.

ఐతే కార్మికులు కొత్తగా నిర్మించుకొన్న అధికారాలతోనూ హక్కులతోనూ, తమకు కొత్తకొత్త సౌకర్యాలు కావాలనీ, అత్యధిక వేతనాలు రావాలనీ వొత్తిడి తీసుకొనిరావటం జరుగుతే, అది ప్రమాదకరమైన ద్రవ్యోల్బణంగా పరిణమిస్తుందేమోననే భయం ప్రజల్లో లేకపోలేదు; పోతే

యాజమాన్యం 'యీ యూనియన్‌ల అధికారాలను అంగీకరించటంవల్ల, కార్మికులకింద అయేవ్యయాన్ని ఉత్పత్తిఅయ్యే వస్తువుల ధరలను పెంచ టం ద్వారా సరిపెట్టి - ఆ ఎక్కువైనదంతా మహాజాగ్రతగా తిరిగి ప్రజల మీదనే ప్రయోగించటం జరుగుతుంది.

తమ భవిష్యత్తంతా యాజమాన్యంమీదా, ప్రజలమీదా ఆధారపడిఉన్న దనే సత్యాన్ని చాలా యూనియన్‌లు గ్రహించి, తదనుగుణంగా జాగ్రత గానూ, తెలివిగానూ ప్రవర్తించటం జరుగుతూనే ఉన్నది. ఉదాహరణకు - ఎమాల్గమేటెడ్ క్లోదింగ్ యూనియన్ - యజమానులకు అండదండల నిస్తూ, పని సక్రమంగానూ, హాయిగానూ జరిగేందుకు అనుగుణంగాఉండే విధానాలను ప్రవేశపెట్టటం, ఉత్పత్తిఅయేసరుకు నాణ్యతకాపాడబడేందుకు తగిన కట్టుదిట్టాలుచేయటం; చేతితోచేసేపనిని యంత్రంద్వారా జరిగేందుకు వీలయిన యంత్రాలను ప్రవేశపెట్టటం, అనవసరమైన పనివారిని తొలగిస్తే అలాటి పనివారికి వేరే పనుల్ని చూపెట్టటం, పెట్టుబడి తక్కువయే పక్షంలో కొంత ధనాన్ని పెట్టుబడికి అప్పివ్వటం మొదలైన పనులుచేస్తూ న్నది. ఇంటర్నేషనల్ లేడీస్ గార్మెంట్ వర్కర్సు యూనియన్‌కు స్వంత ఇంజనీర్లుండి, యజమానులు ఉత్పత్తిని పెంపొందించే పద్ధతులను ప్రవేశ పెట్టటం జరుగుతోంది. విజయవంతంగా కొనసాగే అనేక యూనియన్‌లు ఉత్పత్తి పెరిగినప్పుడే కార్మికుల వేతనాలూ, ఇతర సౌకర్యాలు పెంపొంద గలవనీ, అంతకుమినహా మరొక మార్గంలేదనే సత్యాన్ని కనుగొని, ఆచ రణలో పెడుతూన్నవి. పోతే ఉత్పత్తి నిజంగానే పెరిగినట్లయితే, అందుకు కారణభూతులైన కార్మికులకు వారిభాగం సక్రమంగా అందేట్లు చూడటమే యూనియన్ బాధ్యత. వాల్టర్ ఈథర్ లాటి నాయకులు - కార్మికులకు పరిశ్రమ తాలూకు రికార్డులనుచూసే అవకాశాలుండాలనీ, పరిశ్రమ రూపొం దించే ఉత్పత్తి ప్రజావసరాలకు అనుగుణంగా ఉంటూండాలనీ, తదను గుణంగా సామాజిక సంక్షేమ కార్యకలాపాలను అనుసరించీ, దినదిన

ప్రవర్ధమానమయే ఆర్థికవిధానాన్ననుసరించీ, కార్మికులకు వివిధ సౌకర్యాలు చేయబడాలనీ - అభిప్రాయపడుతూన్నారు.

ప్రభుత్వంమీద వొత్తిడి తీసుకొనివొచ్చి, దానిద్వారా తమతమ సమస్యలను పరిష్కరించుకోవటంకన్నా, తామే సరాసరి యాజమాన్యంతో మాటలు జరపటం అత్యుత్తమ పద్ధతని కార్మికులు గ్రహించటం కూడా జరిగింది. రాజకీయంగా కార్యరంగంలోకి దిగేందుకుగాను తమకు అనుకూలంగానూ స్నేహపూర్వకంగానూ ఉండే కాంగ్రెస్ సభ్యుల్ని ఎన్నుకోవటంలోనూ, వారిని బలపరుస్తూ కాన్వాస్ చేయటంలోనూ, కార్మికులు పాల్గొంటూన్నప్పటికీ, కార్మికవర్గ మనస్తత్వం రాజకీయాలవైపుగాక, వ్యాపారంపైపే ఎక్కువగా మొగ్గుతూంటుదనేది నిజం.

ఇలాటి విధానం కార్మికుల విషయంలో సరిగ్గానూ, బాగానూ పనిచేసింది. ఇటీవలి కాలంలో పెద్దపెద్ద పరిశ్రమల్లో తమ యూనియన్‌ను గుర్తింపచేసి ఆమోదింపజేయటంలో కృతకృత్యమయింది (1941); కార్మికసంక్షేమానికీ, కార్మికుల ఆరోగ్యానికీ సంబంధించిన పథకాల ఆమోదం (1946); సామాజిక సంరక్షణేగాకుండా పింఛన్ కూడా లభ్యమయే విధానం (1949); జీవితపరిణితినిబట్టి కూలిఉండవలసిన విధానం (1950); ఫెడరల్ పథకానికి తోడుగా ఉండేట్లుగా నిరుద్యోగకాలంలో కొంత బత్తెమిచ్చే పద్ధతి (1955) - ఇలాటివెన్నో ఆమోదింప జేయటంలో విజయాలను సాధించింది. కార్మికసంక్షేమానికి యాజమాన్యమే బాధ్యతవహించాలనే అభిప్రాయానికి ఎంతో గుర్తింపు వొచ్చేట్లు చేయగలిగింది.

ఇలాటి యూనియన్‌లే పెట్టుబడిదారులై - పెద్దపెద్ద మొత్తాలను ప్రభుత్వపు బాండ్లకిందా, ఇతర సెక్యూరిటీల్లోనూ దాచినవి. యునైటెడ్ ఆటోమొబైల్ వర్కర్స్ యూనియన్‌కు 40,000,000 డాలర్ల నిధి ఉన్నది. AFL - CIO మూలకార్యాలయం తాలూకు బడ్జెట్ ఏటా 8,000,000 డాలర్లు. యూనియన్‌లు తమ నాయకులకు బాగా ముట్టజెపుతూంటవి.

AFL - CIO ప్రెసిడెంట్ - జార్జ్ హెనీకి ఏటా 35,000 డాలర్లుముట్టు తుంది. జాతీయ స్థాయిమీదఉన్న యూనియన్ నాయకుల్లో కొంతమందికి అంతకన్న ఎక్కువ కూడా వొస్తూంటుంది. ఉక్కుపరిశ్రమ కార్మికుల యూనియన్ ప్రెసిడెంట్ డేవిడ్ మాక్‌డోనాల్డ్‌కు ఏటా 40,000 డాలర్ల భరణం వొస్తుంది

ఈ యూనియన్‌లు ఏర్పడి అభివృద్ధిగాంచటమనేది మొదట్లో స్నేహ పూర్వకమైన ప్రభుత్వపు అండదండల ద్వారానే జరిగినప్పటికీ, ఆ తరు వాత స్వశక్తి మీదనే వర్ధిల్లుతూ, కార్మికుల ఉత్పత్తి తాలూకు ప్రతిఫలాలు విశాలవృక్పధాలతో మరింతమేర సరిసమానంగా పంచబడుతూండేట్లూ; ఆర్థికవిధానం ఆరోగ్యకరంగానూ, శక్తివంతంగానూ ఉండేట్లూ చేయ గలిగినవి.

యూనియన్‌కూ, యాజమాన్యానికీ జరిగే సంప్రదింపులు విఫలమై నట్లయితే - ఉభయుల ఒప్పందంమీదనే ఫెడరల్‌మీడియేషన్ అండ్ కన్ సీలియేషన్ సర్వీస్ ఆహ్వానించబడుతోంది. ఏటా ఇలాటి కొన్నివేల క్లిష్ట సమస్యలను అదిపరిష్కరించి, అనేకసందర్భాలలో సమ్మెలను తప్పించింది. మూకఉమ్మడిగా జరిగే బేరసారాల విధానాన్ని పరిశీలించేందుకూ, అక్రమ విధానాలు అమలుజరపబడకుండానూ, కార్మికులు ఓటుచేసే పద్ధతులను పరి శీలించటం మొదలైనవాటి విషయాల్లో నేషనల్ లేబర్ రిలేషన్స్ బోర్డువారు ఆహ్వానించబడుతారు. సర్వసాధారణంగా సమ్మెలు జరగవు; ఒకవేళ జరి గినా 1930 లో వలె రక్తసిక్తమైన రణాలుగా అవి పరిణమించక, వాతా వరణం అందుకు ఎంతో భిన్నంగా ఉంటుంది. 1956 ఉక్కు పరిశ్రమలో జరిగిన సమ్మెలో కొలుములు చెడిపోకుండా ఉండేందుకుగాను కార్మికులు తగిన కట్టుదిట్టాలుచేసి జాగ్రతలు వహించారు. పరిశ్రమ సర్వనాశనమై పోకుండా దానిరక్షణభారాన్ని వహించే పనివాళ్లు మాత్రమే లోనికి పొయ్యేట్లు చూసేందుకు కొద్దిమంది కార్మికులు మాత్రం సమ్మెసమయంలో

ఫాక్టరీల సింహద్వారాలదగ్గర ఉన్నారు; మిగతావారు యాజమాన్యంనుంచి సెలవు బత్తెం కూడా పుచ్చుకొని, హాయిగా దేశాటనంలో కాలంగడిపేందుకుగాను కుటుంబాలతో సహా తరలివెళ్ళారు.

పూర్వకాలంలో పరిశ్రమ యజమానులే యాజమాన్యాన్ని వహించే పద్ధతి పోయి, ఇప్పుడు యాజమాన్యాన్ని నిర్వహించే వృత్తిధర్మం గలవారు నియోగించబడిన విధంగానే - సుశిక్షణలేని కార్మికనాయకులు కేవలం కాకిగోల చేసేందుకుమాత్రమే అవతరించారే అనే రోజులుపోయి-కార్మిక నాయకత్వాన్ని వృత్తిగా స్వీకరించగలిగిన, లాయర్లూ, ఆర్థికతత్వవేత్తలూ, విద్యారంగంలో కృషిచేసినవారూ కార్మికనాయకత్వాన్ని వహించారు. కార్మిక సంస్థలు 600 వార్తాపత్రికలూ, జర్నల్స్ ప్రచురిస్తున్నవి. 1950 లో కార్మికనాయకత్వాన్ని వృత్తిగా స్వీకరించదలచినవారికి తగిన శిక్షణ నిచ్చేందుకుగాను - ఇంటర్నేషనల్ గార్మెంట్ వర్కర్స్ యూనియన్ ఒక విద్యాలయాన్ని స్థాపించింది. విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం, కార్మికులకు విలువైన అనుభవాలను అందించే ఉద్దేశంతో సమ్మర్‌స్కూల్ నడుపుతూన్నది. యాజమాన్యంవలెనే, కార్మికసంఘాలుకూడా సామాజిక జీవనంలో పాల్గొంటూ, స్థానికసంస్థలతాలూకు బోర్డ్‌లలో సభ్యత్వాలను సాధించటం, తప్పనిసరిగా కూడదీయవలసిన నిధులకొరకై సహాయపడటం మొదలైన పనులు చేస్తూన్నవి.

కార్మికుల అఖండమైన శక్తి కూడా కొత్తకొత్త సమస్యలను రేపింది. పెద్దపెద్ద పరిశ్రమల్లో మూకుమ్మడిగా జరిగే బేరసారాల ఫలితాలు ఆర్థిక విధానాన్ని మార్చుతవి; ఇందువల్ల ఉత్పత్తి అయ్యే సరుకులధరలూ, నియోగించవలసిన కార్మికులసంఖ్య, కొత్తకొత్త ప్లాంట్లను ఎక్కడ స్థాపించాలి అనేదీ - ఇలాటి అనేక సమస్యలు ఎదురౌతూంటవి. యాజమాన్యంతో తమకున్న వ్యతిరేకాభిప్రాయాల తాలూకు ఓటింగ్‌ను ఒకవైపే మొగ్గించే ఉద్దేశంతో సమ్మెలు జరుపబడవొచ్చు; లేదా తన సభ్యులకు ఎక్కువ ఫీజు

అందేందుకూ సమ్మెలను ఉపయోగించవొచ్చు: లేదా అధికారంలో ఉన్న వారి మాటకు ఏకాస్త వ్యతిరేకతను చూపిన కార్మికుణ్ణయినా, పనినుంచి తొలిగించేందుక్కూడా సమ్మెను ఆయుధంగా ఉపయోగించనూవొచ్చు - ఇవన్నీ నిజాలే మరి!

కొన్ని యూనియన్‌లలో అధికారంలో ఉన్నవారి నిరంకుశత్వం తాండవమాడటం, ప్రజాస్వామ్య పద్ధతులనేవి విడనాడబడటంవల్ల ఆయా యూనియన్‌లు చెడుపేరు తెచ్చుకున్నవి. ఉదాహరణకు మ్యుజీషియన్స్ అండ్ టీమ్ మాష్టర్స్ యూనియన్ - ఇంటర్నేషనల్ లాంగ్ షోర్‌మన్స్ ఎసోసియేషన్ - యీ రెండో యూనియన్‌వారు అనవసరపు అక్రమపు గొడవలు లేపినందువల్లా, AFL - CIO కు దీనిమీద శిక్షణచర్యను తీసుకునే అవకాశం లేనందువల్లా, అలాటి దుష్టులను యూనియన్‌నుంచి తరిమివేయలేనందువల్లా - AFL - CIO వారు యీ యూనియన్‌ను తొలగించారు. మహాపట్టణాలలో కట్టడాల నిర్మాణవ్యాపారం విషయంలో - నిర్మాణ కార్మికులూ, కాంట్రాక్టుదారులూ ఏకమై కట్టడనిర్మాణ వ్యాపారాన్ని గుత్తకు తీసుకొని, పనిజరగవలసిన వేగాన జరపక, నిర్మాణపు ఖర్చులు అత్యధికస్థాయిలో ఉంచుతూ, యూనియన్ సభ్యత్వంలో పక్షపాతంజూపి, తమ పెదదార్లకు అనుగుణంగా ఉన్నవారినే జేరదీస్తూ - ఆర్థికవిధానంలోని ఇతర విభాగాలతోపాటు నిర్మాణకార్యక్రమం ముందుకు సాగకుండా ఏళ్లతరబడిగా కొనసాగించారు. గొడవరేపేవారికీ, కార్మికులకూ సంబంధమున్న సంఘటనలు వెలుగులోకి వొచ్చినవి.

ఏది ఏమైనప్పటికీ యీ ఆధునిక కార్మికసంఘాలు - ప్రపంచంలో మరిదేనిమీదా ఆధారపడలేక, కేవలం తానుచేసే పనిమీదనే ఆధారపడే కార్మికుని సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకోవటంమీదనే పనిచేస్తున్నవి. ఈ విధంగా ఆశయాన్ని సంపాయించి, ఆధారపడిఉన్న కార్మికుని పక్షాన మాట్లాడేందుకే యూనియన్‌లు అవతరించినవి. ఐనప్పటికీ కార్మికుల్లో మూడోవొంతు మందిని మాత్రమే యూనియన్‌లు కూడగట్ట గలిగి

నవి. దక్షిణభాగాల్లో రసాయనిక పరిశ్రమా, కార్యాలయాల్లో పనిచేసేవారూ కలిసికట్టుగా ఉండటంలో వెనుకబడిఉన్నారు; యూనియన్‌లు వారినందరినీ ఒక గొడుగు కిందికి తీసుకొని రావాలని ప్రయత్నాలు చేస్తున్నవి.

కార్మికులు సామాజిక సంస్థలుగా పరిపక్వదశల నందుకున్నారనేందుకు ఒక చిహ్నమిది : రెండో ప్రపంచ యుద్ధానంతరం సముద్రాంతరదేశాల్లోని కార్మికసంఘాలకు ఎంతో ప్రోత్సాహం వొచ్చింది. AFL – CIO వారు ఏటా 2½ లక్షల డాలర్లు వ్యయపరుస్తూ సముద్రాంతర దేశాలతో సంబంధ బాంధవ్యాలను కలిగిఉంటూ, పరభాషల్లో ట్రేడ్‌యూనియన్ పత్రికలను ప్రచురిస్తూ, శాశ్వతంగాఉండే ఒక కార్యాలయాన్ని యూరప్ ఖండవాసుల కొరకై బ్రుసెల్స్‌లో నడుపుతూ, ప్రపంచంలోని ఏ దేశంలోనైనాసరే స్వేచ్ఛగా ఏర్పడే ట్రేడ్‌యూనియన్‌కూ, కార్మికుల జీవనప్రమాణాన్ని పెంపొందించేందుకు జరిగే చర్యలను బలపరుస్తున్నది. సముద్రాంతర ఖండాలనుంచివొచ్చే కార్మికనాయకులు, అమెరికన్ కార్మిక యూనియన్‌లకు అతిధులుగాఉంటూ, అక్కడి ఏర్పాట్లూ ఆయా యూనియన్‌లు పని చేసే విధానాలను స్వయంగాచూసి తెలుసుకుంటున్నారు.

## వాటాదారు

ఉత్పత్తీ, విస్తరించబడే ఆర్థికవిధానమూ ఆధారపడిఉన్న పరిశ్రమలు ఎవరికిచెంది ఉన్నవి?

వాల్‌స్ట్రీట్‌లో నివసించే పెట్టుబడిదారుడు - పట్టుటోపీ పెట్టుకొని, చివర్లు కత్తిరించబడిన కోటుధరించి, బీదసాదల శరీరాలమీదినుంచి తొక్కు కుంటూపొయ్యే పెద్దమనిషి చిత్రాన్ని కమ్యూనిస్టులు ఆ పురాతన పద్ధతిలోనే ఇప్పటికీ చిత్రిస్తూఉన్నారు. ఒకసారి యాత్రీకులుగావొచ్చిన ఇద్దరు రష్యన్‌లను ఒకానొక ప్రభుత్వోద్యోగి, ఈస్టర్ ఆదివారంనాడు చర్చినుంచి జనం బైటికివొచ్చేవేళ ఫిఫ్త్ఎవెన్యూకు తీసుకుని వెళ్లాడు. కొద్దిమంది

మంచి దుస్తులు ధరించి, పట్టుటోపీలు పెట్టుకొని, చివర్లు కత్తిరించినకోట్లు వేసుకొని రావటం కనిపించింది.; ఇలాటి దుస్తుల ధారణ అప్పటికి ఫాష న్‌గా లేకుండటమే కారణం. రష్యన్‌లు దాదాపు టాక్సీనుంచి కిందపడే పర్యంతమై "చూడండి - పెట్టుబడిదారులు!" అని కేకలు వేశారు.

'ఆమెను' చూసి ఉండనట్లయితే రష్యన్‌లు చిత్రంగాఉండే పెట్టుబడి దారుల్ని గుర్తించిఉండేవారు కారు: ఎందుకంటే 8,606,000 మంది వాటా దార్లలోనూ సగంకన్నా కాస్త ఎక్కువమంది స్త్రీలు. పెట్టుబడిదారుల్లో 36% మంది ఇల్లాళ్ళు. పురాణయుగంనాటి ఆ పెట్టుబడిదారుని సరాసరి వయస్సు 48 సంవత్సరాలు; ఆతను 25,000 మంది జనాభాఉన్న పట్ట ణంలో ఏటా 7,500 కన్నా తక్కువ ఆదాయంమీద జీవిస్తున్నాడు, ఇలాటి 10 లక్షమంది వాటాదార్ల సాలుసరి ఆదాయం 3,000 డాలర్లుకు తక్కువ. ప్రతి 12 మంది వయోజనుల్లోనూ ఒకరికి పబ్లిక్ కార్పొరేషన్‌లో వాటా ఉంటూన్నది; ప్రైవేట్‌గాఉన్న కంపెనీలలో 15 లక్షలమందికి వాటా లున్నవి. 10 కోట్లమంది పరోక్షంగా ఇన్సూరెన్స్ పాలసీల ద్వారానూ, ఫించన్ నిధుల ద్వారానూ వాటాదారులుగా ఉంటున్నారు.

పెట్టుబడులు పెట్టటమనేది ఎంత జనరంజకమైనదంటే - బ్రోకర్లు ఉప న్యాసాలిచ్చి, వాటాలమీది పెట్టుబడి అనేది, ఏమే నియమావళిని అనుస రించి ఉండాలో ప్రజలకు విశదపరుస్తున్నారు. పెట్టుబడులకుగాను క్లబ్‌లు ఏర్పడి అనేకమంది చిన్నచిన్న మొత్తాలను జేర్చుతూ, అందరి డబ్బు తోనూ వాటాలు కొనటమనేది సదా జరుగుతూనే ఉన్నది. న్యూయార్క్ స్టాక్ఎక్స్ఛేంజీలో నెలసరి మొత్తంమీద వాటాలు కొనటం, ఒకరికొకరు సహాయపడి వాటాదారులు కావటం. (ఈ విధానంలో ఇప్పటికి 12 మిలి యన్‌ల డాలర్ల పెట్టుబడి జరిగింది)-ఇందువల్ల చిన్న పెట్టుబడిదారుడు తన పెట్టుబడిని విస్తరింపజేయటం - ఉద్యోగులూ కార్మికులూ కలిసి వాటాలను కొంటూ, కొన్నాళ్లకు తాము పనిచేసే కంపెనీలకు యజమానులే కావటం

వరకూ జరుగుతోంది. అమెరికన్ టెలిఫోన్ అండ్ టెలిగ్రాఫ్ కంపెనీలో పనిచేసేవారికే $2\frac{1}{2}$ లక్షల వాటాలున్నవి; సోకనీ మోబిల్ కంపెనీవాటాల్లో 80% అందులో పనిచేసేవారివి.

యునైటెడ్‌స్టేట్స్ స్టీల్‌కంపెనీ అధినేత బెంజిమన్ ఫేయిర్‌లెస్ "మన పనివాళ్ళే యజమానులైతే ఏమౌతుంది?" అన్న విషయాన్ని తీసుకొని ఇలాటిది సంభవమేననితేల్చి, "ఇకముందు కార్మికులు పనిమానేసి బైటికి వెళ్లటం లాటివి జరగవు; ఎందుకంటే యజమానే సమ్మెలో పాల్గొనలేడు కదా!"

ఐతే ఇలాటిది అంత త్వరితగతిలో జరగకపోయినా, ఉత్పత్తిలో సన్నకారు ప్రజల తాలూకు వాటాలు దినదినాభివృద్ధవుతూనే ఉన్నవి; పెద్దపెద్ద వాటాలు కొద్దిమందికే చెందిఉన్నవి. పేరుప్రఖ్యాతులున్న, శక్తివంతమైన పెద్ద కంపెనీలు చిన్నచిన్న వాటాదార్లకొరకే చేతులు చాపుతూ ఉన్నవి; తమ వాటాలను చిన్నచిన్న భాగాలుచేసి వాటావిలువను చాలా తగ్గించటంద్వారా వాటాదార్లను ఆకర్షించటం, వార్షిక నివేదికల్ని నాలుగు రంగుల్లో అచ్చువేసి అందించటం, అందాలు చిందేట్లు ముద్రించి, సాధారణ ప్రజకూకూడా అనేక సమస్యలూ, అనుమానాలూ తీరేట్లు చేయటం, బ్రహ్మాండమైన సభలు జరిపి ఏటా 150,000 డాలర్ల వేతనం తీసుకునే ప్రెసిడెంట్ సైతం కిందఉన్న చిన్న వాటాదారుని ఫిర్యాదును కూడా ఎంతో ఓపిగ్గా వినేట్లు చేయటం - ఒక్కొకసమయంలో కార్మికుడు, తాను ఆ కంపెనీలో వాటాదారుగాఉంటూ, వాటాదారుని స్థాయిలో జరిగిన లోపానికి విశదీకరణను కోరటం జరుగుతోంది.

కార్మికుని వాటాదారునుంచీ, వాటాదారుని వస్తువు వాడే వానినుంచీ విడదీసిన రేఖలన్నీ నామారూపాలులేకుండా పోతూన్నవి. వాటాదార్లకు తమ వాటామీద వొచ్చినలాభం తాలూకు చెక్కుతోపాటుగా - ఆ కంపెనీ తయారుచేసే రకరకాల వస్తువులనుగూర్చిన వివరాలూ, ఆ వస్తువుల్నే

వాటాదార్లు అధికంగాకొంటూ, తమ స్నేహితులకూడా సిఫారస్ చేయటం ద్వారా లాభాలు మరింత అధికమౌతాయనే నివేదిక కూడా పంపబడుతూంది. యాజమాన్యమనేది నలుమూలలకూ విస్తరించిన యీ ఆర్థిక విధానం ఏ తరగతికి చెందింది ? పరిశ్రమలను జాతీయంచేసి ఇటు ఆర్థిక విధానాన్నీ అటు రాజకీయజ్ఞతనూ మిళితం చేసేందుకుమారుగా - యాజమాన్యాన్ని విస్తరింపజేసి అనేకమంది వ్యక్తుల చేతుల్లో దాన్ని ఉంచటంవల్ల ప్రజాస్వామ్యం ఆచరణలోకి తీసుకొని రాబడటమే అమెరికన్ విధానం.

ఇటీవలి వత్సరాలలో స్టాక్‌మార్కెట్ నిశ్చలత - పెట్టుబడిదారుని ఎంతో ప్రోత్సాహించి, సక్రమంగా లాభాలూ, వాటామీద రాబడీ వొస్తూ - అన్నిటినీమించి గత 20 సంవత్సరాలలోనూ ఆర్థికసంపత్తి తాలూకు కొనుగోలుశక్తి సగానికి సగం తరిగినా, సాధారణవాటాలు వాటివిలువన్ని మూడు రెట్లు పెంచుకున్నవి. ద్రవ్యోల్బణం జరగకుండా, పెట్టుబడి పద్ధతి అడ్డుగోడపెట్టింది. పార్క్-ఎవెన్యూలో ఇంటిపనిచేసుకొనే ఆమె యుద్ధారంభపు మొదటి సంవత్సరాల్లో 4,000 డాలర్లు పెట్టుబడిపెట్టి - యీ నాడు అదే 40,000 డాలర్లు పెట్టుబడి కావటాన్ని చూస్తోంది; తాను గాఢంగా విశ్వసించిన వాటాలమీద ఒక ఐశ్వర్యవంతుడు 80,000 డాలర్లపెట్టుబడి పెట్టి, పరిశ్రమచేసే ఉత్పత్తి తాలూకు సింహద్వారాల్లో కూర్చొని లాభాలు పంచుకోగలుగు తూన్నాడు.

చిన్నచిన్న వాటాదార్ల కారణంగా వాల్‌స్ట్రీట్ పెట్టుబడిదారుని రూపురేఖా విలాసాలు మారిపోవటం, అలాటివృత్తి తాలూకు పలుకుబడులను తగ్గించివేయటం జరిగింది. బ్రహ్మాండమైన పారిశ్రామిక కార్పొరేషన్‌లు పూర్వంవలె వాల్‌స్ట్రీట్‌లోని పెట్టుబడిదారుల దగ్గరికి అప్పులకోసం పరుగెత్తటంలేదు; అందుకు మారుగా తమకు అవసరమైన పెట్టుబడిని తామే సరఫరా చేయగలుగుతూన్నవి; ఇన్నాళ్లుగా తాను పొందిన లాభాలనుంచి,

(1920 కన్న యీ లాభాలు రెండింతలు లేదా 60%) లేదా కొత్త వాటాలను మార్కెట్‌లోపెట్టి, ఆ వాటాలను తన పాతవాటాదార్లే కొనే ఏర్పాటు ల్లాటివి చేయటం ద్వారానూ ఇది కొనసాగించ బడుతూన్నది. హౌస్ ఆఫ్ మోర్గన్‌కు 667,000,000 డాలర్ల పెట్టుబడి ఉంటే - జనరల్ మోటార్సు కంపెనీకి 2,183,000,000 డాలర్ల పెట్టుబడిఉన్నది.

## రాబడి : వ్యయం

ఈ పెట్టుబడంతా, యీ అత్యధికోత్పత్తి అంతా - తయారైన వస్తువులకు తగినంతవాడకమే లేనట్లయితే వృధా అవుతుంది. ఇలాటి సుభిక్షమైన ఆర్థికవిధానంలో ఉత్పత్తినిగూర్చి బాధపడవలసిన అవసరమేలేదు ; కాని ఉత్పత్తి అయేటంత వేగంగానూ ఉత్పత్తి కాబడే వస్తువులు వాడబడుతూంటవని నిశ్చయంగా తెలుసుకోవలసిన అవసరం ఉన్నది.

ఈ ఆర్థిక విధానంలో అత్యధికోత్పత్తి చేయగలది కనుక, కావలసినంత అప్పు లభిస్తుంది; అందువల్ల రాబడిమీద ఆధారపడకుండానే వ్యయం చాలావరకు పనిచేస్తుంది. దర్పణంవలెఉన్న యీ ఆర్థిక విధానంలో ఎంత ఎక్కువ వ్యయముంటే - అంత ఎక్కువ రాబడికూడా ఉంటూనే ఉంటుంది. ఎందుకంటే వ్యయమనేది ఉన్నప్పుడు, అందువల్ల ఎక్కువమందికి ఉద్యోగాలు లభించటం, అధిక వేతనాలు అందటం జరుగుతుంది.

కనుక వాయిదాల పద్ధతిమీద పైకం చెల్లించి వస్తువుల్ని కొనుక్కునే పద్ధతి ప్రోత్సాహపరచబడింది ; ఇలాటిది చేయిదాటిపొయ్యే స్థితిలో పడబోతున్నట్లు కనిపించినా, ఫెడరల్ రిజర్వ్‌బోర్డు ఋణంమీద ఆధారపడగలదు. వ్యయపరచే పద్ధతిలోని సౌలభ్యముంటూ ఉన్నప్పటికీ - సగం కుటుంబాలకు వాయిదాలమీద ఋణాలులేవు ; 1956 లో వస్తువుల్ని వాడేవారు 20.5 బిలియన్ డాలర్లను ఋణపు చేశారు.

వస్తువు వాడకాన్ని ప్రోత్సాహపరిచేందుకు అనేక పద్ధతులూ, విధానాలూ అమలు జరుపబడినవి. కొత్త కొత్త వస్తువుల్ని ఉత్పత్తి చేస్తూ, యీ కొత్తదనాన్ని చవిచూడాలని ఆశించే వస్తువు వాడకపుదార్లకు - యీ కొత్తదనంతోనే అనేకశాఖల్నీ, వారి ఎన్నికకు వీలైనన్ని వాటిని సృష్టించటం జరుగుతోంది. ఒక ఉత్పత్తిదారుడు సృష్టించే కొత్తవస్తువు లభ్యమవసాగాక, వాడకపుదారుడు పాతవస్తువును విసిరి పారేస్తాడు. ఈ విధంగా - బాగా పనిచేసే రిఫ్రిజిరేటర్ - గోడమీద అంటించిన రంగు కాగితాలకు అనుగుణమైన వర్ణంతో వొచ్చే కొత్త రిఫ్రిజిరేటర్ రాగానే, విశ్రమించవలసి ఉంటుంది; లేదా అరలు అరలుగాఉండి వివిధ ఆహార వస్తుసామగ్రిని దాచుకునేందుకు వీలుగానూ, మరోవైపు ఐస్‌వాటర్ తీసుకునేందుకు పంపువున్న కొత్తరకం రిఫ్రిజిరేటర్ వొచ్చిపడి పాతదానికి స్వస్తి చెపుతుంది.

వాడకపుదారుని నుంచి డాలర్లను సంపాయించే పద్ధతులు - సర్వసాధారణంగా వస్తువుల వెలలు తగ్గించటంగానూ, వస్తువు నాణ్యతలు పెంచటంగానూ రూపొందుతవి. ఎలక్ట్రిక్ రిఫ్రిజిరేటర్లు ఘనఅడుగు 78 డాలర్ల వొంతున 1922 లో అమ్మబడితే, 1955 లో యీ వెల ఘనఅడుగు 34 డాలర్లకు దిగింది. కొత్త రిఫ్రిజిరేటర్ పాతదానికన్న నాణ్యమైనది కూడాను. రేడియోల ధరలుకూడా చాలా తగ్గించబడి, సామాన్య ప్రజానీకానికి చాలా అందుబాటులోకి వొచ్చి ఉండటంవల్ల అమెరికాలోని మూడోవొంతు గృహాల్లోమాత్రమే ఒక్క రేడియో అన్నా లేకుండా ఉన్నది.

లేబర్ అంచనాల బ్యూరోవారు సరఫరాచేసే వస్తువు వాడకపుదారుల వెలల తాలూకు ఇన్‌డెక్స్‌ను అనుసరించి - సామాన్య కుటుంబీకుల ఆదాయాల్లో వొచ్చే మార్పులు వారిజీవనప్రమాణాలూ అర్ధమై, తదనుగుణంగా-అంతకు పూర్వమే జాబితాల్లోఉన్న రేడియోలూ, ఎలక్ట్రిక్ కుట్టుయంత్రాలూ, వాటంతటవే పనిచేసే ఇతర గృహోపకరణాలు మొదలైన వాటికి, కొత్త

కొత్త వస్తువులుకూడా కలపబడుతూన్నవి. గడ్డ కట్టించబడి నిలవఉన్నా చెడని ఆహారపదార్థాలూ, ఎలక్ట్రిక్ వేపుడు పనిముట్లూ, టెలివిషన్ సెట్లూ మొదలైనవికూడా యీ జాబితాల్లోకి ఎక్కినవి.

పోస్టులో వొచ్చే ఆర్డర్లకు సరుకులు సరఫరా చేయటం ఆరంభమై, మార్కెట్ విస్తరించటం, యంత్రాలమీద వస్తువులు తయారవటం, వాటంతటవే పనిచేసే యంత్రాలుద్వారా అత్యధికోత్పత్తి జరగటంవల్ల, వస్తువుల ధరలు చాలా తగ్గించబడిన కారణంగా అమెరికన్ ఉత్పత్తి తాలూకు అనేక వస్తువులు దేశమందంతటా సరఫరా చేయబడుతూన్నవి. మార్కెట్‌నుగూర్చి, వస్తువు వాడకపుదారుని మనస్తత్వాన్నిగూర్చి, పరిశీలనలు జరిపి బహుజనుల అభిరుచులకూ, సౌకర్యాలకూ అనుగుణంగా ఉత్పత్తి జరుగుతూన్నది.

విస్తరించిపొయ్యే యీ మార్కెట్ తరగతులవారీ అనేదాన్ని భేదించి వేసింది. దాదాపు అందరూ రెడీమేడ్ దుస్తుల్ని ధరిస్తున్నారు. డాక్టర్ లేదా లక్షాధికారివలెనే కార్మికుడుకూడా అంత మంచిదుస్తులూ ధరిస్తూనే ఉన్నాడు. ఐశ్వర్యవంతులూ బీదవారూకూడా ఒకేరకం సిగరెట్లు కొనుక్కోవటం, పేక్ చేయబడి సిద్ధంగాఉన్న ఆహారాన్ని కొనుక్కోవటం, ఒకేరకం పత్రికల్ని చదవటం, ఒకే సినిమాలను చూడటం, ఒకేరకం విద్యుత్ పరికరాలను కొనుక్కోవటం జరుగుతూన్నది.

పరిపక్వదశల నందుకున్న అనేక ప్రైవేట్ కంపెనీల ఆర్థిక విధానాల కారణంగా రాబడికూడా సమతలంమీదికి దాదాపు వొస్తూన్నది. 1935-1950 సంవత్సరాలమధ్య అమెరికన్ కుటుంబాలలో అధోగతిలోఉన్న ఐదవభాగం కుటుంబాలు పన్నులుపోను తమ ఆదాయాలు 42% పెరగటాన్ని చూశారు ; అత్యున్నతస్థితిలోఉన్న 5% కుటుంబాల ఆదాయాల్లో తరుగు కనిపించింది ; ప్రత్యేక నైపుణ్యమున్న పనితనంమీద జీవించే కుటుంబాలలో ఐదింట ఒక కుటుంబం ఏటా 7,000 డాలర్ల ఆదాయాన్ని

కలిగిఉన్నది; వృత్తిధర్మంగా నిర్వహిస్తూ లేదా, సాంకేతిక నిపుణత ఉన్న కుటుంబాలలో ఇలాటి ఆదాయం ఆరింట ఒక్కరికి మాత్రమే లభ్యమౌతూన్నది. ఈ విధంగా ఒక తరగతికీ మరొక తరగతికీ మధ్య ఉంటూన్న గీతలు స్పష్టతను కోల్పోయి బండబారిపోతున్నవి. స్థిరాస్తుల మీదికి వెళ్ళే ఆదాయం తగ్గిపోవటం, కార్మికుల ఆదాయం పెరగటం జరిగింది. సామాన్యపు కూలినాలి చేసుకోవటం యథాస్థానంలో ఉండటం లేదా, తగ్గిపోవటం జరుగుతూంటే, ప్రత్యేకమైన వృత్తులను అవలంబించటం పెరుగుతూన్నది.

360 లక్షలమంది ప్రజలకు జీవితభీమా లున్నవి; 300 లక్షలమందికి సేవింగ్స్ ఎకౌంట్లున్నవి; 40 లక్షలమంది ప్రజలు స్వగృహాలలో నివశిస్తున్నారు. అనేక లక్షలమంది దాదులు 1956 లో దాదాపు ఒక బిలియన్ డాలర్లను సంపాయించారు. ఇలాటి ప్రత్యేకత చాలా విషయాలకుసూచన- చిన్నకుటుంబాలకు ఇతరుల సహాయం అవసరమవటం, ఇందువల్ల బాలురు, వృద్ధులకు కొంతపని తగలటం, ఇలాటి దానికిగాను అవసరమైన పైకం లభ్యమవటం, దాదులు వినోదకార్యకలాపాలకు ధనవ్యయాన్ని చేయమని కోరే భావన, త్వరలో ఇదొక ప్రత్యేకవృత్తిగా రూపొందటం - మొదలైనవి. హాలీవుడ్‌లోని బేబీసెట్టర్స్ గిల్డ్ 4,800 మంది రిజిస్టర్డ్ సెట్టర్స్‌ను కలిగిఉండి, సభ్యులకు ఎంతో జాగ్రతగా చిత్రాలను చూపుతుంది. డెట్రియాట్‌లో 5 వ తరగతివరకూ చదువుకున్నవారికి బేబీ సెట్టింగ్‌లో కోర్స్ ఇస్తుంది. ఇంతవరకూ పసిపిల్లలు ఎలా కూర్చోవాలో ఆ కోర్స్‌ను ఎవ్వరూ కనిపెట్టలేదు; కాని అలాటిదికూడా వొస్తుందనేది నిస్సందేహం.

వాటంతటవే పనిచేస్తూ బట్టల్ని ఉతికే యంత్రాలూ, నేలను శుభ్రపరిచే పరికరాలూ, తయారుగా గడ్డకట్టించబడి సిద్ధంగాఉన్న ఆహార పదార్థాలూ- ఇలాటివెన్నో యీనాటి గృహిణులకు పూర్వకాలంలోఉండే దాసదాసీజనం అవసరం లేకుండానే, వారి పని ఎంతో సులువు చేయటమేగాకుండా, పని

వాళ్ళను భరించలేని అనేక లక్షలమందికి సేవలను అందిస్తూన్నవి. ముఖ్యంగా క్షేత్రంమీద ఉండే ఇల్లాలు పూర్వకాలంలోవలె బావిలోనుంచి నీళ్లుతోడటం, ఇంటిల్లిపాది బట్టల్ని ఉతకటం, కూరలు తరుక్కోవటం, మాంసాన్ని ఖండాలు చేయటం మొదలైన ఇంటిపనులతో నడుం విరగ్గొట్టుకోవలసిన అవసరం లేకుండాపోయింది: యంత్రాలూ, వివిధ పరికరాలున్న గృహం ఆమెకు ఎంతో విశ్రాంతినిచ్చి బానిస బ్రతుకునుంచి విడుదలను ప్రసాదించింది.

## చిల్లర బేరాలు

అతివేగంగా ఉత్పత్తి అయే సరుకులను వాడవలసిన అవసరమున్న ఆర్థికవిధానం, వాడకపుదారునికొరకై ఎదురుతెన్నులు చూస్తూ ఒకచోట కూర్చునేందుకు వీల్లేదు. దేశాన్ని చూడవొచ్చిన వారికి ఇక్కడ జరిగే ప్రకటనల పరిమాణాలు కొంత ఆలజడికి కారణమైనప్పటికీ, ప్రజలకు ఏ వస్తువైనా అరుదుగా లభ్యమౌతుందేమోననే భయంలేకుండా చేసేందుకూ, ఎక్కువ వ్యయంద్వారా వర్థిల్లేందుకు అవసరమైన ప్రోమపును చేయవలసిన ఆర్థికవిధానంలో ఇలాటిది తప్పనిసరి. ఈ ప్రకటనావిధానం - మనస్తత్వవేత్తల పరిశీలనలమీదా, వాడకపుదార్ల ఎన్నికలమీదా, మార్కెట్ అంచనాలమీదా, ప్రజల నిర్లక్ష్యత లేదా ఆకర్షించబడుటాలమీదా ఆధారపడుతూ, ప్రజలు వాడకపుదారు లయేందుకు సుశిక్షణ నిచ్చేందుకు ఉపకరిస్తూన్నది.

ఈ ప్రకటనలమీదా, కొత్తకొత్త వస్తువులకుచేసే ప్రచారాలమీదా వెదజల్లబడే ధనాన్ని - విద్యాలయాలూ, రహదారులూ, ఆసుపత్రుల నిర్మాణానికి వెచ్చించకూడదా అని కొంతమంది వాదించవొచ్చు. ఇలాటి విమర్శలను గమనించే - స్వచ్ఛంద సేవాదళంగా పనిచేసే ఎడ్వర్టైజింగ్ కౌన్సిల్, ప్రచారం తాలూకు అనంతశక్తి జాతీయంగా ఉండి సామాజిక సంక్షేమంకొరకై ఉపయోగించబడేందుకు తగినట్లుగా సలహాల నిస్తూన్నది.

తగినన్ని విద్యాసౌకర్యాలు లేకుండటం, విద్యాలయంలో తగినన్ని గదులు లేకుండటం లేదా విద్యావ్యాప్తికి అవసరమైనంతమంది ఉపాధ్యాయులు లేకుండటం - మొదలైన విషయాలమీద చర్చించి జాతీయాభివృద్ధికి అనుగుణంగా ఉండే సలహాలనిస్తూ, జాతీయతకు ఎదురయే ప్రమాదాలను వివరిస్తూంటుంది; ఆ సలహాలను పాటిస్తూ స్థానికంగా ఉండే స్వచ్ఛంద సేవాపథాలు కలకాలంగా వొస్తూన్న అమెరికన్ విధానంలో అయా సమస్యలను పరిష్కరించటం జరుగుతూన్నది.

డ్యూపాంట్ సంస్థ అనేక రేడియో, టెలివిషన్ నాటకాలను, అమెరికన్ చరిత్ర ఆధారంగా ప్రసారం చేస్తుంది. ఆ నాటకాలు ఏ ఒక్క వస్తువునుగూర్చీ ప్రచారం చేయవు; కాని ఉన్నతస్థాయి జీవితానికిగాను ఒకానొక పరిశ్రమ ఏ విధంగా పాటుబడుతూన్నదీ వివరిస్తవి. టెక్సాస్‌కంపెనీ సీజన్‌లో ప్రతివారమూ మధ్యాహ్నంపూట మెట్రొ పాలిటన్ అపేరాను, ఏ వ్యాపారం తాలూకు అభిప్రాయాలూ లేకుండానే ప్రసారం చేస్తుంది.

నిజానికి ప్రకటనలద్వారా జరిగే ప్రచారం సామాజికంగా ప్రముఖపాత్ర వహించింది; ఇది నీతి బాహ్యంగానూ, అసహ్యకరంగానూ, నొప్పించే విధంగానూ ఉండే స్థితిమొదలూ, నైతికపతనం జెందకుండా, సామాజిక సంక్షేమాన్ని గమనించేవరకూ ఉన్నది. వాడకపుదారుని డాలర్లకొరకై పడేపోటీ, బ్రహ్మాండమైన యంత్రాలనుంచి వెలువడే ఉత్పత్తికి తగిన మార్కెట్‌ను సృష్టించటం - మొదలైనవాటి ఒత్తిడులవల్లనే ప్రచారమనేది ఉద్భవించింది.

ఇలాటి అవసరం వాడకపుదారుని పద్ధతుల్నిగూర్చికూడా ఆలోచించవలసిన అవసరాన్ని కలిగిస్తుందనేది ఒకొక్కప్పుడు దేశాన్ని దర్శించేవారిని ఆశ్చర్యపరుస్తూంటుంది. పోస్టుద్వారా పంపబడే వస్తువులుకానీ, డిపార్ట్మెంటల్ స్టోర్స్‌లో కొనబడే వస్తువులుకానీ, ఎదురుప్రశ్న లేకుండానే అమ్మిన వస్తువును వాపస్ తీసుకుంటూంటవి. అమ్మకానికై వినియోగించ

బడినవారికి సుశిక్షణను ఇస్తూ, కొతాదారునితో స్నేహపూర్వకంగా ప్రవర్తించటంలోనూ, మంచి మర్యాదల చూపుతూ మన్ననల నందటంలోనూ, వాడకపుదారునికి నిజమైన సహాయం చేయటంలో ఎక్కువశ్రద్ధ చూపాలని ఆదేశించబడుతూంటారు. ఒకస్థాయి ఉండే నాణ్యత, ట్రేడ్‌మార్క్ లేదా బ్రాంచ్ మొదలైన వాటిమీద కొనుగోలుదారుడు ఆధారపడవొచ్చు. వాయిదాల పద్ధతిమీద కొనుక్కోవటం, టెలిఫోన్‌ద్వారా ఆర్డరిచ్చి తెప్పించుకోవటం, ఇంటింటికీ తిరిగి అమ్మేవారి సౌకర్యం, పోస్టుద్వారా సరుకులు తెప్పించుకోవటం మొదలైనవి - వాడకపుదారుడు తేలిగ్గా తనడబ్బు ఖర్చు పెట్టుకొనేందుకు కొన్ని పద్ధతులు. వాడకపుదారుడు డబ్బు ఖర్చుపెట్టేందుకు చూపే ఒప్పుదలమీదనే జాతీయ ఆర్థికవిధానం ఆరోగ్యకరంగా ఉండగలుగుతోంది.

## సమస్యలు

దినదిన ప్రవర్ధమానమౌతూ వర్థిల్లే ఆర్థికవిధానంలోకూడా ఎక్కడో చీకట్లు ఉన్నవనీ, లేదా అలాటి అనుమానాలు ఉండొచ్చు. ఇలాటి ఆరోగ్యకరమైన పెంపుదలను అమెరికా ఏ విధంగా సమర్థించ గలుగుతూన్నది? నిజంగానే నిరాయుధీకరణ సాధ్యమైనట్లయితే విచిత్రంగా ధ్వనించే దేశ రక్షణ కార్యకలాపాలు - ఏటా 40 బిలియన్ డాలర్ల వ్యయం - ఏమౌతుంది? ప్రస్తుతం లభ్యమయే అనేక ఖనిజాలను అత్యధికంగా ఉపయోగిస్తున్న అమెరికా, ఆ ఖనిజాలు మరివాడే అవసరం లేనందువల్ల ఏం చేస్తుంది? ప్రస్తుతం అమెరికా ధనవంతమైన దేశంగా ఉంటూ, ఆర్థిక విధానాన్ని పెంపొందించే పద్ధతులకుగాను ఉపయోగించే ఆయుధాలను ఉపయోగించటంద్వారా నిజమైన ఘోరమైన లోటును పూడ్చగలుగుతుందా? లేక అమెరికా చేసింది స్వల్పమా? లేక ఆ చేసిందేదో ఎక్కువగాఉన్నా, చాలా ఆలస్యంగా చేసిందా? ఇప్పటికీ ఇంకా ప్రేళ్ళాదే జీవితనాన్ని,

అత్యధికోత్పత్తిద్వారా అమెరికా తుడిచివేయ గలుగుతుందా, రైతుల అవసరాలను తీర్చేందుకు చేయగలిగిం దేమిటి, ఇప్పటి ద్రవ్యోల్బణ ధోరణి ప్రమాదకరరంగా పరిణమిస్తుందా? అలా జరుగుతే దాన్ని అదు పాజల్లో ఉంచటమెలా?

ఆర్థిక విధానానికి ఎదురయ్యే సమస్యలు ఇంకా కొద్దిగా ఉన్నవి.

స్పష్టంగా. ప్రస్తుతానికి కనిపించే అపాయం - ద్రవ్యోల్బణం. ఉత్పత్తి అయే సరుకులకు బలమైన డిమాండ్ ఉన్నంతకాలం - అటు పరి శ్రమకానీ. కార్మికవర్గాలుకానీ తయారయే వెలను మెదలకుండా వాడకపు దారునికి అప్పగించడం జరుగుతోంది. ద్రవ్యోల్బణం చేతులు దాటి పోకుండా ఉండేందుకు ప్రభుత్వమే ధరలమీద కంట్రోల్‌ను పెట్టవలసి ఉంటుంది.

ఆర్థిక విధానాన్ని నిశ్చలంగా ఉంచేందుకు - పరిశ్రమకు కొన్ని ప్రేరే పణలూ. సూచనలూ అవసరం; అప్పుడే అది పెట్టుబడికి అవసరమైన సరుకులమీద వ్యయం చేయటం. ప్రైవేట్ బ్యాంకులనుంచి తీసుకొనే ఋణా లను అదుపులో ఉంచుకోగలగటం జరిగి, వాడకపుదారుడు వ్యయపరిచే ధనంమీదనే కేవలం కన్నుంచకుండా సమర్థించుకో గలుగుతుంది.

ఈ ఆర్థిక విధానానికి ఎదురయే మరోసమస్య గృహనిర్మాణం. పట్ట ణాల్లోనేమి, పల్లెల్లోనేమి ఇప్పటికీ అనేకమంది అమెరికన్‌లు మురికి పేటల్లో నివశిస్తూనే ఉన్నారు. ఇలాటి మురికిపేటలు భూస్వాములకు మంచి ఆదాయాన్నిస్తవి. వీటిని బాగుచేయాలంటే ఎంతోధనం అవసరం; అలాటిదాన్ని ప్రభుత్వంకానీ, స్వచ్ఛంద సేవాదళాలు పోగుచేసే విరాళాలు కానీ రూపుమాపగలవేకాని సామాన్యవిషయం మాత్రంకాదు.

ఫెడరల్ ప్రభుత్వం పట్టణాలకు తగిన సహాయాన్నిచేస్తూ 750 పట్టణ ప్రాంతాల్లో ఉండే మురికిపేటల నిర్మూలనకు పూనుకున్నది. నూతన కట్ట డాలలోకి నిర్ణయించబడిన తక్కువ ఆదాయమున్న కుటుంబాలే ప్రవేశించ

వొచ్చును. అద్దె సామాన్యంగా ఆదాయంలో ఐదోవొంతు ఉంటుంది. గములు కుటుంబీకుల సంఖ్యనుబట్టి కేటాయించబడటంవల్ల, నివాసంలో గుమికూడటం జరగదు; యీ గుమికూడటమే మురికిపేటకు కారణభూత మౌతుంది. షికాగోలో మురికిపేటల్లో నివశించే వారిలో ఐదింట నాలుగింతలమంది, మంచి ఇళ్లల్లోకి మారారు. ఈ విధంగా గృహనిర్మాణ కార్యక్రమం కుటుంబీకుల జీవన ప్రమాణాన్ని హెచ్చిస్తూ, వారే గృహ యజమాను లయేందుకు దారితీస్తూన్నది.

షరిశ్రమల్లో జరిగే అత్యధికోత్పత్తి కార్మికులకూ, పనివారికీ ఎంతో సౌభాగ్యాన్ని చేకూర్చుతే, వ్యవసాయంలో జరిగే అత్యధికోత్పత్తి కారణంగా రైతుల ఆధాయం తగ్గిపోయింది. అమెరికన్లు పరిశ్రమలు ఉత్పత్తి చేయగల వస్తువుల్ని ఎంతైనాసరే కొనగలిగేట్లు కనిపిస్తారు, కాని, తిండివిషయంలో తినేదానికి హద్దు ఉంటుందికదా! తినే ఆహారం బలవత్తరమైనదిగా ఉండటం, తాజాగా ఉండటాన్ని ప్రజలు అలవరుచుకున్నా జనాభా అధిక మౌతూన్నప్పటికీ - రైతులు శాస్త్రీయ పద్ధతులమీద యంత్రాల సహాయంతో పండించే పంటలు అంతా ఉపయోగించ బడటమనేది కుదరకుండా ఉన్నది.

ఈ అత్యధికోత్పత్తిద్వారా లభ్యమైన ఆహారాన్ని - సముద్రాంతర ఖండాలలోని బడుగుదేశాలకు సరఫరాచేసినా బీదసాదలకు తక్కువ ధరలకు అమ్మినా, విద్యాలయాలూ, ఇతర సంస్థలకు తక్కువ వెలలకు అందించినాకూడా యీ ఆహారమంతా ఖర్చుబడేట్లు లేదు. ఫెడరల్ ప్రభుత్వం ఆహారధాన్యాల ధరలు పడిపోయి, రైతులు దెబ్బతినకుండా కాపాడేందుకుగాను ధరలను తగ్గించకుండా, అవసరమైన ధనసహాయాన్ని చేస్తూంటే - అదికూడా అత్యధికోత్పత్తిని ప్రోత్సహించేదిగానే రూపొందింది. రైతు తాను పండించే భూమి విస్తీర్ణాన్ని తగ్గించాలనే నియమం కూడా పనిచేయలేదు; ఎందుకంటే మిగిలిన భూమిమీదనే రైతు అత్యధికోత్పత్తి చేయగలుగుతున్నాడు.

ఉత్తరదేశంలోని బ్రహ్మాండమైన గోధుమపండే మైదానాలు; మధ్య దేశంలో వరిపండే ప్రదేశాలూ, దక్షిణ దేశంలో పొగాకూ, ప్రత్తిపండే భూభాగాలూ - కాలిఫోర్నియాలోని సారవంతమైన లోయలనుంచీ, ఎగుడు దిగుళ్లుగా ఉండే వెర్మాంట్, న్యూహాంప్‌షైర్‌లవరకూ విస్తరించిన పచ్చిక బయళ్లూ - టెక్సాస్‌లోని కింగ్‌రాంచ్‌నుంచి అలబామావరకూ విస్తరించిన 920,000 ఎకరాల సేద్యం - ఇవన్నీ కలిపి అమెరికన్ వ్యవసాయానికి సంబంధించిన సమస్యలను మరింత క్లిష్టతమంచేస్తూ, ఏ ఒక్క పద్ధతిలోనూ ఆ విషమసమస్యలను విడదీయలేని స్థితిలో ఉన్నవి.

రైతులు కో-ఆపరేటీవ్‌లద్వారా సహాయాన్ని పొందుతూన్నారు. కో-ఆపరేటీవ్‌లు రైతుల అవసరాలలో 12% ను టోకువ్యాపారపు ధరలకు సరఫరాచేస్తూ, రైతులు పండించే పంటను సాధ్యమైనంతవరకూ మార్కెట్ చేయగలుగుతూన్నవి. గ్రాంజ్ అండ్ ది ఫారమ్ బ్యూరో లాటి బ్రహ్మాండమైన స్వచ్ఛంద సేవాదళ సంస్థలు సామాజిక సంక్షేమం, విద్యావ్యాప్తి మొదలైనవాటిని స్థానిక స్థాయిలో పెంపొందింపజేసి, రాష్ట్రంలోనూ, జాతీయ ముఖ్యపట్టణాల్లోనూ రాజకీయాధికారాలను పెంపొందింపజేసింది. ఫెడరల్ ప్రభుత్వపరంగా లభించే అనేక సహాయాలు - భూసారాన్ని అంచనాలువేసి పెంపొందింప జేయటం, పల్లెల్లో విద్యుచ్ఛక్తిని వ్యాపింపజేయటం, పంటను ఇన్సూర్ చేయటం, పంటకాల్వలనిచ్చే పథకాలూ, వ్యావసాయక పరిశోధనలూ, ఆ పరిశోధనా ఫలితాలను వివరించే కరపత్రాలూ, రైతులకు ఋణాలనిచ్చే ఏర్పాట్లూ - మొదలైనవి లభ్యమై రైతులకూ్కడా ప్రభుత్వపు అండదండలు అందుతూన్నవి.

ఇంతచేసినా రైతురాబడి - ఆర్థిక విధానంలోని ఇతర శాఖలతో సరిసమానంగాలేదు. ధరలు పడిపోకుండా ప్రభుత్వమిచ్చే రక్షణ పెద్దపెద్ద భూస్వాములకూ, కొన్నివేల ఎకరాల సేద్యానికి యాజమాన్యాన్ని వహించే కార్పొరేషన్‌లకూ ఎక్కువగా ఉపకరిస్తున్నది; నిజానికి

ఇలాటివారికి ప్రభుత్వ సహాయమే అవసరంలేదు. సహాయ సానుభూతుల నందకుండా ఉండే 15 లక్షలమంది చిన్నరైతులు నడుములు విరిగేట్లు పని చేస్తూ, మురికి ఇళ్లల్లో నివశిస్తూ, అనారోగ్యకరమైన వాతావరణంలో బతుకుతూ, తగిన వైద్యపర్యవేక్షణలేక - తాము పండించిన ధాన్యాన్ని ఉత్తరదేశానికి మోసుకొనివెళ్ళి సొమ్ముచేసుకొనేందుకు సతమవుతూన్నారు. దేశదిమ్మరులుగా ఉండే వీరికి స్థిరనివాసమంటూ లేనందువల్ల ఓటింగ్‌లో పాల్గొనే అవకాశం లేకుండటం, సామాజిక జీవనంలోని సౌకర్యాలకు నోచుకోకపోవటం, తమ పిల్లలకు అడ్డులేని విద్యాసౌకర్యాన్ని కలిగించ లేకపోవటం జరుగుతోంది.

అయోవారాష్ట్ర కాలేజిలోని వ్యావసాయక ఆర్థిక తత్వవేత్త జయోఫ్రీ షెప్పర్డ్ ఇలా అన్నారు : "అత్యధికోత్పత్తిని అరికట్టేందుకు, క్షేత్రా దాయాలను పెంపొందించేందుకుగాను ధరలు పడిపోకుండా ఉండే పద్ధతికి స్వస్తి చెప్పాలి". 5 లక్షలమంది రైతులు పండించే పంట అత్యధికో త్పత్తిగా ఉంటూ, క్షేత్రలమీది జననాలసంఖ్య పెంపొందటమే రైతులకు వొచ్చే క్షేత్రం తాలూకు తక్కువ ఆదాయానికి కారణమని షెప్పర్డ్ అభి ప్రాయం. సామాన్యమైన రైతు, ఫలవంతమైన భూమిమీద ఏటా 2,000 డాలర్ల నికరాదాయాన్ని మాత్రమే పొందగలుగుతూన్నాడు. ఈ ఆదా యాన్ని పెంచాలంటే వ్యవసాయం చేయబడే భూమి విస్తీర్ణాన్ని తగ్గిం చటంకాదు - రైతులసంఖ్యను తగ్గించాలి; అప్పుడే తలకు ఇంతగా వొచ్చే ఉత్పత్తి పెరుగుతుంది. ఐతే ఇలాటి సకారణవాదం చాలామందికి నచ్చదు; ఎందుకంటే క్షేత్రాలమీది రైతులద్వారా తమకు లభ్యమయే ఓట్లసంఖ్య తగ్గకుండా ఉండాలనీ, ఎవరెవరు వ్యవసాయాన్ని వృత్తిగా ఉంచుకో దలుచుకున్నారో, వారిని నిరుత్సాహపరచరాదనీ వారి ఆశయం. పల్లీయ జీవనం గొప్పదనీ, భావ ప్రధానమైనదిగా ఉంటుందనే విషయాలు బలవత్తరమైనవిగా ఉన్నవి.






# పదో అధ్యాయం

## పరదేశాలతో వ్యాపారం

ప్రపంచంలో ఉత్పత్తిఅయే వస్తువుల్లోనూ, సరుకుల్లోనూ యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా 40% ఉత్పత్తిచేసినా, ప్రపంచ వాణిజ్యంలో 10% మాత్రమే చేయగలుగుతోంది. టారిఫ్‌ల్లోని అనేక సౌకర్యాలలోనూ, బహుమతుల రూపేణా, లేదా ఋణసంబంధంగా అమెరికా ప్రపంచోత్పత్తి లోనూ, వాణిజ్యంలోనూ తనభాగాన్ని నిర్వహించేందుకు ప్రయత్నించింది. ఆ యా ప్రదేశాలలోని ఆర్థికవిధానాన్ని నడిపించే సముద్రాంతర ఖండాల లోని సంస్థలను విజయవంతంగా ప్రోత్సాహపరిచింది. ఇచ్చిపుచ్చుకునే పద్ధతిమీద వ్యాపారానికి సంబంధించిన అనేక ఎగ్రిమెంట్ల విషయంలో అమెరికా సంప్రదింపులు జరిపి, ఇంటర్నేషనల్ బ్యాంక్ ఆఫ్ రీకన్‌స్ట్రక్షన్, డెవలప్‌మెంట్ అండ్ ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండులను స్థాపించ టంలో అమెరికా ప్రముఖపాత్ర వహించింది. వాణిజ్య సంబంధమైన ఎగ్రిమెంట్లు అమెరికన్ టారిఫ్‌లను 1930 - 33 ల్లో సరాసరిగా 53% ఉండేదాన్ని 1951 కల్లా 15% కు తగ్గించివేసినవి. దీర్ఘకాలంగా పెద్ద టారిఫ్‌లకు అలవడిన జాతీయతకు యీ తగ్గింపు మంచిబేరమే! పర దేశాలనుంచి వొచ్చే దిగుమతులమీద ఆధారపడిన పరిశ్రమలు, యీ పథ కానికి హద్దులుంచేట్లు చేసేందుకు ఎంతో ప్రయత్నంచేస్తూ, తమ పలుకు బడులను ఉపయోగిస్తూన్నవి. పరదేశాల ఉత్పత్తితో పోటీ కారణంగా తమ ఉద్యోగాలే పోతయ్యేమోనని భయపడే స్త్రీ, పురుషులు ఎన్నుకొన్న కాంగ్రెస్ సభ్యులు అమెరికన్ పరిశ్రమలను కాపాడవలసిన గురుతర బాధ్యతను కలిగిఉంటూ, అధికమైన వొత్తిడికి గురవుతూన్నారు.

అతిముఖ్యమైన ఖనిజాలు - రాగి, జింక్, సీసం, పెట్రోల్ మొదలైన వాటిని యునైటెడ్‌స్టేట్స్ అమితవేగంతో ఉపయోగించి వేస్తూన్నది. వీటిల్లో సగభాగమన్నా అమెరికా పరదేశాలనుంచి కొనుక్కోవలసి

ఉన్నది. ఐతే స్థానికమైనశక్తులు మళ్ళీ కల్పించుకుంటవి. గనుల్లో పని చేసే వారికి మరి పనులేకుండాపోతే వారికి జీవనాధార మేమిటి? వారు సంపాయించే వేతనాలమీద బతికే సమాజాల సంగతేమిటి?

అమెరికాలో ఉత్పత్తీ, వేతనాలూ, జీవన పరిణతి ప్రపంచపు సగటు కన్న అధికంగా ఉన్నంతకాలం, మిగతా ప్రపంచంతోడి అమెరికా సంబంధాలలో ఇబ్బంది ఉండకుండా ఉండదు. చివరకు ధార్మికభావంకూడా అమెరికన్‌లను కలవరబరుస్తుంది. స్వదేశంలో ఇలాటి ఫర్మగుణ సంపత్తిని ప్రదర్శించలేని కఠినత్వాన్ని నటిస్తూ, బైటి ప్రపంచంపట్ల యీ ధార్మికభావాన్ని వెలిబుచ్చేందుకు క్షమాపణల నర్పించే ధోరణిని కనబరుస్తూండటం జరుగుతోంది. ఐనప్పటికీ అత్యధికోత్పత్తి ప్రపంచమందంతటా వెల్లివిరియటంద్వారా అమెరికాకు లాభాలు అందుతవనేది సుస్పష్టమైన విషయం.

## వాణిజ్యము : ప్రభుత్వము

ఆర్థికవిధానాన్ని అదుపాజ్ఞల్లో ఉంచేందుకూ, తద్వారా వర్ధిల్లే విధానాన్ని అమలు జరిపేందుకూ ప్రభుత్వానిదే బాధ్యత అనేది యునైటెడ్‌స్టేట్స్‌లో ఒక కొత్త అభిప్రాయంగా భావించబడుతోంది. ప్రభుత్వం మధ్యవర్తిత్వాన్ని వహించి, పెద్దపెద్ద మొత్తాలను వ్యయపరచటంలో ప్రముఖపాత్ర వహిస్తూండటంవల్ల, ఆర్థికవిధానంలో కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. చిన్నవాటిని మినహాయిస్తే పెద్దపెద్ద కార్పొరేషన్‌ల తాలూకు లాభాల్లో 38% ప్రభుత్వానికి చెందుతవి, ఆ తరువాత వాటాదార్లకు అందే లాభాల మీద పన్నులరూపంలో మరికొంతసొమ్ము ప్రభుత్వానికి అందుతుంది.

అమెరికన్‌లు వారి జీవితాల్లోనే నిశ్శబ్దంగా సాగిపోయిన విప్లవాన్ని చూశారు; ఈ విప్లవం పెట్టుబడిదారీ విధానాన్ని సోషలిస్ట్ పద్ధతికి మార్చి వేసింది: అత్యద్భుతమైన అమెరికన్ అత్యధికోత్పత్తి అనబడే

శక్తీ, ఎన్నుకొని ప్రయోగాల్ని జరిపేందుకుగాను దానికి ఉన్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, అనేక సబ్‌స్టేషన్‌లద్వారా (ఆర్థిక విధానంలోని పెద్ద ముఠాలు - కార్మికులూ, పరిశ్రమ, వ్యవసాయం) విద్యుత్‌శక్తి ప్రసరింప జేయబడినట్లు పంచబడటమూ, మధ్యమధ్య ట్రాన్స్‌ఫార్మర్స్‌వలె ఉండే స్వచ్ఛంద సేవాదళాలద్వారా చివరకు వస్తువు వాడకపుదారువరకూ యీ ఆర్థికవిధానం జేరుతూన్నది. దీర్ఘకాలం పెట్టుబడిదారీ పద్ధతులు ఎదిరించ బడినప్పటికీ, చివరకు అది ప్రభుత్వంతో సరిసమానంగా నడక సాగించ గలిగిన స్థితికి వొచ్చింది. ఆర్థిక విధానమనేది ఎవరికైనా లాభసాటిగా ఉండాలంటే, అది పౌరులందరికీ లాభసాటిగా ఉండితీరాలనే అభి ప్రాయాన్ని అది అంగీకరించింది. వ్యాపారానికీ, ప్రభుత్వానికీ, ఆర్థిక తత్వాలకూ, రాజకీయాలకూ మధ్యఉండే అడ్డుగోడలన్నీ కూల్చివేయబడి యీనాడు ఇవన్నీ ఏకమై సామాజికమైన అంతస్థులుగా ఉంది. వీటి ద్వారానే సామాజిక సంక్షేమం జరగాలనే ధోరణికి మారినవి. ఈ విధంగా సోషలిజమ్‌కు మార్చబడిన పెట్టుబడిదారీ విధానం, దాని లాభాలను విస్త రింపజేసి అనేకమంది ప్రజలకు అందేట్లుచేసి, ఐశ్వర్యవంతునికీ, బీదవానికీ మధ్యఉండే దూరాన్ని చాలావరకు - ఏ సోషలిస్ట లేదా కమ్యూనిస్టు ప్రభుత్వమూ చేయలేనంత స్థాయిలో చేసింది, ఒకో కుటుంబపరంగా ఉంటూన్న బ్రహ్మాండమైన స్థిరాస్థులు, ఎస్టేట్ పన్నులద్వారా అంతరింప జేయబడినవి.

అమెరికన్ పద్ధతి పరిపూర్ణమైనదికాదు - ఐతే అది సదా కదుల్తాడుతూ, సరైనమార్గానే పురోగమిస్తూ ఉన్నది. పుష్కలత, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు - యీ రెండూ విడివడేవికావని కనిపిస్తోంది. ఇలాటిది యునైటెడ్‌స్టేట్సు ఆఫ్ అమెరికాలో అమల్లోఉన్న సామాజిక జీవనవిధానంద్వారా సాధించ బడింది. ఈ విధానంలో వ్యక్తిత్వమనేది స్వచ్ఛంద సేవాతత్పరతతోనూ, ఫెడరలిజమ్ అనేది దాన్ని సరితూచేందుకు ఏర్పడిన ఇతరశక్తులతోనూ

కలిసిపోయింది. ఈ పద్ధతిద్వారా యాజమాన్యం విస్తరించి, నిశ్చయాలూ, నిర్ణయాలూ చెల్లాచెదరై నిరంకుశత్వం రూపుమాసిపోయి. ఈ పద్ధతిలోని పుష్కలతను సదా ఎల్లదిక్కులా పంపిణీ చేస్తూనే ఉన్నది.

పుష్కలత నిశ్చయమవగా, అమెరికన్‌లదృష్టి మార్కెట్ విలువల మీదినుంచి మళ్ళించబడి, భౌతిక వస్తుసముదాయాల్ని కూడగట్టే వాటికి సంబంధంలేని వాటిమీద వాలింది. పౌరసంబంధమైన కార్యకలాపాలలో స్వచ్ఛంద సేవాశక్తిని చూపటమే వారికొక కొత్త శక్తి నిస్తూన్నది; ఇదిగాక వారు తమతమ వ్యక్తిత్వాలను పెంపొందింప చేసుకుంటూ సమాజంలోని సభ్యులమనే ధోరణికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు.

జీవితానికి సరిపడే వస్తుసంపత్తిలో లోపమున్నవారికే భౌతిక జీవితపు విలువలు ముఖ్యమైనవిగా ఉంటవి. పోతే పుష్కలత సాధించబడిన తరువాత, జీవితం తాలూకు ఇతర విలువలకు, విలువలు హెచ్చుతవి. మానవ స్వభావంలోని కేంద్రంమీద లాభాలను సంపాయించే అభిప్రాయ ముంటుందనేది ఆర్థికతత్వవేత్తల వర్ణన ఐనప్పటికీ, ఇతర అభిప్రాయాలుకూడా తమతమ విలువలను హెచ్చిస్తూన్నవనేది - సుస్పష్టం.

వస్తువుల పుష్కలత, భౌతికవాదమే ననేది ఒకరకంగా పొరబడటమే అవుతుంది. వస్తువుల పుష్కలత అనేది యునైటెడ్‌స్టేట్స్ విషయంలో సుస్పష్టం; ఇది అమెరికన్‌లకన్న, ఖండాంతరాలనుంచి వొచ్చే అతిథులకే ఎక్కువ ప్రాముఖ్యమైనదిగా తోస్తూఉంటుంది. మెరిసిపొయ్యే దుస్తుల ధారణకు ఒకోసారి పసిపిల్లవాని అమాయకపు ఆనందాన్ని అనుభవించే ధోరణిలోనూ, మరొకసారి ఆ దుస్తులిచ్చే సుఖాన్ని ఆశించే ధోరణిలోనూ, తమ తాహతుకు అనుగుణంగా అమెరికన్‌లు ధరించటం జరుగుతోంది. ఐతే దీర్ఘంగా ఆలోచించి నట్లయితే యీ భౌతిక సుఖాలన్నీ చేజిక్కించుకున్నాక, భౌతికానికి సంబంధించని వానిపైపు దృష్టి మళ్ళించేందుకే అమెరికన్‌లు యీ మార్గాన్ని అనుసరించేరేమోననేది ఆలోచించవలసి ఉంటుంది.

సముద్రాంతర దేశాల్లో ఎదురయే అనేక సమస్యలలో యునైటెడ్ స్టేట్స్ ఇంకా సతమతమౌతూనే ఉన్నది. తరగతులవారీ విభేదాలన్నీ తుడిచివేయబడ్డాక - ఎక్కువమందికి తగిన విశ్రాంతీ, వ్యయపరిచేందుకు తగినంత ఆర్థికస్తోమతా ఏర్పడి నప్పుడు, సంస్కృతి ఏమౌతుంది? యంత్రాలద్వారా సాధించబడిన ఆర్థిక విధానంనుంచి ఒకవ్యక్తి పొందే తృప్తి ఎలాటిది? కేవలం ఆర్థికవిధానానికి సంబంధించని ఇతర రంగాల లోని చిటారు కొమ్మలను అందుకునేందుకు అత్యధికోత్పత్తిద్వారా సాధించిన ఆర్థిక విధానాన్ని ఉపయోగించట మెలా? అభిరుచి, పద్ధతి, అనుభవాలమీద దీని పలుకుబడి, ఒత్తిడి ఏమిటి? ప్రజారంజకమైన కళల మీదా, లలిత కళలమీదా దీని ప్రభావం ఎలా ఉంటుంది?

---

# పదకొండో అధ్యాయం

## కళలు

### తరగతులు లేని సమాజంలో కళలు

దాదాపు తరగతులనేవిలేని, ముందుకు సాగిపొయ్యే సమాజానికి అనుగుణమైన కళ అనేది ఏదైన ఉన్నదా?

డీటాక్వావిల్లీ అలాటిదేదో ఉన్నదనే అభిప్రాయపడ్డారు. అలాటి సమాజానికి సంబంధించిన సాహిత్యం తేలిగ్గా లభ్యమయ్యేదిగా ఉంటూ, త్వరగా చదివేందుకు వీలుగా ఉండాలని ఆయన అభిప్రాయం. అది గాఢమైన ఉద్వేగాలను పొందు పరచాలి. భాషాపరిజ్ఞత శక్తివంతంగానూ, సరళంగానూ ఉంటూ, పాఠకుణ్ణి రంజింప జేయటంకన్నా ఆశ్చర్యచకితుణ్ణి

చేసేందుకు ప్రయత్నిస్తూ, అభిరుచిని అందంగా రూపొందించటంకన్నా, ఉద్రేకాలను పైకి తీసుకొని రావాలని - ఆయన భావం.

ఆయన చెప్పిన యీ పద్ధతులు బహుజనరంజకాలుగా ఉండేందుకు అనుసరించవలసిన పద్ధతులే ఐనప్పటికీ - విద్యావ్యాప్తివల్లా, పుష్కలత వల్ల రూపొందిన అనేకరకాల పరితలను ఆయన అభిప్రాయాలు గణనకు తీసుకోలేము. ఐనప్పటికీ ఆ అభిప్రాయాలు వ్యాపారసంబంధమైన నాగరికతలో కళలకు ఎదురయ్యే ప్రమాదాలను స్పష్టపరుస్తూనే ఉన్నవి.

పనిపాటలనుంచి విడుదలయ్యాక మానవుడు తన అభిరుచులను పెంపొందించుకొని, తాను కోరి ప్రయత్నించినట్లయితే కళాకారుడుకూడా కాగలుగుతాడనేది - అలాటి కాలం వొస్తుందనేదాన్ని డీటాక్వొవిల్లీ ముందుగా చూడలేకపోయ్యారు. ఆనాటి సామాన్యప్రజలో వొచ్చే అభివృద్ధిని, ఆశ్చర్యపరిచే పెంపుదలలను ఆయన ముందుగా గమనించలేకపొయ్యారు. ఈనాడు ప్రజలు కావ్యాలను ఏటా 100,000,000 డాలర్ల విలువ గలవాటిని కొంటున్నారు ; వారికి సంగీతాన్నిగూర్చి తెలియటమే కాదు ; ఒక గాయక దర్శకుని ప్రతిభను, మరొక దర్శకుని ప్రతిభతో పోల్చి విమర్శనాపూర్వకంగా చెప్పగలుగుతూన్నారు.

అమెరికన్‌లు తమకున్న భౌతిక వస్తుసముదాయాన్నిగూర్చి సగర్వంగా చెప్పుకునేందుకు ఒకవైపు ఎంతో ఆతృతను కనబరిచినా, మరోవైపు సాధారణంగా తమ సంస్కృతిని ఎత్తిచూపితే, దాన్ని పట్టుకొని వేళ్ళాడే దుమ్మూ, ధూళీ, బూజూ యూరపియన్ కళ్ళకు అంత అందంగా కనిపించవేమోననే భయంతో కాస్త సిగ్గుపడుతూంటారు. అమెరికన్‌లు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, అభివృద్ధీ, సుఖసౌఖ్యాలూ, యాంత్రికోత్పత్తీ మొదలైనవాటిని తమకొరకు కోరి సాధించిన సమయంలో, వారి సంస్కృతిని యూరప్‌కు అప్పగించేందుకు తమ సమ్మతిని తెలిపారు. నిజానికి యూరప్ అమెరికాకు ఒక ప్రతిబింబంగా ఉంటూ, పురాతనమైనదిగా ఉన్నదేకాని,

ఆధునాతనమైనదిగానూ, పురుషత్వం కలదిగానూ ఉండలేము. కనుకనే అమెరికన్‌లు కళారాధనలను వారి మహిళలకు వొదిలేశారు ; వారిదృష్టిలో కళ అనేది మరింతఎక్కువగా స్త్రీత్వానికి సంబంధించిందిగా ఉంటూన్నది.

ఐతే, ఇప్పుడిప్పుడే యీ చిత్రం మారుతూన్నప్పటికీ, ఆ పాతభావా లింకా పూర్తిగా వైదొలగిపోలేదు.

నిజమేమంటే అమెరికన్‌లు భూతకాలంనుంచి, భవిష్యత్ కాలంవైపు తిరగటమనేది - ఒక విధంగా సూచనప్రాయంగాఉండే కళలనుంచి తిరోగమించటమే. ఎందుకనంటే - కళ పురాణాలనుంచీ సూచనలనుంచీ ఉద్భవించి, మానవుని నిజపరిస్థితినీ, అతని ఖర్మనూ - విషాదరూపంలో ప్రతిఫలింప జేసేందుకు ప్రయత్నిస్తున్నది. ఐతే, అమెరికా తన భవిష్యత్‌లో విషాదాంతం ఉంటుందని నమ్మలేని భూఖండం. దాని పురాణమంతా ఆశాజనకంగా ఉండటమే.

ఇలాటి వాగ్దానాన్ని వెలిబుచ్చాలంటే. కేవలం కవిత్వధోరణి మాత్రమే చాలదు. వికారమూ, బీదతనమూ, అవమానాలనుగూర్చి కోపగించుకొన్న కారణంగా - వీటినిగూర్చి ఏమైనా చేయాలని అమెరికన్‌లు నిశ్చయించుకున్నారు. వీటిని కళారాధనద్వారా గుర్తించటంగాక, వీటికి ఎదురొడ్డి పోరాడి, సక్రమంగా నడిపించాల్సిన అవసరమున్నదని వారు గ్రహించారు. కనుకనే వారు సామాజిక పరిశోధనలవైపూ, సామాజిక శాస్త్రంవైపూ తిరగటం జరిగింది.

కళాకారులను ప్రోత్సహించిన శక్తిసామర్థ్యాలూ, ఆశయాల్లాటివే - సామాజిక శాస్త్రవేత్తలనూ, మనస్తత్వవేత్తలనూ కదిపి, కుదపటం, మానవుని ఆశయమూ, ఉద్దేశ్యాలనుగూర్చి తెలుసుకోవాలని కుతూహలపడటం, మానవుని ప్రవర్తననుగూర్చి విశదీకరించి అర్థతాత్పర్యాలను విడదీయటమనేది జరిగింది. వీటి ఫలితంగా - ఒక పాఠ్యగ్రంథం, లేదా కుటుంబ సంక్షేమ కార్యకలాపాలు, లేదా వైద్యంలో మనస్తత్వశాస్త్ర అవశ్యకతల్లాటివి అవతరించినవి.

కనుక అమెరికన్‌లు ఎన్నుకున్న మార్గం - కళాకారుడు ఎన్నుకొన్నదే: ఉన్న అనుభవాన్ని నిత్యజీవితంలో ప్రవేశపెట్టటం. అంతులేని కుతూహలం ముందుకు నడిపించగా, ఒక బాలుడు సముద్రపుటొడ్డున ఉండే ఒక రంధ్రాన్నిగూర్చి తెలుసుకోవాలని చూపే కుతూహలం లాటిది, లేదా ఒక కవి ప్రకృతి సౌందర్యంలోని ఒకానొక ప్రత్యేక విభాగాన్నిగూర్చి తీవ్రంగా పరిశీలించి దాన్ని రచించిన విధంగా - అమెరికన్‌లు తమ ప్రపంచంలోని అఖాతాల్లోకి జొచ్చుకుపోయి వాటినిగూర్చి క్షుణ్ణంగా తెలుసుకునేందుకు ప్రయత్నించారు. ఐతే, కళారాధననుంచి వెలువడే చిటారుకొమ్మ కున్నది కేవలం అక్కడ అంతకుముందే ఉన్నదైతే, అమెరికన్‌లు సాధించే చిటారుకొమ్మకున్న ఫలం పరిస్థితులను మార్పు చేసేందుకుగాను చేసే గట్టిప్రయత్నంగా ఉన్నది.

కౌశలాలు కళలవైపు మళ్ళినపుడు, ప్రేరేపించేశక్తి నిశ్చలంగా ఉంటూ, అనేక సందర్భాలలో పరిస్థితులను మార్పుచేయాలనే గాఢవాంఛ, లేదా కనీసం 'అమెరికా' ను గూర్చిన కొత్త అర్థాలను కనుక్కోవాలనే తీవ్రవాంఛ, దాన్ని మరింత స్పష్టంగా అందచందాలలో విలసిల్లే రూపాన చూడాలనే కోర్కె కలుగుతోంది.

అమెరికన్‌లకు గొప్ప కలలున్నప్పటికీ, వారి సంస్కృతిలో సాహిత్యం జర్నలిజమ్‌వైపే స్వభావసిద్ధంగా పయనిస్తుంది. ప్రజా సంబంధమైన కార్యకలాపాల్లోనేమి, శాస్త్రీయ పరిశోధనల్లోనేమి, వీటిని నిత్యజీవితంలో అమలు జరపటంలోనేమి - త్వరితగతిని ముందుకు సాగిపోతూన్న ప్రపంచంలో జర్నలిజమ్ విడువరానిది ; విడువలేనిదీను. పూర్వకాలపు కథలు, ఊహించిన వర్ణనలను యీనాటి శాస్త్రీయ పరిశోధనా ఫలితాలు సరళమైన భాషలో చెప్పబడటం తలదన్నింది ; అత్యద్భుతమైన ఒడిస్సియస్ ప్రయాణాలను, వాల్ట్‌డిస్నీ ప్రకృతి అద్భుతాలను తెరమీదికి ఎక్కించటం తలదన్నింది ; కనుక యీ అద్భుతాలన్నిటినీ విడమరిచి, వివరించగల అను

భవశాలురూ, ప్రతిభాశాలురైన వారి అవసరం ఎంతో ఉన్నది; అప్పుడే అక్కడ ఉన్నదాన్ని మనం బాగా అర్థం చేసుకో గలుగుతాము.

ప్రపంచంలో ఏం జరుగుతున్నదో తెలుసుకోవాలని నీకు ఉందదా? వార్తలను అందించే వారపత్రికలూ, లేదా ఖండాలలోని రాజకీయాలను వివరించే జాన్ గంథర్ రచనలూ మొదలైనవి ఉండనేఉన్నవి. వీధుల్లోని అంగళ్లల్లో ఉత్తమ గ్రంథాలు అమ్మకానికి సిద్ధంగా ఉన్నవి. ఈ గ్రంథాలు రాజకీయాలకు సంబంధించినవైనా, ఆయా రచయితలు నవలాకారుడు చెప్పే ధోరణీ, అతని కౌశలం లేదా నాటకరచయిత సృష్టించే రసజ్ఞతా మొదలైనవాటిని ప్రదర్శించగలరు. పోతే వీరు రచించే విషయాలు ఎంతో ఆనందదాయకంగానూ, వినోదపూర్వకంగానూ ఉండటంవల్ల కొంతవరకూ నవలాకారుల్నీ, నాటకరచయితల్నీ తలదన్నటం కూడా జరిగింది.

జర్నలిజమ్ నవలల్లోకీ, నాటకాల్లోకి కూడా ప్రవేశించింది. మాంసాన్ని పేక్ చేసేవారూ, నూనె కార్మాగారాధిపతులుచేసే దుర్మార్గాలను అప్టన్ సింక్లర్ తన నవలల్లో బహిరంగపరచిన విధంగానే - యీ నాటి నవలా కారులు హాలీవుడ్‌లోని తక్కువ అభిరుచులనూ, ప్రకటనలలోని నైచ్యాన్నీ లేదా పరదేశాల్లో వృత్తికొరకైపడే పాట్లనుగూర్చి తెలియజెప్తూనే ఉన్నారు. ఈ నాటి సంఘటనలను వినోద విజ్ఞానాలకూ, గుర్తించు కునేందుకూ వీలుగాఉండే విధంగా జర్నలిజమ్ సాహిత్యరంగంలోని కళ లను అనుసరిస్తూంటే, ఆధునాతన జీవితచిత్రణకుగాను సాహిత్యం జర్న లిజమ్ తాలూకు కళలను ఉపయోగిస్తూన్నది. చివరకు సినిమాలు కూడా ప్రస్తుత సంఘటనల ఆధారంగానే తీయబడుతూన్నవి. ప్రాథమిక మానవుల సంబంధాలను వివరించే కథలకు మారుగా - జాతివిచక్షణకు సంబంధించి నవీ, మద్యపానానికి సంబంధించినవీ, నేరస్థుల మనస్తత్వాలకు సంబం ధించిన లేదా సంబంధాలున్నవాటితో ఆయా సమస్యలను వివరించే కథ లతో మన పరిచయాలు ఎక్కువవుతూన్నవి.

కావ్యాలూ, కాగితపు అట్టలతో వెలువడే గ్రంథాలూ, అనేక ఫిలిమ్‌లూ, చిత్రకారుల మూలచిత్రాలనుంచి కళ్లుచెదిరే రంగులతో అచ్చువేయబడిన చిత్రాలూ మొదలైనవి విరివిగా వొచ్చేందుకు భౌతికవాదమే కారణం. బహుజనాదరణను పొందిన 'లైఫ్' అనే మాగజైన్ టి. ఎస్. ఇలియట్ రచించిన క్లిష్టతరమైన పద్యభాగాలనూ, హెమ్మింగ్‌వే రచించిన 'ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ', పాతబడిపోయిన అందెవేసిన చేతులు తాలూకు చిత్రాలూ, ప్రపంచంలోని వివిధ మతాలకు సంబంధించిన సంగ్రహ చరిత్రలూ - మొదలైన వాటిని అచ్చువేస్తుంది. అంతేగాక వివిధ తిన్నుబండారాలను గూర్చి, నేరాల తాలూకు ఫొటోలను కూడా అచ్చు వేస్తుంది. ఈ ఉన్నత స్థాయిలో ఉండే సంస్కృతి కూడా ఒక్కొసారి, ఇంతవరకూ మరుగున పడిఉన్నవారిని బహిరంగపరుస్తూంటూంది. దాని వేళ్లు ఎక్కడ ఉన్నవో, ఆ బ్రహ్మాండమైన వృక్షం ఊడలు దించుకునేందుకు అవసరమైన బలమైన ఆహారం ఎక్కణ్ణుంచి లభ్యమౌతున్నదో ఎవరు చెప్పగలరు ?

స్వభావసిద్ధమైన కళాభిరుచీ, అధునాతన సాంకేతిక నైపుణ్యం కలిసి - రికార్డింగ్ చేయటం, టెలివిషన్‌లో ఆపేరాలను ప్రదర్శించటం, మూల చిత్రానికి నకలుగా అనేక చిత్రాలను యధాతథంగా రూపొందింప జేయటం మొదలైనవాటిని పెంపొందింపజేసినది. సంస్కృతి ఏ కొద్ది మందికో చెందాలనీ, తమకు మాత్రమే ఆ సంస్కృతి లభ్యమైనది గనుక, తాము మిగతా మానవాళికన్నా అత్యధికులమని గర్వించవొచ్చనే భావం ఏ కొద్ది మందికో ఉన్నది. నిజమైన గొప్ప కళ విశాల విశ్వానికంతా చెంది ఉండాలని అమెరికన్‌ల భావం.

ఈ విధంగా కళాభిరుచులు విస్తరించటం, కళలు బహుజనాదరణను పొందటం మొదలైన విషయాలు సముద్రాంతరాలనుంచివొచ్చే యాత్రికులను సంభ్రమాశ్చర్యాలలో ముంచుతవి.

## సాహిత్యం

జేడెన్ ఇలా అన్నారు: "యూరప్‌నుంచివొచ్చిన కొత్తలో నామొదటి బలవత్తరమైన అభిప్రాయమిది: ఏ ప్రదేశంలోకానీ, ఏ కాలంలో కానీ ఎవరుకానీ రచించిన సాహిత్యం ఇంత కుంగిపోవలసిన స్థితిలోలేదు. సర్వస్వమూ మేలుకొరకే సృష్టించబడిందనే వాదంలో ప్రపంచ ప్రసిద్ధికెక్కిన యీ జాతి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవిస్తూ కూడా, తనను తాను చూసుకునేప్పుడు - సమాజంలోని నిస్సహాయస్థితిలో ఉండి బలయిపోతూన్న వారినీ, అనుమానాస్పదమైన ప్రవర్తనలతోనూ, అంగవైకల్యంతోనూ బాధపడేవారిని మాత్రమే ఎందుకు చూడాలనేది నా ఆశ్చర్యం! ఒకవైపు శిలాసాదృశంగా ఉండే నాయకులు ఎంతబాధను, ఓర్పునైనా చూపగలిగి, ఆ గుణగణాలే భూషణాలుగా ధరించగలిగినవారుండికూడా, సమాజంమీది రచయితల దృక్పథం ఇలా ఎందుకు దిగజారిపోయిందో?"

దీనికి ఇదొక జవాబు: చాలామంది అమెరికన్ రచయితలు హృదయాంతరాళాల్లో ఆదర్శాలను ఆరాధిస్తూ, అమెరికన్ జీవితంచేసే వాగ్దానాలన్నిటినీ ఎంతో సీరియస్‌గా తీసుకొని, ఆ ఆదర్శానికి ఏ కాస్త ఇబ్బంది వొచ్చినా, తలకిందులై పోతూన్నట్లు భావించే తత్వమున్నవారు. నాణానికి ఒకవైపున నాణాన్ని అమలు జరిపే అధికారి బొమ్మఉంటే, మరొకవైపున అక్షరాలుంటవి; యీ రచయితలు 'బొరుసు' వైపున ఉన్నకోవకు చెందుతారు. మురికి పేటలవైపు ఒక కన్నువేసి ఉంచటం రచయితల విధులలో ఒకటి. నవలాకారుడు - ప్రకటనదారుడు చూపే అమెరికన్ జీవితం అటు మొగ్గకుండా ఉండేందుకుగాను, రెండవ తక్కెడలో వేసే బరువే ఇది. 1925 - 1940 ల మధ్య వెలువడిన అమెరికన్ నవలా సాహిత్యం ప్రపంచంలోని పశ్చిమ దిశల్లో ఎంతగానో తప పలుకబడులను ప్రసరింపజేసింది.

హెమ్మింగ్‌వే సత్యాలను నగ్నంగా సరళమైనభాషలో చెప్పటం, అనుభవ మనేదాన్ని వర్ణించటానికి మారుగా, దాన్ని అనుభవించేవారి భావాలను ప్రస్ఫుటింప జేయాలనే నిశ్చయం - అన్నిటిలోకీ అత్యధిక పరిమాణాల్లో తమ పలుకుబడులను ప్రయోగించింది. ప్రపంచ పరిస్థితులమీది అజమాయిషీని పోగొట్టుకుంటున్నాననే మానవుని భయం, ఆయన రచనల్లో భావగర్భితంగా ఉన్నది. ఆయన సృష్టించిన కథానాయకులు సాధారణంగా శారీరకంగా ఓటమిని ఎదుర్కోవటం. వారు సాధించే విజయాలేమన్నాఉంటే అవి కేవలం నైతిక విజయాలుగానే ఉండటం జరిగింది : ఈ పుస్తకాల్లోనూ, ఆయన తీసుకున్న ప్రజానీకంలోనూ సర్వనాశనమూ, మృత్యువూ ప్రముఖపాత్రలు వహించినవి.

జఫర్‌సన్ సిద్ధాంతాల ప్రకారంఉండే ప్రజాస్వామ్యం, హామిల్టన్ ఆర్థిక సిద్ధాంతంలోని భారీప్రమాణంలో జరిగే వ్యాపారానికి మారిన భాగంతో. తన ముందువున్న అమెరికన్‌లవలెనే జాన్‌డాస్ పస్సాస్‌కూడా కోపోద్రిక్తుడవటంతో - ముప్పైఏళ్ళ వయస్సున్న ఒక సామాన్య మానవుడు తన కొక ఇల్లంటూలేక, తన దేశంలోనే నిలువ నీడలేక పోవటాన్ని చూడగలిగాడు. కెమేరాకన్ను, వార్తాచిత్రాలూ, జీవితచిత్రణల్లోని కొత్తకొత్త సాంకేతిక నైపుణ్యాలు అభివృద్ధి గాంచటంతో - తక్కువ వేతనాలు సంపాయించే వారికీ, నిరుద్యోగులకూ ప్రాతినిధ్యం వహించి, ఆయన కత్ర తీసుకున్నాడు. హెమ్మింగ్‌వే నాయకులవలె, పస్సాస్ నాయకులకు పోరాడే అవకాశాలే ఎన్నడూ లభించలేదు ; అప్పటికే వారు జీవితంలో ఓడిపోయి నిస్సహాయస్థితిలో ఉన్నారు.

దక్షిణదేశ జీవితంలో దౌర్జన్యం, అవమానం, అస్వభావికాలను విలియమ్ షాక్‌నర్ కనిపెట్టాడు. ఇక్కడ భూతకాలం వర్తమానకాలాన్ని కలుషితం చేయటం, గర్వం సిగ్గుతో కలిసిపోవటం, గ్రామాల్లోని మురికిపేటలమీద జాతి వైషమ్యం మరింత బరువుగా పరిణమించటం - మొద

లైనవి పరిశ్రమాభివృద్ధిలోకన్న పీడకలలకన్నా ఘోరంగా సృష్టించబడి నవి. కేవలం సూచనప్రాయంగాఉన్న విభాగాలలోకూడా యీ కథల్లో పీడకలల తాలూకు నాణ్యత సుస్పష్టం. ఐనప్పటికీ యీ కలగాపులగంలో కూడా షాక్‌నర్‌కు విషాదం స్ఫురించింది - అది అర్థవిహీనమైన దానికన్న నయం!

ఇతర రచయితలు - పేరు ప్రఖ్యాతులున్నవారుకూడా వివిధ దృక్కోణాలనుంచి అమెరికన్ జీవితంలోని చీకట్లనే పై వారితో సమానంగా చూశారు; జార్జియానుంచి ఎర్‌స్కిన్ క్లాడ్‌వెల్, షికాగోనుంచి జేమ్స్ ఫారెల్, మేయిర్ లెవిన్ మొదలైనవారు. ఐశ్వర్యవంతుల జీవితం నిస్సారమైనదని జాన్ ఓహారా, హాలీవుడ్‌లో తనకుతాను తెలుసుకునేందుకుగాను అనుసరించబడేవి మోటుమార్గాలనీ, పోరాడే రంగస్థలంలో అంతా అన్యాయమేననీ - బడ్ షుర్‌బర్గ్ కనిపెట్టాడు.

ఆ యా ప్రాంతాల ననుసరించి జీవితవిధానంలోఉండే మార్పులు కారణంగా - హృదయం ద్రవించే సాహిత్యం వెలువడింది; ఇది ఎక్కువ భాగం వాస్తవికతనే ఆశించిందికాని, నిజంగా జీవించే జీవితాంలోని కుంగుబాటును గణనకు తీసుకోకపోవటమే ఇందుకు కారణం. డొరోతీ కాన్ ఫీల్డ్‌ఫిషర్ వెర్‌మాంట్‌లోని పల్లీయ జీవనాన్ని ప్రదర్శించటమేగాక, యాంకీ సంస్కృతిని మనం అర్థం చేసుకునేందుకు తగిన అవకాశాల్ని కలిగించాడు. వాల్టర్ డూఎడ్‌మాంట్స్, శామ్యుయల్ హాప్‌కిన్స్ ఆడమ్స్ - న్యూయార్క్ ఉత్తర రాష్ట్రానికి ప్రాతినిధ్యంగా మాట్లాడారు; మార్తాఆస్టెన్సో (అమెకుముందు విల్లాకాథర్) ఉత్తర దిశలోని వలస వొచ్చిన ఒంటరి రైతులకు ప్రాతినిధ్యం వహించి మాట్లాడారు.

తిరిగి మనం దక్షిణానికివొచ్చినట్లయితే దౌర్జన్యం, నాశనంకనిపిస్తుంది: కౌశలమున్న నవలాకారుల్లో అత్యధికులు దక్షిణదేశవాసులే; కార్‌సన్ మెక్‌ముల్లర్స్, విల్లియమ్ స్మిత్, యుడొరావెల్టీ మొదలైనవారు అనేకులు.

అందరూ వలసవొచ్చినవారే అయిఉండీ, కొత్తగా అమెరికాకు వలస వొచ్చినవారి అనుభవాలనూ, అంతకుక్రితం వారు యూరప్‌లో గడిపిన జీవితవిధానాన్నీ, వారు తమతమ ప్రాంతాలలో బతుకుతెరువుల కొరకై పడినపాట్లనూ, ఏ విధంగా ఇక్కడికి గుమికూడారో ఆ విధానాన్నీ - మొదలైన విషయాలతో అమెరికన్ సాహిత్యం వెల్లివిరిసింది. ఇర్వింగ్ ఫైన్‌మెన్ పురాతన జ్యూల జీవితాల్లోని బాధలను నిశితంగానూ, హెర్మెన్ వేల్ వర్తమాన పద్ధతులను వాడిగానూ చెప్పారు. ఆలివర్ లా ఫార్జ్ 'లాఫింగ్ బాయ్' అనే పుస్తకంలోనూ, ఇతర గ్రంథాలలోనూ ఇండియన్‌లు రెండు విభిన్న సంస్కృతుల మధ్య నలిగిపోతూండటాన్ని సానుభూతి పూర్వకంగా వివరించారు. ఇతర నీగ్రో రచయితలవలెనే, రిచ్చర్డ్ రైట్ కూడా నీగ్రోలపట్ల శ్వేతజాతీయులుచూపే ద్వేషకారణంగా వొచ్చే పరిణామాలను విశదీకరించాడు.

ఒక దానితో మరొకటి సంఘర్షిస్తూన్న సంస్కృతులతో ఏర్పడిన సమాజాన్ని సృష్టించాక, అమెరికన్‌లు క్రమంగా అత్యధికంగా అంతర్జాతీయ ప్రపంచంలోకి జొరబడేందుకు తిరిగి నవలాసాహిత్యాన్నే ఉపయోగించారు. పెరల్‌బక్ హృదయాల్ని కదిలించే విధంగా చైనాను గూర్చి వ్రాసింది; జేమ్స్ మెక్‌నర్ ఏషియాలోని సంస్కృతులను పునర్దర్శించాడు. యూరపియన్ నాగరికతను ఆధారంగా తీసుకుని, అక్కడి పరిస్థితులమీద అమెరికన్‌లు ఎప్పుడూ నవలలు వ్రాస్తూనే ఉన్నారు. వారి కుతూహలం ఆఫ్రికా వైపు మళ్లగానే - వారు అక్కడి పరిస్థితులను వివరించే నవలల్ని (ఇవన్నీ అమెరికన్ రచయతలు మాత్రమే వ్రాసినవికావు) చదివి, అక్కడి విషాద పరిస్థితుల్నీ, సమస్యలనూ అర్థం చేసుకునేందుకు ప్రయత్నించారు.

నవలలద్వారా కనిపించే యునైటెడ్‌స్టేట్స్ ముఖ్యంగా చీకట్లతో నిండి ఉన్నదైనప్పటికీ, అత్యుత్తమ రచయితలు కొంతమంది మరింత సమదృష్టిలో చూడగలిగారు. జాన్‌స్టెయిన్‌బెక్‌కు జీవితం మీదుండే గౌరవం,

పోరాటాలలోనే జీవించటంలో అర్థమున్నదనే భావం మొదలైనవి. దుష్ట శక్తులూ సామాజిక నిర్లక్ష్యతా మానవునికి చేసేహానిని గూర్చిన ఆయన కోపోద్రిక్తతను, సమతలంమీదికి లాగుతూన్నది. పాతకాలపు పద్ధతుల మీదా, ఆ స్థాయిలమీదా బతికేందుకు ప్రయత్నించటంవల్లా, కేవలం ధనికులై సమాజాన్ని నిర్లక్ష్యం పెట్టటంవల్లా, మానవశక్తి ఎలా వృథా కాగలదో జె. పి. మార్క్వాండ్ తెలియజెప్పారు. ఐనప్పటికీ ఆయన చెప్పిన ధోరణి కలతజెంది నిరాశతో కూడినదికాకుండా, సానుభూతి పూర్వకమై, సున్నిత ధోరణిలో ఉన్నది.

తాను సృష్టించే జీవితంలో - అనేక సందర్భాలలో దక్షిణదేశవాసుల జీవితం - రాబర్ట్ పెన్‌వారెన్ స్వచ్ఛమైన విషాదాన్ని ప్రవేశపెట్టి, అది సముద్దేశాలను, దుష్టమైన పరిమాణాలకు ఎలా దారితీయుస్తుండో వివరించారు. దుష్టత్వంనుంచి ఉద్భవించే చిత్రమైన విధానాన్ని ఆయన చూశారు. మానవులకు న్యాయంమీద యింకా అచంచల విశ్వాసమున్నది - తమకు న్యాయం జరగకపోయినా, లేదా న్యాయం జరగకుండా ఉండేందుకు కొన్ని సందర్భాలలో వారే కారణమైనప్పటికీ, వారి దృక్పథంలో మాత్రం 'ఆశ' ఇంకా చావలేదు.

జేమ్స్ గౌల్డ్ కజిన్స్ అనేక ఇతివృత్తాలమీద రచనలు చేశారు; ఐతే ఆయనెప్పుడూ ఆధ్యాత్మిక విలువల మధ్య మానవుడు ఆరాటపడటాన్ని చూస్తూ, ముఖ్యంగా మంచిచెడులను తూచి, మంచిని ఏరుకునేందుకే ప్రయత్నించటం ఆయన రచనలకు ఒక కేంద్రసమస్యగా ఉంటూన్నది.

పోతే చారిత్రాత్మక సాహిత్యం - నిన్న మొన్నటి చారిత్రక సంఘటనలను గూర్చినదీ, చరిత్రవిషయంలో గర్వపడదగిందిగా ఉన్నది. ఈ కోవకు చెందిన రచయితల్లో కౌశలమున్నవారు కెన్నెత్ రాబర్ట్స్, శామ్యూయల్ షెల్లా బార్జర్, థామస్ బి. కోస్టెయిన్, బ్రూస్ లాంకాస్టర్ మొదలైన వారు.

ఐతే ఒక చిన్నపట్టణంలో నివశిస్తూ, అక్కడి విద్యాలయాలూ, చర్చీలూ, క్లబ్‌లూ, ఉద్యోగసద్యోగులూ, క్రీడారంగాలూ, స్క్వేర్‌డాన్సులూ, రాజకీయ పోరాటాలూ, ఆర్థికరంగంలోని మిట్టపల్లాలూ, చితికిపోయిన గృహాలూ, సుఖంగా గడిచిపోయ్యే కుటుంబజీవనాలూ, క్రిస్మస్ సమయంలో వీధుల్లో అలంకరించబడిన రంగురంగుల దీపాలూ, హాస్యాస్పదమైన గర్వాన్నిసూచించే సంఘటనలూ, సరళమైన సహృదయత్వం, అగ్నిప్రమాదం లేదా వరదలవల్ల కలిగిననష్టానికి ప్రజలుచూపే 'ధోరణి' చేసే సహాయం, తననుగూర్చి తనకున్న అభిప్రాయం, తన రక్షణకుగాను పడేపాట్లూ, ముఖ్యంగా తన పిల్లలనుపెంచే విధానం - మొదలైన వాటిని ఏర్చికూర్చిన నవలాసాహిత్యమనేది ఇంతవరకూ ఎవరిచేతా వ్రాయబడలేదు.

విభిన్నఅభిరుచులున్న దేశం అమెరికా కావటంవల్ల, ఏదో సూచనప్రాయంగా లేదా మూలపదార్థం తాలూకు ఛాయనుమాత్రమే చిత్రించినందువల్ల ప్రయోజనం ఉండదు. చెప్పదలచుకున్నది నిశితంగానూ, సుస్పష్టంగానే చెప్పాలి. కనుకనే విమర్శకూ, హాస్యానికీ ప్రాధాన్యత హెచ్చింది.

ఈ కారణంవల్లనే పద్యసాహిత్యం ద్వారా ప్రజానీకాన్ని జేరటం కష్టమౌతున్నది; ఇలాటిదీ మహామేధావుల మెదళ్లకు కొంత పరిశ్రమ నిస్తుంది; ఐతే ఇలాటి మహామేధావులు ఎక్కువమందిలేరు. పద్యసాహిత్యం 40 సంవత్సరాలక్రితం రాబర్ట్‌ఫ్రాస్ట్ రచనల ద్వారా పునర్జన్మించింది ; నలుగురు మాట్లాడే భాషలో, భూమినుంచి తవ్వబడిన పదజాలంలో ఆ పద్యభాగాలుండటంవల్ల వాటిని ప్రజానీకం తేలిగ్గా అర్థంచేసుకోగలిగి ఆనందించింది. ఇప్పటికీ అనేకమంది యువకవులు పద్యరచనలుచేసి చెవిటివారుకానివారికి వినిపిస్తూనే ఉన్నారు.

రోజురోజుకూ క్లిష్టమైన సమస్యలతోకూడిన యీ ప్రపంచాన్ని జాగ్రత్తగా; క్షుణ్ణంగా అర్థంచేసుకునేందుకు అనుగుణంగా విజ్ఞానమనే సాధన

ఉంది ఎంతబాగా వివరించే ప్రయత్నాలు చేసినప్పటికీ. దాన్ని ఇంకా విశదంగా తెలుసుకోవాలనే ప్రజలకుతూహలం, వారి దృష్టిని సాహిత్యభాగాల మీదినుంచి మళ్ళిస్తూన్నది. అమెరికన్ జాతి పునరుద్ధరణకు సహాయపడిన అంతర్యుద్ధాన్ని గూర్చిన పుస్తకాలను ప్రజలు అత్యధికంగా పఠిస్తున్నారు. జీవితచరిత్రలు కూడా ప్రజారంజకాలుగా ఉన్నవి. ఐతే డెడ్‌సీ దగ్గిర దొరికిన శిధిలాలూ, అంతరిక్షయానం, రోదసీయాత్రలూ వివరించే వివిధ గ్రంథాలను కూడా ప్రజలు పఠిస్తూనేఉన్నారు. రాజకీయనాయకుల జ్ఞాపకాలూ, ప్రజాస్వామ్య రక్షణసిద్ధాంతాలూ, ఆధ్యాత్మిక జీవనవిధానం మొదలైన విషయాల మీద పుస్తకాలుకూడా విరివిగా చెల్లుబడి అవుతూనే ఉన్నవి.

పావుడాలర్ దగ్గర్నుంచీ ఒక డాలర్‌కు కొస్త పైదాకా ఉండేవెలలకు లభ్యమయే కాగితపు అట్టలున్న పుస్తకాలు హఠాత్తుగా ప్రచురించబడవుగాన, పుస్తకపఠనం పెద్దఎత్తున సాగింది. పుస్తకాలు అధికవెలలలో అమ్మబడుటమనే సమస్యను చివరకు సాంకేతికనైపుణ్యం పరిష్కరించగలిగింది. ఒకప్రక్క క్రొత్తపుస్తకాల ధరలు ఇతరవస్తువుల ధరలవలెనే, పెరిగిపోతూంటే, పునర్ముద్రణలు (ఒకోక్కసారి ప్రథమ ముద్రణలు లేదా మూలగ్రంథాలు - ముఖ్యంగా సాహిత్యరంగంలో), మేగజైన్‌ల ధరలకు లభ్యమౌతూ వరదవలె దేశమంతటా పుస్తకాలు విరజిమ్మబడినవి. పూర్వం దేశంలో 500 పుస్తకవిక్రేతలుంటే, ఇప్పుడు వీరిసంఖ్య 50,000 కు పెరిగింది; ప్రతి స్టేషనరీషాపూ, చివరకు మందులషాపు కూడా పుస్తకాలతో నిండిన బీరువాలతో అలంకరించబడుతూన్నది. ఇల్లాలు కూరలూ నారలూ కొనుక్కునేందుకు వెళ్ళినప్పుడుకూడా కొన్ని పుస్తకాలను ఆమె ఎన్నుకొనే అవకాశమున్నది. 1956 లో యీ కాగితపు అట్టలున్న పుస్తకాలు 300,000,000 ప్రతులు అమ్ముడైనవి. ఈ పుస్తకాన్ని చదివాక మేగ్‌జైన్ వలెనే విసిరిపారేయవొచ్చు కనుక, అతిస్వల్ప వెలకు లభ్య

మౌతూండటంవల్ల ఆర్థికవిధానాన్ని మార్చలేదు కనుకనే కొన్ని కోట్ల మంచి దృష్టిని యీ పుస్తకాలు ఆకర్షించగలిగినవి.

పై అట్టమీది బొమ్మచూస్తేనే అర్థమౌతుంది - కొన్ని పుస్తకాలు వొట్టి చెత్త అని. ఐతే ఆశ్చర్యపడేటంత ఎక్కువగా చాలా పుస్తకాలు మహా కావ్యాలూ, ఉద్గ్రంథాలూను - పురాతన ఆధునిక సాహిత్యాలన్నీ ఏర్చి కూర్చిన రత్నాలు. ఇంతకుముందెప్పుడూ మహామేధావులైన రచయితలు ఇంతఅందుబాటులోకి రాలేదు.

ఈ కాగితపు అట్టలతో ఉండే పుస్తకాలేగాక, 115,000,000 ప్రతులు గట్టి అట్టలున్న పుస్తకాలు, 95,000,000 బాలసాహిత్యానికి సంబంధించిన ప్రతులు అమ్ముడైనవి; వీటన్నిటినీ మించి బైబిల్, ఎన్‌సైక్లోపిడియాలూ, పాఠ్యగ్రంథాలూ, సాంకేతికసంబంధమైన పుస్తకాలూ మొదలైనవి ఏటా 800,000,000 ప్రతులు అమ్ముడవుతున్నవి.

కొన్ని కోట్లమంది సభ్యులున్న బుక్‌క్లబ్‌లు యీ అమ్మకాలను మరింతగా ప్రోత్సాహపరిచినవి.

బ్రాడ్వే ప్రొడక్షన్ ఆర్థికవిధానాన్ని గూర్చి పరిశీలించినవారు, ప్రదర్శనకు యోగ్యంగా ఉండే నాటకాలను రచించబోవటం జూదమాడటం లాటిదనే అభిప్రాయాలను వెలిబుచ్చినప్పటికీ - టెన్నెసీ విలియమ్స్, ఆర్థర్‌మిల్లర్ మొదలైనవారు ప్రజానీకానికి వినోదకరంగాఉండే అత్యుత్తమరచనల్ని చేయగలిగారు. ఇక దేశంలోని చిన్న చిన్న థియేటర్లూ, యూనివర్శిటీ థియేటర్లూ, పురాతన ఆధునిక నాటకాల నెన్నిటినో ప్రదర్శిస్తూనే ఉన్నవి. నటించే పద్ధతీ, నాటకరంగాలంకరణ, రచనావిధానం మొదలైనవాటిమీద వీరుచేసే ప్రయోగాలు అనేకసందర్భాలలో మెచ్చుకోదగినవిగా ఉంటూ న్నవి. సమ్మర్‌థియేటర్ ఒక ప్రత్యేకమైన సంస్థగా రూపొందింది. సెలవు రోజుల్లో నలుగురూ గుమిగూడితే ఏ గొడ్లసావిట్లోనో, లేదా టౌన్‌హాలు లోనో, లేదా ప్రత్యేకంగా నిర్మించబడిన రంగస్థలంమీదనో - బ్రాడ్వేలోను

రంగస్థలాలమీద చూపబడే ప్రతిభను యువతీ యువకులు చూపేందుకు ప్రయత్నిస్తూ - అటు షేక్స్పియర్ నాటకాల దగ్గర్నుంచీ, అధునాతనమైన హాస్యనాటికల వరకూ ప్రదర్శనలు ఇస్తూనే ఉంటారు.

## జాజ్

థాయ్‌లాండ్ ప్రభువు బెన్నీగుడమన్‌ను కలుసుకొని రాజోచితమైన బహుమతిని ఇచ్చినప్పుడూ, లండన్‌లోని రాయల్ ఫెస్టివల్‌హాల్‌లో లూయీ ఆరమ్‌స్ట్రాంగ్ తన త్వెట్టను మోగించినప్పుడు, అంతకు పూర్వ మెప్పుడూ జాజ్ సంగీతాన్ని విని ఎరుగని మధ్యప్రాచ్యదేశంలోని ప్రేక్షకులు వెర్రెత్తిపోయినప్పుడూ - జాజ్ ఆధునిక సంస్కృతిలో ఒక క్రొత్త విభాగమనేది సుస్పష్టమౌతున్నది. జర్మనీలోని ప్రేక్షకులకు జాజ్ వినిపించి నప్పుడు వారి భావాలను లూయీ ఆరమ్ స్ట్రాంగ్ ఇలా విశదీకరించారు. "చప్పట్లు కొట్టలేక ప్రేక్షకులు అలసిపోయి, కుర్చీలతో మెప్పుకోర్లను సూచించే శబ్దాలు చేశారు ...ఇక పోలీసులు అగ్నిప్రమాదం సంభవించి నప్పుడు చిమ్మే నీటిని చిమ్మితేనేకాని ఆ సద్దు అణగలేదు."

అమెరికన్‌లమీద వ్యతిరేకభావం ఉంటున్నసమయమున గిల్లెస్పీ తన బాండ్‌తో ఏథెన్స్ జేరాడు. ఐతే ఏ విద్యార్థులైతే అమెరికా రాయబార కార్యాలయంమీద రాళ్ళురువ్వారో వారే - ఆ బాండు వినేందుకువొచ్చి, అక్కడి శాంతి భద్రతలు కాపాడేందుకు నియమించబడిన పోలీసులతో కలిసి నాట్యమాడసాగారు. చివరకు వీరు గిల్లెస్పీకి బ్రహ్మరథం పట్టారు.

జాజ్ యునైటెడ్‌స్టేట్స్‌లోనే జన్మించి, ఉన్నత స్థానానికి తీసుకొని పోబడింది. దాని జానపద పునాదులు సాంకేతిక నైపుణ్యంతో వైవిధ్యాన్ని పొంది, కళతాలూకు అన్నివిభాగాలనూ ఆక్రమించగలిగింది, ముఖ్యంగా ఇందులో రెండురకాల సంగీతపుకట్లు ఉన్నవి; కలిసికట్టుగా ఉండే యూర పియన్‌బాణీ, తాళయుక్తంగా కలపటంలో అద్భుతపరిషితిలో ఉన్న

పశ్చిమ ఆఫ్రికన్ బాణీ. నిజానికిది నీగ్రోలు కనుగొన్నదే - పొలాల్లో పనిచేసేటప్పుడు పని తేలిగ్గానూ, హాయిగానూ సాగిపొయ్యేందుకు పాడుకొనే పాటలు, ఆధ్యాత్మిక సంబంధమైన వాటిని నీగ్రోలనుంచి తీసుకొని. వాటికి శ్వేతజాతీయులు మెరుగులుదిద్దారు. అంతకన్న సరిగ్గా చెప్పాలంటే రెండురకాల సంస్కృతుల మేళవింపిది. ఇది న్యూఆర్లియన్స్‌లో ప్రాముఖ్యతను వహించింది; ఇక్కడ ఫ్రెంచ్, స్పానిష్ రక్తాల కలయిక ఉండటంతో, యీ రెండు ప్రవాహాలూ ఏకమైనవి.

మొదటినుంచీ నీగ్రోను జాతిలో పూర్తిగా కలిపివేసినా, లేదా విభేదమనేదే లేకుండా చేసినా జాజ్ ఎన్నటికీ అభివృద్ధి అయేదికాదు. సమాజంలో నీగ్రో అవసరాన్ని గుర్తించక అవసర పరిణామమది; అతని సద్గుణాలను సమాజం మెచ్చుకొన్నందు కొకతార్కాణం; ఐతే క్రైస్తవమత సాంప్రదాయాన్ననుసరించీ, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు అనుగుణంగానూ నీగ్రోకు పరిపూర్ణమైన స్థానాన్ని సమాజమింకా కలిగించలేదు. ఐనప్పటికీ జానపద కథల్లోని సిగ్గుపడే కుందేలువలెనే నీగ్రో కూడా తనకన్నబలశాలురైన శ్వేతజాతీయుల మీద విజయాన్ని సాధించటం జరిగింది; ఎందుకంటే అతని సంగీతం ప్రపంచమందంతటా గుర్తించబడి ప్రాముఖ్యతను వహించింది: యునైటెడ్ స్టేట్స్‌లో అదొక ప్రాముఖ్యత ఉన్నకళగా ఉద్భవించింది.

జాజ్‌ను ఆరాధించే సమాజంలోవలెనే, జాజ్‌లోకూడా అనేక మార్పులు జరుగుతూనే ఉన్నవి; ఈ మార్పులూ, కూర్పులూ, చేర్పులకారణంగా అనేక కొత్తబాణీలు ఏర్పడటం, కొత్తవాయిద్యాలు కలవటం, కొత్త స్వరాలూ, బాణీలూ ఉద్భవించటం మొదలైనవి జరుగుతున్నవి. కొత్త దృక్పథాల నెన్నిటినో జాజ్ అంగీకరించింది.

అంతకుపూర్వం జాజ్ వినని శ్రోతలమీద కూడా దాని ప్రభావం అంత తీవ్రంగా ఉండే కారణాలేమిటి? హేంబర్గ్ హాట్‌క్లబ్ ప్రెసిడెంట్ దీనికి

ఇలా జవాబు చెపుతున్నారు: "ఎందుకంటే జాజ్ ప్రజాస్వామ్యానికి ఒక చిన్న నమూనా. ప్రతివాయిద్యమూ తన వ్యక్తిత్వాన్ని చూపుతూ సరిసమానంగా వాడబడుతుంది. ఇతర వాయిద్యాల విషయంలో చూపే ఓర్పూ, ఆ వాయిద్యగాళ్ళను కూడా దృష్టిలోపెట్టుకోవటమే అందర్నీ కలిసికట్టుగా పనిచేయించే ముఖ్యసూత్రం."

శాస్త్రకారుడూ, మనస్తత్వ వేత్తా మరొక కారణాన్ని చూపుతున్నారు: జాజ్ నిరంకుశత్వాన్నీ, అధికారాన్నీ ప్రతిఘటించేదిగా ఉండటంవల్లనే- మేధావులూ, వయోజనులూ, నీగ్రోలూ - తాము సమాజంలో సమాన స్థాయిలో లేమనుకొని బాధపడేవర్గాలవా రందరికీ జాజ్ ఆ లోటును తీర్చేదిగా ఉంటూన్నది.

ఒక కళను గూర్చిన గ్రహణశక్తి, ఇతర కళారంగుల వైపుకూడా మళ్లుతుంది. ఒకప్పుడు వ్యభిచార గృహాలలో మాత్రమే జాజ్ వినవొతుందనే అభిప్రాయ ముండటంవల్ల దానిమీద ఏవగింపు వుండేది: ఐతే ఇప్పుడు ప్రజానీకం కళల పట్లచూపే ఆ పేక్షకులతో అది నాగరీక మౌతున్నది.

## నాట్యకళ

కళలనుగూర్చి పరిశోధించటంలో అమెరికన్‌లు హఠాత్తుగా నాట్యకళన గూర్చి తిరిగి తెలుసుకోవటం జరిగింది; ఎందుకంటే ఆ పాతకాలంల్ కూడా నాట్యకళ వారి జీవితంలో ఒక భాగంగానే ఉంటూ, చుట్టూ తిర గుతూ నాట్యం చేయటం లేదా సమానాంతర చతుర్భుజంలో ఉం నాట్యంచేయటం మొదలైనవి దేశీయజీవనానికీ, జీవితసౌఖ్యానికీ, ఆనంద నికీ అవసరమై, వీనిద్వారా తమ తమ ఉత్తరాలను వెలిబుచ్చే సాధకాలు ఉండేవి. కొంతమంది నాట్యకారులు వీటికి ఆధ్యాత్మిక ప్రాముఖ్య కూడా కల్పించగలిగినందువల్ల, నాట్యాలు చర్చిలలోకూడా చేయబడేవి ఇవన్నీకూడా అమెరికన్ సాంప్రదాయాలనుంచి ఉద్భవించినవే.

మరికొందరు నాట్యకారులు - మార్తాగ్రహమ్, డోరిస్‌హింపెరీ, ఛార్లెస్ వెయిడ్‌మన్, జోస్‌లైమన్ మొదలైన హేమాహేమీలు - శరీరాంగాల కదలికలోనూ, ముఖభంగిమల మార్పుల్లోనూ, సంగీతసహాయంతో మానవుని భావాలకేగాక, సామాజికమైన అక్రమాలనూ, వ్యక్తిగతమైన విజయాలనూ, విషాదాలనూ, ప్రకృతి సిద్ధాంతాలను కూడా ప్రదర్శించ గలిగే పద్ధతిలో నాట్యాన్ని రూపొందించారు.

ఈలోగా ఒకప్పుడు యూరప్‌కే ప్రత్యేకత ఉన్న బాలెట్ కూడా అనేక సుప్రసిద్ధమైన అమెరికన్ కంపెనీల కలయికతో స్థాపించబడింది. ఎగ్నిస్‌డీ మిల్ల దారితీస్తూ, ప్రత్యేకతఉన్న నాట్యాన్ని, సంగీతసభాంతానికి మేళవింపచేసి-బాలెట్‌నూ, ఆధునికమైన నాట్యాన్ని, జానపదనాట్యాన్ని మిశితంచేసి జకహోములో ప్రదర్శనల నిచ్చింది. చివరకు యీ కళకూడా యునైటెడ్ స్టేట్సుకు సంక్రమించింది. ఈనాడు నాట్యం కేవలం అలంకరణార్థంగా లేకుండా, నాటకరంగంమీద విడువలేని విభాగంగా ఉన్నది. చివరకు సినిమాల్లోకూడా నైపుణ్యమున్న ఫ్రెడ్‌ఎస్టరీ, గానీ నెర్లి మొదలైనవారి నాట్యాలు ఒక ముఖ్యవిభాగంగా రూపొందినవి. 'సెవెన్ బ్రైడ్స్ ఫర్ సెవెన్ బ్రదర్స్' అనే చిత్రంలో - ఆ కథాసంవిధానానికి అనుగుణంగా నాట్యాలు అమర్చబడి, ప్రేక్షకులకు నాట్యంవల్లనే కథ ముందుకుసాగుతూన్నదనే అభిప్రాయం కలగకుండాచేయటం జరిగింది : ఇది నాట్యాన్ని గూర్చిన మెప్పుకోలుగానే భావించవలసి ఉంటుంది.

టెలివిషన్‌లో యీనాడు ఎంతోమంది అత్యుత్తమ నాట్యకత్తెలు పాల్గొంటూ, సినిమాటోగ్రాఫీకి ఎంతో ప్రాముఖ్యతను ఆపాదింపచేశారు.

## చిత్రలేఖనం : శిల్పం

అమెరికన్ చిత్రలేఖన కళనుగూర్చిన ఏ నిష్పాక్షిక అభిప్రాయమైనా సరే - ఒక్క ఫ్రాన్స్‌మినహా ఏ ఇతరదేశంలోని చిత్రకళతో పోల్చినా,

అమెరికన్ చిత్రకళ వెనుకబడి ఉండలేదనేతోస్తుంది; చిత్రకళలో ఫ్రాన్స్ మిగతా ప్రపంచానికంతకూ పురోగామిగా ఉన్నది.

వాస్తవికత ప్రాముఖ్యత వహించి, చిత్రకళలో ప్రస్ఫుటమైంది: ఈవాస్తవికతకు కొంతవరకూ ప్రణయంకూడా కలసి దాన్ని వెలుగుతో నింపింది.

రాబర్ట్ హెన్రీ, జాన్‌స్లోయన్, జార్జ్‌బెల్లోస్ ఇంకా మరి కొందరూ కలిసి సుప్రసిద్ధులైన 'ఎనమిందుగురు' గా ఉండే ముఠాగా కూడారు. దాంతో అంతకు క్రితం చిత్రకళమీద ప్రసరించిన యూరపియన్ పలుకుబడులుతగ్గి, ప్రధానాంశాన్ని ఎన్నుకోవటంలోనూ, చిత్రరచనాపద్ధతిలోనూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలువొచ్చి, అమెరికన్ ఘట్టాన్ని వాస్తవికతతో మేళవింపజేయటం జరిగింది. 'ఏష్‌కాన్‌స్కూల్'లోని సభ్యులు తాము చూచినదాన్ని చిత్రంగా లిఖించేందుకు భయపడక పొయ్యేందుకు కారణమిదే।

ఆధునిక చిత్రలేఖనంలో గడ్డురోజులు 1913 వ సంవత్సరం; ఫ్రాన్స్ లోని చిత్రలేఖనంలో కొమ్ములు తిరిగినవారు ఎలాటి చిత్రాలను రచిస్తున్నారో, ఆ సంవత్సరంలో న్యూయార్క్‌లో జరిగిన ఆర్మోరీ షోలో చూడటం తటస్థించింది. ఆ నాడు మొదలు అధునాతన పద్ధతుల ఆరాధన అమెరికాలో ఆరంభమైంది. ఈ ఆధునాతన దృక్పథమనేది నిజానికి పురాతనమైనదేకాని, ప్రపంచాన్ని ఇదేదో వింతవస్తువుగా సరిక్రొత్త దృక్పథంతో చూడటం, చిత్రలేఖనం హృదయాంతరాళంలోని ఒకానొక కుతూహలమై పురాతన బంధాలనన్నిటినీ తెంచుకొని స్వేచ్ఛావాయువులను పీల్చేదిగా ఉండటమే యీ నూతనత్వం. ఆర్మోరీ షోకారణంగా - పరిశ్రమల్లోని రూపురేఖలూ, వస్త్రధారణపద్ధతులూ, గృహాలంకరణలూ, చివరకు వంటసామాగ్రుల ఆకారాల్లోకూడా ఒక విప్లవం సంభవించింది. వ్యక్తిగతంగా కళారాధన చేసేవారు యీ ఆధునిక చిత్రకళనుంచి వెలువడిన పత్రాలనెన్నిటినో కొనుక్కోసాగారు: ఆ రోజుల్లో లేని, పురాతన వస్తుప్రదర్శనశాలల్లో యీనాడు ఆ చిత్రాలు భద్రపరుచబడినవి.

కళలన్నిటిపట్లా అభిరుచులు పెరగటమనేది గత 20 సంవత్సరాలుగా తీవ్రరూపం దాల్చింది. ముఖ్యంగా లోటుఏర్పడినకాలం కళలకు గొప్ప గౌరవాన్ని చేకూర్చింది; ఆ రోజుల్లో నిరుద్యోగులుగాఉన్న ట్రక్‌డ్రైవర్ల విషయంలో ప్రభుత్వంవహించే బాధ్యతలాటిదే, నిరుద్యోగులుగాఉన్న కళాకారుల విషయంలో కూడా వహించవలసి ఉంటుందనేది గుర్తించబడింది. ఆ నాడు రచించబడిన చిత్రాలు ప్రజల కుతూహలాన్ని ఎంతగానో పెంచినవి. జానపదచిత్రాలు - వలసదారులు ఏర్పరచిన వర్జీనియాలోని విలియమ్స్‌బర్గ్ పునర్నిర్మించబడి, తరతరాలుగా వొస్తున్న సంస్కృతిని నిలిపింది. W. P. A ద్వారా ప్రభుత్వంలో 'చిత్రలేఖన, శిల్పశాఖ' ఒకటి ఏర్పడింది. ఈ శాఖ ద్వారా కళోద్ధారణతోపాటు, ప్రభుత్వానికి అవసరమైన కట్టడాల తాలూకు ప్లానులూ, నమూనాలు తయారుకావటం జరిగింది. ఈ విధంగా కళలను పోషించేందుకు పూనుకున్న ప్రభుత్వాలలో యునైటెడ్‌స్టేట్స్ పురోగామి ఐంది.

సమకాలీన చిత్రలేఖనాన్ని ముందుతరాలవారికొరకై భద్రపరచిఉంచే నిమిత్తం కళకు ప్రోత్సాహమిచ్చే నిమిత్తం పురాతనవస్తు ప్రదర్శనశాలలు (మ్యూజియమ్‌లు) ఏర్పడినవి; వీటిల్లో న్యూయార్క్‌లోని 'మ్యూజియమ్ అఫ్ మోడరన్ ఆర్ట్' సుప్రసిద్ధమైనది. చిన్నచిన్న సమాజాలు, బీదవి కూడా ఎగ్జిబిషన్‌లను అమర్చి వివాదగ్రస్థంగాఉండే కళ తాలూకు చిత్రాలను ప్రజలకు ప్రదర్శించసాగింది. వర్జీనియాలోని లలితకళాప్రదర్శనశాల రాష్ట్ర ప్రభుత్వ సహాయంతో కళలను చూసి గ్రహించటమనే దానికి ప్రాధాన్యత నిస్తూ, మొట్టమొదటి మొబైల్ యూనిట్‌ను ఏర్పరచి, చిత్రకళను దేశంలోని మూలమూలల్లోనూఉన్న ప్రజలు దర్శించే అవకాశాలను కలిగించింది. ఇక మ్యూజియమ్‌లు - చిన్నవికానీ, పెద్దవికానీ దేశమందంతటా విస్తరించి, పిల్లలు చిత్రాలు వేయటాన్నీ, లేదా నాటకాలను ప్రదర్శించటాన్నీ పోత్సాహపరుస్తూ, పెద్దలు కుండలు చేయటం, లేదా బట్టలు నేయటం లేదా

కళనుగూర్చిన ఉపన్యాసాలను వినటం మొదలైనవాటిని ఉత్సాహపరచినవి. ప్రస్తుతం 5 లక్షలమంది అమెరికన్‌లు తైలవర్ణ చిత్రాలను రచించగలిగి ఉన్నారు.

శిల్పశాస్త్రం కూడా అంతకు పూర్వం అమలులోఉన్న పరిణామాలలో ఎన్నో మార్పుల్ని పొందింది. జాకోబ్‌ఎబెస్టెయిన్ అమెరికాలో పుట్టి నప్పటికీ, ఇంగ్లండ్‌వెళ్ళి శిల్పశాస్త్రంలో తన ప్రావీణ్యతను ప్రదర్శిస్తూ ఆంగ్లేయుల్ని భయభ్రాంతుల్నిచేసి, చివరకు 'నైట్' గా గౌరవించబడి నాడు. పార్‌మాన్‌షిప్ అందాలు చిందించటంలో బహుజనరంజకుడై ఎన్నో జ్ఞాపకార్థంగాఉండే కట్టడాలను నిర్మించినాడు. వాస్తుశాస్త్రవిధులను అతిక్ర మించి, స్వేచ్ఛగా స్వతహాగా తీవ్రంగా ఆలోచించి, రాతితోను, కొయ్య తోనూ మలచిన అనేక చిత్రాలనూ, కట్టడాలనూ శిల్పులు నిర్మించారు. గత రెండు దశాబ్దాలలోనూ యీ శిల్పుల, చిత్రకారులసంఖ్య లెక్కకు మిక్కుటమైంది; వీరి పేర్లన్నీ ఉదహరించకుండటం అన్యాయమౌతుంది; కొద్దిమంది పేర్లు చెప్పటం భావ్యమూ కాదు.

అలెగ్జాండర్ కాల్డెర్ తన కదిలిపొయ్యే సరంజామాతోనూ, తోటిపని వారితోనూ, అనేక వస్తుసముదాయాలతో పనిచేస్తూ, మధ్యమధ్యలో ఖాళీ ప్రదేశాలుంచటం పనితనంలో ఒక భాగంగా ఉంచుతూ - అధునాతన పని తనానికి ప్రాతినిధ్యం వహించిన విధంగా నిరూపించాడు. 'ప్రొడ్యూసర్స్ షోకేస్' అనే టెలివిషన్ ప్రదర్శనలోని కళానైపుణ్యంతో అనేక కోట్ల మంది అమెరికన్‌లు పరిచితులయ్యారు.

## కట్టడపు కళ

చేసి చూపటమనేదానికి యునైటెడ్‌స్టేట్స్ ప్రాముఖ్యతను ఇచ్చింది. మొదట్లో అమెరికాకు వలసవొచ్చినవారు గృహోపకరణాలుగా ఉండే అనేక పనిముట్లను తమకు తాముగా తయారుచేసుకున్నారు; అవి ఎంతో

అందమైనరూపాలలో రూపొందించబడటంవల్ల ఉత్తరోత్రా .వాటిని పురాతనవస్తుప్రదర్శనశాలల్లో భద్రపరిచారు. కోసినగడ్డిని గుట్టగావేసే పనిముట్లూ పిండిపదార్థాలను కలిపేందుకు ఉపయోగించిన కొయ్యతొట్లూ. మొదలైనవెన్నో యీ నాటికీ ఉన్నవి. న్యూ ఇంగ్లండ్‌లోని సాల్ట్‌బాక్స్ గృహం. స్వీడనీయులు, డెలెవెరే రాష్ట్రంలో ప్రవేశపెట్టిన కొయ్య కాబిన్‌లూ మొదలైనవి నిరాడంబరతకు సూచనలైనా. ఆ నాడు లభ్యమయ్యే వస్తువుల్లో అత్యుత్తమమైనవాటిని ఎన్నుకోవటం. పదికాలాలపాటు మన్నికను కలిగి ఉండి. ఉపయోగపడటం మొదలైనవి వీటిల్లో స్పష్టంగా కనిపిస్తవి.

1840 లో హొరేషియోగ్రీన్ పారిశ్రామిక యుగప్రాంగణంలో నిలబడి పనిచేసే విధానాన్ని యీ విధంగా వివరించారు; "అందంగాఉండటమనేది అంటే - బాగా పనిచేస్తుందని నమ్మదగింది - అని నా ఉద్దేశ్యం." క్లిప్పర్ నావల్లోనూ, వంతెనలూ, యంత్రాలలో - కళలోకన్నా అధికంగా ఆయిన సిద్ధాంతం గుర్తించబడింది. కట్టడపు పనిలోని విధానం ఆయామాలాలను జాగ్రతగా, లెక్కప్రకారం ఎన్నుకొని అమర్చటంలో శాస్త్రీయపద్ధతిమీద ఆధారపడాలనీ, అమరిన ఆ ప్రదేశంలో అవిచేయవలసిన పనికి అనుగుణంగా ఉండాలనీ ఆయన సూచించారు.

ఐతే పనిచేసే సిద్ధాంతంమీదనే పని ఆరంభమైనప్పటికీ. యూరప్‌వలెనే యునైటెడ్ స్టేట్స్ కూడా పై మెరుగులకూ. షోకులకూ ప్రాధాన్యతనిచ్చే పొరపాటుకు ఎరయింది. దురదృష్టవశాత్తు యీ కాలం - దేశంలోని అధికభాగం నిర్మించబడే సమయంలోనే ఉండటంవల్ల. ఫలితంగా అమెరికాలో వికారంగా కనిపించే కట్టడాలు యీ నాటికీ ఎన్నో కనిపిస్తవి.

కాని "షికాగోస్కూల్"లోని కట్టడపు పనితనశాఖ హెన్రీ హాబ్‌సన్ రిచర్డ్సన్(1838-1886).లూయీ సుల్లివాన్ (1856-1924) నాయకత్వాలలో పనిచేసే సిద్ధాంతాలమీద కట్టడనిర్మాణాలకు తిరిగివొచ్చింది. కేవలం ధనాన్ని కూడబెట్టే మనస్తత్వమున్న న్యూయార్కు రాష్ట్రంకన్నా.

షికాగో ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రకారం అవసరాలను తీర్చటమే ఆదర్శంగా ఉంచుకోవటం కేవలం యాదృచ్ఛికం మాత్రం కాదు. రిచ్చర్డ్‌సన్ కట్టడపు ముందుభాగాన్ని నిర్ణయించటంలో, అర్థంలేని అందచందాలను గాక, కట్టడంలోని వివిధ భాగాల ఉపయోగాన్ని సూచించేందుకు వీలుగా ఉండేటట్లుగా చేశాడు. సుల్లివాన్ - ఉక్కు-ఫ్రేమ్‌నుకానీ, ఎత్తుగా పొడుగ్గా ఉండే కట్టడాన్నికానీ స్వతహాగా కనిపెట్టకపోయినా, సెయింట్ లూయీలోని వెయిన్‌రైట్ కట్టడం, షెల్‌సింగర్ డిపార్ట్‌మెంట్‌స్టోర్ లాటి కట్టడాలను నిర్మించి, అర్ధశతాబ్దంవరకూ వాటినే నమూనాలుగా చలామణిచేయగలిగాడు. సుల్లివాన్ సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని, సామాజిక అవసరాలను తీర్చటమే పురోగమించటంగా భావించాడు.

సుల్లివాన్ శిష్యుడైన ఫ్రాంక్ లాయిడ్‌రైట్ (1869 – ) తన గురువుగారి ఆదర్శాలను జీవితంలో ప్రవేశపెట్టి, తాను నిర్మించిన గృహాల్లో సమానాంతరంగా ఉండే సమతలాలను ఏర్పరచటం ద్వారా, కట్టడం భూమిని కరుచుకొని ఉండటం, లోపలిప్రదేశం నాలుగుగోడలమధ్యా ఉండే ఉపయుక్తమైన ప్రదేశమేకాని, పెట్టెలమాదిరి అమరికలేదనే ధోరణి ప్రవేశపెట్టాడు. బైటవారికి ఇల్లు ఎంత అందంగా కనిపిస్తోందనే విషయానికి గాక, లోననివసించేవారి అవసరాలకు అనుగుణంగా నిర్మాణం జరిపించాడు. నిరాడంబరతకూ, మన్నికకూ, అవసరానికీ ప్రాధాన్యతలు ఇవ్వబడినవి.

తొలిదినాల్లోని నిరాడంబరత, సామర్ధ్యత మొదలైనవి చేతిపనుల్లో ప్రస్ఫుటించేవిగా ఉంటూ, పారిశ్రామికయుగంలో చివరకు సుస్థాపించబడినవి. జాన్‌వాక్స్ కంపెనీ, జనరల్ మోటార్స్‌వారి పరిశోధనా కేంద్రం, ఆల్‌బర్ట్ జాన్ తాలూకు ఫాక్టరీల తాలూకు కట్టడ నిర్మాణంలో రైట్ ప్రవేశపెట్టిన విధానాలు ఎంతో నిరాడంబరమైనవిగానూ, అందచందాలతో విలసిల్లుతూ పనిచేయటం, మన్నికల విషయంలో అత్యద్భుతాలుగా ఉండి విజయసూచకాలైనవి.

'పనిచేయటం' అనే సిద్ధాంతం మొదట్లో పారిశ్రామిక కట్టడాల్లోనూ, అంబరచుంబితభవనాల్లోనూ, ఫ్యాక్టరీల నిర్మాణంలోనూ ప్రవేశపెట్టబడి, అధికోత్పత్తికి దారితీయటం జరిగింది. ఆ తరువాత యీ సిద్ధాంతం గృహ నిర్మాణంలోనూ విద్యాలయ నిర్మాణంలోనూ ప్రయోగించబడింది; చివరకు చర్చీలలోనూ, పుస్తకభాండాగారాల్లోనూ - ఎక్కడైతే పురాతన పద్ధతులకు ప్రాధాన్యముంటుందో అక్కడ - కూడా ప్రయోగించబడింది. గృహాలలో అనేక విధాలుగా చోటు ఉపయోగపడటమనే ప్రధాన కర్తవ్యం గుర్తించ బడింది. పెట్టెలవలెఉండే మూడు గదులూ, పార్లర్, లివింగ్‌రూమ్, డైనింగ్‌రూమ్ - ఇవన్నీ కలిసి ఒకే పెద్ద విస్తీర్ణంలోకి ఇముడ్చబడినవి. చివరకు వంటగది - ఇల్లాలు ప్రత్యేకంగా పనిచేసుకొనే స్థలంకూడా ఒక కౌంటర్ లివింగ్‌రూమ్‌ను విడదీసేందుకు ఉపయోగించబడి నిర్మించబడు తూన్నది.

రైట్ పలుకుబడులు యూరప్‌వరకు విస్తరించిన విధంగానే, నిర్మాణ కౌశలమున్న అనేకమంది యూరపియన్‌లు అమెరికన్ నిర్మాణానికి దోహదం చేశారు. రిచ్చర్డ్ కేత్రా, ఏంటోనిన్ రేమాండ్, మార్షల్ బ్రూరర్, వాల్టర్ గ్రోపియస్ మొదలైనవారు అమెరికాకు వొచ్చి అంతర్జాతీయ విద్యాలయాన్ని స్థాపించారు. లీకార్బు సియర్ కొద్దికాలంపాటే యునైటెడ్ స్టేట్స్‌లో ఉన్నప్పటికీ - ప్రపంచంలోని ఇతరతావుల్లోవలెనే, ఇక్కడ కూడా తన పలుకుబడిని విస్తరింపజేశాడు. టోకియోలోని ఇంపీరియల్ హోటల్‌ను నిర్మించిన ఫ్రాంక్ లాయడ్‌రైట్ ద్వారా జపానీయుల నిర్మాణ కౌశలం కూడా అమెరికాను తన పలుకుబడికిందికి లాగింది.

ఇలాటి పలుకుబడులూ, సాంకేతికంగా పొందిన అభివృద్ధి సమకూర్చే కొత్త కొత్త చౌకవస్తువులూ మొదలైనవి భూభాగ రూపాన్నే మార్చినవి. ఇంకా మార్చుతూన్నవి. అంబరచుంబిత భవనాలు 'పనిచేయటం' అనే సిద్ధాంతానికి చిటారుకొమ్మలుగా ఉన్నవి. అనేకమంది నివసించేందుకు

వీలుగా, చౌకగాఉండే గృహాలూ (ఇవి ఇప్పటికీ చౌకబారు అభిరుచుల తోనే ఉంటూన్నవి), వినోద స్థలాలూ, షాపులుండే ప్రదేశాలూ, చుట్టూ కొన్ని ఎకరాలమేర కార్లు పార్క్ చేసేందుకు అనువైన వాతావరణంలో ఉంటూ - కొత్తయుగానికి నాందీ ప్రస్తావనగా ఉంటూన్నవి. హాయిగా, సుఖంగా విశ్రాంతిగా సామాజికులు నివశించేందుకు అనుకూలంగానూ, సంసార జీవితంలో కలసికట్టుగాఉండే విధంగానూ. పెరిగిన విశ్రాంతి సమయాలను సక్రమంగా ఉపయోగించేందుకు వీలుగానూ, లోన ఉన్న స్థలాన్ని బైటిస్థలంతో కలిపి పిల్లలూ పాపలూ హాయిగా ఆడుకునేందుకు వీలుగానూ - ఉండేటట్లుగా నిర్మాణ కార్యక్రమం సాగుతూన్నది.

---

# పన్నెండో అధ్యాయం

## జన సామాన్యం

కళ ద్వారా ప్రజాసామాన్యాన్ని జేరటం నుంచి ప్రజాసామాన్యాన్ని జేరే కళకు వొచ్చినట్లయితే, యీ రెంటి మధ్యా కొంత ఇబ్బందిగా ఉండే సంబంధాలున్నవని తెలిసికోవలసివొస్తుంది. జనసామాన్యాన్ని జేరేందుకు ప్రతి కళలోని కౌశలమూ ఉపయోగించబడుతూ, ఒక్కొసారి అది కళా ఖండమనే సార్థకనామానికూడా యోగ్యతను సంపాయిస్తున్నది. ఐతే జన సామాన్యాన్ని జేరటంలో కళాస్వరూపాలులేని విధానాలు కూడా ఉప యోగించబడుతూ, వాటి ఆశయాలు కొత్తసృష్టికన్న, లాభసాటి బేరంగానే ఉండటం జరుగుతూన్నది.

ప్రకటన కర్తలు 1956 లో 10 బిలియన్ డాలర్లు ఖర్చుపెట్టారు; ఎలా గైనా జనసామాన్యాన్ని జేరుదామని వారు - టెలివిషన్, రేడియో, వార్తా

పత్రికలూ, మాగజైన్‌లను ఉపయోగించారు. వీటిల్లో 626 మేగజైన్‌లకు మామూలు సర్క్యులేషన్. 1,700 దినపత్రికలూ, 9,000 వారపత్రికలూ- 2,947 రేడియో స్టేషన్‌లూ, 465 టెలివిషన్ స్టేషన్‌లూ ఉంది వీటిద్వారా ప్రకటనలు సజీవస్రవంతిగా సాగిపోతూన్నవి. ప్రకటన కర్తలకు వినోదాన్ని చేకూర్చటం ద్వారా కొతాదారుల్ని ఆకర్షించటమే లక్ష్యం కావటం వల్ల - ప్రతి సిగరెన్ ఉత్పత్తిదారుడూ. లేదా సబ్బుల తయారీదారుడూ. జనరంజకమైన రేడియోనాటకాన్ని. లేదా టెలివిషన్ ప్రోగ్రామును తన ఖర్చుమీద నడిపించటం. లేదా విరివిగా సర్క్యులేషన్‌ఉన్న పత్రికల్లో ప్రకటన లివ్వటం లాటివి చేస్తూంటాడు. ప్రకటనలను సక్రమ విధానంలో దేశంలో మూలమూలకూ జేర్చేవిధానాలూ, ఆయా మేగజైన్‌లూ ఒక దానితో మరొకటి పోటీపడుతూన్నవి; ప్రతివారూ ఎక్కువమంది జనాన్ని ఆకర్షించేందుకే ప్రయత్నిస్తున్నారు.

## టెలివిషన్

ఎక్కువ మంది ప్రేక్షకులను ఆకర్షించేదేది ?

ఫ్లీడర్‌మౌస్ టెలివిషన్ ప్రొడక్షన్‌ను 130 లక్షలమంది చూశారు. లాదొహిమీ ప్రొడక్షన్‌ను 150 లక్షల మంది చూశారు. నేషన్‌ల్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీవారు 500.000 డాలర్ల వ్యయంతో లారెన్స్ ఆలివర్ కట్టించిన 'రిచ్చర్డ్ దీ థర్డ్' ను ప్రదర్శించినప్పుడు; పగటిపూట దీన్ని చూసే వారిసంఖ్య అత్యధికంగా-5 కోట్ల మందిని ఆకర్షించింది. 12 సంవత్సరాల వెనుకఉన్న తత్వాలనేభావం ఉంటూన్నప్పటికీ. అవకాశం లభించినప్పుడల్లా ప్రజాసామాన్యం మంచికోసం పరుగులెడుతూనేఉన్నది.

ఐతే ఎప్పుడూ ఫ్లీడర్‌మౌస్‌కానీ. రిచ్చర్డ్‌కానీ ప్రదర్శించబడుతూనే ఉంటుందా అనే విషయాన్ని తెలుసుకునేందుకు ఎవ్వరూ టెలివిషన్‌వైపు చూడనవసరంలేదు. ఐతే అదేమిటి ;

కొద్ది రోజులపాటు టెలివిషన్‌ను సదా తిలకిస్తూ ఉన్నట్లయితే అనేక విషయాలు తేటతెల్లమౌతవి. దానికున్న అత్యద్భుతమైన శక్తి - కేవలం కల్తీలేని వినోదాన్ని అందించటం, ఎంతో సాన్నిహిత్యమున్న ధోరణిలో మానవత్వానికి సూటిగా తగిలేట్లుగా ఉండటం, ప్రజానీకంతాలూకు సంస్కృతిని పెంపొందించటమూను. టెలివిషన్ - న్యూయార్క్‌లోని యునైటెడ్ నేషన్సునుంచి, సూయజ్ కెనాల్‌లోని మునిగిపోతూన్న ఓడల దాకానూ, అక్కణ్ణుంచి కాలిఫోర్నియాలోని అగ్నిప్రమాదంవరకూ గంతులు వేస్తూంటుంది: సహజంగా మనంకూడా దాంతోపాటే కదలిపోతూఉంటాం. అంతకు పూర్వం బేలెట్ అనే పదానికి అర్ధమన్నా తెలియని గృహాల కూ్కడా టెలివిషన్ బాలెట్ ప్రదర్శనను అందిస్తూంటుంది, అది మనను కడుపుబ్బ నవ్విస్తుంది. భయభ్రాంతుల్ని చేస్తుంది, దాని కెమెరాలముందుకు వొచ్చిన వారిలో లీనం చేస్తుంది. యీ క్రొత్త ప్రపంచాన్ని గూర్చిన విజ్ఞానంతో మనము కలిసికట్టుగా ఉండేటట్లు బంధిస్తుంది. ఒక వంద మార్గాలలో - మనందరమూ స్వదేశంలోనూ, విదేశాలలోనూ ఒక ప్రజ అని నిరూపించి, విశదీకరిస్తుంది.

ఉచ్ఛనీచాలను కలిపి ఆ భేదాలు తెలియరాకుండానే టెలివిషన్ ఆ సరళిలో నడచిపోగలదనే విషయం సుస్పష్టం. అనేక స్థానిక స్టేషన్‌లు రోజుకు 18 గంటల చొప్పున ప్రసారాలను నడుపుతూ, నెలలవారిగా పనిచేస్తూండటం వల్ల, దాని ఫలితాలు సామాన్య ప్రజకు అనుగుణంగా ఉండవలసినవిగా పరిణమిస్తూన్నవి, ఐతే అదిచేసే భారీఎత్తు ప్రయత్నాలలో ప్రత్యేకత ఉన్న సంఘటననుంచి, విషాదపూరితమైనదాన్ని విడదీసేందుకు ఏసిద్ధాంతాలనూ అది అమలు జరపలేకపోవటమే టెలివిషన్ విషయంలో వొచ్చిపడిన పెద్ద ఇబ్బంది. ఐతే కొన్నివేల సంవత్సరాలుగా నాటకరంగం తన వినోదాన్ని ప్రేక్షకులమీద ప్రయోగించటంకన్న వేరేమీచేయలేక పోయింది - ఐతే టెలివిషన్ పురోగమనం అమితవేగంతో సాగిపోతూన్నది.

కుటుంబజీవనంలో సదా కౌతూహలాన్ని పెంచేందుకు ప్రయత్నించటం టెలివిషన్ విషయంలో ఆశ్చర్యపడవలసిన మరొక అంశం. కుటుంబజీవనం తాలూకు ప్రాముఖ్యత అంతటా చూపబడుతుంది; పోటీలో పాల్గొనేవారిని, వారివారి సంసార జీవితాన్నిగూర్చి ప్రశ్నలు వేయటం, కెమేరాముందు వారి వారి సంతానాలను ఎన్నిసార్లు తీసికొనివొచ్చేదీ. గృహజీవనాన్ని గూర్చిన సుఖాంత నాటికలూ, నవ్వులతోనిండి ఆ నవ్వులాటలే జీవితాన్ని సాధించి విజయాన్ని పొందేందుకు సాధనాలనే ధోరణిని కనబరుస్తవి. నిష్కల్మష మైన మనస్సులలోనుంచి వెలువడే బాలబాలికల మాటలూ, ఆ మాటల వెనుక దాగిన గాంభీర్యతా, తెలివితేటలూ మొదలైనవి వీరి విభిన్నాములనీ, మన యువతీయువకులకు చిహ్నాలనీ - దినదిన ప్రవర్ధమానమౌతూ, చిరాకు పడుతూ, అంటిపెట్టుకొనిఉంటూ, భయపడుతూ, గొప్పలుచెప్పుకుంటూన్న సంస్కృతిలో పెరుగుతూన్నవనీ మనం అర్థం చేసుకోవలసి ఉంటుంది. అమెరికనులు తమ సంతానాన్ని ప్రేమించటం, తమకు తామే ప్రేమించ టమే కావొచ్చు - కాని అందువల్ల వారి మనసులు పరిశుద్ధంగా ఉంటూ న్నవి. టెలివిషన్ అమెరికన్ల బలహీనతలను కనుగొని, వాటినే పెట్టు బడిగా ఉంచి ఆకర్షిస్తూన్నది.

ఒకప్పుడు అమెరికన్లు 'కూచ్ డిసెండింగ్ ఎస్టెయిర్‌వేస్'ను హేళన చేసినా, ప్రపంచంలోని అధునిక కళాఖండాలను కూర్చుకొనివొస్తున్న విధంగానే - వారు ఒకప్పుడు నవ్వినదాన్నే త్వరగానో, ఆలస్యంగానో అంగీకరించటం జరుగుతోంది. అదృష్టదేవత కరుణించిన యీ దేశంలోని నవ్వులు - కేవలం శిశువుల నవ్వే నవ్వులు కావు. ఎక్స్‌ప్రెస్ రైళ్లు పక్కనే ఉన్న పట్టాలమీద పరుగెత్తిపోతూన్న విధంగా ఇవి విషాదానికి పక్కనే త్వరితగతిని పయనిస్తూంటవి. ఈ నవ్వులు అభిప్రాయ భేదాలను మంచి తనం మీదనే పరిష్కరించుకోదగుననీ, ఒక విషయంలోని సారాంశం హాస్యాస్పదమైన దానిలోని భాగమేననీ, నవ్వగలగటమంటే జయించటమే ననే - గాఢమైన భావాన్ని ఇవి విశదీకరిస్తవి.

యాత్రీకులు అమెరికన్‌లు జీవితపు చీకటి కోణాలను, విషాదాలను చూసే సామర్థ్యంలేనివారని అంటారు - ఇది నిజమే మరి! ఐతే హాస్యాస్పదమైన దానికన్నా విషాదమైన దానిలో ఉన్నతస్థాయిలో సద్గుణముండక పోలేదు. బానిసత్వంమీదా, ప్రత్యేకసౌకర్యాలమీదా, అమానుషత్వంమీదా, కొల్లగొట్టడంమీదా, బహుజనులు తిండీతిప్పలూలేని అనేక సంఘటలమీద నిర్మించబడిన సంస్కృతులకు విషాదధోరణి తగిఉంటుంది. ఐతే అమెరికా - తన లోపాలన్నిటిలోనూ అలాటి సంస్కృతిని సాధించలేదు. అందరికీ అందుబాటులో ఉండే విద్యావిధానం, నలుగురుకీ ఉపయోగపడుతూ అందరిక్షేమాన్నీకోరే సంస్కృతి అందరికీ అందుబాటులో ఉండటమే దాని లక్ష్యం - కనుకనే స్వభావసిద్ధంగా దాని తత్వం హాస్యప్రధానంగా ఉంటూ హాస్యధోరణిలోనే జీవితాన్ని పరిశీలించి చూడగలుగుతోంది.

నాటకాన్ని డాక్యుమెంటరీతో కలిపిచూపటం టెలివిషన్ ప్రవేశపెట్టిన మరొక విశేషం. ఏండ్రియా డోరియా అనే నౌక మునిగిపోవటం నిజంగా తీయబడిన ఫిలిమ్‌నుంచి పునర్నిర్మించబడింది. జైలు జీవితాన్ని అనుభవించే వారిని గౌరవంగాచూస్తూ నడచిన ఒకానొక నాటికకు ప్రత్యేక స్థానమీయబడింది; స్వభావసిద్ధమైన నటనతో నిండిన యీ నాటకం ఇచ్చిన ఆదేశమిది : వేళ్ళలేనివారినినమ్మి వారుస్థిరంగా నిలబడేందుకు అనుకూలంగా ఉండే స్థానాన్ని కల్పించినట్లయితే, యీ నేరాలు రూపుమాసిపోతవి. ఒకానొక డాక్టర్ అమాయకులైన ఒకానొక కర్రెబియన్ సమాజానికి సేవ చేయటంలో లానొక కొత్త జీవితాన్ని చవిచూసిన నాటకం ఇచ్చే సందేశమిది: ప్రతి సంస్కృతికీ ఒక ప్రత్యేకవిధానం, పంథా ఉన్నవి; వాటి లక్ష్యలను అందుకోవటంలో అవి ఉపయుక్తంగా ఉంటవి: అన్ని సంస్కృతులూ గౌరవించదగినవే!

ప్రజల విజ్ఞానాభివృద్ధిని ఆశించిన 26 స్టేషనలేగాక, మరెన్నో వ్యాపార నిమిత్తం ఏర్పడిన స్టేషన్‌లుకూడా - విజ్ఞానసాధన విషయంలో మానవుడు

ఆలోచించగల అన్ని శాఖలకూ సంబంధించిన ప్రత్యేకమైన ప్రోగ్రాముల్ని ప్రసారం చేస్తూనేఉన్నవి. ఎవ్వరైనాసరే ప్రతిరోజూ యీ ప్రోగ్రాముల్ని చూస్తూ, తెలియని విషయాలనువిని నోట్స్‌రాసుకో నారంభిస్తే విశాలమైన దృక్పథంతోకూడిన విద్య ఇంటినుంచి వదలకుండానే సాధించటం జరుగు తుంది. టెలివిషన్ ద్వారా విద్యావ్యాప్తి చేయటమనేది ఇప్పుడే అరంభ మైంది. నేషనల్ సిటిజన్స్ కమిటీ ఫర్ ఎడ్యుకేషనల్ టెలివిషన్ అనబడే ఒకానొక స్వచ్ఛందసేవాసమాజం, టెలివిషన్‌లో ప్రసారమయ్యే వివిధ విషయాల స్థాయిలనుపెంచే ప్రయత్నాలు చేస్తూన్నది. ఇప్పటికీ విద్యా వ్యాప్తికై ఉపయోగపడే టెలివిషన్ ప్రసారాలు 6 కోట్ల మందిని జేరుతూ ఉన్నవి.

టెలివిషన్‌లోని లోపాలు ఏమైనప్పటికీ - నటనలో, దర్శకత్వంలో, నడకలో, స్టేజింగ్ మొదలైనవాటిల్లో - అత్యున్నతస్థాయిలనందుకోవటం జరిగింది. చెప్పదల్చుకున్నదాన్ని ప్రజానీకానికి జేర్చేందుకు ఇదొక సజీవ మైన, సారవంతమైనపంథా. అంతేగాక సామాన్యప్రజను అందుకునేందుకు ఇదొక కూడలిస్థానంగా కూడా ఉంటూన్నది. ప్రెస్ ఎసోసియేషన్‌ల తాలూకు వార్తలనూ ఫొటోలనూ ఉపయోగిస్తూ, పుస్తకాలనుంచీ, మాగ జైన్‌లనుంచీ కథావస్తువుల్ని ఎన్నుకుంటూ, రేడియోలనుంచి దర్శకులనూ నటీనటులనూ ఎరువుతెచ్చుకుంటూన్నది. ఇది ఇచ్చే ప్రదర్శనలన్నిటినీ హాలీవుడ్ ఫిలిమ్‌మీదికి ఎక్కిస్తూనే ఉన్నది.

ఇక ప్రేక్షకుల దృక్పథంనుంచి చెప్పవలసివస్తే, ఈ ప్రదర్శనలు ఎంతో దీర్ఘంగా ఉండటంవల్ల బాధాకరంగా ఉండటం, ఒక్కొక్క సమ యంలో వ్యాపారసంబంధమైనవి అవమానపూర్వకంగాకూడా ఉంటూన్నవి. యవ్వనం, అందచందాలు, సుఖసౌఖ్యాలూ, గృహజీవనంలోని స్వర్గసౌఖ్యం క్రైస్తవమత సాంప్రదాయమైన నీతినియమాలూ - మొదలైనవాటిని ఆయు ధాలుగా ఉపయోగించి ఒకసిగరెట్ పాకెట్ అమ్మేందుకూ, లేదా కొత్తగా

తయారైన ఒకసబ్బు అమ్మేందుకు ప్రయత్నించటాన్ని ప్రేక్షకులు సహించ లేక పోతూన్నారు.

నేషనల్ ఎసోసియేషన్ ఆఫ్ రేడియో అండ్ టెలివిషన్ బ్రాడ్ కాస్టింగ్‌వారి నైతిక దృక్పథంలో తన సభ్యులకు విద్యారంగంలోనూ సమాచారాలలోనూ, వినోదవిజ్ఞానాలలోనూ అత్యుత్తమమైనవే అందిస్తామని హామీ ఇచ్చారు. ఇదంతా ప్రజాసేవే కనుక తమ విధులను గుర్తించి, అప్పటి కప్పుడు యీ కంపెనీవారు ఉచితంగా ప్రోగ్రాముల్ని నడపటం, ప్రేక్షకులను చర్చిలకు వెళ్లి ప్రార్థించమని కోరటం, సామాజిక సంక్షేమ కార్యకలాపాలకు విరివిగా విరాళాలిమ్మని వేడటం, లేదా సంక్షేమ కార్య కలాపాల ఆవశ్యకత, మానసికారోగ్యరక్షణ మొదలైన వాటినిగూర్చి వివ రించటం చేస్తూంటారు. స్వంతంగా ప్రభుత్వ పర్యవేక్షణలో ఇలాటి నెట్ వర్క్ ఏదీలేదు కనుక, ప్రభుత్వం కూడా ప్రజానీకాన్ని జేరేందుకు టెలి విషన్‌నే ఉపయోగించటం, అందుకు తగిన విధంగా నిర్వాహకులు కొంత కాలాన్ని ప్రభుత్వానికి కేటాయించటం జరుగుతూన్నది. ఉదాహరణకు **C B S** అమెరికన్ వైమానిక శక్తిని ప్రజలకు సుబోధకరంగా అంది చ్చేందుకుగాను 10 లక్షల డాలర్ల వ్యయంతో ప్రభుత్వ వైమానికశాఖ సహకారంతో ప్రదర్శించగలిగారు. వ్యాపారధోరణిలో, లాభాలువొచ్చినపుడే వ్యాపారాన్ని సాగించటం సాధ్యమౌతుందనే న్యాయాన్ని అనుసరించి - టెలివిషన్ లేదా రేడియో నెట్‌వర్క్ ముందుగా, దాని ఆర్థికస్థితిగతుల్ని గమనించవలసి ఉన్నది. ఎంత తక్కువమంది ప్రేక్షకలున్న టెలివిషన్ ప్రదర్శనకైనా కొన్ని లక్షలమంది ప్రేక్షకులు ఉంటూనే ఉన్నారు. ఇంత మంది ప్రజానీకం తాలూకు విజ్ఞానవినోదాలను కాపాడవలసిన నైతిక ప్రవృత్తి ఆ స్టేషన్‌కు ఉండదా?

సామాన్య ప్రజను అందుకోవటమనే ఆదర్శాన్ని - వీరిలో అధమాధమ స్థితిలో ఉన్నవాడూ, లేదా ఎదుటి తక్కెడలోపడే మరికొన్ని శక్తులూ,

వాటి పలుకుబడులను కూడా పేర్కొనవలసే ఉంటుంది. ఇంత బ్రహ్మాండమైన ప్రేక్షకజనంలో విభిన్న ప్రకృతులూ తత్వాలున్నవారూ, విభిన్న అనుభవాలున్నవారూ ఉన్నప్పటికీ, వారిస్థాయి ఏదైనప్పటికీ సమానమనేది ప్రధానం. ఇలాటి ప్రేక్షకజనం అనాగరికమైన శక్తిని కూడా ఉపయోగించటంవల్ల ఫలితాలలో కొంతమార్పు రాకతప్పదు. ప్రేక్షకుల అభిరుచులు నాటకాల్లో, బాలెట్‌లలో, సంగీతంలో అత్యున్నతమైన వాటినే కోరటంవల్ల, ప్రసారంచేసేవారూ, వ్యాపారాభివృద్ధికి టెలివిషన్‌ను ఉపయోగించేవారుకూడా తమతమ స్థాయిలను పెంపొందించుకోవలసిన అవసరాలు ఏర్పడుతూన్నవి.

## రేడియో

టెలివిషన్ అభివృద్ధిచెందసాగాక రేడియో వెనుకబడింది. ఐతే ఇప్పటికీ రేడియో ప్రసారాలు జనసామాన్యానికి జేరగలుగుతూ, ఒకో సమయంలో టెలివిషన్‌ను ఉపయోగించలేకపోవటం, లేదా దానికన్న రేడియో ఉపయోగమే అధికంగాఉంటటం, టెలివిషన్‌ను పోటీచేయటంలో రేడియో స్వశక్తిని గుర్తించటం జరిగినవి.

గృహిణులు పనిపాటలు చేసుకుంటూ టెలివిషన్‌దగ్గర కూర్చునే తీరిక కలిగి ఉండరు కనుక, రేడియో ద్వారా ప్రసారమయ్యే సోప్ అపేరాలను పనిచేసుకుంటూనే వింటున్నారు; లేదా కొన్ని సంవత్సరాలుగా తమతో కలిసిమెలిసి తిరిగిన స్నేహితులను ఒక్కసారిగా వొదులుకోలేని మనస్తత్వమున్నవారూ, టెలివిషన్ తెరలాటివాటిని ఏవగించుకొనేవారూ రేడియోలనే వాడుతూన్నారు. ఇప్పటికీ రేడియో - వంటగదిలో, స్నానాలగదిలో, పడకగదిలో, చివరకు కార్లలోకూడా తన స్థానాన్నికోల్పోక, మనుషుల చేతులకూ, కళ్లకూ పని ఎక్కువగా ఉన్నప్పటికీ చెవులను మాత్రం రేడియోకు అప్పగింపగలిగిన స్థితుల్లో దానిస్థానం యధాతధంగా

ఉంటూనే ఉన్నది. ముఖ్యంగా కాంపులకు వెళ్ళేవారికీ, బీచ్‌లో కాలం గడిపేవారికీ ముఖ్యస్నేహితుడుగా రేడియో ఉంటూన్నది. ట్రాన్‌సిస్టర్స్‌తో నిర్మించబడి, బాటరీలతో పనిచేస్తూండటంవల్ల దీన్ని తేలిగ్గా జేబులో వేసుకొని ఎక్కడికిబడితే అక్కడికి తీసుకునివెళ్ళే సౌలభ్యమున్నది. స్వతక్షులను అది తిరిగి కనుక్కున్నది: నిరాడంబరత్వం, ఆ క్షణంలో పనిచేయగలగటం, సంక్షేమం, కలుపుగోలుతనం, చెప్పే విధానంలోని నేర్పు - మొదలైనవి.

వార్తలకొరకూ, వాతావరణ విశేషాలకొరకు, ఏదైనా ప్రమాదకరమైన సంఘటనలను గుర్తించినప్పుడు ఏక్షణానికి ఆ క్షణం ఏమైనదో తెలుసుకోవాలనే కుతూహలం మొదలైన వాటికొరకు జనసామాన్యం రేడియోను ఉపయోగిస్తూనే ఉన్నది. ఒక స్రవంతివలె ప్రవహించే సంగీతం కొరకు కూడా రేడియో తిప్పుతారు; ఇలాటి సంగీతాన్ని ఒకో మెట్రొపాలిటన్ ఏరియాలో కనీసం ఒక్క స్టేషనన్నా ప్రసారం చేస్తూనే ఉన్నది.

ఇప్పుడు రేడియో ప్రోగ్రాములు చాలా సంక్షిప్తంగా ఉండాలి - ఎందుకంటే క్షవరంచేసుకునేటప్పుడు, లేదా స్నానంచేసేటప్పుడు, భోజనంవేళ లేదా కారులో ఆఫీసుకు వెళ్ళేటప్పుడు ప్రజలు రేడియోను వింటున్నారు. కనుక, దీర్ఘకాలం వినగలిగే ఓపికా, తీరికా ఉన్నవారి కొరకై రేడియో ప్రసారాలలో ఒక పద్ధతి కనిపెట్టబడింది: సుదీర్ఘంగాఉండే ప్రోగ్రామును చిన్న చిన్న ఖండాలుగాచేసి, ఆ ఖండం తనలో తాను పరిపూర్ణతను కలిగి ఉంటూ, తరువాతి ఖండంతో తేలిగ్గా కలిసిపొయ్యే విధంగా యీ ప్రోగ్రాములు అమర్చబడినవి. వార్తాపత్రికలోవలె తాజావార్తల శీర్షికనుంచి, హఠాత్తుగా ఏ కాంగ్రెస్ సభ్యునితోటి ఇంటర్‌వ్యూకో గంతువేయటం, అక్కణ్ణుంచి ఏ సముద్రాంతర రిపోర్టో లేదా కొత్త శాస్త్రీయ పరిశోధనా ఫలితమో వివరించి, వనితల ఫాషన్‌లకు మారుతూండటం జరుగుతోంది.

## సినిమాలు

టెలివిషన్ సినిమాలమీద పెద్దదెబ్బతీసింది. సినిమా థియేటర్లలోకి జొరబడే జనం వారానికి 9 కోట్లనుంచి 5 కోట్లకుదిగి, తిరిగి $5\frac{1}{2}$ కోట్లకు ఎగబాకింది. ఇందుకు టెలివిషన్ కారణం మాత్రమే కాదు; ముఖ్యమైనదిగాకూడా ఉన్నది.

సినిమాలు చూడాలంటే ఎక్కువ డబ్బు కావాలి; మొత్తం కుటుంబమంతా వెళ్ళాలంటే, పిల్లలక్కూడా టిక్కెట్లుకొనాలి; మరీ పసిపిల్లలుంటే ఇంటిదగ్గర ఆ పసిపిల్లలకు కాపలాగాఉంచిన మనిషికి డబ్బివ్వాలి. కారు కారూ సినీమా థియేటర్‌లోకివెళ్ళే సౌకర్యం కొంతవరకూ యీఇబ్బందిని తొలగించి సహాయపడింది; పిల్లలు చిన్నవారైతే ఉచిత ప్రవేశం లభ్యమవటం, ఒకవేళ వారికి సినిమా విసుగెత్తితే, హాయిగా వెనుక సీటులో నిద్రించే సౌకర్యముండటం జరిగింది.

కొంత కాలంపాటు అసలు టెలివిషన్‌లేదనే ధోరణిలో ఆలోచించి, దేన్నయితే తాను పోరాడలేదో అందులోనే లీనమైపొయ్యేందుకు ప్రయత్నిస్తూ, హాలీవుడ్ తన పురాతన చిత్రాలను టెలివిషన్‌కు అనుకూలంగా ఉండే నాటకాలుగా రూపొందించి విడుదలచేస్తూ తన నటీనటబృందాలను కూడా టెలివిషన్ ప్రొడక్షన్‌కు ఎరువివ్వసాగింది. టెలివిషన్ పోటీని తట్టుకునేందుకుగాను హాలీవుడ్ మరింత ఉచ్చస్థాయిలో ఉత్తమ చిత్ర నిర్మాణాలకు పూనుకున్నది. టెలివిషన్‌లో సాధ్యపడని కొత్తకొత్త విషయాలనూ, అభిరుచులనూ - ఉదాహరణకు రంగస్థల విశాల విస్తీర్ణం, దృశ్యవిశేషం, ఎక్కువమంది నటీనటుల్ని సెట్‌మీదికి ప్రవేశపెట్టగలగటం మొదలైన వాటిని హాలీవుడ్ ఆచరణలో పెట్టసాగింది. ఇదమిద్ధమని తేల్చుకొనే సమయంలో సాంకేతికనైపుణ్యం కూడా మితిమీరినందువల్ల - ఎక్కువ విస్తీర్ణాన్ని ఫొటోగా తీయగల వెడల్పయిన లెన్సులూ, ఎక్కువ

విస్తీర్ణమున్న తెర, కళ్లమిరుమిట్లుగొలిపే వర్ణవిశేషాలు మొదలైనవి కూడా సాధ్యమై దోహదం ఇచ్చినవి.

నిజానికి హాలీవుడ్ ఎప్పుడూ ఫలవంతమయే పథకాలను వేయటంలో అందెవేసినచేయిగా ఉంటూనేఉన్నది. స్లోమోషన్ ఫొటోగ్రఫీ, నీళ్లకింద తీసే ఫొటోగ్రఫీ, బ్రహ్మాండమైన ఓడలు మునిగిపొయ్యే దృశ్యాలూ, రైళ్లూరైళ్లూ ఢీకొన్న దృశ్యాలూ, మహానగరాలు కాలిపోవటం, హాస్యరస పూరితమైన కార్టూన్‌చిత్రాలూ - మొదలైనవాటిని హాలీవుడ్ చిత్రనిర్మాతలు తమ చిత్రాల్లో ప్రవేశపెట్టి అద్భుతాలు జరిపారని ప్రపంచమంతటా కీర్తి నార్జించారు. ఒకో సినిమాతీయాలంటే 276 నైపుణ్యం గల పనితనాలు అవసరమౌతూన్నవి.

హాలీవుడ్‌లోని ఇంద్రజాలంలో ఏదోభాగం ప్రపంచంలోని మానవు లందరితోనూ మాట్లాడగలిగిఉంటూ, అది సెక్స్‌కు సూచనగానూ, ప్రపంచానికి స్వాప్నవిక సూచనగానూ ఉంటూన్నది. హాలీవుడ్‌చిత్రాలను ఏవగించుకునేవారుకూడా వాటినిచూసి ఆనందిస్తూనేఉన్నారు. ఈవిధంగా హాలీవుడ్ చిత్రించేవాటిని ఒకవైపు మెచ్చుకుంటూ ఆనందిస్తూ, మరొకవైపు తమ లోని లోపాలను హాలీవుడ్ నిర్మాతలమీద రుద్దుతూనేఉన్నారు.

హాలీవుడ్ చిత్రాలు అంతర్జాతీయకీర్తిని ఆర్జించేందుకు కారణాలు లేక పోలేదు: ముఖ్యంగా హాలీవుడ్ బహుజనాదరణను పొందే చిత్రాలను తీయటమనేదాన్ని మొదటినుంచీ నేర్చుకున్నది; ఎందుకంటే అమెరికాలోని వివిధజాతులూ, అనేకరకాల సంస్కృతులతో ఉన్న జనబాహుళ్యమంతా వలసలువొచ్చినవారే కావటం, ప్రాథమిక మానవావసరాలనూ,ఆయా అనుభూతులను సరిగ్గా చిత్రిస్తేనేకాని, ముందు స్వదేశంలోనే తమకు ఆదరణ లభించదనీ వారు తెలుసుకొని తదనుగుణంగా చిత్రనిర్మాణాన్ని జరిపారు. హాలీవుడ్‌నుంచి కౌబాయ్ చిత్రాలు, స్టంటు చిత్రాలనుంచి కావ్యాల వరకూ రకరకాల చిత్రాలూ వెలువడినవి. సౌత్‌సీ ఐలెండ్‌వాసులు యీ

చిత్రాలను రెండు తెగలుగా విభజించారు. బాంగ్-బాంగ్ (స్టంటు) కిస్-కిస్ (ముద్దులతోకూడిన ప్రణయచిత్రాలూను). యీ రెండురకాలూ వారికి నచ్చేవే!

ఐతే దురదృష్టవశాత్తూ - అమెరికన్ చిత్రాలలో కనిపించే దౌర్జన్యాలూ. స్టంట్లూ, దొంగలముఠాలూ. దోపిడీలూ మొదలైనవాటినిచూసి మిగతా ప్రపంచం - అమెరికన్‌లందరూ దొంగల ముఠాల్లోనివారనీ లేదా కౌబాయిస్ అనీ, లేదా ప్రేయసీప్రియులనీ పొరబడటం జరిగింది: ఐతే చిత్రమేమంటే స్వదేశాల్లో నిర్మించబడే చిత్రాలను చూసినప్పుడు యీ ప్రేక్షక మహాజనులే తమదేశీయులందరూ ఆయా చిత్రాల్లో కనిపించే పాత్రలకు అనుగుణంగానే జీవితాలను గడుపుతూన్నారని ఎన్నడూ పొరబడలేరు - ఎందుకనో మరి! హాలీవుడ్ సాధించిన ఘనవిజయాలూ, కీర్తిప్రతిష్ఠలూ ప్రపంచమందంతటా యునైటెడ్‌స్టేట్స్ స్థాయిని తగ్గించటం, అదేదో అబద్ధాలతో కూడినదిగా భావించబడటం జరిగింది; ఐతే హాలీవుడ్ సత్యాన్ని సత్యంగానే చూప దలిచి అమెరికన్ సంస్థల్నిగూర్చీ, దేశీయ వాతావరణాన్నిగూర్చీ దాపరికం లేకుండా చిత్రించటమే ఒక నేరమైంది; ముఖ్యంగా కమ్యూనిజమ్ ఇలాటిదాన్ని తనకు అనుకూలంగా ఉండేవిధంగా ప్రచారంలోకి తీసుకొచ్చింది.

హాలీవుడ్ చిత్రాలలోని దుష్టపాత్రల్లో - మెక్సికన్, లేదా అరబ్ పాత్రలను, గుర్తించేవిధంగా ప్రవేశపెట్టినప్పుడు ఆయా జాతీయులు పెద్ద గందరగోళాన్ని రేపటం జరిగింది; కనుకనే చిత్రాలలోని దుష్టపాత్రలన్నీ అమెరికన్‌లే అవటాన్ని హాలీవుడ్ ఎన్నుకున్నది. అందుకని అమెరికన్‌లు యీ దుష్టత్వాన్నంతనూ సమర్థులైన పురుషులవలె తమభుజాలకు ఎత్తుకొని ఆ వెల చెల్లించారు. ప్రపంచ దృష్టిలో యునైటెడ్‌స్టేట్స్ తాలూకు శక్తి సామర్థ్యాలూ, పలుకుబడులూ అత్యధిక మవటాన్ని సహించలేనివారు కొందరు - అమెరికన్‌లను ద్వేషించేందుకు అనుకూలంగా ఉండే వాతా

వరణం తమకోరకై సంసిద్ధంగా ఉన్నదని గ్రహించారు: ఎందుకంటే అమెరికన్ చిత్రాలలో కనిపించే దుష్టులూ, ముఠాలూ, దోపిడీదారులూ, ఐశ్వర్యవంతులైన సోమరులూ - వీరందరూకూడా అమెరికన్లుగానే ఉంటున్నారు కనుక।

ఈ కథల్లో ప్రత్యేకమైన మెలికలుండే పాత్రలన్నిటినీ అమెరికనులుగానే గుర్తించేందుకు అవకాశాలు ఏర్పడేట్లుగా చిత్రించబడుతున్నవి. దుష్టురాలుగా పైకి కనిపించినా, అంతరాంతరాల్లో మంచిగాఉండే అమ్మాయిలాటి పాత్ర - అమెరికన్ చిత్రాలలో ఒక ప్రత్యేకమైన కోవ. రచయిత - నాయకి తన చేతుల్లోనే పడిపోయినట్లుగా భావించి, ఆనందించి, తదనుగుణంగా దుష్టుని చేతుల్లో లేదా నాయకుని చేతుల్లోకి వాలిపోవటాన్ని రచించటం జరుగుతోంది. ఐతే అమెరికన్ సంస్కృతిలో యువతీ యువకులకు ఎంతో స్వేచ్ఛఉండి తమతమ భాగస్వాములను తామే ఎన్నుకొనే అవకాశాలు ఉండటంవల్ల, యాదృచ్ఛికంగా యెదురైన వ్యక్తితో పరిచయం కలగటం, కాలక్రమేణా అది స్నేహంగానూ, ప్రణయంగానూ పరిణమించటం సహజమేమరి। ఈవిధమైన నాయకి సంసిద్ధతను ఊతగా తీసుకొని, నాయకుడు తాను ఇన్నాళ్లుగా, ఇన్నేళ్లుగా తల్లి సంరక్షణలో నేర్చిన నీతుల పలుకుబడినుంచి క్రమంగావిడివడి ముందుకు సాగగలుగుతున్నాడు. ఐతే నాయకుని కోర్కెలను రేపిన సంఘటనలో ఆమె ఎన్నుకొన్నమార్గం విషయంలో రాజీకుదిరినట్లు కనిపించి అక్షణంలోనే ఆమె అమాయకురాలుగా రూపొందు తూన్నది. కథాంతంలో వారిద్దరూ హాయిగా పెళ్ళాడుతారు.

కొన్ని కథావస్తువులు అమెరికన్ కుటుంబజీవనంతాలూకు ప్రత్యేక పరిస్థితులు ఆధారంగా ఏర్పడినవి. అనేక సందర్భాలలో నాయకుడు తన తల్లిదండ్రులమాటల్ని తోసిపుచ్చి, లేదా తనమీద పనిచేసేవారి పలుకుబడుల నుంచి విడివడి తన జీవితపంధాను తానే నిర్ణయించుకుంటాడు. తాను

వొచ్చిన కుటుంబంగాక, తాను ఏర్పరచుకొన్న కుటుంబానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతూన్నది. యవ్వనం ఘనంగా చూడబడుతూన్నది. తండ్రిపాత్ర సర్వసామాన్యంగా బట్టతలతో, హాస్యాస్పదంగా ఉంటూం టుంది. కథ సాగుతున్నకొద్దీ తండ్రిపాత్ర దుష్టత్వంతోకూడి, నాయకపాత్ర మీద తన అధికారాన్ని చలాయిస్తూ ప్రమాదకరంగా ఉండేట్లు కనిపిస్తుంది. ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రకారమైతే- నాయకుడు తండ్రినిమించిన కుమారు డయేందుకు ప్రయత్నించటంవల్ల, కుమారుణ్ణి తండ్రి క్షమించవలసే ఉంటూంది. ఐతే దుష్టత్వంతో కూడిన ప్రమాదకరమైన ఈ ప్రపంచంలో ఎదురొడ్డి పోరాడాలంటే, తన తండ్రిని మించిపోవాలంటే, తన నేరాన్ని కూడా కొంతవరకైనా ప్రదర్శిస్తూ చివరకు పోలీసుదృష్టిలో పడినప్పుడు నిజంగానే తానుకూడా దోషా అనే అనుమానానికికూడా గురికావలసి ఉంటుంది.

ఈవిధంగా నేరాలు ఆధారంగా తీయబడ్డ చిత్రాలతాలూకు అంతరాంత రాల్లో వెంటాడే తత్వమొకటి కనిపిస్తుంది. సాధారణంగా నేరాన్ని పరిష్క రించేది పోలీసుగాక, సర్వ స్వతంత్రుడుగాఉండే వేరొకవ్యక్తే పరిశోధ నలు జరుపుతాడు. కొత్త తలబిరుసుతనం పొగరుమోతుతనమున్న కుమా రుడు చట్టాన్ని (తండ్రిగారి అధికారాన్నీ దురహంకారాన్నీను) అతిక్ర మించవలసిన విషమ పరిస్థితులేర్పడి, న్యాయసాధనకుగాను నేరస్థుడౌతూ న్నాడు. సూచనప్రాయంగా వివరించాలంటే- అమెరికన్ యువకుడైఉండి కొత్త ప్రపంచంకోసం అర్రులుజాచి, స్వస్థలాన్ని విడిచేందుకు సిద్ధపడి, తదనుగుణంగా తండ్రిగారి ఇల్లువిడిచి పశ్చిమానికి పయనమై, అకొత్త ప్రదేశంలో, కొత్తవాతావరణంలో భాగ్యభోగ్యాలను అన్వేషిస్తున్నాడు. అక్కడ చట్టాన్నే తన చేతుల్లోకి తీసుకోవాలి; అక్కడ స్వహస్తాలతో తన నివాసాన్ని నిర్మించుకోవాలి . తన తరువాతి తరంవారుకూడా తన వలెనే ఆ గృహాన్ని విడిచి, వేరొక నూతనగృహ నిర్మాణానికై అన్వే

షిస్తారనీ అతనికి తెలుసు. దీన్నిబట్టి తండ్రి ప్రదర్శించే అధికారాన్ని ఎదు ర్కోవటమనేది ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు లోతుకు పాతుకొనిపోయిన వేళ్లలాటివి: పిత్రార్జితమైన ఆస్థివలె తరతరాలకూ ఇది సంక్రమిస్తూ ఉంటుంది; కనుకనే అమెరికన్ కథావస్తువులకూ ఇతర కళాప్రవర్శ నలకూ ఎల్లప్పుడూ ఇలాటివే కేంద్రీభూతమైనవిగా ఉంటూన్నవి యువ కులూ, యువతులూకూడా ఎప్పుడూ ముందడుగులు వేస్తూనే జీవితంలో పోరాడి తమ కాలాన్ని సక్రమంగా ఉపయోగిస్తూ విజయాన్ని సాధించట మనే విషయానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతూన్నది.

నిస్సందేహంగా సినీమాలు అపజయాన్ని సూచిస్తున్నవని వాటిని దుమ్మెత్తిపోసేవారు- అవి విజ్ఞులైనవారికొరకై అంత పెద్దస్థాయిలోనూ తీయబడలేదనీ, ప్రాపంచిక జానపదనాటకానికి అనుగుణంగా చిత్రించ బడినవనేవిషయాన్ని విస్మరిస్తున్నారు. కనుకనే జానపదనాటకాలు ఎప్పుడూ ఆయా అద్భుతవిషయాలమీదా, భయాలమీదా, వింతవింతకోర్కెలమీదా ఆధారపడి ఏర్పడే విధంగానే యీ కధలూ ఉండటంలో ఆశ్చర్యమేమీ ఉండదు.

ఈ సినీమాలమీద సెన్సార్ నిబంధనలూ. సెన్సార్‌వారి దృక్పధంమరింత కఠినంగా ఉండేపక్షంలో అవి ఇంతకన్న బాగాఉండే అవకాశాలున్నవి. సెన్సార్ విధానంలో అనేక పేచీలతో తల వాచిపోనటంవల్ల, చిత్రనిర్మాణ పారిశ్రామికులు తాము చిత్రించే చిత్రాలకు సంబంధించిన ఒక విధానాన్ని సూచించే పట్టికను "మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ అండ్ డిస్ట్రిబ్యూటర్ ఆఫ్ అమెరికా" వారి ఆధ్వర్యాన రూపొందించుకున్నారు. ఈకొత్త నిబంధ నావళి ప్రకారం- స్నానాలగదిలో అలంకరించుకోవటంకానీ, శాస్త్ర సమ్మతంగానూ, చట్టసమ్మతంగానూ దంపతులైనవారు ఏకశయ్యాగతులు కాకుండుటంకానీ చూపబడదు. యవ్వనదశలో ఉన్నవారి సమస్యలూ, ఉద్రేకాలూ- ముఖ్యంగా లైంగిక విషయాలలో- తెరమీద నిషేధించ బడి

నవి. కాథలిక్స్‌తాలూకు "లీజియన్స్ ఆఫ్ డీసెన్సీ" సంఘం, మరికొన్ని ప్రొటెస్టెంట్ చర్చికి సంబంధించిన సంఘాలూ - హాలీవుడ్ నిర్మాతలు యవ్వనదశలోని లైంగిక సమస్యల్నిగూర్చి చూపకుండా, విముఖుల్ని చేసేందుకుగాను ఎల్లప్పుడూ పనిచేస్తూనే ఉన్నవి.

మత సంబంధమైనవారు యీ విషయాల్ని కల్పించుకోవటాన్ని మనం అర్థంచేసుకోవచ్చు. ఈ సినీమాలు చూసేది పిల్లలు, ముఖ్యంగా 9 ఏళ్ళ వయస్సు లేదా ఆప్రాంతాలలో ఉన్నవారిమీద యీ కథావస్తువులు తమ పలుకుబడులను తీవ్రంగా ప్రసరిస్త ); 16 సంవత్సరాల ప్రాంతాలలో ఉన్న వారిమీద లైంగిక విషయాల ప్రసక్తులు తమ తీవ్ర ప్రభావాలను ప్రసరిస్తవి. ఐతే అమల్లో ఉండవలసిన నిబంధనలు వైవాహికంగా దంపతులైనవారి తాలూకు చిత్రణను తుడిచివేయటం, వివాహం కానివారిమధ్య సంబంధాలు విచ్చలవిడిగా ఉండటంగా పరిణమించినవి. నేరాలనూ, దౌర్జన్యాలనూ అనుమతించటంద్వారా చిత్రంలోని ప్రపంచం అసత్యాపూరితమైనదిగా రూపొందింది. సెన్సారువారు చిత్రాలలో ప్రవేశపెట్టే మార్పులద్వారా మానవులనే మార్చగలమని పొరబడ్డారు: మురికి ప్రదేశాలూ, నిర్లక్ష్యత వహించే లేదా విరోధభావం పూనిన తల్లిదండ్రులూ, తగినంత విశ్రాంతి వినోదాలు లేకుండటం, కేవలం ధనానికే ప్రాధాన్యతనిచ్చిన సామాజిక పరిసరాలూ మొదలైనవి నేరస్థులయే కారణాలేకాని కేవలం సినీమాలుకావు; నిజానికి మనం మనసమాజాన్నీ మననూ దూషించుకొనే సాహసం లేక యీ సినీమాలమీద విరుచుకొని పడుతున్నాము.

ఇటీవల సుప్రీంకోర్టు నిర్ణయాలు సెన్సార్‌షిప్ నిబంధనలను మేల్కొల్పినవి. స్వతంత్రులైన చిత్రనిర్మాతలిప్పుడు కోడ్‌సీల్ లేదా అనుమతి అవసరంలేకుండానే తమ చిత్రాలను ప్రదర్శించగలరు. ఇలాటి నిబంధనలకు కట్టుబడని టెలివిజన్, హాలీవుడ్‌వారు ఏర్పరచిన నిషేధాల నెన్నిటినో అతిక్రమించింది.

ఐతే సెన్సార్ నిబంధనలనే సమస్య పరిష్కరించబడినా, ప్రాధమిక మైన సమస్యలనేవి ఉండనే ఉన్నవి. హాలీవుడ్ పరిశ్రమ ఒక కళాపూరిత మైనదాన్ని నిర్మించేందుకు ప్రయత్నించటంవల్ల - యీరెండూ ఒకదానితో మరొకటి సంఘర్షిస్తున్నవి. అంతకుక్రితం విజయవంతమైన చిత్రానికి ఆపాదించబడిన విజయాన్ని సాధించే నిబంధనావళినుంచి ఏ కాస్త పెడ మార్గం పట్టినా, లేదా కొత్తదాన్ని పరిశోధనలో ప్రయోగించినా, ఆర్థిక సహాయంచేసే బాంకులు నిరుత్సాహపరుస్తూన్నవి. ఐతే స్వతంత్రభావాలు కళాపూరితమైన ఆలోచనలూ బాక్సాఫీస్ చిత్రాలను సృష్టించగలవనే సత్యం అనేకసార్లు రుజువైంది.

రచనా నైపుణ్యం, దర్శకత్వ నిర్వహణా ఉండి, చిత్ర నిర్మాణాలను కలిపికట్టుగా నడిపించే సామర్ధ్యత ఉన్నవారు పూర్వంకన్నా అధికంగా విజయవంతమైన చిత్రాలను నిర్మించగలుగుతున్నారు. కళాపూరితమైన సృజనాత్మక శక్తులను కూడదీసి, ఆయా నిర్ణయాలను వాటికే వొదిలివేయ టంవల్ల, హాలీవుడ్‌లోని అత్యద్భుత నైపుణ్యాన్ని అపారంగా ఉపయో గించుకొనే అవకాశాలుండి మంచిచిత్రాలు తయారవుతూన్నవి. కాని ఇంత మాత్రాన నిర్మాతకూ దర్శకునికీ, నటీనటులకూ, టెక్నీషియన్‌లకూ మధ్య ఉండే వైషమ్యాలన్నీ రూపుమాసిపోవు.

ఇక నటీనటుల విషయంలో- అధునాతన జానపద నాయకుడు విరివిగా డబ్బు ఖర్చుపెడుతూ, ప్రణయోపాసకుడుగా ఉంటూ, సాధారణమైన మానవుడుగా ఉన్నవాడు హఠాత్తుగా తెల్లవారేటప్పటికి చిహ్నాకొమ్మ కెక్కిపోయిన కధలు పబ్లిసిటీలో చదివి, ఒలింపస్ నాయకున్ని తలదన్ని నట్లున్న యీ నాయకులను ఎంతో గొప్పగా భావించేవారు- వీరు ఊహించి నంతహాయిగా, సాఫీగా తేలిగ్గా వారిజీవితాలు గడవటం లేదనిమాత్రం ప్రజ లకు తెలియదు. చిత్రనిర్మాణం జరుగుతూన్న సమయాలలో యీ నటీనటులు దీర్ఘకాలాలపాటు, కష్టపడి పనిచేయాలి; ఎంతోసేపు ఓపిగ్గా వేచి కూర్చుం

చేసేకాని ఆ యా సీనుల అమరిక పూర్తవదు; అనేక రీటేక్‌లకు వారు విసుక్కోకుండా వొళ్ళొంచి పనిచేయాలి. ఒక చిత్రానికీ మరొక చిత్రానికీ మధ్యఉండే విరామకాలం వీరికి విసుగెత్తించి చికాకుపరచి, జీవితమంతా శూన్యంగా కనపడటంలో వారు లైంగికంగా కొన్ని సాహసకృత్యాలకు తలపడటం, అనేకరకాల వినోదాలలో పాల్గొనటం జరుగుతూన్నది. వారిఆదాయం, వారు నటించిన చిత్రాలు తెచ్చేరాబడిమీద ఆధారపడి ఉంటుంది; వారి రాబడికి అనుగుణంగా వారు జీవితవిధానాన్ని అమర్చుకోవలసి ఉంటుంది. దేశంలోని జనాభాలో మిగతావారందరికన్నా వీరు అత్యధికంగా సంపాయించినప్పటికీ, ఏ ఏడేళ్ళ కంట్రాక్టులకో కట్టుబడి ఉండవలసి వస్తోంది. ప్రజానీకానికి వీరు ఇలవేల్పులవలె కన్పించినా, అదే వృత్తిలో ఉన్నవారిచేత ద్వేషించబడుతూంటారు. కాని ప్రజానీకం వారు కనిపించిన వివిధపాత్రలదృష్ట్యా వీరినిచూసి, ఆ యా పాత్రల తాలూకు ఆదర్శాలను, వీరి వ్యక్తిగత జీవితానికి ముడిపెట్టటంవల్ల వీరికి ఆరాధకులవుతూన్నారు.

## వార్తాపత్రికలు

ఆమెరికన్ వార్తాపత్రికలు ప్రపంచంలో ఉత్పత్తిఅయే న్యూస్‌ప్రింటులో 60% వరకూ ఉపయోగిస్తున్నవి. ఇక లోనివిషయాలలోకి వెళ్తే సర్వజన సమ్మతంగా ఉండే న్యూయార్కు డైలీ న్యూస్‌లాటిని ఆదివారం పత్రిక 3,694,851 కాపీలు అమ్ముతుంది; క్రిస్టియన్‌సైన్సు మానిటర్, వాల్ స్ట్రీట్ జనరల్, న్యూయార్క్ టైమ్స్‌లాటివి ప్రపంచవార్త లన్నిటినీ అందించగలమని గర్వంగా చెప్పుకుంటూ, తమ ఆదివారపు సంచికకు గాను 200 ఎకరాల అడివిని న్యూస్‌ప్రెంట్ రూపాన ఉపయోగిస్తూన్నవి. చిన్నచిన్న స్థానికమైన పత్రికలు, సామాజిక కార్యకలాపాలకు ప్రాధాన్యత నిస్తూ, సామాజిక దృక్పథాన్నీ, దాని నైతిక ప్రవర్తననూ రూపొందించ

టంలో ప్రముఖపాత్రలు వహిస్తూన్నవి. పోతే "క్లీవ్‌లాండ్‌ప్రెస్" లాటి పత్రికలున్నవి: దీని ఎడిటర్ లూయీ సెల్‌ట్జెర్ ఎంతో బీదరికంలో చిన్న తనాన్ని గడపటంవల్ల, తన పత్రిక సామాజికుల అంతరాత్మలకు ప్రతి బింబంగా ఉండేట్లుచేసి, ఇరీ సరస్సును శుభ్రపరచవలసిన అవసరాన్నీ లేదా ఒక జంతు ప్రదర్శనశాలను స్థాపించవలసిన అవసరాన్నీ గుర్తింప జేయటం, అమెరికన్ బాల బాలికలమధ్యా, పరదేశాల్లోని బాల బాలికలమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రోత్సహించే ఒక సహాయకురాలిని నియోగించు కోవటం మొదలైన పనులు చేస్తున్నారు.

బహుజనామోదంగా ఉండే పత్రికలనుగూర్చి నిర్ణయించింది అమెరికాకు వలసవొచ్చిన బహుజనులే, జోసెఫ్‌పులిట్జర్ జర్మన్‌భాషలో వెలువడే పత్రికలో-జర్మనీనుంచి వలసవొచ్చినవారి అవసరాలేమిటో గుర్తించి ప్రవేశపెట్టాడు; ఆయన "న్యూయార్క్‌వరల్డ్" ను, రెండవతరం జర్మనులు బలపరచటంలో బహుజనప్రీతిని చూరగొన్నది. ఇదేవిధంగా హీరెస్ట్ తన పత్రికలను ఐరిష్‌వారు బలపరచటంతో అభివృద్ధి చెందించ గలిగాడు. వీరు ఉభయులూ పరభాషల్లో వెలువడే పత్రికల్లో సంచలనం కలిగించే వార్తలూ, సామాజిక ముఠాతత్వాలూ మొదలైనవాటిని గూర్చి వ్రాస్తూ, తమ తమ పాఠకులకు తగిన సలహాలనివ్వటం ఎంతో ముఖ్య మైనదిగా భావించి, ప్రవేశపెట్టారు.

ప్రకటనలద్వారా రాబడి అధికమవటంతో, సంచలనం కలిగించే వార్తలే సర్క్యులేషన్ పెరిగేందుకు ముఖ్యాంశాలుగా తయారైనవి. క్రీడారంగం సామాజిక వార్తలూ, కామిక్స్, పుస్తకాలనుగురించిన వార్తలూ, వివిధ కళలూ, గృహాలంకరణా, గృహోపకరకృత్యాలు, ఎవరంతటవారే చేయగలి గిన మరామ్మతులూ, హాస్యపూరితంగానూ, సీరియస్‌గానూ వ్రాయబడిన రచ నలూ, వైద్యసంబంధమైన వ్యక్తిగతసంబంధమైన సలహాలూ-మొదలైన

వివిధ శీర్షికలను ప్రవేశపెట్టి పిన్నలకూ పెద్దలకూకూడా ఆకర్షణీయంగా తయారు చేయబడుతూన్నవీ పత్రికలు.

ఎసోసియేటెడ్ ప్రెస్, యునైటెడ్ ప్రెస్, ఇంటర్ నేషనల్ న్యూస్ సర్వీసు- మొదలైన సంస్థలు ప్రపంచవార్తల్ని సేకరించి వాటిని టెలిగ్రామ్‌లద్వారా దేశంలోని పత్రికలన్నిటికీ పంపుతూంటవి. ఇప్పుడు యీ వార్తలు ఎలక్ట్రికల్ ఇంపల్సెసీగా పంపబడుతూ, ఇవి ఒక టేప్ మీద కన్నాలువేయటం, ఆటేప్‌ను సరాసరి లైనో మెషిన్‌లోకి పంపుతే, అక్కడ దానంతటదే అచ్చుకూర్చటం జరుగుతూన్నది. దాదాపు 200 సిండికేట్‌లు ఎలాటి శీర్షికకైనా లేదా ప్రత్యేకశీర్షికకైనాసరే తగినవిధంగా మేటర్ సరఫరా చేస్తున్నవి. ఇలాటి సౌకర్యమే లేనట్లయితే అనేక చిన్నచిన్న పత్రికలు, పెద్ద పెద్ద పత్రికలదెబ్బకు తట్టుకోలేక వాటిలో లీనమైపోవటమో లేదా రంగంనుంచి నిష్క్రమించటమో జరిగేది; అలాకాక, స్వతంత్ర భావాలను కొంతవరకూ తగ్గించయినాసరే తన పఠితలకు ప్రపంచవార్తలను అందించగలుగుతూన్నవి. తమకు సేవచేసే- వార్తలనందించే సంస్థలకు, వార్తాపత్రికలవారు ముఖ్యమైన స్థానిక వార్తలను అందిస్తూ, ఇతర చందాదారులకూ్కడా వాటిని అందించే అవకాశాలను కలిగిస్తూ ఒకరికొకరు సేవలను అందిస్తున్నారు.

## మేగజైనులు

సామాన్యమైన సర్క్యులేషన్‌ఉన్న 500 మాగజైనుల్లోనూ 54 మాగజైనుల అమ్మకాలు- 70, 000 ప్రతులనుంచీ 11, 000, 000 ప్రతుల వరకూ ఉన్నవి. "ది రీడర్స్‌డైజెస్ట్" ఒక్క యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోనేగాక, ప్రపంచమంతటా విరివిగా అమ్ముడవుతూన్నది. వృధాఅయేదీ, చెడుత్రోవల బట్టేదీ చాలా తేలిగ్గా, హాయిగా చదువుకునేందుకు వీలుగా కథచెప్పే ధోరణిలో చెప్పబడటం, ఎంతో నైపుణ్యంతో వివిధ వ్యక్తిత్వాలనుగూర్చి సరళంగా వ్రాయటం, జనప్రియమైన శాస్త్రీయ

విశేషాలూ, వ్యక్తిగతమైన సలహాలూ, ఉత్తమమైనహాస్యం- మొదలైనవి అమెరికన్ మనస్తత్వాలకు ప్రతిబింబంగా ఉంటూన్నవి.

అనేకవేల వ్యాపారసంబంధమైన మాగజైనులూ, ప్రపంచంలో అత్యుత్తమమైనవిగా పరిగణింపబడే వైజ్ఞానికమైన పత్రికలూ, కంపెనీ పబ్లికేషన్‌లూ, విద్యాలయాలకు సంబంధించిన పత్రాలూ, అనేక సమాజాంతాలూకు కరపత్రాలూ- మొదలైనవన్నీ బ్రహ్మాండమైన పరిమాణాల్లో కాగితాన్ని ఉపయోగిస్తున్నవి.

మేగజైనులు మహా విజ్ఞులైన అమెరికన్ పండితులకోవకు చెందినవై ఉండటంనుంచి, అంత పెద్ద తెలివితేటలు లేనివారికోసం ప్రచురించబడే కామన్‌బుక్స్ వరకూ ఉంటూన్నవి. ఈ రెంటిమధ్యా ఎన్నోరకాల పత్రికలు ఉన్నవి. సుప్రసిద్ధులైన (సర్వసామాన్యంగా సినీమా నటీనటులు) వారి జీవితంలోని దుర్గంధం, గర్భస్రావాలు చేసేందుకుగాను ఏర్పడిన ముఠాలూ, మానవుని దురాశా, దురభిమానాలకు గురయే అనేకనిర్భాగ్యులున్న సమాజంలోని కుళ్ళును బైటపెట్టటంవరకూ - యీ పత్రికలు నిర్వహిస్తున్నవి.

మంచి ప్రకటనలు సంపాయించేందుకు అనేకమంది పఠితలుండే పత్రిక సర్క్యులేషన్ విపరీతంగాఉండాలి, కనుక, తాము అచ్చువేసేది ఎంత చెత్త చెదారమైనా, ఎంత దుర్గంధభూయిష్ఠమైనా సరే ఎక్కువమందిని ఆకర్షించటమే గురిగా కొన్ని పత్రికలు నిర్వహించబడుతూన్నవి. ఐనప్పటికీ, ఉత్తమరచనలూ, ఉత్తమతరగతికిచెందిన ఫొటోలూ అందాలు చిందేట్లుగా ముద్రించిన పత్రికలను ప్రజలుఎక్కువగా ఆదరిస్తూ ప్రోత్సాహపరుస్తున్నారు; ఇక కుప్ప తొట్టెలోనుంచి ఏరిన వార్తలూ, దుర్గంధపూరితమైన సాహిత్యం మొదలైనవాటికి ఇలాటి ప్రోత్సాహంలేదు; అవి చాలా మర్యాదకమైన పత్రికలకన్నా తక్కువ సర్క్యులేషను కలిగి ఉన్నవి.

ఈపత్రికలమీద సెన్సార్‌షిప్‌ఉంటే, ఛండాలాన్ని చాలావరకు తుడిచి వేయవొచ్చని కొంతమంది అమెరికనులు భావిస్తున్నారు. కాని దేశం

మొత్తంమీద- ఇలాటి సెన్సార్‌షిప్ వాక్స్వాతంత్ర్యానికి భంగకరమనీ, బూతుకానిదాన్ని వ్రాసేందుకు అందరూ అనుమతించబడాలనేభావం ప్రబలంగా ఉన్నది. ఛండాలాన్ని తుడిచివేయవలసిన సరైనమార్గం- ప్రజల సంస్కృతిని పెంపొందించటం, మంచిచెడులను విడదీసేవిజ్ఞానాన్ని వారికి అదివ్వటం, ఇంతకన్న మంచివిషయాలను ప్రచురించటమేకాని- ఛండాలాన్ని తొక్కివేయటంకాదు.

## విమర్శ

సామాన్యప్రజ అంతస్థులు దిగజారుతున్నట్లయితే ఆ విషయాన్ని వివరించేందుకు విమర్శకులు ఉన్నారు. సినీమాలూ, రేడియోలూ, టెలివిషన్, పత్రికలూ, సంగీతమూ, నాట్యమూ, నాటకాలూ, రికార్డులూ, సాహిత్యమూ- ఇవన్నీకూడా ఆరోగ్యకరమైన వాతావరణంలోనే ఉండేందుకు తగిన కట్టుదిట్టాలు చేయబడినవి. పెంపొందే యీ సంస్కృతిలో ఇదివరకెన్నడూ ఇంతమంది విమర్శకులకు తావులేదు.

ఈ విమర్శకులు సర్వసామాన్యంగా కఠినంగానే ఉంటారు. అమెరికన్ నవలాకారులు శక్తివంతమైన భాషలో ఎంతో కఠినంగా జాతీయమైన లోపాలనుగూర్చి వ్రాసిఉన్నారు. ఇప్పుడు నవలాకారులమీద విమర్శకులు కారాలు నూరుతున్నారు. సాహిత్యమంతా వివిధ దృక్కోణాలనుంచి- రచయిత సంస్కృతీ, సమాజంపట్ల అతని దృక్పధం, లేదా వ్రాయబడిన విషయం ఎలా చిత్రించబడిందీ, లేదా సూచనప్రాయంగా చెప్పేదేమిటి- మొదలైన వాటిని ఆధారంచేసుకొని పరిశీలించబడుతూన్నది. జాన్‌క్రోవీరాన్‌సన్ విమర్శలో కొత్తపద్ధతి కనిపెట్టాడు; దీనిప్రకారం సాహిత్యశాఖలకుచెందిన రచనను ప్రత్యేకించి దాని విమర్శ కొన్ని చట్టాలననుసరించి చేయబడుతుంది.

సాహిత్యత్రైమాసిక పత్రికలు అభివృద్ధిగాంచుతవి. ఎడ్మండ్ విల్సన్, కెన్నెత్‌బ్రూక్, లియొనెల్ ట్రిల్లింగ్, జోసెఫ్‌వుడ్ క్రుట్చ్ మొదలైనవారు

ప్రాథమికంగా విమర్శకులుగా పేరుపొందినా, సాహిత్యకారులుగా కూడా ఎంతో ప్రాముఖ్యతను సంపాయించారు. అదేవిధంగా మార్క్ వాన్ డోరెన్ లాటి కవులూ, నవలాకారులూ ఉత్తమజాతి విమర్శకులయ్యారు.

నవలాకారులు దేశాన్ని విమర్శించటం విమర్శకులు నవలాకారుల్ని విమర్శించటం పరిశీలిస్తే- పైదేశాలవారు యునైటెడ్ స్టేట్స్‌లోని పరిస్థితులు ఘోరంగా ఉన్నవని అభిప్రాయపడే అవకాశం ఉన్నది. నిజమేమిటంటే- నవలాకారులూ, విమర్శకులూ కూడా కొన్ని ఆదర్శాలనే కొలబద్దలుగా ఉంచుకున్నారు. కనుక అంతా మనం వేరా వాలని కోరుకునే యీ భావం, అమెరికాను గూర్చిన రెండవకోనకు చెందింది. విమర్శనా దృక్పథమనేది అమెరికాలో ఎంతో పెరిగిందనే విషయం- చిన్నపిల్లలు తమకున్న కొద్దిపాటి సంగీత జ్ఞానంలోనూ జాజ్‌నుగూర్చి చర్చించటం, లేదా ఇంటర్నల్ కంబశ్చన్ మోటార్లనుగూర్చి మాట్లాడటం మొదలైనవాటినిబట్టి చెప్పవొచ్చు. ప్రముఖ పత్రికల్లో కొమ్ములుతిరిగిన విమర్శకుల వ్రాతలు చదువుతూ, లేదా విమర్శ కూడా ప్రజలకు అందుబాటులో ఉంటూ, రాజకీయాలు, క్రీడారంగాలలో కూడా జొచ్చుకొని పోయిందనే విషయాన్ని చిన్నవారుకూడా గ్రహిస్తూనే ఉన్నారు.

అమెరికన్ విమర్శకులు కేవల దేశీయమైనదాని మీదనే విమర్శలను జరపటంలేదు. ఆంగ్లసాహిత్యంమీది అత్యుత్తమవిమర్శలో కొంతభాగం యునైటెడ్ స్టేట్స్‌లోనే ఉద్భవించింది; ఫ్రెంచ్ దృక్పథం ప్రకారం ఫ్రెంచ్ చిత్రకళమీదా, సాహిత్యంమీదా- ఫ్రాన్స్‌కు బైట వెలువడిన విమర్శల్లో అత్యుత్తమమైనది యునైటెడ్ స్టేట్స్‌లోనే విరివిగా లభ్యమైనదని.

## అభిరుచి

ఐతే అమెరికన్ అభిరుచులు ఏమైనా అభివృద్ధి జెందినవా? లేక దిగజారుతూన్నవా?

10–11 ఏళ్ళక్రితం వెలువడిన సినీమాలనే, మొదట్లో టెలివిషన్ ద్వారా ప్రదర్శించటం జరిగిందనే విషయం ఒకజవాబు. ఆయాచిత్రాలు విడుదలైన సమయంలో అత్యుత్తమంగా కనిపించినా, ఉత్తరోత్రా సాంకేతిక నైపుణ్యాలూ, శాస్త్రీయపరిశోధనా ఫలితాలూ అభివృద్ధి గాంచటంతో-ఆనాడు ఎంతో బాగున్నట్లున్నచిత్రం, యీనాడు సాంకేతికంగా లోపాలతో నిండిఉన్నట్లూ, బిగువైనసంభాషణలు లేనట్లూ, కథాసంవిధానంకూడా చాలా వొదులుగా ఉన్నట్లూ, ఊహాలు అంతఎత్తుకు పోనట్లూ తోస్తుంది. టెలివిషన్ విషయంలోనూ, సినీమాల విషయంలోనూ ధ్వనించే యీ భేదమే-అమెరికన్ అభిరుచులస్థాయి పెంపొందుతూన్నదని నిరూపిస్తూన్నది.

బహుజనులను ప్రేక్షకులుగా పొందాలనీ, కోట్లాది ప్రజకు నచ్చేట్లుగా ప్రదర్శించాలనీ చేసే ప్రయత్నాలు అనేక సందర్భాలలో ఆ యా స్థాయిలను విచారకరమైనంతగా దిగజార్చినవి. ఐతే ఒకపక్క చౌకబారు చెత్త చెదారం తయారవుతూంటే, మరొకవైపు ఉత్తమఅభిరుచులతో కూడిన కళాత్మకమైనవికూడా రూపొందుతూ తక్కెడ ఒకేవైపు మొగ్గకుండా కాపాడుతూన్నవి. యూరపియన్‌లు ఏకాస్తకళానైపుణ్యాన్నన్నా చూద్దామని ఆశించి, తీరా న్యూస్‌స్టాండ్లమీద, లేదా టెలివిషన్‌ద్వారా వెలువడే చెత్తాచెదారాన్నిచూసి ముడుచుకుపోతూన్నారు. ఐతే ఆక్షణంలో రూపొందిన వస్తువునుచూసి, తమ అభిరుచి అంతేనని భావించకుండా, మార్పులకొరకై అన్వేషిస్తూ అంతకన్న పై అంతస్థుకు వెళ్ళాలని అమెరికన్ ఆత్రపడుతూంటాడు. ఇలాటి దృక్పథంలో అమెరికా ప్రజలందరికీ అందుబాటులోఉండే అనేక మార్గాలను కనుగొని, తద్వారా ప్రజలందరి అభిరుచులూ పెంపొంది, పైస్థాయికి పెరిగేందుకుగాను, ఇంతకుముందు కనీవినీ ఎరుగని బ్రహ్మాండమైన సంస్కృతిస్థాయిని అందుకునేందుకు ముందడుగు వేస్తునే ఉన్నది.

నిజమైన విషమసమస్యఇది: బ్రహ్మాండమైన యీ ప్రజాసామాన్యపు ఆకలి తీర్చేందుకుగాను ఉత్తమమైన వస్తుసముదాయాలను కనుక్కోవట

మెలా? అత్యుత్తమమైన దానినే ప్రకటించే ప్రకటన కర్తలను ప్రోత్సహించటమెలా? ఇలాటి అవసరాన్ని సృజనాత్మకశక్తి తాలూకు కౌశలం తీర్చగలదేమో? పూర్వంవలె యీశక్తి ఇప్పుడు పరదేశాలకు పోకుండానే. స్వదేశంలోనే ఉంటూన్నది. సృజనాత్మకశక్తిఉన్న కళాకారుడు అమెరికన్ మూర్ఖత్వంనుంచి ఎగిరిపోయి మరొక సంస్కృతీస్వర్గాన్ని చేరుకొనేందుకు ప్రయత్నించటంలాంటిది లేదు. దీని ఫలితంగా సంస్కృతీపరంగా అభివృద్ధి స్పష్టమౌతూన్నది. మానసికమైనదీ, ఆలోచనలకు అందేదానికోసం ఇప్పుడు ఆర్థికసహాయం అందుబాటులో ఉంటూండటంవల్ల. మంచి అభిరుచీ, తెలివితేటలతో కూడినదానికిజేయుతూ, న్యాయాన్ని చేకూర్చుతూన్నది. దినదిన ప్రవర్ధమానమయే మేధావులమాదిరి కళాపూరితమైన వాటిని రూపొందించేందుకు దోహదంచేస్తూ, ఊహలకు ముందెన్నడూ లేనంత గౌరవం లభిస్తూన్నది.

అమెరికన్‌లు స్థానిక దృక్పథంనుంచి, అంతర్జాతీయ దృక్పథానికి తమ రాజకీయదృష్టిని పెంపొందించుకొన్న విధంగానే ఇప్పుడు వారు పెంపొందే సంస్కృతీ ప్రాంగణంలో నిలబడి. తమకళాకారులు ధైర్యంగా ప్రపంచమంతా అర్థంచేసుకోగలిగిన భాషలో, భావాల్లో మాట్లాడగలుగుతారని ఆశిస్తూన్నారు.

---

# పదమూడో అధ్యాయం

## వినోదం

యుద్ధసమయంలో అమెరికన్ సైనికులు చాలాకాలంవరకూ సౌత్ ఫసిఫిక్ అరణ్యాలలో ఉండిపోవలసిన పరిస్థితివొచ్చింది: అప్పుడు ప్రతి సైని

కుడూ ఒక దారంముక్కను జేబులో ఉంచుకోవాలనీ అక్కడివారు ఎవ రైనా విరోధభావంతో తనను సమీపిస్తూన్నప్పుడు "పిల్లిఊయల" ఆట ప్రారంభించాలనీ ఆదేశించబడ్డాడు. అనేక సందర్భాలలో అక్కడివారు ఇలాటి ఆటలో పాల్గొనేవారు. కనుక క్రీడలనేవి విరోధభావాన్ని రూపు మాపటానికీ, ఇద్దరిమధ్యా మాట్లాడుకునేభాష కరువైనప్పుడు, ఒకరినొకరు అర్థంచేసుకునేందుకు ఉపయోగపడటానికి సూచనగాఉన్నవి.

పూర్వకాలంలో పండగల సందర్భంగా నడపబడే క్రీడలనుంచీ అధు నాతన కాలంలోని ఒలెంపిక్ పందాలవరకూ, ఆనాటి దేవాలయ నాట్యాల దగ్గర్నుంచీ యీనాటి స్క్వేర్ నాట్యాలవరకూ, స్త్రీ పురుషులు తమతమ స్వభావాలనూ, కోర్కెలనూ శారీరకాంగాల కదలికలద్వారా వెలిబుచ్చేం దుకు వీటిని ఉపయోగించారు కళారూపంవలెనే క్రీడారూపంకూడా గజి బిజిగా ఉన్నదానిని ఒకవరుసలో క్రమంలో ఉంచేందుకు ప్రయత్నించి, దానికంతకూ ఒక అర్థాన్ని కల్పిస్తూంది. ఒకప్రజ ప్రవేశపెట్టిన ఒకానొక క్రీడలో వారి గురీ, జీవితంపట్ల వారిదృక్పథమూ-వారి కళలలోవలెనే-ప్రతిఫ లిస్తూ ఉంటుంది.

అమెరికన్ క్రీడలనుంచీ, వారి విరామకాలాలను అమెరికన్లు ఉపయో గించే విధానాలనుంచీ మనం తెలుసుకోవలసిందేమిటి?

## క్రీడలూ; ఆటపాటలు

యూరపియన్ జానపద నృత్యాల ఆధారంగా రూపొందించబడిన స్క్వేర్ నాట్యాలు, అద్భుతమైన అమెరికన్ సాంప్రదాయంగా అనేక విధాల్లో కనిపిస్తవి. అది పల్లీయ వాతావరణంనుంచి ఉద్భవించటంవల్ల స్థూలంగా దానిదృక్పథం ఆపల్లీయ వాతావరణాన్నే సూచిస్తుంది. ఒకో [illegible] చదరంలో నలుగురు ఆడ-మొగల జతలుండటం జీవశాస్త్రరీత్యా ఏ [illegible] జతను ఒక కొలబద్దగా ఉంచే అవసరాన్ని. నాలుగుజతల్ని కలపట [illegible]ల్లు. ఒకరికొకరు సహాయ సహకారాలను అందించే కౌశలాన్ని అమలు జరిపే

అవకాశాల్ని కలిగించాలనీ ఆదేశించటం జరుగుతోంది. ఆలోచనా, తదను గుణంగా కదలికా యీ రెండూ త్వరితగతిన హుందాతనంగా చేయబడే నాట్యవిధానంలో- అలనాటి వలసదారులు తమ ఊహలనూ, తుపాకులనూ ఒకేఒక్క కదలికలో స్పష్టపరచినవిధంగా - నాట్యం చేసేవారుకూడా ఒక్క కదలికలోనే దాన్ని చూపగలుగుతూన్నారు.

స్క్వేర్‌నాట్యం- సమాజంలోని మానవుని చూపటానికి ఒక చిన్న నమూనా; సమాజంలోని ప్రతిమానవుడూ అవసరమే - ఐతే ప్రతివారి నట నలూ ఏకమై ఒకే ఒక్క హుందాతనంలో ముందుకు సాగాలి- అనేదాన్ని నిరూపిస్తున్నది. స్క్వేర్‌నాట్యం మొత్తం సమాజం పనిచేసే విధానాన్ని సూచనప్రాయంగా తెలియపరుస్తూన్నది. వ్యక్తిప్రాముఖ్యత (వ్యక్తిత్వం) అత్యవసరమనీ ఐతే తనంతట తానే కూడలిలో జేరాలనీ (స్వచ్ఛందసేవా ప్రవృత్తి) ఇందువల్ల సామాజికులు ఒకరికొకరు సహాయ సహకార సాను భూతులను అందించ గలుగుతారనేది స్పష్టమౌతూన్నది. నాట్యకారులు ఇలాటి చదరాలుగా ఏర్పడి ప్రతిచదరమూ తనకుతానుగా పనిచేస్తూ అన్ని చదరాలలోని కదలికలతోనూ సరితూగేవిధంగా (ఫెడరలిజమ్) చూసుకుం టుంది. ఒకవైపుకే మొగ్గిపోకుండా ఉండేందుకుగాను, స్త్రీల కదలికలు, పురుషుల కదలికలను సరితూచుతూ, ఉభయులూ కలిసికట్టుగా జీవించా లనే తత్వాన్ని సుబోధకరంచేస్తూ, ఒక్కో చదరంలోని ఎనిమిదిమంది వ్యక్తులూ చేతులు కలిపి ఒక వృత్తంగా ఏర్పడటంలో చూడనవుతుంది.

ఇదేవిధంగా అమెరికాలోని అనేక క్రీడల్లోకూడా వ్యక్తిత్వపు అవస రాన్ని గుర్తింపజేయటం, ఐతే వివిధవ్యక్తులు కలిసి ఒకటీమ్ (జట్టు)గా ఏర్పడి, ఇతరజట్లతో పోటీలుచేసి గెలుచుకునేందుకు ప్రయత్నించటం- మొదలైన తత్వాలు సుస్పష్టం.

అమెరికన్ సంస్కృతికి ప్రాతినిధ్యం వహించిన బేస్‌బాల్-టీమ్ వర్క్ మీదనే ఆధారపడి ఉన్నప్పటికీ, అందులో పాల్గొనే ప్రతివ్యక్తీ తనశక్తి

సామర్థ్యాలను ఎంతగానో ప్రదర్శించి, తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించే అవకాశాలెన్నో ఉన్నవి. సరిగ్గా గ్రహించటం, గురితప్పకుండుట, వేగం, చప్పునచూసి నిర్ణయించటం, బలమైనహస్తాలు - తప్పక బహుమతులకు అర్హమైనవి. అనుకోకుండా లభ్యమయే అనేక అవకాశాలను ఆటగాడు సక్రమంగా ఉపయోగించుకో గలగాలి; అతను మొత్తం రంగస్థలిలో ఎక్కడెక్కడ ఏమేమి జరుగుతూన్నదో ఒక్కసారి కలయజూడటంతో గ్రహించి ఏవిధంగా ప్రవర్తిస్తే విజయం లభిస్తుందో అంచనాలు వేయగలగాలి. ఆజ్ఞలనేవి లేకుండానే జట్టు జట్టూ కలిసి కట్టుగా పనిచేస్తుంది. ఒకరినొకరు అర్థం చేసుకోవటంమీదా, ఒకరికొకరు సహాయపడటంమీదా విజయం ఆధారపడి ఉంటుంది. ఈ కారణంగానే యుద్ధసమయంలో అమెరికన్ సైనికులు శత్రుసంహారములోగాక, తమ వారిలో గాయపడినవారికి ఎంతో సహాయం చేయటంలో గొప్ప ధైర్యసాహసాలను కనబరిచారు.

1893 ప్రాంతాల్లో స్ప్రింగ్‌ఫీల్డ్‌లో ఆరంభించబడిన బాస్కెట్‌బాల్ కూడా జట్టు పనిచేసే విధానంమీదా, త్వరగా ఆలోచించి నిర్ణయించటంమీదా త్వరితగతినచూపే కదలికలమీదా, వొచ్చిన అవకాశాలను సక్రమంగా ఉపయోగించుకోవటంమీదా- విజయం ఆధారపడిన క్రీడ.

ఇక ఫుట్‌బాల్ విషయంలో 1867 తరువాతనే అమెరికన్‌విధానం అభివృద్ధి చెందింది. ఇందులో తలా, కాళ్లూ త్వరితగతిన పనిచేస్తూ జట్టంతా కలసికట్టుగా ఆడుతూ, కదలికల్లో ఎంతో వేగాన్ని ప్రదర్శిస్తూండాలి; ఇది ఒక శరీరానికీ మరొక శరీరానికీ జరిగే సంఘర్షణలను కొంచెం అమానుషంగానే చూపుతుంది. ఈ క్రీడా పరిసరాలుకూడా యుద్ధవాతావరణాన్ని సూచిస్తవి- మిలటరీబాండు, అందమైన కన్యలూ- పూర్వకాలంలో కోటల గోడలమీద నిలబడి తమ నాయకులను యుద్ధవిజయులు కమ్మనీ, తమ మాన మర్యాదలు కాపాడమనీ ప్రోత్సహించే ధోరణీ, ఉత్సాహపరచే పిచ్చి

కేకలూ ఏ జంతువు గుర్తో పతాకచిహ్నంగా (కొలంబియాకు సింహం) ఉంచటం మొదలైనవి.

క్రీడారంగంలో పాల్గొనే ఆటగాళ్ళవలెనే ప్రేక్షకులుకూడా లాభాలు పొందుతున్నట్లు కనిపిస్తుంది. సరిహద్దుప్రాంతం విస్తరించిన ఆ తొలి రోజుల్లో సరైనచట్టాలు లేకుండుటం, లేదా ఉన్న చట్టాలేవో చాలా బలహీనంగా ఉండటం జరిగినప్పుడు, కేవలం న్యాయంమీదకాకుండా తాను సభ్యుడుగా ఉన్నకూడలి లేదా సమూజంమీదనే తన రక్షణ ఆధారపడి ఉండటం జరిగింది; ఆ తత్వమే యీనాడు అమెరికన్ క్రీడల్లోకూడా ప్రస్ఫుటమౌతున్నది. అమెరికన్‌లు నైపుణ్యమున్న క్రీడారంగపు జట్లుగా రూపొందటంలో, తామందరికీ వాటిల్లో ప్రాతినిధ్యమున్నట్లు భావించి. చుట్టూఉన్న అనేకమంది ఫాన్స్‌కొరకై యీ ఆటలు సాగించటం, యీ విధంగా సమాజంతో దగ్గరిసంబంధ బాంధవ్యాలను కలిగిఉండటం జరిగింది.

## కాలక్షేప కార్యకలాపాలు

దైనందిన జీవితంలోని విశ్రాంతి వేళలు క్రమంగా అత్యధికమౌతూండటంతో కాలక్షేప కార్యకలాపాలు పెచ్చుపెరిగి, ఇక్కడ ఉపహరించలేనన్ని ఉన్నవి. స్త్రీ పురుషులు- పూర్వకాలంలోని మానవులు చేసుకొనే చేతిపనుల పట్ల ఎక్కువ అభిరుచి గలవారై, బహుశా వారివలెనే తాముకూడా కౌశలం చూపాలనే భావనలో వాటిని అనుసరిస్తున్నారు. గార్డెన్‌క్లబ్బులూ, ఫ్లవర్ షోయీ అభివృద్ధి జెందుతూన్నవి. స్టాంపులనుంచి గుండీలవరకూ, బొమ్మలనుంచి ఆటోగ్రాఫ్‌ల వరకూ - పోగుచేయటంలోని ప్రజల కుతూహలం దినదిన ప్రవర్ధమానమౌతున్నది. కాలక్షేపానికి సయమీజ్ కవలలైన పిల్లుల్ని పెంచటం ఇతర పెంపుడు జంతువుల్ని సాకటంకూడా కద్దు.

'నీ అంతట నీవేచేయ్-' అనే నినాదం చాలామందిని అంతకు క్రితం తమ చేతుల్తో తామే పనిచేసి ఎరుగని వారిని ప్రోత్సాహపరచింది; ఇందు

వల్ల పుస్తకాలలో, పనిముట్లలో, ఇతరవస్తువుల్లో క్రొత్తగా 6.000,000,000 డాలర్ల వ్యాపారం సాగింది. చాలా మాగజైన్‌లలో ఫొటోగ్రఫీలో సరికొత్త పద్ధతులను గూర్చిన సూచనలు వెలువడుతూండటంతో - హేపీ - ఉత్తమ తరగతికి చెందిన ఫొటోలను ఏర్పికూర్చే కాలక్షేప కార్యకలాపం ఒక సాంప్రదాయంగా రూపొందింది.

ప్రతి కాలక్షేప కార్యకలాపానికీ ఒక క్లబ్ ఉన్నది. తమ కార్యకలాపంలో ప్రజలు ఎల్లప్పుడూ కొత్త కొత్త మిత్రుల్ని సంపాయిస్తూనే ఉన్నారు. రకరకాల పక్షుల్ని పెంచే కార్యకలాపంలో నిమగ్నులైన వారు- ఏ అర్ధరాత్రిపూటో, ఎక్కడో దూరప్రదేశంలో కలుసుకొని, క్రొత్త పక్షిని, తుపాకితో కాల్చటం కాకుండా, తెలివిగా పట్టుకోవటం ద్వారా పొందాలని చూస్తారు. రహదారిలో ఒక పెద్దవరుసలో పురాతనమైన కార్లు కదలిపోతుంటవి: 50 ఏళ్ళనాడు ప్రజలు ధరించినవిధంగా వింతవింత దుస్తులేవో ధరించి ఒకానొక క్లబ్‌లోని సభ్యులు, పాతకార్లను శుభ్రపరచి సక్రమంగా నడిచేట్లు చేసి వాటి యజమానులు అవి ఇంకా పనిచేస్తూనే ఉన్నందుకు తమ గర్వాన్ని ప్రదర్శిస్తూ ఏసూరతీరానికో షికారు బయలు దేరటమది। సంగీతసాధన చేసేవారు కూడలిగా ఏర్పడి తమ జానపద సంగీతాన్ని, శాస్త్రీయసంగీతాన్నీ పాడుతారు. లాస్‌ఏంజలీస్‌లో కేవలం డాక్టర్లుమాత్రమే సాధనచేసే ఆర్‌చస్ట్రా ఒకటి ఉన్నది.

నాటక కళాభిరుచులున్నవారిని కమ్యూనిటీ థియేటర్లు ఆకర్షిస్తూన్నవి. తాము నటించలేకపోయినా, నాటకకళపట్ల అభిమానులుగా ఉన్నవారు సీనరీలు, దుస్తులూ మొదలైనవి రూపొందించటంలో సహాయపడుతూన్నారు. కొయనెక్ ఐలండ్‌లో ప్రతి ఎండాకాలంలోనూ ప్రదర్శించబడే 'దిలాస్ట్ కాలొనీ' అనేక నాటకాలు పశ్చిమసరిహద్దు ప్రాంతాభివృద్ధిని కథావస్తువుగా కలిగినవి. ఆనాటి జానపద గాథలూ, జానపదనృత్యాలతో ప్రదర్శించబడుతూ ఎన్నో సంవత్సరాలుగా దేశాభివృద్ధికి పాటుబడినవారికి యీనాడు

వినోదాలను అనుభవించే అవకాశాలను కలిగించి వారి సంస్కృతిని కళా పూరితం చేస్తున్నది.

గ్రామంలోని విద్యాలయాన్ని సామాజికులు ఒక కేంద్రంగా ఉపయోగించటమనేది కలకాలంగా వొస్తున్న ఆచారం. హైస్కూల్‌లో రాత్రులందు దీపాలకాంతి కళ్ళు మిరిమిట్లు గొలిపేట్లు కనిపించకపోవటం చాలా అరుదు; రాత్రులందు ఫర్నిచర్ తయారు చేయటాన్ని నేర్చుకునేవారు ఒకవైపుగా P. T. A. వారు కలుసుకొనే థియేటర్లో తల్లిదండ్రులుండటం మరొకవైపున చిన్నపిల్లలు నాట్యాలుచేయటం ఇంకోవైపున పుస్తక భాండాగారంలో పాఠకులుకూడి అనేక విషయాలను చర్చించటం మరొక దిక్కున సాగుతూనే ఉంటుంది. కొన్ని పట్టణాలు విద్యాలయాల్లో వినోద కార్యకలాపాలను కొనసాగించేటంత పెద్దవిగాకూడా ఉన్నవి.

పూర్వం పార్కులు ఏవో ఉండాలి లెమ్మనే ధోరణిలో అమర్చబడితే ఇప్పుడవి ప్రజోపయోగాలకొరకై సిద్ధపరుచబడుతూన్నవి. వీటిల్లోకల్లా ప్రఖ్యాతిచెందినవి- గొప్పగొప్ప జాతీయమైన పార్కులు; మైనీనుంచి, వాషింగ్టన్ రాష్ట్రంవరకూ విస్తరించి ఉన్న పార్కులు చూసేందుకు వీలుగా అధునాతన పద్ధతుల్లో రోడ్డునిర్మాణం జరిగి, అక్కడి ప్రజల ప్రకృతి సహజమైన వంశపారం పర్యతను కాపాడింది. మొదటిదీ పెద్దదీ ఐన ఎల్లోస్టోన్ 3, 500 చదరపుమైళ్లు విస్తరించి ఉన్నది: అక్కడ స్వభావసిద్ధంగా ఏర్పడిన వేడినీటి ఊటలూ, రంగురంగుల బురదను విరజిమ్మే గుంటలూ సరస్సులతో కన్నులపండువగా కనిపించే దృశ్యవిశేషాలూ, అడవులూ పర్వతశ్రేణులు మొదలైనవి ప్రకృతి అద్భుతాలను కళ్ళకు కట్టినట్లు ప్రదర్శిస్తవి. చారిత్రక ప్రసిద్ధిచెందిన యుద్ధరంగాల తాలూకు పార్కులు- చిన్నవైనప్పటికి, లింకన్ జన్మించాడని చెప్పబడే కొయ్యదుంగల కేబిన్‌లలాటివికూడా యీ నాటివరకూ భద్రపరచబడి

ఉంటూ గెట్టిస్‌బర్గ్ యుద్ధరంగం వర్జీనియాలోని జేమ్స్‌టౌన్- ఆంగ్లేయులు మొట్టమొదట అమెరికాలో ఏర్పరచుకొన్న స్థావరాల్లాటివి- నేటికీ ఉన్నవి.

150 జాతీయమైన అరణ్యాలు 4, 400 కాంపులు, పిక్నిక్ కేంద్రాలతోను, వేటకూ, చేపలుపట్టేందుకూ, ఈతకూ వీలుగ ఉండే ప్రదేశాలతో ప్రజానీకంకొరకు ఎదురు చూస్తూనే ఉన్నవి. ఈ అడవుల్లో ప్రశాంతంగా జీవితాన్ని గడుపుతూ, స్వేచ్ఛగా హాయిగాఉంటూ ప్రకృతిసౌందర్యాన్ని అనుభవించాలనే కుతూహల మున్నవారు కొద్దినాడుగను భూమిని సేకరించి ఇళ్ళు కట్టుకోవొచ్చును. దాదాపు అన్నిరాష్ట్రాలలోనూ చారిత్రాత్మక ప్రాధాన్యత ఉన్న కట్టడాలూ, పార్కులూ ఉండి, అక్కడ కొద్దికాలం పాటు ఉండేందుకు సౌకర్యాలు చేయబడినవి.

సెలవురోజుల్లో అమెరికన్‌లు యీ ప్రదేశాలకు ప్రవాహంగా వొచ్చిపడుతూండటంవల్ల, ఒకోసారి ఇక్కడి చోటుకూడా సరిపోదు. తమ చరిత్ర అభివృద్ధిగాంచిన ఆ పురాతన ప్రదేశాలు చూడాలనే కుతూహలంతో తహతహలాడగా, తమపిల్లలు ఏప్లిమౌత్ సర్వతమో చూడాలని, జఫర్‌సన్ మానటిసెల్లోలోని భాగం చూడాలని లేదా దేవీక్రోకెట్ మరణించిన ప్రదేశం అలామో చూడాలని - మాట్లాడుకోవటాన్ని పెద్దలు వింటూంటారు. ఇంకా అనేక విషయాలు తెలుసుకోవాలని కుతూహలపడేవారు. ఎంతో ఆకర్షణీయంగా ముద్రించబడిన ఆయారాష్ట్రాల తాలూకు గైడ్స్‌కూడా వెంటతీసుకొని వెళ్తారు. అమెరికన్ చరిత్రలో ఇదివరకెన్నడూ గడిచిపోయిన కాలంతాలూకు చిహ్నాలను చూడాలనే ఇంత ఆతృతకానీ, ఆయా కట్టడాలను పునర్నిర్మించి, భద్రపరచడంకానీ ఇంత పెద్దయెత్తున సాగలేదు. పాతసాలెమ్ పునర్నిర్మించబడింది; తరువాత పాత విలియమ్స్‌బర్గ్, అటు పిదప పాత స్టర్‌బ్రిడ్జ్ తిరిగి కట్టబడి, ఇప్పుడు పాతప్లిమౌత్ పునర్నిర్మించబడుతోంది. ఇదే ధోరణి మరికొంత కాలంపాటు సాగుతే, యూరప్‌లో కన్నా అమెరికాలోనే పురాతన భవనాలసంఖ్య అధికంగా ఉండగలదు.

ఇదివరకు లేని ఎండాకాలపు సెలవులు ఇప్పుడు వేలకొద్దీ కార్మికులకు లభ్యమవటంతో, వీరు తమతమ కుటుంబాలను స్వంతకార్లల్లో తీసుకొని దేశంలోని నలుమూలలకూ ప్రయాణమై తమ జాతీయతలోని వివిధ ప్రజలనూ, వివిధ జాతులనూ చూడటం, వారితో పరిచయం సంపాయించటం అనేక దృశ్యవిశేషాలను చూడటం, పురాతన చరిత్రా చిహ్నాలను దర్శించటం జరుగుతూన్నది. ఈ దేశాటనాన్ని భరించలేని కుటుంబాలలోని పిల్లలకు స్వచ్ఛమైన గాలి పీల్చేందుకు వీలుగా ఉండే కాంపులూ, గృహాలూ ఉన్నవి: ఈ గృహాలు ఆ యా పరిసరాల్లోని, లేదా గ్రామాల్లోనివారే నడుపుతూ పిల్లలకు ఉచితంగా నివాసాలను ఇస్తున్నారు.

తనచుట్టూ అతివేగంగా కదిలిపొయ్యే యీ సంఘటనలకు అనువుగా దుస్తుల ధారణలోకూడా ఎన్నోమార్పులు వొచ్చినవి. కార్లలో ఎక్కువ దూరప్రయాణాలు చేయటం, కాంప్‌చేయటం, పర్వతాలమీదినుంచి ప్రవహించే సెలయేళ్ళల్లో చేపలు పట్టటం, వర్క్‌షాప్‌లో పనిచేయటం మొదలైన వాటికొరకై పురుషుడు తన చొక్కాచేతుల్ని పైకి మడుచుకోవలసి ఉంటుంది; యీ బాధనుంచి తప్పించుకొనేందుకు అతను పొట్టిచేతుల నీలపురంగు చొక్కా ధరిస్తాడు. స్త్రీలుకూడా పొట్టిగాఉండే గౌనులు ధరిస్తారు: ఉత్తమ తరగతికి చెందిన మోటార్లుకూడా "మీ రెలా వొచ్చారో, అలాగేరండి!" అన్న నినాదాన్ని ప్రదర్శిస్తున్నవి.

ఈ పైమెరుగుల అవసరం లేకుండటమనేది ఇద్దరు స్నేహితులు ఒకరికొకరు అతిథులుగా ఉన్నప్పుడుకూడా అమలుజరుగుతూన్నది. సేవకులూ వంటవారూ లేకుండానే వంట ముందుగానే వండటం, వేడిపదార్థాలను భోజనశాలకు తెచ్చుకోవటం, అక్కడే ఏ కుర్చీలోనో కూర్చొని భోజనం చేయటంలాటి దృశ్యాలు పరిపాటి.

ఎక్కువ విశ్రాంతికాలం ఉన్నకుటుంబాలు తమ వ్యవధిని సక్రమంగా ఇంటనే ఉపయోగించే మార్గాలు అన్వేషిస్తవి. వర్క్‌రూమ్ లేదా వర్క్

షాప్ అనేది ఇప్పుడు ఒకో గృహంలో అత్యవసర మైనదిగా ఉంటూన్నది. మన స్తత్వ వేత్తలు అనుమతించినవీ, పిల్లల మనస్తత్వాలను సరిదిద్దే ఆట వస్తువులు పిల్లలకు ఇవ్వబడుతూన్నవి. విద్యాలయం చెప్పని అనేక ఆట పాటల్లో వారిని ప్రవేశపెట్టేందుకు, పిల్లలు పెద్దవాఃవుతూన్నకొద్దీ బైటికి పంపబడతారు—పియానోను వాయించటం, నాట్యం, టెన్నిస్, గుర్రపుస్వారీ మొదలైనవి పెరిగేపిల్లలు నేర్చే ఆటపాటలు.

మన స్తత్వ వేత్తల అనుమతిని పొందిన మరొక క్రీడకూడా గృహం లోకి ప్రవేశించింది. ఇదే ప్రణయక్రీడ, భార్యాభర్తలమధ్య లైంగికసంబంధ మైన ప్రణయమే సుస్థిరమైన కుటుంబజీవనానికి మూలాధారమనే సిద్ధాంతా న్ననుసరించి, పూర్వపు అభిప్రాయాలలో మార్పులువొచ్చి, ఆ భయాలు మాయమైనవి: లైంగికప్రణయక్రీడ స్వభావసిద్ధమైనదీ, కుటుంబ జీవనా నికి మూలాధారమైనదీ, తగినరీతిఉండి ఆధునిక ప్రపంచంలో విసుగు, చిరాకుల నెల్తించే అనేక బరువు భారాలనుంచి విడుదలయేందుకు సక్రమ మైన మార్గంగా అమలు జరుపబడి, దంపతులు ఎంతో హాయిగా, తేలిగ్గా జీవితాన్ని గడుపుతూ, నవ్వుతూ కాలం వెళ్ళబుచ్చ గలుగుతూన్నారు.

ఇక ముసలివారూ, వయస్సుతోపాటు పనులనుంచి విధిగా విరమించిన వారి వినోదంకొరకు, కొత్త కొత్త పథకాలు ఏర్పడి వారిపట్ల దయాదాక్షి ణ్యాలనూ, ఒకరికీ మరొకరికీ మధ్య అనురాగం వర్ధిల్లేవిధంగా పని చేస్తు న్నవి. దేశమంతటా సీనియర్ సిటిజెన్స్, లేదా "గోల్డెన్ ఏజ్" సమా జాలు ఏర్పడినవి. వీటిల్లోని సభ్యులు అందరి అభిరుచులకూ అనుగుణంగా ప్రోగ్రాములు- చర్చావేదికలనుంచీ నాట్యరంగాలవరకూ- వేస్తారు. జీవిత మంతా పోరాటంలోగడిపి విసుగెత్తి, చిరాకుపడే అనేకులకు జీతంబత్తెం లేకుండా సమాజానికి సేవచేసే అవకాశాలు లభించటంవల్ల, స్కూల్ బోర్డ్ లేదా ఇతర స్థానిక సమాజాలలో సభ్యులుగాఉండి ఎంతో తృప్తి పడుతున్నారు. ఏ 65 వ ఏటనే పనినుండి నిష్క్రమించవొచ్చనే ఇప్పటి

నిబంధనవల్లా, కాలం గడిచేకొద్దీ మానవుని జీవితప్రమాణం పెంపొందు తూండటంవల్లా, జాతికి ఎక్కువమంది ఎక్కువకాలాన్ని సేవలో గడిపే వారు లభ్యమౌతూన్నారు.

ఐతే దురదృష్టవశాత్తూ అన్ని వినోదాలూ సమాజానికి మేలుచేయటం లేదు; లోగడ వివరించినవి వికాస విజ్ఞానాలకూ్కడా దోహదం చేస్తు న్నవి. కాని నెవడారాష్ట్రంలోని లాస్‌వెగాస్ దేశంలోకల్లా జూదాన్ని అత్యుత్తమస్థాయిలో నడుపుతోంది; 1955 లో అమెరికన్‌లూ, పరదేశీ యులు కొంతమందీ రోజుకు సరాసరిన 3,861 మంది వొంతున తమ ధనాన్ని జూదంలో విరజిమ్మేందుకు వొచ్చి 60,320,000 డాలర్లు జూదంలో ఒడ్డారు. 1952 లో అమెరికన్‌లు 5.3 బిలియన్ డాలర్లు పొగాకుమీదా, అంతకు రెట్టింపు మత్తుపదార్థాలమీదా వెచ్చించారు.

## విశ్రాంతి—దేనికి?

విశ్రాంతి కాలాన్ని ఉపయోగించే అనేక పద్ధతులద్వారా, అమెరికన్‌లు తాము కష్టించి పనిచేసి సంపాయించిన విరామకాలాన్ని సక్రమంగా ఉపయోగించి, తాము కష్టించి సంపాయించిన ధనాన్ని కాకుండా, వేరే దైనా సంపాయించాలని తహతహ లాడుతూంటారు. ఏవొక్కటీ బరువై తక్కెడ తలక్రిందులవకుండాచూసే తత్వమున్న వీరు, కేవలం విశ్రాంతి తీసుకుంటూ హాయిగా కాలంగడుపుతూ ఏదో కొత్తకొత్త అరణ్యాలను జయించినంతగా గర్విస్తారు.

కొత్తదనాన్ని సృష్టించటమనేదాన్ని అమెరికన్‌లు మొదటినుంచీ తమ తమ వృత్తులలోనూ, కౌశలమున్న పనుల్లోనూ చేసి చూపుతూనే ఉన్నారు. పని అనేది- అన్నపానాదులవలెనే ప్రేమించవగింది. తాము పనిచేయటం వల్ల వారుచేసిన అత్యధికోత్పత్తికి క్షయాన్నికూడా చూపవలసిన అవసరం ఉన్నది; కనుక తక్కువకాలం పనిచేసి, ఎక్కువకాలం ఉత్పత్తిఐనదాన్ని

ఉపయోగించవలసిన అవసరం ఉన్నది. ఈ ప్రాథమికమైన మార్పు, దృక్పథం లోనే మార్పు తీసుకొచ్చింది. పూర్వం అమెరికన్ పనిలో నీతివిచూస్తే, ఇప్పుడు నవ్వులాటలో దాన్ని చూస్తున్నారు. నిజానికి యీ నవ్వులాట వైపే ఎక్కువగా మొగ్గుతూ, ఆత్రపడుతూన్నాడు కూడాను. కనుక విశ్రాంతివేళల్ని వినియోగించే విధానాలనేవి ఇతర విషయాలవలెనే నేర్చుకోవలసి ఉన్నవి.

నైపుణ్యమున్న పనివారిమీదా, కళాకారులమీదా పరిశ్రమలు తీసిన దెబ్బనుంచి అమెరికనులు ఇంతకుముందే కోల్కొన్నారు. సాంకేతిక నైపుణ్య సహాయంతో నాటకకళద్వారా సామాన్యప్రజను జేరే అవకాశం లభించటంతో, కళా, పరిశ్రమా ఒకదానితో మరొకటి పెనవేసుకొని పోయినవి. దీర్ఘకాలం కట్టుబడిపోయి ఉండటాన్నుంచి ఆటోమేషన్ (వాటంతటవిగా పనిచేసే యంత్రాలు) విడుదలను ప్రసాదించగా, పరిశ్రమ అతని పురాతన సాంప్రదాయాలను పురికొల్పేదిగానూ, చేతిపనుల్లో నిపుణతను ప్రసాదించేదిగానూ రూపొంది, ఎక్కువ విశ్రాంతికాలాన్ని ఇస్తూన్నది. కనుక మానవుడు చుట్టు తోవలో తిరిగితిరిగి తగినంత కాలాన్నిపొంది, వ్యక్తిగతమైన సృష్టిచేసేందుకూ ఆటపాటల్లో పాల్గొనేందుకూ నోచుకుంటున్నాడు; ఇన్నాళ్ళుగా అతన్ని బంధించిఉంచిన ఇనుపచేతుల పట్టునుంచి విడిపడుతున్నాడు. సాంకేతికాభివృద్ధి కారణంగా అనేకవస్తువులు వరదల వలె వొచ్చిపడి ఎందరికో మేలుచేస్తూ, భౌతికవాద ప్రస్తావనేలేని జీవితం కొరకు చేసే ఆలోచనలకూ కూడా తగినంత వ్యవధిని ఇస్తూన్నది; నిజమైన సృష్టిఅనేది జరగవలసింది ఇక్కడే.

ఈ బ్రహ్మాండమైన వృత్తంలో తిరిగి తిరిగి మానవుడు చివరకు ఏడెన్ ఉద్యానవనానికే వొచ్చినప్పటికీ, యీ ప్రయాణం వృధాప్రయాస అని ఎవరనగలరు?

---

# పధ్నాలుగో అధ్యాయం

## శాస్త్రము : మానవుడు

శాస్త్రమూ, శాస్త్రీయ పద్ధతులూ వినూత్న జీవితాన్ని వాగ్దానం చేసిన సమయంలో, సకారణవాద ప్రాబల్యం అత్యధికంగా ఉన్న కాలంలో అమెరిక రిపబ్లిక్ ఉదయించి సామాజిక శక్తిలో శాస్త్రీయ దృక్పధానికి ప్రాధాన్యతను ఇచ్చి, తన ఆశలన్నిటినీ దానిమీదనే ఉంచింది. బెన్ ఫ్రాంక్లిన్ పరిశోధనలూ, థామస్ జఫర్సన్ కొత్త సృష్టులదగ్గర్నుంచి అధునాతనంగా తయారైన పారిశ్రామికోత్పత్తి వరకూ శాస్త్రమనేది అమెరికన్ విధానంలో మిళితం చేయబడింది – కేవలం కుతూహలోద్దేశ్యంతోగాక, మానవసేవనే గురిగా పెట్టుకొని, అత్యధికోత్పత్తికి దోహదం చేసి ప్రజలందరికీ మేలుకూర్చేదిగానూ, ప్రజాస్వామ్య సిద్ధాంతాలను నడిపేందుకు అత్యవసరమైనదిగానూ ఉన్నది. త్వరితగతిని ప్రజలనూ సరుకులనూ జేరేసేవిధానంవల్లా, వార్తలను క్షణాలమీద ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి అందివ్వగలిగే సౌకర్యంవల్లనూ మన మేలునూ, బాధ్యతలనూ విశాల దృక్పధంలోకి లాగి, విశాలప్రపంచాన్ని నివాసానికిగాను ప్రసాదించి, నటనాకౌశలాన్నీ ప్రదర్శనయోగ్యమైన కళలనూ మన గృహాల్లోకి కొనివొచ్చి, స్త్రీ పురుషుల పాత్రలను తారుమారుచేసి, ఎన్నో మార్పులను ఎంతో వేగంగా తీసుకొని రావటంతో - ఆశ్చర్యకరంగా మారిపోయిన యీ ప్రాపంచిక విషయాలనుగూర్చి మన పిల్లలు మనకు విశదపరచవలసి వొస్తోంది.

శాస్త్రం జీవితప్రమాణాన్ని పెంచటం, శిశుమరణాలను తగ్గించివేయటం వల్ల – మనలోని పిన్నపెద్దల నిష్పత్తిలో మార్పుతీసుకొని వొచ్చింది.

వంతానాన్ని కనటమనేది కేవలం యాదృచ్ఛికంగాకుండా, మానవునికోరెక్క ప కారమే జరిగే అవకాశం ఉండటంవల్ల, శిశుజననం ఒక భారం అవ లేదు సరికదా, శాస్త్రీయ విజ్ఞానంవల్ల సుఖసౌఖ్యాలకు కారణభూతమైంది. అది అనేక వ్యాధులను నామరూపాలు లేకుండాచేయటం, మిగతావాటికి నివారణల్ని కనిపెట్టటంవల్ల, మనం బాధలనుంచి విముక్తిపొందాము. అధిక సంఖ్యాకులుగా ఉంటూన్న ప్రజానీకాని 'కంతకూ అహారాన్ని సర ఫరా చేసేవిధానాలు దానికితెలుసు: అదేవిధంగా చీమలపుట్టను కాలితో రాచి నాశనం చేయగలిగినంత తేలిగ్గా మానవజాతినే తుడిచిపెట్టివేయగల సామర్ధ్యతకూడా దానికి ఉన్నది.

శాస్త్రాన్ని ఒక ఆయుధంగా ఉపయోగించటంద్వారా యీనాడు అమెరికన్‌జాతి పొందిన నాగరికత స్పష్టమౌతూన్నది. అనాటి శాస్త్రీయ సిద్ధాంతాలు, యీనాడు పరిశోధనాలయాల్లో పరిశోధించబడి, రుజూచేయబడి, ప్రజావసరాల కొరకై అత్యధికోత్పత్తి ప్రణాళికల్లో విజయవంతంగా ప్రవేశపెట్టబడుతూన్నవి. కేవలం పరిశోధనా ఫలితాలకారణంగానే అనేక కొత్తకొత్త పరిశ్రమలు మొలకెత్తి. సరికొత్త వస్తువులు - నైలాన్, ప్లాస్టిక్‌లాటివి ఉత్పన్నమౌతూన్నవి.

ఐతే శాస్త్రం ఒకానొక మానసిక దృక్పధాన్ని, తత్వాన్ని అనుసరించేదిగా కూడా ఎంతో ప్రాముఖ్యమైనదిగా ఉంది. అదే అనేక సమస్యలను ఛేదించేందుకుగాను ఆయాపరిష్కార మార్గాలను పరిశోధించేదిగా-భౌతిక విషయాలలోనేగాక, మానవత్వానికి సంబంధించిన అన్ని విషయాలలోను సర్వజనసమ్మతంగా ఉంటూన్నది. ఒక విషయాన్నిగూర్చి చిరాకుపడటం లేదా గుడ్డిగానమ్మటానికి వీల్లేకుండా వేరొకమార్గాన్ని శాస్త్రం చూపుతూన్నది. చివరకు ప్రకటనల్లోకూడా శాస్త్రీయదృక్పధాన్నీ, ఆయా ఫలితాలనూ వివరించటంవల్ల పాఠకుణ్ణి ఆకట్టుతున్నారు; "ఐదింట నలుగురు డాక్టర్లు యీ విషయాన్ని ఒప్పుకుంటున్నారు...." "ఇంజనీర్లు మెచ్చు

కొన్న యీ కారును కొనండి" మొదలైనవి ఉదాహరణలు. కారులోని భాగాల విషయం ఏమీ తెలియనివారుసైతం, శాస్త్రకారులు మెచ్చినది కావటంవల్లనే ఆ కారును కొనేందుకు కుతూహల పడుతూన్నారు.

ఆధునిక ప్రపంచంలో శాస్త్రం ధరించిన కేంద్రీభూతంగా ఉండే పాత్రను గుర్తించి, 1950 లో కాంగ్రెస్ "నేషనల్ సైన్స్ ఫౌండేషన్" ను స్థాపించింది; ప్రాథమిక పరిశోధనలనూ, శాస్త్రాల్లో విద్యావ్యాప్తినీ అభివృద్ధిచేసి ప్రోత్సహించేందుకూ, జాతీయదృక్పథం తదనుగుణంగా ఉండేందుకూ, యీ జరిగేదంతా సామాన్యుల సుఖసౌఖ్యాలకు దోహదంగా ఉండేందుకూ యీ సంస్థతాలూకు కార్యకలాపాలు దోహదమవ్వాలని ఉద్దేశించబడింది. పాలసీలను తయారు చేయటంలో అపజయాన్ని పొందినందుకు విమర్శలకు గురైనప్పటికీ- సాధ్యమైనంతవరకూ అనుభవంలోకి తీసుకొచ్చే దానికన్నా ప్రాథమిక శాస్త్రీయ విజ్ఞానాన్ని బలపరచటం, సెకండరీ స్కూల్స్‌లోని విద్యకు శాస్త్రాన్ని మిళితంచేసి ఎక్కువమంది సైన్‌టిస్టులు తయారయేందుకు అవకాశాన్ని కల్గించటం సైన్‌టిస్టుల కోవకు చెందిన వారిని రహస్యంగా నిర్వహించ వలసిన పరిశోధనలకు ఉపయోగించటం- మొదలైన విధులను యీ ఫౌండేషన్ పాటించింది.

## శాస్త్రమూ : సామాజిక సంస్కరణ

తెలివిగల యువకులైన మెకానిక్స్ దొడ్డిలో ఉన్న గారేజ్‌లో పని చేసే విధంగా, అమెరికన్‌లు సదా తమ సమాజాన్ని బాగుచేసి పై అంతస్థులకు తీసుకొని వెళ్ళేందుకు ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. ఈ సంస్కృతిలో ప్రోత్సాహకరంగా కనిపించేవాటిల్లో - గురిచూచినదేదో పై అంతస్థుల్లో ఉండటమూ, అదీ విపరీతపరిమాణాల్లో ఉండటమూను; ఆ అవర్శాన్ని అందుకోవటంలో సామాజికులు శాస్త్రీయపద్ధతులమీద సాగే విమర్శను ఎప్పుడూ ఎదుర్కోవలసే ఉంటుంది. అడపాదడపా స్వార్థంతోఉండే

కుంచితభావాలు విజయాన్ని పొందనప్పటికీ- శాస్త్రీయమైన రుజూలు బరువైనవిగాఉండి నిర్ణయాలలో ప్రముఖపాత్రలను తీసుకోవలసే ఉంటవనేది గుర్తించబడింది.

17 వ శతాబ్దంలో యూరప్‌లోనిపరిస్థితులే అమెరికాలోకూడా ఉండటం వల్లనే అమెరికన్‌జాతి విప్లవాన్ని నడిపింది. కనుక విప్లవంద్వారా జరిగే సంస్కరణ అమెరికన్ ప్రత్యేకతగా ఉన్నది; ఐతే విశ్వాసం - మొదట్లో భగవంతునిపట్లా, ఆ తరువాత మానవాభ్యుదయంపట్లా ఉండేదికూడా సంస్కరణకు అవసరమౌతూనే ఉన్నది. ఈనాటి అమెరికన్ సామాజిక సంస్కరణలో మతానికీ, నీతికీ సంబంధించినవాటికి ప్రత్యేకస్థానాలున్నవి; అందుకనే మార్క్స్ లెనిన్ సిద్ధాంతాలకు అలవడినవారి చెవులు - అమెరికన్ పద్ధతిలో జరిగే సంస్కరణను గుర్తించలేవు; లేదా దాన్ని అనుమానంతో చూస్తవి.

అమెరికాలో సంస్కరణ నిమిత్తంగానూ, ఉన్న పరిస్థితుల్ని ఎదుర్కొంటూన్న ధోరణిలోనూ వెలువడిన విపరీత పరిమాణాల్లోఉన్న సాహిత్యాన్నిగూర్చి పరదేశీయులకేమి తెలియను. అమెరికాగడ్డమీద వ్రాయబడిన మొట్టమొదటి ఆంగ్లగ్రంథం విలియమ్ బ్రాడ్ ఫోర్డ్ రచన "ఆఫ్ ప్లిమాత్ ప్లాంటేషన్" నాడే యీ ఎదుర్కొనే ధోరణి ఆరంభమైంది. అనాటినుంచీ వలసదారుల పాలనగుండా జఫర్‌సన్ కాలంవరకూ- విలియమ్ లాయడ్ గారిసన్, సుసాన్ బి. ఎంథోనీ, డెమీరెస్ట్ లాయిడ్ మొదలైనవారి రచనలద్వారానూ, వారి ప్రవర్తనల ద్వారానూ కొనసాగుతూ, సామాజిక నీతిని అమలు జరిపేందుకు కంకణం కట్టుకొన్న వారి ఆదేశాలూ 1840 లో ఉద్భవించిన సంస్కరణోద్యమం- ఆధ్యాత్మికతత్వం సోషలిజమ్, మొదలైన నినాదాలెన్నో వినవౌతూ, శతాబ్దంపాటు సాగింది.

బ్రయన్, టెడ్డీరూజ్‌వెల్ట్ నుంచి విల్సన్, లాషోక్లిట్టీవరకూ- న్యూడీల్ దగ్గర్నుంచీ ఆశ్చర్యకరంగా — ఐసెన్‌హోవర్ దాకా సంస్కరణఅనేది

రాజకీయాలకు ఎంతో ఆశాజనకంగా ఉన్నది. ఇప్పుడు కన్సర్వేటివ్ పార్టీవారు తమ సమాజంతాలూకు సువార్తలను కావలించుకున్నారు: ఐతే కొంతమంది సభ్యులు ఇంత దగ్గిరసంబంధాన్ని హర్షించలేము. సంస్కరణ కర్తల తాలూకు పధకాలు- పాప్యులిస్ట్లూ, సోషలిస్టులూ, ప్రోగ్రసివ్స్ మొదలైనవారి నినాదాలు ముందుగానో కాస్త ఆలస్యంగానో చట్టరూపాలు ధరించినవి.

ఆక్షేపణలను తెలియపరుస్తూ, సంస్కరణ అవసరమనేదాన్ని ప్రోత్సాహపరిచిన విషయాలివి; మానవుని సకారణ వాదనకు శాస్త్రీయదృక్పధం కూడా తోడవటంతో జీవితస్థాయి పెరగటం, అత్యధికోత్పత్తిని జనులందరూ పంచుకోవటమూ జరుగుతుంది. ఇదే ఆమెరికన్లకు వేదంగా ఉంటూ ప్రముఖ రాజకీయ పార్టీల మాటలూ, చేతలూ బలపరుస్తూన్న విషయం. రెండు ముఖ్యరాజకీయపార్టీలూ ప్రజలూ తమ క్షేమమూ అభివృద్ధీ, ప్రపంచమంతటా యీ విధానం విస్తరించినప్పుడే మరింత కట్టుదిట్టంగా ఉంటవనే విషయాన్ని గ్రహించినవి.

ప్యూరిటన్ల ఆక్షేపణలు సకారణ వాదానికి తోడుగానూ, క్రిస్టియన్ మత దృష్ట్యా వెలువడే సామాజికదృక్పధం శాస్త్రీయపద్ధతి అభివృద్ధయే విధానానికి తోడుగానూ ఉండి- యునైటెడ్ స్టేట్స్లో శాస్త్రం మానవాభ్యున్నతిని సాధించే సాధనంగా రూపొందింది. జేమ్స్టౌన్, ప్లిమౌత్ల దగ్గర్నుంచీ బ్రూక్ఫారమ్, ఒనీడాసమాజంవరకూ - బైబిల్ కామన్వెల్త్ నుంచీ అన్ని జాతులవారూ కలిసికట్టుగాఉండే గృహనిర్మాణ కార్యకలాపాల వరకూ-దేశంలో సామాజిక పరిశోధనలు జరిగినవి. అడవులలో కొత్తకొత్త స్థావరాలను ఏర్పరచుకోవటంలాటివి ప్రత్యేక పధకాలుగా పరిణమించినవి; ఉదాహరణగా జాన్జేషిప్హెర్ట్ ఒహియోలోని ఓబెర్లిన్లో ఒక విద్యాలయంచుట్టూ తన సమాజాన్ని ఏర్పరిచాడు: ఈ విద్యాలయం యువతీ యువకులకు తన సామాజిక పరిస్థితులనూ సమాజానికి

సంబంధించిన మంచిచెడులనూ బోధించి వొచ్చినదాన్ని సామాజికులందరూ పంపిణీ చేసుకొనే విధానాన్ని ఆ అడవీప్రదేశ మంతటా మారుమోగించింది.

ఆయా సమాజాలు సామాజిక పరిశోధనాలయాలు. ఆ తరువాత సామాజిక శాస్త్రవేత్తలు సామాన్య సమాజాలను పరిశీలించి, అవి ఎందుకు విజయవంతమైనవో లేక ఎందుకు అపజయాన్ని పొందినవో తెలుసుకో సాగారు. ఇలాటి పరిశీలనల్లో ప్రఖ్యాతిగాంచినది-రాబర్ట్, హెలెన్ లిన్డ్‌లు మిడిల్‌టౌన్ సమాజాన్నిగూర్చిన చేసిన పరిశీలనలు. సామాజిక స్థావరాలవారు తమ ఇరుగు పొరుగుల బీదరికాన్నిగూర్చి తెలుసుకొని, ఆయా సమస్యలను గ్రహించి వారి అవసరాలను తీర్చేందుకు చేసిన ప్రయత్నాలు యీ పరిశీలనకు పురోగాములు. ఆ తరువాత ఇలాటి పరిశీలనలు ప్రవాహరూపాన జరిగినవి; వీటిల్లో సువిశాలమైన పరిశీలన డబ్లియు. లాయడ్ వార్నర్, ఆయన అనుచరులూ కలిసి యాంకీ సిటీప్రాజెక్టును గూర్చి చేసినది.

విశేష ప్రజానీకంనుంచి సేకరించిన అనేక రుజూల సహాయంతో సామాజిక శాస్త్రజ్ఞులు - మానవ స్వభావాన్ని గూర్చీ సామాజిక పరిస్థితులను గూర్చీ, సామాజిక సంస్థలనుగూర్చీ శాస్త్రీయ విజ్ఞానాన్ని అభివృద్ధిచేశారు. జీవశాస్త్రజ్ఞుడు సజీవకణాలను దుర్బిణిలో ఎంత నిర్లిప్తంగా పరిశీలిస్తాడో, అదేవిధంగా సామాజిక శాస్త్రజ్ఞులుకూడా మానవ ప్రవృత్తినిగూర్చి అంత నిర్లిప్తంగానూ పరిశీలనలు జరిపారు. సామాజికతత్వం ఎలాఉన్నదో ముందుగానే చెప్పగలగటం, దుష్టశక్తులను తొలగించటం లేదా సామాజికమైన చెడులను తొలగించడానికి మార్గాలు చెప్పగలుగుతూన్నారు.

డార్విన్ సిద్ధాంతాలూ లేదా ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ప్రజలను ఆకర్షించిన విధంగానే, సామాజిక శాస్త్రజ్ఞుల పరిశోధనలుకూడా వీరి హృదయాలను మాసుకొని పొయ్యేవిగా రూపొందినవి. సాధారణ పౌరునికోసమై ఉద్దేశించబడిన యీసామాజిక శాస్త్రీయవిజ్ఞానం, దాన్ని అర్థంచేసుకోలేని

వ్యక్తికూడా దాని శక్తిని గౌరవించటం జరిగి, సామాజిక న్యాయం లభించింది. అనేక సందర్భాలలో శాస్త్రీయవిజ్ఞానం అనేక సరుకుల్ని సరఫరా చేస్తూ, విజయాన్ని సాధించిన కారణాలన్నీ యీ క్రొత్తశాస్త్రీయ విజ్ఞానాన్ని సుస్థిరం చేసేందుకు పోరాడసాగినవి. సామాజికశాస్త్రం ఎత్తిచూపిన మచ్చలు కోసివేయబడటం లేదా మాన్పివేయబడటం జరిగితీరాలి. డాక్టర్ రోగాన్ని నిర్ణయించటమేగాక, దానినుంచి రోగికి విముక్తి కలిగించే విధంగానే- సామాజిక శాస్త్రజ్ఞుడు జాతివైషమ్యాలూ బాల బాలికల్లోని నేర ప్రవృత్తులూ, చితికిపోయిన గృహాలూ మొదలైనవాటిని బాగుచేసేందుకు తగిన పథకాల్నికూడా సిఫారసు చేస్తున్నాడు.

ఈపని కమ్యూనిటీ అంచనాలతో ఆరంభమై, ఆయా సమాజపు టవసరాలను నిర్ణయించటం జరుగుతోంది. ఉదాహరణకు- గ్రీన్‌విల్లీ, దక్షిణ కరొలినాలలోని విషమసమస్య- అక్కడి నీగ్రోల అవసరాలను తీర్చటం. అక్కడి కమ్యూనిటీ కౌన్సిల్ ప్రజలందరికీ సంబంధించిన సమస్యగా దీన్ని గుర్తించి, నీగ్రోలూ, శ్వేతజాతీయనాయకులూ కలసిన ఒక కమిటీని అన్నిదృక్పథాలవారూ ఉండే విధంగా వేసింది. గృహనిర్మాణాల దగ్గర్నుంచీ వృత్తులవరకు ఉండే అంచనాలను సేకరించేందుకుగాను, సత్యాన్ని పరిశోధించే ఉద్దేశ్యంతో 12 కమిటీలు పని ప్రారంభించినవి. ప్రతి కమిటీలోనూ ఒక శ్వేతజాతీయుడు, ఒక నీగ్రో నాయకులుగా ఉన్నారు. ఈఅంచనాల కొరకై 200 మంది నియోగించబడ్డారు. ఇల్లాళ్ళు ఇరుగు పొరుగుల ఇళ్ళకువెళ్ళి వారెలా జీవిస్తున్నారో పరిశీలించారు; మంత్రులు బస్సుల్లో ప్రయాణంచేసి ప్రజలు ఎలా గౌరవించబడుతున్నారో తెలుసుకున్నారు.

గ్రీన్‌విల్లీ సత్యాలను చూడగలిగాక, మురికిపేటలను తుడిచిపేయటం, నూతనగృహనిర్మాణ పథకాలను ప్రవేశపెట్టడం జరిగింది. మొట్టమొదటిసారి నీగ్రో డాక్టర్లుకూడా మెడికల్ సొసైటీ మీటింగులకు ఆహ్వానించబడ్డారు. నిజానికి సామాజిక పురోభివృద్ధికొరకై కమిటీలలో కలిసికట్టుగా

పనిచేయటమనేదే ముఖ్యమైన విషయం. ఈ అంచనాలు- అసలుసమస్యను పరిశీలించి విశదీకరించి దాన్ని పరిష్కరించేందుకు ప్రయత్నించటమనేది- జాన్‌డీవే ప్రజాస్వామ్యాన్నిగూర్చి చెప్పిన నిర్వచనానికి అనుగుణంగా ఉంది- పరిశోధనా సరళిలో మానవశక్తులు సర్వస్వతంత్ర మయేందుకు ప్రయత్నిస్తూ. ఒకదానికి మరొకటి పెనవేసుకొని స్వచ్ఛందసేవాసక్తిని పెంపొందించాలి.

మొదటినుంచీకూడా సామాజికస్థాయిని పెంపొందించటమనే భావం అమెరికన్‌లను ప్రోత్సహిస్తూనే ఉన్నది. ఈ స్వప్నాన్ని సత్యంచేసేం దుకు గాను అన్నిరకాల సామాజికసేవలూ ఉపయోగించబడినవి; వినో దాన్ని చేకూర్చే పథకాలూ, కుటుంబానికి సేవచేసే నిమిత్తం ఏర్పడిన కేంద్రాలూ. మానసికారోగ్యాన్ని పెంపొందించే వైద్యాలయాలూ. కమ్యూ నిటీ నర్సులూ, శిశుసంరక్షణాలయాలూ, వృద్ధులను సాకే కేంద్రాలూ, ఉద్యోగాలను అన్వేషించి సరఫరాచేసే బ్యూరోలూ. స్కౌట్ బాల బాలికల సంఘాలూ- మొదలైనవెన్నో ఉన్నవి. కమ్యూనిటీ ఫెస్టులూ, కౌన్సిల్స్ వేసిన అనేక పథకాలను అమలుజరిపే నిమిత్తం ఏటా అవసరమైన 300, 000, 000 డాలర్ల నిధిని పోగుచేసేందుకు 20 లక్షలమంది స్త్రీ పురు షులు పనిగట్టుకొని ఇంటింటికీ తిరిగి విరాళాలను పోగుచేస్తున్నారు. ఈ స్వచ్ఛందసేవాదళాలు విరాళాలు పోగుచేయటమేగాక కొన్నికోట్ల గంటలు- ఆస్పత్రులలో సహాయంచేయటం స్కౌట్ మాస్టర్స్‌గా పని చేయ టానికి వినియోగిస్తున్నారు కూడాను. సమాజాన్ని పైఅంతస్థులకు పాకిం చటమనేది కొనుక్కునే వస్తువూకాదూ; లేదా ప్రభుత్వం సరఫరాచేసేదీ కాదు. ప్రతివ్యక్తీ చలించి. తనశక్తినీ. కాలాన్నీ సామాజికాభివృద్ధికొరకై శక్తివంచన లేకుండా వినియోగించేందుకు సమ్మతించటం వల్లనే సాధ్య మౌతూన్నది.

సామాజికశాస్త్ర పరిశోధనలు సమాజంలోని అన్ని ప్రదేశాలలోనూ అమలు జరుపబడుతూన్నవి. మతగురువు తన ఉపన్యాసాలలో యీ పరి

శీలనలను ప్రజలకు అందిస్తాడు. విద్యాలయాల్లో ఆయా పథకాలలో విద్యార్థ విద్యార్థినులను నడిపేందుకూ, వారి వ్యక్తిత్వాన్నీ, వ్యక్తిగతావసరాలనూ గుర్తించేందుకూ వీటిని ఉపయోగిస్తున్నారు. పరిశ్రమల్లో వ్యక్తిగతమైన పనిపాటల్లో- తన ఉద్యోగులతోటి సంబంధ బాంధవ్యాలను బాగుచేసుకొనేందుకూ, ప్రజానీకంతోడి యీ సంబంధాలు ఉత్సాహకరంగా ఉండేందుకూ- ఉపయోగిస్తున్నారు, హాలీవుడ్ చిత్రనిర్మాతలు ప్రజాభిప్రాయాలను సేకరించే పథకాలను ప్రవేశపెట్టడంద్వారాను, ఏ రకంచిత్రం ప్రజలకు ఇష్టమో తెలియపరచమని ప్రకటనలు చేయటంద్వారానూ, సామాజిక శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగిస్తున్నారు.

వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఉండే సంబంధబాంధవ్యాల పరిశీలనలు జరిగి, వారిమధ్య సౌహార్ద్రం పెంపొందే మార్గాలు అన్వేషించబడటంతో, వారి కూటమిద్వారా సామాజిక సేవాతత్పరత అధికం చేయబడింది. ఈ విధంగా సామాజిక శాస్త్రాల విజ్ఞానం ఉపయుక్తమైన ఆయుధాలుగా ఉంటూ, వాటిని ఉపయోగించే విధానాలమీద ఆ యా ఫలితాలు ఆధారపడి ఉన్నవి. డైనమట్‌ను ఉపయోగించటంద్వారా కొండప్రదేశం ఛేదించబడి రోడ్ వేసేందుకు అనుకూలంగా మార్గాన్ని ఏర్పరచనూవొచ్చు; లేదా అమాయకులైన వారిని దానితో నాశనమూ చేయవొచ్చు. ధనం సత్కార్యాలకూ ఉపయోగపడుతుంది, నైచ్యానికీ వినియోగించబడుతుంది. చివరకు మతనిశ్వాసాలు కూడా సౌభ్రాతృత్వానికీ దోహదం చేయబడుతూన్నవి: ద్వేషాన్ని పెంపొందించేందుకూ ఉపయోగపడుతూన్నవి. అదేవిధంగా సామాజిక శాస్త్రీయ విజ్ఞానమనే ఆయుధాలు పనివాళ్ళను యజమాని కాళ్ళకింద కట్టి పడవేయనూ గలవు; ప్రజాభిప్రాయంమీద తన పలుకుబడినీ ప్రభావాన్నీ, ప్రసరించి వారి ఉద్రేకాలను వ్యాపారానికి లేదా రాజకీయాలకు ఉపయోగించుకో గలిగీ ఉన్నది.

శాస్త్రీయ సిద్ధాంతాలను మానవాభ్యుదయంకొరకు ఉపయోగించే పథకాల్లో టెలివిషన్ ముఖ్యమైనవాటిల్లో ఒకటి: దీని తాలూకు సాంకేతిక

నైపుణ్యాన్ని గూర్చి లోగడే తెలుసుకున్నాం. అంతకన్నా ముఖ్యమైనది అది సామాజికంగా చేసేసేవ. టెలివిషన్ ప్రవేశపెట్టిన ప్రోగ్రాముల్ని వైవిధ్యమున్న సమాజాలమీద రుద్దకుండా, సామాజిక శ్రేయస్సును గూర్చి వివరించి అర్థం చేసేందుకు ప్రయత్నించినవి. ఉద్యోగులు క్షేత్రాల మీదికి వెళ్ళి, రైతులను వారి గృహాల్లోనే కలుసుకొని, చిన్న చిన్న ముఠాలుగా వారిని పల్లీయ విద్యాలయాలకు ఆహ్వానించి, ఒకరికొకరు తోడుగా ఉండటంవల్ల లభ్యమయే శ్రేయస్సును గూర్చి వివరిస్తూన్నారు. క్రమంగా నమ్మకమనేదానికి పట్టు లభించింది. వ్యవసాయ పద్ధతులు మార్పు చెందినవి. పంటలు అభివృద్ధి ఐనవి. సామాజికతత్వం వృద్ధి జెందింది. ఆరోగ్య పథకాలలోనూ, గృహవసతుల్లోనూ, విద్యాలయా ల్లోనూ, వినోదాల్లోనూ స్థాయి పెరిగింది. ప్రభుత్వం నైపుణ్యమనేది ప్రజ లకు అందుబాటులో ఉండే ఏర్పాట్లు చేసింది; కాని దాన్ని ప్రజలమీద రుద్ద లేదు. ఉత్తమమైన మార్పు తనలో తానుగానే రూపొందాలనే నిశ్చితాభి ప్రాయంతో ప్రభుత్వంకూడా స్వచ్ఛందంగా ప్రజలు ఒకరికొకరు సహాయ పడుతూ బాసటనగా ఉండే పరిస్థితులు ఏర్పడేందుకు వేచిఉన్నది.

## క్రొత్త సరిహద్దులు.

వైద్య శాస్త్రీయవిజ్ఞానం ఎపెండిక్స్‌ను తీసివేయటం, కొత్తగా ఒక కాలును ఇవ్వటం లేదా పోలియోను జయించటం చేయగలుగుతూన్నవి. వ్యావసాయక శాస్త్రీయ విజ్ఞానం తక్కువ ఖర్చుకు అత్యధికమైన పంట లను సృష్టించగలగటంవల్ల, ధనధాన్యాదుల ధరలు పడిపోయి బీదకూ బిక్కకూ తక్కువ వెలకు ఆహారం లభ్యమయే సావకాశాలను ఏర్పరిచి ఆకలిని రూపుమాపగలుగు తూన్నది. ఐతే ఇక్కడికీయుద్ధం పరిసమాప్తి కాలేదు; సగమేఐంది. మానవులు వ్యాధులవల్ల గాయపడేవానికన్న అధి కంగా తమకుతాము- తమ సంస్థలలో పెరిగే వైషమ్యాలద్వారా గాయ

పరుచుకుంటున్నారు. అనేక వ్యాధులతాలూకు సూక్ష్మక్రియలు కన్నా-వైషమ్యం, సంఘర్షణ మొదలైనవాటికి ఎక్కువమంది హేతువు లభ్యమౌతూన్నారు.

కనుక ఇప్పుడు స్వాభావికమైన, సామాజికమైన శాస్త్రీయవిజ్ఞానాలు యీ సమస్యలను పరిష్కరించేందుకుగాను ఉపయోగించబడవలసి ఉన్నవి. వైద్యుడు- మనస్తత్వవేత్త సహాయాన్ని కోరుతాడు. వ్యవసాయక సాంకేతిక నిపుణుడు తన కొత్తపద్ధతిలో పంటలను అభివృద్ధిచేసే పధకాలను ఇండియాలోని లేదా థాయ్‌లాండ్‌లోని గ్రామంలో ప్రవేశపెట్టేముందు- తన పద్ధతులు అక్కడి సామాజికాచారాలనూ, మానవుల విశ్వాసాలనూ భంగపరచకుండా ఉన్నవో లేవో నిశ్చయంగా తెలుసుకొని, అవిసర్వజన సమ్మతంగా ఉండే విధానంలో అమలు జరుపుతూన్నాడు. పారిశ్రామికుడు ఒక క్రొత్త యంత్రాన్ని ప్రవేశపెట్టేముందు ముందుగా మానవ సంబంధ బాంధవ్యాల విషయం బాగా తెలిసిన పెద్దలతో సంప్రదించి, తరువాత పరిశ్రమకు ఆధ్వర్యం వహించిన వారితోనూ, ఆతరువాత యూనియన్ ప్రతినిధులతోనూ సంప్రదింపులుజేసి ఎన్నో జాగ్రతలు వహించిన తరువాత కాని, ఆ యంత్రాన్ని ప్రవేశపెట్టటంలేదు.

సామాజిక, స్వాభావిక పరమైన శాస్త్రీయ విజ్ఞానం ఆయా సమస్యలను పరిష్కరించే నిమిత్తం మాత్రమే కలిసికట్టుగా పనిచేయటంలేదు. అవి ఒకదాని అభిప్రాయాలను మరొకదానికి తెలియజెపుతూన్నవి. ఒకప్పుడు జీవశాస్త్ర సూత్రాలకూ, భౌతికశాస్త్ర సూత్రాలకూ మధ్యఉండే దూరాన్ని ఇప్పుడు బయోఫిజిక్స్, బయోకెమిస్ట్రీలు పూరిస్తూన్నవి. అదే విధంగా జీవశాస్త్రానికీ, సామాజిక శాస్త్రానికీ మధ్యఉండే ఖాళీప్రదేశాలుకూడా పూరించబడుతూన్నవి. జీవశాస్త్రంతాలూకు రసాయనిక భాగాలు అర్థం చేసుకో బడుతూన్న విధంగానే, సామాజిక ప్రవర్తనతాలూకు జీవశాస్త్ర ప్రాథమిక సూత్రాలుకూడా సుస్పష్టమౌతూన్నవి. మధ్యలో అంతర్ధానమై

పోయిన అతుకులన్నీ కూడదీయటం సాధ్యమైతే గొలుసుఅంతా బలంగా ఉంది. మానవస్వభావం, తత్వం, సామాజి కాభ్యుదయాలను రసాయనిక శాస్త్రవిజ్ఞానంద్వారా అదుపాజ్ఞల్లో ఉంచటం సాధ్యపడొచ్చు. ఉదయం ముఖం కడుక్కోగానే అవసరమైన శక్తిసామర్థ్యాలను పొందేందుకు, లేదా మానసికబలాన్ని నిలబెట్టుకునేందుకు సహాయపడే మాత్రను వేసుకోవటంలాంటిది ఇప్పటికే సాధ్యమై అమలు జరుపబడుతోంది.

కంప్యూటింగ్ యంత్రాలూ, 'ఎలక్ట్రానిక్ మెదడు' లూ సంవత్సరాల తరబడి లెక్కలు కట్టవలసినదాన్ని, ఎంతజాగ్రతగా పనిచేసినా ఎక్కడో తప్పుపొయ్యే అవకాశమున్న దాన్ని- కొద్ది నిమిషాలలో సరిగ్గా చేయ గలుగుతూన్నవి. ఒక పెద్ద గ్రంథాలయంలోని ఒకానొక విషయానికి సంబంధించిన పుస్తకాల జాబితా క్షణంలో కళ్ళముందు ఉండే విధానాలు కూడా ప్రవేశపెట్టబడి అభివృద్ధి చేయబడుతూన్నవి. ఒక భాషనుంచి మరొకభాషకు అనువదించగల యంత్రాలు తయారు చేయబడినవి. ఈ యంత్రా లిలా అభివృద్ధి కావటంతో మానవుడు రోజురోజుకూ శారీరక, మానసిక బాధలనుంచి విడుదలవుతూ మరింతస్వేచ్ఛను అనుభవించ గలుగుతూన్నాడు. మానవుడు సృష్టించిన దాని ఫలితాలతో సర్వస్వతంత్రుడుగా జీవించగలిగేయుగం దరిదాపుల్లోనే ఉన్నది.

## ప్రజాస్వామ్యశాస్త్రం

ప్రజాస్వామ్య పద్ధతులమీద సాగుతూన్న సమాజంలోని అవసరాల కొరకై శాస్త్రీయ విజ్ఞానవేదాంతం, ఆయాపద్ధతుల ఆచరణా అమలుజరుపబడుతూన్నది. ఏవో సిద్ధాంతాలను పట్టుకొని వేళ్ళాడటంకన్నా, ఆ నమ్మకాలే స్థిరమైనవనే అభిప్రాయంలో ఉండటంకన్నా, ఒక పనితాలూకు ఫలితాలను అనుసరించి మంచి చెడులూ సత్యాసత్యాల నిర్ణయం జరపాలి. ఏదో సుస్థిరంగాఉండే ఒకానొక విధానంమీద యీ విశ్వమంతా తిరుగు

తూన్నదనీ, ఆ ప్రాధమిక సత్యాలను ఒక్కసారి కనుక్కున్నట్లయితే అన్ని సమస్యలూ తీరిపోతవనే ఒకానొక అభిప్రాయం చాలా వేదాంతాల్లోకి జొరబడింది. ఐతే ఆభావాదికి యీ ప్రపంచం ఎప్పుడూ అనేకమార్పులకు లోనౌతూన్నదనీ, నిశ్చితాభిప్రాయాలూ, పరిపూర్ణత జరిగిందనే దురభిప్రాయాలూ, అదే సత్యమనే గాఢనమ్మకాలూ - హాని చేస్తవనీ తెలుసు.

వేదాంతాన్ని శాస్త్రీయపద్ధతిలో జోడించి- "ఆయుధతత్వాన్ని" రూపొందించి పనిపాటలు జరిగే ప్రపంచానికి సేవ చేసే అవకాశాల్ని కల్పించింది. జాన్ డీవే, ఆయా ఫలితాలను గమనించటమంటే ఆయా విధానాల ఉపయోగ పద్ధతుల్నికూడా చూడాలి.

ఫలితాలలో ఆయా పద్ధతులుకూడా ఒక విభాగం. దేన్నయినా ఎన్నుకొన్నప్పుడు, ఆ ఎన్నుకున్నదాని ఫలితాలేమిటో తెలుసుకునేవరకూ, ఆ ఎన్నుకొన్నదాన్నిగూర్చి మనకు తెలియదు. ఆదర్శాలనుబట్టే నడుచుకున్నామని అన్నప్పటికీ, ఆయా ఫలితాలనుబట్టే నిర్ణయించటం జరగవలసి ఉంటుంది.

శాస్త్రీయ పద్ధతుల్ని ప్రవేశపెట్టటంలో అత్యంతోపకరమైన వేదాంతాన్ని రూపొందిచిన సమయంలోనే, అలివర్ వెండెల్‌హోమ్స్ "వాస్తవికత" అనే చట్టాన్ని గూర్చినగొడవ లేవనెత్తాడు, దీని ప్రకారం 'చట్టం' కేవలం పుస్తకాల్లో ఉన్నది మాత్రమేకాదు; మారిపోతూన్న మానవుని అవసరాలకూ సామాజిక పరిస్థితులకూ అనుగుణంగా చట్టం అమలు జరుపబడాలి.

చరిత్ర కేవలం జరిగిపోయినసంఘటనల తాలూకు వివరాలేకావనీ, ప్రస్తుత పరిస్థితుల్ని అర్థంచేసుకునేందుకూ భావిని నిర్ణయించుకునేందుకూ ఆయుధ అనే విషయాన్ని జేమ్స్ హార్వే రాబిన్‌సన్ బోధించాడు. ఈ విధంగా చరిత్ర సామాజిక శాస్త్రంలో ఒక విభాగమైంది. పారిశ్రామిక విప్లవంలో ఉపయోగించ బడిన శాస్త్రీయ దృక్పధం- ఉత్తరోత్రా రాజకీయాల్లో

కూడా చొరుచుకొని పోతుందనే విషయాన్ని, డీవే, రాబిన్‌సన్ వారి అను చరులూ నమ్మారు. శాస్త్రీయ పద్ధతుల్ని ప్రవేశపెట్టటంద్వారా పరిశ్రమ ప్రపంచాన్ని మార్చివేసింది. ఐతే సాంకేతిక విజ్ఞానానికి సరిగ్గా విరుద్ధంగా దాన్ని అనుభవంలోకి తీసుకొని రావలసిన సామాజిక విధానంకూడా ఒకటి ఉన్నది. పారిశ్రామిక జీవితాన్ని సుసాధ్యంచేసిన పద్ధతుల్ని ఖండించకుండానే, ఆ సిద్ధాంతాలను డీవే సమాజంపట్ల - బీదరికాన్ని, అమాయకత్వాన్ని, అసమానత్వాలను నిర్మూలించేందుకు ఉపయోగించాలని కోరాడు.

అమలు జరుపబడే పద్ధతులనూ, లభ్యమయే ఫలితాలనూ ఉన్న సంబంధ బాంధవ్యాలను, డీవే నిరూపించిన వాటిని గమనించకుండానే, శాస్త్రీయ దృక్పథంద్వారా విలువలు కట్టటమనేది జరగనిపని అని కొంతమంది వాదించారు. నిజమేమిటంటే- ప్రజాస్వామిక పద్ధతులమీద నడిచే వ్యక్తికీ సమాజానికీ శాస్త్రీయపద్ధతులు తేకలిగే మేలును శాస్త్రకారులు చూపగలరు. ఇలాటిది ఇతర విధానాలమీద నడిచే సమాజాలకు సరిగ్గా విరుద్ధమైనది. ఇక విలువలనేవి-స్వతంత్రులైనవారిలో కొందరు తమ తమ గమ్యస్థానాలను జేరేందుకూ, వారు ఏర్పచుకొన్న ప్రత్యేకపద్ధతులూ మొదలైనవి- ఆశావాదదృక్పథానికి దోహదం చేస్తున్నవి.

## ఫౌండేషన్‌లు

సాంకేతిక నిపుణతతో గొప్ప గొప్ప ఐశ్వర్యాలను నిర్మించేందుకు కలిగిన అవకాశాలే ఫౌండేషన్లనే గాఢవిశ్వాసం జీవితంలో అమలు జరపటమనేది ఇంతకన్న బాగా మరెక్కడా కానరాదు; ఇలాటివి 20-వ శతాబ్దంలో మానవాభ్యున్నతి కొరకై అనేకంగా మొలకలెత్తినవి.

ఐతే ఇప్పుడు పనిచేస్తున్న కొన్నివందల ఫౌండేషన్స్‌లో కొద్దిమాత్రమే అదృశ్యప్రాయంగా నడపబడుతూన్నవి.

స్కాట్‌లాండ్‌నుంచి వలసవొచ్చిన కుర్రవానిచే స్థాపించబడిన, అనేక సంస్థలలో ఒకమైన న్యూయార్క్‌లోని కార్నిజీ కార్పొరేషన్ - విజ్ఞాన

ప్రసారానికీ, విజ్ఞానాభివృద్ధికీ ఉద్దేశించబడి- ఇప్పుడు పరిశీలనలను జరిపే పథకాలకూ, మానవజీవితస్థాయి పెంపొందేందుకుగాను కొత్తకొత్త విజ్ఞానాల్ని సాధించేందుకూ విరాళాలను ఇస్తున్నది. సామాజికశాస్త్ర పరిశోధనా ఫలితాలను, అమలుజరిపే నిమిత్తం రస్సెల్‌సాజ్ ఫౌండేషన్ తన విరాళాలను అధికంగా వినియోగిస్తూన్నది. బోస్టన్‌వ్యాపారి ఎడ్వర్డ్‌ఫిలెనీచే స్థాపించబడిన 'ది ట్వెంటీయత్ సెంచరీఫండ్' ఆధునిక ఆర్థికశాస్త్రం, ప్రస్తుత సామాజిక సమస్యల విషయంలో జరిగే పరిశోధనలకూ, విద్యావ్యాప్తికీ విరాళాలను ఇస్తూన్నది.

ప్రపంచంలోని మానవుల శ్రేయస్సునే ఉద్దేశంగా పెట్టుకొని రాక్‌ఫెల్లర్ ఫౌన్‌డేషన్ పని చేస్తున్నది; అనేక శాఖలకు యీ ఫౌండేషన్ సహాయపడుతూ, విజ్ఞానాభివృద్ధినీ, ఆ విజ్ఞానాన్ని మానవుల అవసరాలకూ, వారి అభ్యున్నతికీ అమలు జరిపేందుకు ప్రయత్నిస్తూన్నది; వైద్యశాస్త్రం, జీవశాస్త్రం, వ్యవసాయం, సామాజిక శాస్త్రాలూ, మానవత్వానికి సంబంధించిన శాస్త్రాలూ మొదలైనవాటికి చేయబడే సహాయాలు యీ సంస్థ అందించే సహకారాలలో కొన్ని.

జాన్‌సైమన్ గిగ్గిన్‌హీమ్ మెమోరియల్ ఫౌన్‌డేషన్-శాస్త్రకారులకూ పరిశోధకులకే గాక, సృజనాత్మక శక్తిసామర్థ్యాలున్న కళాకారులకు- కవులూ, గాయకులూ, చిత్రకారులూ, శిల్పులూ మొదలైనవారికికూడా సహకారాల నిస్తున్నది, కొన్ని సంస్థలద్వారా తమ సహకారాలను అందించే ఇతర సంస్థలవలె గాక- ఇది విశేషశక్తిసామర్థ్యాలు చూపే ఒక సామాజిక సేవకుణ్ణి ఎన్నుకొని సహాయపడుతుంది. అనేకవందలమంది సృజనాత్మక శక్తిసామర్థ్యాలున్నవ్యక్తులు, వారి పనిపాటల్లో ఒంటరిగా జీవితమంతా గడుపుతూ, సృజనాత్మక శక్తినీ, కల్పనాశక్తినీ చప్పున గుర్తించలేని లేదా ఆయాశక్తుల్ని ధనంతోమాత్రమే తూచగల పరిసరాల్లో బతికేవారికి ఎందరికో యీ సంస్థ విశేష ఉత్సాహ ప్రోత్సాహాలను ఇచ్చింది.

ఈ ఫౌండేషన్సు అన్నిటిలోకీ బ్రహ్మాండమైనది ఫోర్డ్ ఫౌండేషన్: దీనిచరిత్ర రాసిన రచయిత దీన్నిలా వర్ణించాడు: "విశేషధనముండి, చుట్టూ ఉన్నవారిలో కొంతమంది దాన్ని కోరేవారున్న సంస్థయిది." 1953 లో దీనితాలూకు ఆస్థి 50,000 కోట్ల డాలర్లు అని అంచనాలు వేయబడింది. కాని, 1955 లో జాతిమత విచక్షణ లేకుండా ప్రైవేట్‌గా నడపబడే ఆస్పత్రులకూ, విశ్వవిద్యాలయాలకూ, కాలేజీలకూ మొత్తం 4,000 కు పైగా ఉన్న సంస్థలకు 50,000 కోట్ల డాలర్లనూ ఈసంస్థ ఒక్కసారిగా విరాళాలను ఇచ్చింది. ఈలాభాలన్నీకూడా మోటార్ పరిశ్రమలోనే గణించబడినవి: వ్యక్తిగతంగా నడపబడే బ్రహ్మాండమైన పరిశ్రమలోకూడా పారిశ్రామికులకు ప్రజలపట్ల ఉండేభావం, జాతీయాభివృద్ధీ, సామాజిక సేవలపట్ల వారి అనురాగం మొదలైనవి స్పష్టమౌతూన్నవి.

ఫోర్డ్ ఫౌన్‌డేషన్ పాలసీ విషయమై జరిగిన పరిశీలనల్లో ముఖ్యంగా ఐదురంగాలు యీ ఫౌన్‌డేషన్ సహకారాలను పొందుతూన్నవని తేలింది: శాంతి స్థాపన; ఆర్థిక విధానాన్ని బలంగాఉంచటం; ప్రజాస్వామ్య సిద్ధాంతాలమీద నడిచే సమాజంలో విద్యావ్యాప్తి; వ్యక్తిగతమైనతత్వం, మానవులమధ్యఉండే సంబంధ బాంధవ్యాలను గూర్చిన పరిశీలనలూ, పరిశోధనలూను. చిత్రమేమంటే ఇంతగొప్ప ఐశ్వర్యాన్ని కూడబెట్టేందుకు సహాయపడిన భౌతిక, పదార్థ శాస్త్రాలూ, సాంకేతిక శాస్త్రాలకొరకై యీ ఫౌండేషన్ తన ధనాన్ని వెచ్చించే అవసరంలేదని భావించినట్లు తోస్తుంది.

కాన్సర్ వ్యాధిమీద పరిశోధనలనూ లేదా బాల మరణాల కంట్రోల్ విధానాల అన్వేషణకుగాను, అనేక కోట్లమంది ప్రజలనుంచి పొందే చందాలూ విరాళాలద్వారా కొన్ని ఫౌండేషన్‌లు నిర్వహించబడుతూన్నవి. ఈ ఫౌన్‌డేషన్‌ల అన్నిటి నిర్వహణల్లోనూ అమెరికన్‌లు తెలివితేటలపట్ల చూపే గౌరవమూ, మానవుని సమస్యలను పరిష్కరించేందుకు శాస్త్రీయ విజ్ఞానశక్తిపట్ల వారి గాఢవిశ్వాసమూ, కనుకనే విజ్ఞానాభివృద్ధి జరిగే కార్యకలా

పాలకు చేదోడు వాదోడుగా ఉండవలసిన బాధ్యతలూ మొదలైనవాటివి గుర్తించటమేగాక- భవిష్యత్‌లో తెలివితేటల్తో ప్రవర్తించినట్లయితే మానవ జీవితస్థాయే పెరుగుతుందనే గట్టి నమ్మకాన్నికూడా రుజూచేస్తున్నారు.

# పదిహేనో అధ్యాయం

## ఎక్కడికీ ప్రయాణం?

వ్యక్తికీ, సమాజానికీమధ్య ఉండే సంబంధాన్ని గూర్చిన ప్రశ్నను ప్రతి సంస్కృతీ గమనించి, వారి ఉభయులమధ్యా తక్కెడ ఎటూ మొగ్గకుండా ఉండే విధంగా సరితూగేట్లు ప్రతి యుగంలోనూ తిరిగి తిరిగి అమర్చవలసే ఉంటుంది. యునైటెడ్‌స్టేట్స్ వ్యక్తిత్వ ప్రాముఖ్యతఉన్న యుగంనుంచి దాటింది. అక్కడ సర్వస్వతంత్రులైన కళాకారులూ, నిపుణతఉన్న పనివారూ- తమ పనినిగూర్చి గర్వపడేవారూ ఉన్నారు. ఆదేశంలో ఒకవైపున పొట్టలుపెంచిన షాహుకార్లూ, మహా ఐశ్వర్యవంతులూ, మరొకవైపున బీదరికంతో కుంగిపొయ్యేవారూ రాజకీయంగా అనుసరించిన పెడదార్ల కారణంగా సిగ్గుపడవలసిన పరిస్థితులకు కారకులైనవారు కూడా ఉన్నారు. వ్యక్తిత్వమనే దానిలోని మంచి చెడులను రెంటినీకూడా యునైటెడ్‌స్టేట్స్ అనుభవ పూర్వకంగా తెలుసుకునేఉన్నది. వ్యక్తికీ, సమాజానికీమధ్య పడికట్టురాళ్ళువేసి వేయి విధానాల్లో తూచి చూసిందా దేశం.

వ్యక్తిగత స్వాతంత్ర్యానికి అమెరికన్ సంస్థలన్నీ ప్రాముఖ్యతను ఇచ్చినవి. ప్రాముఖ్యతవల్ల కొన్ని మేళ్ళూజరిగినవి; కొన్ని కీడులూ జరిగినవి. ఇటీవలి సంవత్సరాలలో కూడలి లేదా సమాజానికి ప్రాముఖ్యతను ఇవ్వటం జరుగుతూన్నది. విలియమ్ హెచ్. వైటే జూనియర్ ' ది ఆర్గ-

నైజేషన్ అఫ్‌మాన్' అనే పుస్తకంలో అమెరికన్‌లు చాలాదూరం వెళ్ళారని అన్నారు. పారిశ్రామిక రంగంలో- అందరూ కలిసికట్టుగా పనిచేయటంలో ఎంతో మేలు జరిగినప్పటికీ, యీ మేలుకుగాను వ్యక్తిత్వమున్న, మంచి ఊహలున్న వ్యక్తికూడా కలగా పులగమైపోయి, మిగతా వారితో పాటే తానూ పంచుకోవలసి రావటం జరిగిందని- ఆయన అన్నారు. సామాజికపరంగా చూసినట్లయితే, 'సమాజానికి సంబంధించిన' అనే విషయం- వ్యక్తితాలూకు రహస్యాలనూ, వ్యక్తిత్వాన్నీ భంగపరుస్తూన్నది. సుబుర్బాన్ సమాజాలు కొన్ని సామాజిక ముఠాలుగా ఏర్పడి, ఆయాపనులన్నీకూడా సామాజిక పరంగానే జరుపుతారు. పురుషులందరూ కలిసి ఒక గడ్డిని కత్తిరించే యంత్రాన్ని కొని వొంతుల ప్రకారం దాన్ని ఉపయోగిస్తారు. వెండి పాత్రలూ, ప్లేట్లూ, పుస్తకాలూ, రికార్డ్‌లూ మొదలైనవి సమాజానికి సంబంధించినవిగాఉండి, అవసరమైన వారు ఎరువు తీసుకోవటం, తిరిగి అప్పగించటం చేస్తూంటారు.

ఈ సుబుర్బనైట్స్‌లో చాలామంది సామాజిక జీవనాన్ని ఎరుగని పట్టణాలనుంచి వొచ్చినవారు. చిన్న ఇరుగు పొరుగుల స్నేహ సౌహార్ద్రాలను కనుగొనటమంటే- వారికి అపూర్వపు అమెరికన్ వాతావరణమే కనుగొన్నట్లవుతుంది. ఐతే ఇలాటిది ప్రతిచిన్న పట్టణంలోనూ, ఆచారంగా ఉంటూ- అలనాడు ఆ అరణ్యప్రాంతాల్లో ఒంటరి జీవితాల్ని, సరిక్రొత్తదనాన్ని అనుభవిస్తూ, తమవారు ఎంతో తక్కువమందిగా ఉండగా, సర్వస్వతంత్రులై ఒకరి అధికారానికి కట్టుబడకుండా తమలోతాము ఒకరికొకరు సహకార సహాయాలను అందిలచుకున్న రోజులు, తిరిగి ఎదురవుతూన్నట్లు నిరూపిస్తున్నారు. కనుక కూడలిని గూర్చిన ప్రాముఖ్యతను గూర్చి నొక్కిచెప్పటం- ఆ పురాతన విశేషాన్ని వెలికితవ్వి, ఏదో కొత్తదాన్ని కనుగొన్న సంతోషాన్ని పొందటమే నన్నమాట.

ప్రస్తుతం ఉమ్మడిగా, కలిసికట్టుగా జరుగుతూన్న పరిశోధనలూ, పరిపాలనలు మనను కుంగదీస్తవేమోననే భయాన్ని- కొన్నికోట్ల చిన్నచిన్న

కూడలులు లేదా సమాజాలుగా ఏర్పడి మొత్తమంతా ఒక పెద్దసమాజంగా రూపొందటం, ద్వితీయస్థానాన మరికొన్నికోట్ల ఎసోసియేషన్‌లు- పౌర సంబంధమైనవీ, ఆర్థికసంబంధమైనవీ, సామాజిక రాజకీయ సాంస్కృతికమైనవీ- ఎక్కడి కక్కడ, తక్కెడ తగ్గుమొగ్గులు చూపకుండా సరి జేస్తూండటంవల్ల పొరద్రోలుతున్నవి.

అనేక రంగాలతోనూ, తత్వాలతోనూ కూడుకున్న ఇలాటి సమాజంలో ఆకర్షించేందుకూ, సమ్మతించేందుకూ పోటీలుపడుతూ అభిరుచిని కలుగ జేస్తున్నది. ఫలానాకారు కొనమనే సలహాలు మనచెవిన బడుతూన్నప్పటికీ, విమానయానంకన్న రైలుప్రయాణాన్నే ఎన్నుకుంటూ, పబ్లిక్ అధికారంకన్న ప్రైవేట్ అధికారాన్నే బలపరుస్తూ- రిపబ్లికన్‌ను లేదా డెమోక్రాట్‌ను ఓట్‌చేసి గెలిపిస్తున్నాము. అటు పారిశ్రామికులూ, ఇటు కార్మికులు కూడా తమగోడు వినమంటున్నారు; ఒకవైపు వ్యవసాయదారుడూ, మరోవైపు పశువుల పెంపకపుదారుడూ - ఒకపక్క కన్సర్వేషనిస్ట్ మరొపక్క దోపిడీదారుడుగా తయారయేందుకు సిద్ధపడ్డవాడూ - ఒకవంక అభ్యుదయపథంలో విద్యావ్యాప్తి జరగాలనేవాడూ, మరొకవంక ఆచారంగా వొస్తూన్న విద్యావిధానమే కొనసాగాలనేవాడూ - ఇంకొకదిక్కున అనేక రకాల మతాలూ- మనకు వేడికోళ్లు చేస్తూనే ఉన్నవి. ఎన్నిక చేసుకునేందుకు తగినంత విశాలంగాఉండి, అన్ని తరహాల వ్యవహారాలూఉండి, అన్ని స్థాయిల్లోనూ మనను ఆహ్వానించే జీవితం నిజంగానే ఎంతో ఉత్సాహకరంగా ఉంటుంది.

పనిచేసేకాలం కుదించబడటంతో ఎన్నికకు మరింతవైశాల్యం ఏర్పడుతూన్నది. ఇటీవల ఒకానొక పారిశ్రామికుడు ఉద్యోగాలిచ్చేనిమిత్తం 300 మంది కాలేజీ సీనియర్స్‌ను ఇంటర్వ్యూచేస్తే, వారిలో ఒక్కరు కూడా తమకు లభించబొయ్యే వేతనాన్నిగూర్చి ప్రశ్నించలేదు. అన్నీ సమృద్ధిగా దొరుకుతూ పుష్కలత వెల్లివిరిసి ఉండగా, ఆరోగ్యాన్నీ సుఖసౌఖ్యా

లనూ బలిపెట్టి మిగతావారి నందరినీ తోసిపుచ్చి పైకిరావాలనే ఆతృత తాలూకు వొత్తిడి మనకులేదు. ఘోరంగా పోరాడే అవసరం చాలావరకు తగ్గిపోయింది. ఒకవంక పని, తక్కువకాలాన్ని హరిస్తూ, బుర్రవేడె క్కించుకో వలసిన అవసరం లేకుండా చేయటంవల్ల- ఇతర విలువలు- మనశ్శాంతి, సంసారిక జీవనం, తీరికవేళల్లో చేసే పనిపాటలూ, వినోదాలూ మొదలైన వాటి ప్రాముఖ్యత పెరిగింది.

విరామకాలాన్ని ఎంతబాగా వినియోగించగలిగి, అందులో ఎంత సామ ర్థ్యత చూపగలడనే దానిమీదనే విజయం అధికంగా ఆధారపడి ఉన్నది; క్రీడారంగాల్లో గెలుపులు పొందటం, దూరతీరాలకు పయనించటం, చక్కగా మాట్లాడటం, సామాజిక జీవనంలో ప్రాధాన్యత వహించటం వస్తు సముదాయాలవల్లగాక విరామవేళలద్వారా తృప్తిని పొందటం- మొద లైనవి. నిజానికి విరామకాలాన్ని నిపుణతతో గడపటంలోనే- తనకూ, తన కుటుంబానికీ, సమాజానికీ మేళ్లు చేకూర్చటం జరుగుతూ అదే విజ యానికొక పరీక్షగా ఉంటూన్నది.

## సాధించబడినవి

ఒకపక్క ప్రపంచం అనేక సమస్యలతో అట్టుడికినట్లు ఉడికిపోతూ ఉంటే, ఏదో విధంగా యునైటెడ్‌స్టేట్స్ ఆఫ్ అమెరికా విరుద్ధ విష యాలతోనే సాఫీగా జీవనాన్ని సాగించగలిగే సమాజాన్ని సృష్టించి - చర్చలతోనూ, పంపిణీ విధానంతోనూ నడపబడే ప్రభుత్వమే పెడద్రోవల బడకుండా నాగరికతను ఆరాధించగలుగుతుందని నిరూపించింది. స్వేచ్ఛ- నీ ఇష్టానుసారంగా తిరిగేందుకు ఉపయోగించే స్వేచ్ఛ. లేదా ప్రభుత్వాన్ని విమర్శించే స్వేచ్ఛ, ఒకరితో కలిసి నిలబడే స్వాతంత్ర్యం లేదా అక్రమమైన చట్టాలకు ఎదురాడి పోరాడే స్వాతంత్ర్యం- ఇంకా మనదే.

అమెరికన్‌లు సాధించిన వాటినిగూర్చిన తుదితీర్పులు ఇంకొంచెం ఆగి ఉండాలి. ఐతే- అత్యుత్తమమైన విజ్ఞానం, పైస్థాయిలకు చెందిన స్వవిమర్శ, సామాజికశాస్త్రం, సాంకేతికశాస్త్రాల అభ్యున్నతీ, తరగతులవారీ విడదీతలు అదృశ్యమయ్యే తుదిఘట్టాలూ, అణుశాస్త్ర విజ్ఞానయుగం, ప్రజాస్వామ్యపు మధుర స్వప్నాలను సత్యాలు చేయాలనే దృఢనిశ్చయం, మొదలైన వాటి ఉనికిని ఎవ్వరైనా గుర్తించగలరు.

ఇన్నిరకాల జనులున్న, ఇంతపెద్ద సమాజంతాలూకు సాధనలను వివరించటం అసాధ్యమైన పనిగా తోచవొచ్చు; కాని ఒక వ్యక్తితాలూకు చరిత్రను చూస్తే, అన్నమంతా ఉడికిందో లేదో ఒక్కమెతుకు తెలియజెప్పే విధాన, అర్థమౌతుంది. అనేకులనుంచి ఎన్నుకొనే అవకాశాలున్నప్పటికీ, సుప్రీంకోర్ట్ న్యాయమూర్తి విలియమ్. ఓ. డగ్లస్‌ను తీసుకుంటూన్న కారణం, ఆయనపేరు సముద్రాంతర దేశాల్లోకూడా తెలుసు. ఆయన సర్క్యూట్ వెళ్ళే మతబోధకుని కుమారుడు: మినిసోటాలో జన్మించి తన ఆరవయేటనే తండ్రిని కోల్పోయాడు. ఆతరువాత విలియమ్ డగ్లస్ తన కుటుంబంతో సహా వాషింగ్టన్ రాష్ట్రానికి తరలివెళ్ళాడు. విద్యాలయంలో కష్టపడి చదివి, విట్‌మన్ కాలేజీలో స్కాలర్‌షిప్ సంపాయించాడు. కిటికీలు కడిగీ, స్టోర్స్‌లో గంటకు 10 సెంట్లు కూలికి పనిచేసీ, హోటల్స్‌లో టేబిల్స్ దగ్గిర వెయిటర్‌గాఉండి తిండి సంపాయించీ- తన కాలేజివిద్యార్థి జీవితంలోని తుది 3 సంవత్సరాలు ఖాళీ ప్రదేశంలో గుడారంవేసుకొని అక్కడ నివసించి కొద్దిధనం కూడబెట్టుకో గలిగాడు. ఎండాకాలం సెలవుల్లో పళ్ళు ఏరటం, ఉత్తరదిశలోని అడవుల్లో కట్టెలు కొట్టటం, అరణ్యాలలోని అగ్ని ప్రమాదాలతో పోరాడటం చేశాడు. ప్రపంచయుద్ధం ముగిసే సమయానికి ఆయన కాలేజివిద్య పూర్తిచేసి, విద్యార్థిసంఘానికి ప్రెసిడెంట్‌గా ఎన్నికైనారు.

రెండేళ్ళపాటు ఆయన తన నివాసమున్న ఊరిలోనే హైస్కూల్లో ఉపాధ్యాయవృత్తి అవలంబించాడు. ఆతరువాత గొర్రెలమందకు రక్ష

కుడుగా తూర్పుదిశకు బరువులు తీసుకొనివెళ్ళే రైలులో పయనమైనారు; ఆయన షికాగోవరకూ రోడ్డుమీద ప్రయాణాన్ని సాగించి చివరకు చేతిలో మిగిలిన పైకంతో న్యూయార్కుకు టిక్కెట్టు కొనుక్కొని, న్యూయార్కులో చేతిలో ఆరు సెంట్లతో దిగాడు. అక్కడ కొలంబియా లా స్కూల్‌లో ప్రవేశించి, అక్కడే ట్యూటర్‌గా ఉంటూ, జీవితం గడి చేందుకు ఒక పుస్తకాన్ని రచించి తనక్లాసులో రెండవవాడుగా ఉత్తీర్ణు డయ్యారు, పెద్ద కార్పొరేషన్ లా కంపెనీలో పనిచేశారు; కొలంబియా, ఏల్ విశ్వవిద్యాలయాల్లో లా బోధకుడుగా ఉన్నారు; ఆయన "దివాళా" మీద చేసిన పరిశీలనలూ, పరిశోధనలూ ప్రభుత్వాన్ని ఆకర్షించటంవల్ల, కామర్స్ డిపార్ట్‌మెంట్‌కు ఆహ్వానించబడి, తరువాత సెక్యూరిటీస్ అండ్ ఎక్స్‌ఛేంజ్ డిపార్ట్‌మెంట్‌లో ప్రవేశించి, ఆతరువాత ఆశాఖలో ఛైర్‌మెన్‌గా పనిచేసి అర్థిక ప్రపంచంలో ముఖ్యమైన సంస్కరణల నెన్నిటినో తీసు కొచ్చారు. 1939 లో ఆయన సుప్రీంకోర్టు న్యాయాధికారిగా నియమించ బడి, చరిత్రలో చిన్న వయస్సులో ఇలాటి గౌరవాన్ని అందుకున్నవారిలో ద్వితీయుడయ్యారు. ఆ తరువాత ఆయన జీవితంలోని అనేక ఎండా కాలాలు - ప్రపంచ పర్యటనలో గడిచి, దేశదేశాలలోని పరిస్థితులూ, సమ స్యలూ, సంస్కృతుల పరిశీలనలకు దోహదం చేసినవి.

ఈ నాడు గడ్డికోసుకుంటూ, లేదా వార్తాపత్రికల్ని అమ్ముకుంటూన్న, దేశంలోని అనేకమంది యువకుల్లో చాలామంది దగ్గస్‌లు పెరిగి పెద్ద వుతూ ఉండిఉంటారనేది అమెరికన్‌ల గాఢవిశ్వాసం. వారి తరంలో ఎదు రయ్యే అనేక సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో వారికే తెలిసి ఉంటుంది.

ఈ నాడు సమాజాన్ని ఎదుర్కొంటూన్న కొన్ని సమస్యలు విషమం గానూ, నిరాశాజనకాలుగానూ ఉన్నవి: నేరాలూ, మత్తుపదార్థసేవనలూ, మానసిక అనారోగ్యం, ద్వేషాలూ, పెడద్రోవలు పట్టటం మొదలైనవి.

ఐతే మనం ఆ ధోరణులను చూడటం నేర్చుకున్నాం; ఎందుకంటే ఎల్లప్పుడూ చెడు అనేది మనతో ఉంటూనే ఉంటుందని మనకు తెలుసు. ఈ సమస్య లన్నిటినీ ఎదుర్కొనేందుకు అటు ప్రభుత్వమూ, ఇటు స్వచ్ఛంద సేవాదళాలూ చేసే పోరాటాలూ - ఆ యా కార్యకలాపాలవల్ల ఎంతో ప్రోత్సాహకరంగా ఉండటమేగాక, అదంతా ప్రజాస్వామ్య పద్ధతుల్లోకూడా జరుగుతూండటం ఆశాజనకంగా ఉంటూన్నది.

1980 కల్లా ఈ ఆర్థిక విధానం ఇంకా విస్తరించి కార్మికులకు సంవత్సరం పొడుగునా ఆదాయం ఉంటూ, వారానికి ఏ 30 గంటల పనో ఉండగలదని అమెరికన్‌లు నమ్ముతూన్నారు. తరువాత 10 - 15 సంవత్సరాల్లోనే మనం కాలేజి లెక్చరర్స్ సంఖ్యను రెండింతలు చేస్తేనేకాని కాలేజి విద్యకొరకై వొచ్చే యువతీయువకుల అవసరాలను తీర్చలేము; ఆ తరువాత, గత 300 సంవత్సరాలుగా మనం నిర్మించిన శారీరక శక్తి సామర్థ్యాల వినియోగానికి ఏర్పడిన సానుకూలతల్లాటివి నిర్మిస్తేనేకాని, కాలేజి విద్య నభ్యసించే అసంఖ్యాకులైన విద్యార్థులందరికీ ఉద్యోగ సద్యోగాలు లభ్యమవవు.

పుష్కలతను ప్రసాదించిన యీ ఆర్థిక విధానం విశ్వవ్యాప్తమవాలనీ, అలా అయేందుకు మనంకూడా శక్తివంచన లేకుండా సహాయ సహకారాలను అందించాలనీ, ఒకరికొకరు సహాయపడే, ఒకరినొకరు గౌరవించే పథకాల విషయమై ఇతర జాతులకు మనం సహకరించాలనీ మనం కోరుతూన్నాము.

యునైటెడ్‌స్టేట్స్‌లో పని చేయటమనే శుభవార్త, సామాజికమైన శుభవార్తలతో కలిసి రూపొందించబడిన ఉద్విగ్నపూరితమైన సరికొత్త సంస్కృతినిగూర్చి అనుభవిస్తూన్న వారందరికీ తెలుసు. చివరకు మనం స్త్రీ చేసే అంతరాంతర పరిశీలనలను కూడా గ్రహించి, అమలు జరపటం వల్ల ఆ యా సమస్యలపట్ల స్త్రీ పురుషుల దృక్పథాలను మిళితం చేసి విశాల

దృష్టిని ఏర్పరుచుకో గలుగుతూన్నాము. ఈ విధంగా నిన్న మొన్నటివరకూ సగం మానవజాతి (స్త్రీలు) వంట ఇళ్లల్లోనే బంధించబడి ఉన్నవారు - యీ నాడు తమ సహకారాలను అందించటంద్వారా సమాజంపట్ల మనం కొత్త దృక్పథాన్ని ఏర్పరుచుకొని, అది ఎలా ఉన్నదో, ఎలా ఉండాలో గ్రహించ గలుగుతూన్నాము.

## అమెరికన్ పురాణం

ప్రతి జాతికీ ఒక పురాణం ఉండి. అది ఆ జాతితాయొక్క ఆశయాలనూ, సాధనాలనూ, తదనుగుణంగా ఎదుర్కొన్న అపజయాలనూ పొందిన ఫలితాలనూ వివరిస్తూ ఉంటుంది. అమెరికన్ పురాణంలోని ముఖ్య భాగం లోని ప్రముఖపాత్ర యూరప్‌నుంచి స్వేచ్ఛాస్వాతంత్ర్య తృష్ణలతో అమెరికాకు వలస వొచ్చి, ఇక్కడొకొత్త భూభాగాన్ని కనుగొని, అనాగరికుల నుంచి దాన్ని గెలుచుకొని, నాగరికతనూ, చట్టాన్నీ ప్రవేశపెట్టి - అరణ్య సిద్ధాంతాలను రూపుమాపి వర్రలను ఫలవంతం చేసింది. మానవులందరూ సర్వ స్వతంత్రులుగానూ, సరిసమానులుగానూ ఉండాలి. ఈ కొత్త భూమి లోని స్వాభావిక సంపదంతా వీరిదే। ధైర్య సాహసాలతోనూ, ఆశల తోనూ వారు అరణ్యాలనుంచి తమ నాగరికతను పెంపొందించుకున్నారు. తమ సద్గుణ సంపదలవల్లా, మతైక విశ్వాసాలవల్లా, కళాభిరుచులవల్లా అక్కడి అనాగరికులకన్న మిన్నగా ఉండి, విజయాన్ని సాధించేందుకు విధి నిర్ణయించిన బహు జనులవలె, ఆ ఖండాన్ని ఆక్రమించి అభివృద్ధి చేశారని - యీ పురాణం రుజువులతోసహా వివరిస్తూన్నది.

లోహపు పనివాళ్ళుగా, కొత్త సృష్టులు చేసేవారుగా, శాస్త్రకారులుగా, సాంకేతిక నిపుణులుగా, వ్యాపారులుగా - వీరు తాముకన్న మధురస్వప్నం లోని పుష్కలతను సత్యం చేసేందుకు అనేక యంత్రాంగాలను నిర్మించారు. విద్యావ్యాప్తి, అందరికీ సరిసమానావకాశాలూ యీ దివ్యస్వప్నం

లోని ఒక భాగంగా ఉంది. అవి రోజురోజుకూ ఫలవంతమౌతూనే ఉన్నవి.

తన తాతలూ, తండ్రులూ నివశించిన గడ్డ యూరప్‌ను వొదిలి, యీ కొత్త భూఖండాన్ని వెదుక్కుంటూ వొచ్చి - తనకన్న అధములుగా ఉన్నవారి పక్షాన పోరాడి విజయాన్ని సాధించేందుకు నడుంకట్టాడు - వలసదారుడు. అతను అధికారాన్ని సందేహ దృష్టితో చూసి ప్రతిఘటిస్తూనే ఉంటాడు. అతని ఆనందాలు యువకులు ఆనందాన్నిపొందే వివిధ రంగాలలోనే ఉంటూన్నవి: బరువుభారాల్ని వొదుల్చుకోవటం, కొత్త లావుగా ఉండే యువతులూ, పురుషత్వం ప్రతిఫలించే క్రీడలూ, మోటు గానూ తల దిమ్మెక్కేట్లుండే విలాసాలూ, గొప్ప ఆశలూ, హఠాత్తుగా తాత్కాలికంగా కుంగిపోవటం, తన బలాతిశయాన్ని గూర్చి ఆనందిం చటం - విజ్ఞానం, సౌందర్యం మొదలైనవాటికోరకై తహతహలాడటం - యవ్వనదశలోకి ప్రవేశించినవారు పొందే వివిధానుభూతులకు అనుగణాను భూతుల్ని పొందటం జరుగుతూన్నవి.

అమెరికా తన ప్రతిబింబాన్ని తన చిన్నకుమారునిలో ఇప్పటికీ చూసు కుంటూనే ఉన్నది; తాను సరిహద్దు ప్రాంతాలకు తరలివెళ్ళే వీరునివలె, భూతకాలాన్నీ, తండ్రితాలూకు అధికారాన్నీ వొదిలించుకొని ముందుకు సాగిపొయ్యే తత్వమున్న కుమారునిలోనే శాశ్వతంగా అమెరికా తన ప్రతి బింబాన్ని చూసుకోవాలని చరిత్ర ఒక నియమాన్ని విధించింది మరి. కనుక అమెరికన్‌లు తామే అంతా ఆక్రమించాలనే తత్వమున్నవారని ఎవ్వరూ భయపడనవసరంలేదు; ఎందుకంటే ఇలాటిదేదీ వారి ప్రతిబింబా లకు సంబంధించింది కాదు. పోతే వారు ఉన్న ప్రదేశంనుంచి నిష్క్ర మించటం, తమకున్న అరణ్య ప్రదేశాలను పరిశోధించటం, ఆ పాత ప్రపంచంలోని తండ్రిగారి అధికారాన్నీ వారి ప్రతిబింబాన్నీ తుడిచివేయ టమే - వారి తత్వం. వారెప్పుడూ విప్లవాత్మకంగా ఉంటూ, అధికారంతో

కాకుండా, ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉండటంలో యీ ప్రపంచాన్ని కుదించి, ఒక క్రమంలో అమర్చుకునేందుకే ప్రయత్నిస్తుండాలని విధి నిర్ణయించింది. కనుకనే ఐశ్వర్యరీత్యా ఏర్పడిన అధికారాలను ఎమర్కొవటం, సామాజిక శాస్త్ర పరిశీలనలను జరిపి ప్రజానీకంలోని తరగతులను రూపుమాపటం, యజమానినికూడా పనివాళ్ళ స్థాయిలో ఉంచటం, కార్మికుల సమానత్వాన్నిగూర్చి నొక్కి వక్కాణించటం జరుగుతూన్నది.

## షణ్ముఖ విధానం

యునైటెడ్‌స్టేట్స్‌లో అమల్లోఉన్న సామాజిక విధానాలను ఆ పాత కూటాలైన-వ్యక్తిత్వం, ప్రైవేట్ ఎంటర్‌ప్రైజ్, కేపిటలిజమ్, చివరకు ప్రజాస్వామ్యం మొదలైన పదాలతో వర్ణించటం భావ్యంకాదని ఎవ్వరూ అనలేరు. సమాజంలోకి చొచ్చుకొనిపోయి అత్యద్భుతమైన విజయాల్ని మనం సాధించినా, మన సమాజాన్ని గూర్చి ఒక ప్రత్యేక విధానమంటూ ఉన్నదని మనం చెప్పలేము.

అమెరికన్ సమాజాభివృద్ధి ఆరు రకాల పనులవల్ల షణ్ముఖవిధానంలో జరిగింది: వ్యక్తిత్వం, స్వచ్ఛందసేవాశక్తి, ఫెడెరలిజమ్, తక్కెడ ఎటూ మొగ్గకుండా కాపాడేతత్వం, లోనికి చొచ్చుకొనిపోవటం, అంతర్జాతీయ రాల్లో ఏర్పరుచుకునే విడివడని సంబంధమూను. ఇప్పటికీ సమాజాభివృద్ధి కొనసాగుతూనే ఉంది...అది సుసాధ్యమనే తర్కం ఆమోదించబడి, ఒకనాడిది ప్రపంచమంతటా విస్తరించగలదు.

ఉదాహరణగా మనం ఒక వ్యక్తి-ప్లిమత్ గవర్నర్ విలియమ్ బ్రాడ్‌ఫర్డ్‌ను తీసుకుందాం: తన ఇష్టానుసారంగా ఆయన పిలిగ్రిమ్స్ అని పిలువబడే కూడలిలో యువకుడుగా ఉన్నప్పుడే జేరారు ఈ సందర్భంలో వ్యక్తి విస్తరించి, స్వచ్ఛందసేవాశక్తి ఉంది, తనవలెనే ఆలోచనలను సాగించే కూడలితో చేతులు కలిపి, మతకారణాలుగా ఉత్తర అమెరికాకు వలస

వొచ్చి స్వచ్ఛందసేవా శక్తి అనే సిద్ధాంతాన్ని అమలుజరిపి సుస్థిరం చేసేందుకు ప్లిమౌత్ కామన్‌వెల్త్ అనే ఒక చిన్న సంస్థను నెలకొల్పి వ్యాపార దృక్పథాన్ని అలవరచుకొని ఆ ప్రదేశంలోని వ్యాపారవ్యవహారాల అధ్వర్యాన్ని జరిపించారు. బలహీనమైన చిన్నచిన్న గ్రామాలు కొన్ని కలసి న్యూ ఇంగ్లండ్ కాన్‌ఫెడరేషన్‌లో జేరి, సైనికబలసంపత్తి కొరకై పాటు బడ్డసాగడంలో ఫెడరలిజమ్ సిద్ధాంతం రూపురేఖలు దిద్దుతూన్నది.

కొంతకాలంపాటు-బోస్టన్, ప్లిమౌత్‌లు కన్నెక్టికట్ లోయవిషయమై పోటీపడిన సందర్భంగా-వారివారి చిన్నశక్తులు ఒక దానితో మరొకటి పోటీ తక్కెడ ఎటూ మొగ్గుచూపకుండా చేయబడినవి. ఆ పైమెట్టు-లోనికి జొచ్చుకొనిపోవటమనే సిద్ధాంతం-హార్ట్‌ఫర్డ్, వెథర్స్‌ఫీల్డ్, సేబ్రుక్ తదితర ప్లాంటేషన్‌లు కలిసికట్టుగా-ఒకేరాష్ట్రప్రభుత్వం కిందికివొచ్చేందుకు సమ్మతించటం ద్వారా అమలు జరుపబడింది. ఇలాటి నియమితిఉన్న చట్రంలో, ఒక దానితో మరొకటి పైనవేసుకుని పోవటమనేది, కన్నెక్టికట్ ఒక రాష్ట్రంగా అవతరించిన సందర్భంలో చూడనవుతూంది.

ఇదే విధానంలో ఫెడరల్ ప్రభుత్వం కూడా ఏర్పడ్డింది.

ఈ సిద్ధాంతం మన సమాజంలో ఎలా పనిచేస్తున్నదీ చూద్దాం: ఉదాహరణకు విద్యావ్యాప్తిని తీసుకుందాం: వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడమనే సిద్ధాంతంలో- ఆరంభమై, ప్రతిపౌరునికీ సరిసమానావకాశా లుండాలనే సిద్ధాంతాన్ని అమలు జరపటం మీదనే విద్యాసౌకర్యం చేయబడి, ఆయా సదవకాశాల్ని వినియోగించుకోవటం విద్యద్వారానే సాధించబడాలనేది సుస్పష్టం. విద్యాలయస్థాపనలో స్వచ్ఛందసేవాశక్తి కనిపిస్తుంది-ఎందుకంటే ప్రతిపట్టణమూ తన విద్యాలయ విధానాన్ని ప్రవేశబెట్టి, పౌరులందరూ అందుకయే ఖర్చును పన్నులద్వారా భరిస్తూ, భవననిర్మాణం లోనూ విద్యాలయాన్ని నిర్వహించటంలోనూ చేతులు కలుపుతున్నారు. కనుక,

ఐతే స్వచ్ఛంద సేవాశక్తి రెండుమార్గాలలో యీ దృశ్యంలోకి వొస్తూన్నది; మన సమాజం ఎలా పనిచేస్తున్నదో అర్థంచేసుకునేందుకు యీ రెంటినీ విడదీయటాన్ని మన మిక్కడ ప్రవేశ పెట్టవలసిఉన్నది. ఉపాధ్యాయ ఉపాధ్యాయినులు సామాజిక వృత్తిధర్మాల పరంగాఉండే ఒక స్వచ్ఛంధసేవావిధాన్ని ఆర్గనైజ్‌చేసి, ప్రాంతీయ, జాతీయసంస్థలతో సంబంధాల్ని కలిగిఉంటారు. ఇలాటి కూడలి కలసికట్టుగా పనిచేసేందుకే ఏర్పడిందనాలి: ఎందుకంటే, ఉపాధ్యాయ ఉపాధ్యాయినులే దీన్ని ఆర్గనైజ్‌చేసి ఉండటంవల్ల, వృత్తిరీత్యా వారు బలపడి, తమ వృత్తిధర్మ నిర్వాహణలో మరింత శ్రద్ధాశక్తుల్ని ప్రదర్శిస్తూంటారు కనుక.

తల్లిదండ్రులూ-టీచర్లూ కలిసి ఒక ఎసోసియేషన్‌గా రూపొందుతూన్నారు: వీరి కలయిక సామాజికతత్వాన్ని నిరూపిస్తున్నది. ఎందుకంటే సమాజంలో విద్యాలయస్థానాన్ని ఇది నిర్ణయించి, విద్యాలయం, కుటుంబమనే రెండు సంస్థలను ఒకచోటజేర్చి. ఇందువల్ల సామాజిక శ్రేయస్సు ఉద్దేశించబడటం, మరొకవైపున సామాజిక జీవితానికి బాలబాలికల్ని సన్నద్ధులచేయటం జరుగుతూన్నది కనుక.

పోతే ఫెడరల్ తత్వమనేది యీ రెండు శాఖల్లోనూ-అంటే కార్యకలాపాల నిర్వహణ, సామాజిక పరమైనదీను-కలిగిస్తుంది; యీ రెండూ కూడా నేషనల్ ఆర్గనైజేషన్స్‌తో సంబంధాన్ని కలిగేఉన్నవి. ఒకసారి ఫెడరల్ సంస్థకిందికి రాగానే యీ ఆర్గనైజేషన్‌లు ఎంతబలహీనమైనదప్పటికీ హఠాత్తుగా కొత్తశక్తిని పుంజుకొని బలపడుతవి. జాతీయంగా విస్తరించిఉన్న అధికారాలవల్ల తక్కెడ ఎటూ మొగ్గకుండా ఇవి చూస్తూ ఉంటవి; ఇవి ఇంతకన్నా మంచి విద్యాలయాలూ, మంచి విద్యావిధానమూ కావాలని పోరాడుతూ, పన్నుల భారంతగ్గాలనీ, రైతులకు సహాయపడాలనీ, కార్మికచట్టాలు మరింత సడలించబడాలనీ ఇలాటి పేయిపథకాలను ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించేవారివైపు మొగ్గుపోకుండా తక్కె-

దలోని బరువువల్ల అది తలక్రిందులవకుండా చూస్తుంటవి. ఎందుకంటే లెక్కలేనన్ని స్థానికస్వచ్ఛందసేవాదళాలున్నవి మనకు: ఇవన్నీ కూడా ఫెడరేషన్‌లుగా ఏర్పడి, తమ తమ పథకాలనూ, నిర్ణయాలనూ ప్రధాన కార్యాలయంద్వారా పంపుతూ తమ శక్తిసామర్థ్యాలతో వాషింగ్‌టన్‌లో జరిగే నిర్ణయాలమీద పలుకుబడులను ఉపయోగించ గలుగుతూన్నవి.

ఇప్పటివరకూ యీ విధానం అన్నిటికన్నా అధికంగా సంఘర్షణను పెంపొందించింది. ఐతే యీ స్థితిలో లోనికి చొచ్చుకొని పోవటమనేది అడ్డుకుంటూంది. ఒకదాన్నిబట్టి మరొకటి పనిచేసే మిత్రాల్లో వైరుధ్యాన్నే గాకుండా, అనేక సందర్భాలలో ఒకరి పద్ధతుల్ని మరొకరు అనుస రించటంకూడా జరుగుతూంటుంది. విద్యావిధానం - ఒకప్పుడు విద్యాలయా లకూ, టీచర్లకు మాత్రమే సంబంధించినదిగా ఉన్నదని భావించబడినది. ఇప్పుడు సమాజంలోని ఇతర రంగాలలోకి కూడా చొచ్చుకొనిపోయింది. కార్మిక సంఘాలు తమ స్వంత విద్యాలయాలనూ, విద్యావిధానాలనూ ప్రవేశ పెడుతూన్నాయి. పరిశ్రమలోనే తరిఫీదు నిచ్చేవిధానం, లేదా పనివారు తమ విద్యాశక్తిని విద్యాలయంద్వారా తీర్చుకొనేందుకు ప్రయత్నిస్తే వారి కయ్యే ట్యూషన్ ఖర్చులను ఇవ్వటం మొదలైనవాటిని పారిశ్రామికులు చేస్తున్నారు. క్షేత్ర సముదాయాల తాలూకు ఆర్గనైజేషన్స్ చర్చావేదికల్ని అమర్చటం, ఉపన్యాసాలిప్పించటం, డాక్యుమెంటరీ ఫిలిమ్‌లను చూపటం, వ్యాసరచనా పోటీలను నడపటం మొదలైన పనులు చేస్తూన్నవి.

మన సమాజంలో పనిచేసే ప్రతి చిన్న సమాజమూ ఇదే పద్ధతులమీద పనిచేస్తూన్నది. లాయర్, స్థానికమైన బార్ ఎసోసియేషన్‌లో సభ్యుడుగా ఉండి (పనిచేసే తత్వం) లీగల్ ఎయిడ్ సొసైటీ, కమ్యూనిటీ కౌన్సిల్‌కు తన సేవల నందిస్తూ (సామాజికతత్వం) ఉండటం కొన్ని వందల ఉదా హరణల్లో ఒకటి; వ్యక్తిని సామాజిక పరంగా పెంపొందించేందుకు అమెరికన్‌లు వృత్తిరీత్యాను, పౌరధర్మరీత్యానూ చేదోడు వాదోడుగా కలిసి

నట్లుగా ఉండి పని చేస్తూంటారనేది సుస్పష్టం. కార్మికులూ, పరిశ్రమలూ ఒకదానికొకటి ముక్కెదురుగా ఉన్నవని ఒకప్పుడు తలచబడినా, ఒకదాని లోకి మరొకటి జొరబడిపొయ్యేస్థితి ఇప్పుడు అందుకున్నది. కార్మిక సంఘాలు తెలివిగా, నిర్వాహకవర్గం తాలూకు సమస్యలను ఎదుర్కొనే ఉత్సాహాన్ని చూపుతూన్నాయి; నిర్వాహకులు కార్మిక సంఘాలతో సాఫీగా సాగిపోగలుగుతూనూ ఉన్నారు. వాటంతటవే పనిచేసేయంత్రాలను స్థాపిం చటంలో పని గంటలు తగ్గించబడటం, అధిక వేతనాలివ్వటం సాధ్య మవటం ఒకదానితో మరొకటి శాశ్వతంగా పెనవేసుకునే తత్వాన్ని నిరూ పిస్తూన్నది. వస్తుపరంగా స్వంతమైనవాటిల్లో కానీ, విరామకాలంలో జరిపే కార్యకలాపాల్లో కానీ, తత్వాలలో కానీ, మేనేజర్‌కూ, కార్మికునికీ ఉండే దూరం ఎంతో తగ్గిపోయి అంత్యస్థితిలో ఇలాటి దసలు గణనకే రాకుండా పోతూన్నవి.

ఇలాటి షన్ముఖ విధానాన్ని నిరూపించే వందలాది ఉదాహరణలను గుర్తించవొచ్చును: ఒకప్పుడు వేదాంతానికే అంకితమైపోయిన చర్చ్ ఈనాడు రాజకీయ, సామాజికరంగాల ప్రాధాన్యతనుకూడా గుర్తించిన కార్య కలాపాలలో పాల్గొంటూన్నది; ఒకదాన్నుంచి మరొకదాన్ని విడదీయలేని రాజకీయ చరిత్రలున్న రాజకీయ పార్టీలు, ఈనాడు అనేక సందర్భాలలో కలిసికట్టుగా పనిచేసి ఓట్లను సంపాయించేందుకు పూనుకుంటూ, ఒకదానికి మరొకటి ప్రతిబింబంగా ఉంటూ, అన్ని పెద్ద రాజకీయ పార్టీలతోనూ ఐక్యతను సాధించి; కలిసికట్టుగా ఉంటేనేకాని అధికారాన్ని నిలబెట్టుకో లేకపోవటం, అలాకాని పక్షంలో వైదొలగటం జరగవలసి ఉంటూందని గ్రహించినవి.

సిద్ధాంతాలనే ఉపయోగించి ఇప్పటికీ అభివృద్ధిపథంలో పయనించే ఉదాహరణను తీసుకొని, దాని భవిష్యతును చెప్పగలగటాన్ని పరిశీలిద్దాం:

ఇటీవల దేశంలోని కొంతమంది వ్యక్తులు చిన్న చిన్న ఎసోసియేషన్లుగా రూపొందింది. లాభాలు వొచ్చే ఆర్థికవిధానాన్ని సక్రమంగా ఉపయోగించేందుకుగాను కొంత ఆస్తిపాస్తుల్ని సేకరించే ఉద్దేశ్యంతో తాము అదా చేయగలిగిన పైకాన్ని పనిచేయించేందుకు పూనుకున్నారు. వీరు పెట్టుబడి క్లబ్‌లను స్థాపించి, తమతమ పైకాలను కలిపి, షేర్స్, బాండ్ల విషయమై బాగా తెలిసినవారితో సంప్రదింపులు జరిపి, చర్చలుచేసి, కలిసికట్టుగా ప్రతి నెలా తమ మొత్తాలను పెట్టుబడులుగా పంపుతూన్నారు.

ఇలాటి చిన్న చిన్న ఎసోసియేషన్‌లు ఫెడరేషన్‌గా మారటమనేది తప్పనిసరి. వీరిలో రాష్ట్రసంబంధమైనవీ, జాతీయ సంబంధమైనవీ విశ్వాసాలు ఉంటవి. వారు వాషింగ్‌టన్‌లోకానీ, లేదా న్యూయార్క్‌లో కానీ బహుశా ఆ రెండు పట్టణాల్లోనూ కార్యాలయాలను స్థాపిస్తారు. పెద్ద పెద్ద పెట్టుబడిదారులూ, బ్యాంకులూ, బ్రహ్మాండమైన కార్పొరేషన్‌లూ తీసుకొచ్చే వొత్తిడులతో తక్కెడ ఒక పక్కకు మొగ్గు చూపకుండా, రెండవ వేపు వీరు కాచుకుంటారు. చిన్న చిన్న మొత్తాలను పెట్టుబడులుగా పెట్టుకున్నవారికి పన్నులభారం తగ్గించే ప్రత్యేక విధానాన్నీ, సౌకర్యాలను వీరు సాధిస్తారు. ఈ విధానంలో తమ తమ స్వార్థాలను ఏకంచేసి శాశ్వతంగా అతుక్కునేట్లు చేస్తారు.

వ్యక్తిగతంగా చూసినట్లయితే వారందరూ పనివారూ, ఉత్పత్తిని ఉపయోగించేవారూను; ఎసోసియేషన్ రూపేణా వారు పెట్టుబడిదారులు; జాతీయ సంస్థలో సభ్యులుగా ఉండటంవల్ల వారుకూడా రాజకీయమైన పలుకుబడులను కలిగినవారై ఉంటారు. ఈ విధానంలోని ప్రతి యంత్రాంగానికీ తమ శక్తివంచన లేకుండా పాటుబడుతూ, కలిసికట్టుగా ఉండేందుకు శ్రద్ధపడి సాధించటంతో, అనేక పనులుచేసే అనేక రూపాలు ధరించే వీరు ఏకమై వారివారి వివిధ పాత్రలమధ్య ఉండే భేదాలు అంతరించిపోతవి.

ఒకదానితో మరొకటి బంధించబడటమంటే - అది సుస్థిరంగా మార్పులు చెందని విధంగా ఉంటుందని నా ఉద్దేశ్యంకాదు; అలాటి ధోరణి అని మాత్రమే. మన సమాజం మార్పులు చెందేదిగానే ఉంటూన్నది: అదే దాని బలాతిశయం. ఐతే ప్రాథమికమైన ముఖ్యాంశాలు - పుష్కలతా, అత్యధికోత్పత్తీ, ఉత్పత్తి అయే పదార్థాలు మరింత వైశాల్యంమీద పంచబడటంద్వారా - ఆదాయాల్లో, విద్యావ్యాప్తిలో, తరగతుల్లో ఉండే విభేదాలను తుడిచివేయటం - ఇక తప్పనిసరై ఇవ్వన్నీకూడా ఒకదానితో మరొకటి చొచ్చుకొనిపోవటం జరగాలి. కార్మికుని కుమారులూ, మంత్రిగారి లేదా ఫాక్టరీయజమాని కుమారులూ కలిసే హైస్కూల్ విద్యకు వెళ్తారు; బహుశా కాలేజీకూడా వెళ్తారు. శక్తిసామర్థ్యాలున్న వారందరూ కాలేజీకి వెళ్తే, విద్యాభ్యాసం విషయంలో వారిమధ్యఉండే విభేదాలన్నీ రూపుమాసిపోతవి.

మన సమాజాన్ని గూర్చిన రంధ్రాన్వేషులు-మనది కేవలం యాంత్రికమైన సమాజంగా ఉన్నదనీ, చివరకు మానవుడు బ్రహ్మాండమైన యంత్రములో ఒకఅణువుగా ఉండిపోతాడనే అభిప్రాయాల్ని వెలిబుచ్చుతూన్నారు. సాహసికులు, వాస్తవికవాదుల వేషాలుధరించి, పారిశ్రామిక యుగానికి ముందుండే చేతిపనితనం, నైపుణ్యం, తనకుతానుగా చేసుకోగలిగే పని పాటల్లోఉండే క్షేమం మొదలైనవి అంతరించిపోయినవనీ, ఆ తృప్తి మరి రాదనీ వాపోతున్నారు.

ఐతే ఇదంతా అర్థం పర్థంలేని వాదం!

18-వ శతాబ్దపు చేతిపనితనమున్న వ్యక్తికి పోటీల్లో ఎలాటి రక్షణ ఉండేది? అప్పటికి నివారణోపాయాలు తెలియని అనేక వ్యాధులనుంచీ నిరంకుశంగా పరిపాలనచేసిన ప్రభుత్వాలనుంచీ అతని కేమిటి రక్షణ? రోజుకు పన్నెండుగంటలు పనీ, బాలబాలికలచేత కూడా పనిచేయించే ఆ రోజులు తిరిగి రావాలని కోరుకునే దెవరు? ఇప్పుడున్న వారానికి 40

గంటల పనీ (త్వరలోనే ఇది 30 గంటలు చేయబడుతుంది), సామాజిక రక్షణనిచ్చే పథకాలూ, నిరుద్యోగులకు లభించే కాంపెన్సేషనూ, ఆధునిక వైద్యవిజ్ఞానం, విద్యావ్యాప్తి 50 సంవత్సరాల క్రితం కూడా ఆశించేందుకు సాహసించని కలయికనని యీ రక్షణలకు మానవులు అలవడిపొయ్యారీనాడు. అది ఒక రక్షణమాత్రమే కాదు:

పురాతన సమాజంలో అందరూ కలిసే ఏదో గొప్ప సద్గుణం వీరినందరినీ నడిపిస్తున్నదా అన్నట్టుగా పనులుచేసుకొనే ధోరణిని సాహసోపేతమైనదిగాచేసే పథకాలు పనిచేస్తున్నవి. సామాజికరూపురేఖల్లో స్వచ్ఛందసేవాదళాలుండటం, ఆయా సమస్యలను ఎదుర్కొనేందుకు అనుసరించబడే సరైన మార్గాలను నిరూపిస్తున్నవి. కొన్ని అభిప్రాయాలను పరిశోధనా రూపంలో ప్రవేశపెట్టి ప్రయత్నించి, అవి విజయవంతంగాఉండే ధోరణిలో ప్రభుత్వపు సహాయసహకారాలు కూడా ఉండటం, ఇందువల్ల చిన్న తప్పులు పెద్దవికాకుండా చూసుకునే అవకాశాలుండటం జరుగుతూన్నది.

సామాజిక విధానమనేది నాలుగుగోడల మధ్యా నిర్వహించబడవలసి ఉండాలనే అభిప్రాయమున్నవారికి-అనేకతరహాలూ తత్వాలూఉన్న ముఠాలుగా ఏర్పడిన అమెరికన్‌ల జీవితం అసలు ముందుకు సాగుతూంటుందా అనే అనుమానం మొలకెత్తుతుంది. మనం సాధించిన ఐశ్వర్యమంతా కుప్పతొట్టిలోనుంచి; అభిప్రాయభేదాలనుంచే ఏకీభవించే విధానాన్ని మనం ఏర్పరిచాము. ఇలాటి ఏకత్వాన్ని ఒక బహుమతిగా మనం భావిస్తున్నామంటే, కష్టించి సాధించినందువల్ల-అందుకు ఆశ్చర్యపడనవసరంలేదు. ఐతే పరిశీలకులు ఇలాటి ఏకత్వాన్ని చూసి మనలో చీలికలు లేకుండటం, అభిప్రాయవిభేదాలు మనకు లేవనుకోవటంగా పరిగణిస్తారు-ఇది తప్పు అభిప్రాయం. మనలోఉన్న అభిప్రాయభేదాలన్నిటినీ ఎంతో ఓర్పుతో సహించి, వాటిని రూపుమాపుకొని ప్రశాంతజీవితాన్ని కలిసికట్టుగా కొనసాగించేనిమిత్తం సాధించాము. మన ఐక్యానికిసంబంధించిన సూచనలు

స్పష్టంగా కనిపించవంటే-మన నందఱ్నీ అవి కలిసికట్టుగా ఉంచేందుకు ప్రయత్నించటమేనని మన జవాబు. మనం అంగీకరించి అనుసరించే అనేక విషయాల-ఉదాహరణకు సర్వసమానత్వాన్ని ప్రకటించే ప్రవర్తనా, ఆర్థిక విధానంపట్ల మనకున్న బాధ్యతల నిర్వాహణా మొదలైనవి-ఎంతో కష్టపడి మనం సాధించగలిగినవై ఉన్నవి.

మన సంస్కృతిలో మతైక, రాజకీయాభిప్రాయాలు ఒకే ప్రవాహంగానూ, పబ్లిక్ ప్రైవేట్ వ్యాపారాలు ఒకటిగానూ, జాతీయ అంతర్జాతీయ సమస్యలమధ్య భేదాన్ని గుర్తించలేని విధంగానూ-జాన్‌డీవే ప్రవేశపెట్టిన సిద్ధాంతాలననుసరించి రాజకీయసిద్ధాంతాలు విద్యావ్యాప్తికి సంబంధించిన వేదాంతసూత్రాలుగా పరిణమించటం, పుష్కలతా, సమానత్వాలున్న ప్రపంచంలో ఆదర్శాలూ, వాస్తవికతలూ ఒకటిగా రూపొందటం జరుగుతూన్నవి.

జాన్‌డీవే తన ఆశల్ని యీ విధంగా వెల్లడిచేశారు:

"జరుగుతూన్న సంఘటనలకు అనుగుణంగా వేదాంతం సహకరిస్తూ, నిత్యజీవితంలోని ప్రతిచిన్న విషయంతాలూకు అర్థాన్నీ స్పష్టపరుస్తూండగా శాస్త్రీయవిజ్ఞానమూ, ఉత్తేజమూ ఒక దానితో మరొకటి పెనవేసుకోగా ఊహలూ, అనుభవాలూ ఒకదాన్నొకటి కావలించుకుంటవి. కవిత్వమూ, మతైకాభిప్రాయాలూ జీవితపుష్పాలవుతవి."

సమానత్వమే ఆదర్శంగానూ, స్వచ్ఛందసేవాశక్తికీ ఫెడరలిజమ్ కూర్చిన బలాతిశయాలలో, సామాజికమైన సరితూకమూ, అభివృద్ధులకు, తక్కెడ ఒకవైపు వొంగిపోకుండాచేస్తూ-ఒక దానిలో మరొకటి పెనవేసి కొనిపోతూ స్థాయిలూ, ధోరణులూ పెంపొందుతూఉండగా-సమానాంతర శాఖలవలె ఎంతదూరం వెళ్లినా ఆ రెండూ కలుసుకోక పోవటం-అత్యద్భుతశక్తిసామర్థ్యాలున్న సమాజానికి ప్రధానలక్షణంగా ఉంటూన్నది. ఇలాటిది భావిజీవితానికొక పథకం-అంతేకాదు-సోషలిస్టు ధోరణిలోని

సామాజిక న్యాయసూత్రాలను కాపిటలిస్ట్ విధానంలోని అత్యద్భుత శక్తులలో కలిపేందుకుచేసే ప్రయత్నమై-ఇది భావిమానవులందరికీ భవిష్యత్‌గా కూడా ఉంటూన్నది. ఇలాటి రెండు పట్టాలున్న రైలులో మనం ఇప్పటికే ప్రయాణాన్ని ఆరంభించాము; దానితాలూకు బ్రహ్మాండమైన మోటార్ల వేగానికి ఆ రైలు ఎటూ జారిపోకుండా సరిగా పట్టాలమీదనే పయనిస్తూన్నది. రీయాక్షనరీలు మాత్రం యీ పట్టాలలో ఒక దాన్ని తొలగించటం వల్ల ప్రయాణం మరింత హాయిగా సాగుతుందని నమ్ముతున్నారు।

## సాంప్రదాయమైన సంస్కృతి

నాగరికతలు ఆయాకాలానికి సంబంధించినవిగా ఉంటూన్నప్పటికీ, అమెరికన్ నాగరికతకు వంశపారంపర్యతఉంది. జీవితం ముందుకు ప్రవహించిపోతూనే ఉన్నది. గ్రీకుల ప్రజాస్వామ్యం, వైవిధ్యం, అందచందాల పట్లచూపే ఆపేక్షలూ, అనురాగాలూ, శారీరకబలాతిశయాల్ని వృద్ధిచేసుకోవటం మొదలైన వాటిని యూరప్‌అంతా అనుసరించినవిధంగానే, అమెరికా కూడా అనుసరించింది. సెక్స్‌విషయాలలో చూపే నిరాడంబరతా-మతైకవిశ్వాసాలపట్లచూపే ధోరణులలోకూడా అది పురాతన కాలంనాటి వేళ్ళను మరచిపోలేదు. జ్యూలు నైతికచట్టానికి కట్టుబడిఉండటానికీ, ఒక క్రమ పద్ధతిలో ఉన్నదానిపట్ల చూపే గాఢవిశ్వాసం, భగవంతుని చెప్పుచేతల్లో ఉన్న విశాలవిశ్వం, భగవానునిచే ఎన్నుకోబడిన జనావళి - ఇలాటి అభిప్రాయాలుగల వారెందరో అమెరికాలో ఉన్నారు. అనురాగాన్ని ప్రదర్శించే చట్టం, చుట్టుపట్ల నివశించేవారికి సహాయపడటం, అవసరాలతో బాధపడేవారితో కలిసి పంచుకోవటం, ప్రతి మానవునిలోనూ భగవంతుడే ప్రత్యక్షమౌతూన్నాడనే క్రిస్టియన్ మతవిశ్వాసం - ఇవే మన చరిత్రలో ఉద్దేశపూర్వకంగా అమలు జరపబడినవనీ, తత్కారణంగానే మన జీవితాలు కొనసాగుతూన్నవనే విషయాన్ని మనం అంగీకరిస్తున్నాం.

రోమన్‌లు చట్టాలను ప్రేమించేవిధానం, ప్రకృతిలోని చిత్రాలనుగూర్చి ఆలోచించి పరవశించెందే ఇండియన్‌ల ధోరణి, సంగీతంలోని తాళ జ్ఞానంలో ఆఫ్రికన్‌లు చూపే కౌశలం, మొదలైనవి - ప్రపంచంలోని దేశ దేశాలనుంచీ, ఆకలితో మాడిపోకుండా తమనుతాము రక్షించుకుంటూ, తమలోదాగిన ఉత్సాహాన్నీ, కౌశలాన్నీ ప్రదర్శించాలని తహతహలాడిన జనావళి అమెరికాకు వలసవొచ్చి, వారివారి నాగరికతలనూ, సంస్కృతు లనూ, ఆ ఖండంలో ప్రవేశపెట్టారు.

అట్లాంటిక్ మహాసముద్ర తీరంలో మొట్టమొదటి నివాసాలను ఏర్పర చిన వారికి, వారేం చేస్తున్నారో తెలుసు. తాము చేసేది కేవలం పరిశోధనే నని కూడా వారికి తెలుసు. ఐతే విలియమ్ బ్రాడ్‌ఫర్డ్ అన్నట్లుగా "ఒక చిన్న కొవ్వొత్తి తాను వెలుగుతూ, మరొక వెయ్యి కొవ్వొత్తులను వెలి గించగల విధంగానే - మొట్టమొదటి వెలుగు కిరణం క్రమంగా అనేక దీపాలను వెలిగించి, చివరకు జాతినంతనూ వెలుగులో ముంచగల దివ్య జ్యోతిగా పరిణమించింది." అబ్రహాం లింకన్ తన గెట్టిస్‌బర్గ్ ఉపన్యా సంలో - ప్రజలు ఎన్నుకొన్న, ప్రజలు పాలించే, ప్రజలకొరకు ఏర్పడిన ప్రభుత్వం అంతర్యుద్ధాన్ని సహించగలదా లేదా తెలుసుకొనేందుకే అంత ర్యుద్ధం జరిగిందన్నట్లు - యీ అమెరికన్‌జాతే ఒక పరిశోధన అనే ధోర ణిలో అమెరికన్‌లు భావిస్తున్నారు.

పారిశ్రామికాభివృద్ధి కారణంగా - మానవుడు భూమినే నమ్ముకొని కూర్చొనవలసిన అవసరం చాలావరకు తగ్గించబడి, భూమాతనుంచి విడి వడి, శాశ్వత గృహమనేదాన్ని వొదులుకొని, ఉద్యోగాన్వేషణ కొంకై పయనమవటంలో - జీవిత సముద్రంలోని లంగరు గొలుసుల్ని తెంచు కున్నాడు. స్వగృహం, ప్రకృతి, ఋతువులు, సారవంతమైన భూమి మొదలైన పదజాలం సూచనప్రాయంగా ప్రాముఖ్యతలోనున్న వాటినుంచి నిజమైన అర్థాన్ని పిండింది.

ఐతే ఇటీవలి సంవత్సరాలలో ఆ యా అర్థాలను తిరిగి మనం వెనక్కు నెట్టుతున్నాము. సామాజిక శాస్త్ర విజ్ఞానాభివృద్ధీ, జాన్‌డీవీ కార్యకలాపాలూ, పరిశ్రమల్లో దినదిన ప్రవర్థమానమౌతూన్న సామాజిక దృక్పథం, నూతన గృహనిర్మాణ పథకాలను ప్రవేశపెట్టటంలోనూ, నిర్మించటంలోనూ చూపబడే శ్రద్ధాశక్తులు, విద్యాలయాలు నడపబడే విధానాల్లో చేయబడేసూచనలూ, ఇంకా ఇలాటి వందలకార్యక్రమాలద్వారా మన సంస్కృతి-మానవుని కార్యకలాపాలూ. ఆ తొలిరోజుల్లోని సహకార సానుభూతుల కలయికను తిరిగి సాధించేందుకు గల మార్గాలను ప్రవేశపెట్టటం మొదలైన వాటిద్వారా కొత్తకొత్త అర్థాలకొరకై అన్వేషణ ఆరంభమైంది.

కలసికట్టుగా పనిచేయుటమనేదాన్ని అమెరికన్‌లు ఎప్పుడూ ప్రేమిస్తూన్నట్లే కనిపిస్తుంది. ఈ పదం రూపొందిన జన్మస్థలంలో 'కలిసికట్టు' అనే దానికి - కుటుంబం, జట్లు, క్లబ్‌లు, ఎసోసియేషన్‌లూ, రాజకీయ పార్టీలూ ఇంకా ఇలాటి అనేక కలయికలు, సజీవ సమూజంలో చూడదగినవాటి ద్వారా మనం, మన కుటుంబ నిర్వహణ విధానాల్లాటి వాటిని అమలు జరుపుతూన్నాము. ప్రతి సమూజమూ, ఉత్తేజపరిచే సంస్కృతిమీద ఆధారపడి ఉంటూ, ఆ యా ఉత్తేజాలు చిన్నతనంలోని స్నేహాలద్వారా రూపురేఖలు దిద్దుకునేవిగా ఉంటూన్న కారణంగా, సమూజం తన సంస్కృతికి కుటుంబ సంబంధ బాంధవ్యాలనే పీఠంగా తీసుకొనవలసి ఉన్నది. కుటుంబంలో ఉత్తేజ పరిచే సంస్కృతే భారీప్రమాణంలో సమూజంలో కూడా కనిపిస్తూ ఉంటుంది. కనుకనే మనం చర్చ్‌ని మాతగానూ, జాతీయతను పితృభూమిగానూ, రహస్య ఆజ్ఞలను భాతృత్వంగానూ పేర్కొంటున్నాము. ఈ విధంగా కుటుంబంతాలూకు అభిప్రాయాలను సూచనప్రాయంగా సమూజంలోకి ప్రతిఫలింపజేయటంతో జాతీ, ప్రపంచమూ ప్రజాస్వామ్య విధానంలో రూపురేఖలు దిద్దుకున్నవిగా ఉంటూ, తన పౌరులు సామాజిక కార్యకలాపాలలో ఎప్పుడూ ప్రధానపాత్రలు తీసుకో

వలనే ఉంటుందని మనం ఆశిస్తున్నాము. ఎందుకంటే ప్రజాస్వామ్య మనేది కేవలం ఒకానొక ప్రభుత్వ విధానంమాత్రమేకాదు; అది ఒక జీవిత విధానం.

స్కాట్ ఫిట్ జిరాల్డ్ ఇలా అన్నారు: "అమెరికా అంటే హృదయం అంగీకరించినదాన్నే అనుసరించేది." ఇది భావపూరితమైనదిగా కనిపిస్తే, అమెరికా అలాటిదేనని కూడా మనం అంగీకరిస్తాము.

---

# పదహారో అధ్యాయం

## విశ్వసమాజం: యునైటెడ్ స్టేట్స్

నిరంకుశత్వానికి విప్లవంగా, ప్రజల ఆత్మవిశ్వాసానికి అనుగుణంగా, వ్యక్తి హక్కులను గుర్తించేదిగా, ప్రజాస్వామ్య సిద్ధాంతాలమీద నడప బడే ప్రభుత్వంగా న్యాయమూ సర్వజనసమానత్వాలకు బాసగా, అనేక సంవత్సరాలనుంచీ అమెరికా నిలబడింది. దురాక్రమణను ఖండిస్తూ, ప్రపంచంలోని ప్రతితావులోనూ స్వేచ్ఛాస్వాతంత్ర్య పోరాటాలకు తగిన ఉత్తేజాన్నిస్తూ, దేశభక్తులైనవారు దేశస్వాతంత్ర్యంకోసం పోరాడి దేశ బహిష్కృతులైనప్పుడు వారికి రాజకీయరక్షణనిస్తూ, స్వాతంత్ర్యసాధన కోసం తగిన ఆర్థికసహాయాన్ని సమకూర్చుతూ-ప్రపంచంతాలూకు ఆత్మకే మనం దర్పణంగా ఉంటూన్నాము. ఐతే ఇదే సమయంలో వాషింగ్టన్ సలహాల ప్రకారమూ, మన్రోసిద్ధాంతాల ప్రకారమూ మనం ప్రపంచంలో జరిగే అనేక వాగ్వాదాలనుంచి దూరంగా ఉంటున్నాము.

ఐతే ముందువెనుకల ఆలోచనలేకుండా మనం స్పెయిన్‌తో యుద్ధం లోకి దిగి, హఠాత్తుగా పసిఫిక్ మహాసముద్రం మీదినుంచి ఫిలిప్పయిన్స్‌కు

విస్తరించినప్పటికీ-వెనువెంటనే సామ్రాజ్యతత్వాన్ని ప్రదర్శించినందుకు సిగ్గుతో మొహం వాలిపోగా, మనం సంపాయించిన భూభాగం ఎప్పుడూ మనకు వలసరాజ్యాలుకావని పేర్కొని, త్వరలోనే ఫిలిప్పయిన్స్ స్వాతంత్ర్యాన్ని గూర్చిన మాటలు జరిపాము. చైనాలోని బాక్సర్ విప్లవంలో యూరోపియన్ సిద్ధాంతాలననుసరించిన సామ్రాజ్యతత్వంలో మనం ఇరుక్కున్న నేరానికిగాను, మన భాగంగా చైనీస్ విద్యార్థులకు యునైటెడ్ స్టేట్స్‌లో విద్యాసౌకర్యాలను కలిగించాము.

మంచి ఇరుగుపొరుగులతత్వాన్ని ప్రదర్శించటమనేది-ఇతర అమెరికన్ దేశాలతో మనం చేసుకున్న సంధిషరతుల ద్వారానూ, ఒప్పందాలద్వారానూ జరిగింది; ఫిలిప్పయిన్స్ స్వాతంత్ర్యాన్నిపొందే పథకాలను అమలుజరపటం-ఒకప్పుడు మనం వలసలుగా అనుభవించినబాధలు తెలుసుకున్నవారమే కనుక, వలసరాజ్యాలలోని ప్రజలపట్ల మనంప్రదర్శించే సానుభూతీ, మనం శాంతికాముకులమనేందుకు నిదర్శనాలుగా 1920_1921 లో నౌకబలాన్ని దావాపు లేకుండాచేయటం, చివరకు మనకు హానికలుగుతూన్న సమయాలలో కూడా కేవలం స్వరక్షణార్థం కూడా దౌర్జన్యాన్ని సాధనంగా ఉపయోగించరావనే మన సిద్ధాంతం (1933 లోని మాంట్‌విడియో సమావేశం; 1936 లోని బోనస్‌ఎయిర్స్ సమావేశం)-ఇలాటి అనేక సంఘటనలు మనకు శాంతిభద్రతలపట్లా, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపట్లాఉండే అభిలాషకు తార్కాణాలు; చివరకు చిన్నచిన్నజాతులకూ కూడా స్వేచ్ఛలభించాలనే సదుద్దేశంతో, మన బలాతిశయాల్లో చాలాభాగాన్ని ఇష్టపూర్వకంగా వొదులుకోవటం, తద్వారా ఆయా చిన్నజాతులు తమ స్వాతంత్ర్యాన్ని సాధించటం కూడా జరిగినవి.

1930 లో ఒక దేశంతో మరొకదేశం చేసుకొనే అనేక వ్యాపార సంబంధమైన వొప్పందాలను, ప్రపంచంలోని ఆర్థికవిధానం ఆరోగ్యకరంగా ఉండే నిమిత్తం చేసుకున్నాయి. 1939 కల్లా 19 దేశాలు-ప్రపంచపు

మొత్తం వ్యాపారంలో ఐదింట మూడుపాళ్లు ఆక్రమించినవాటితో, మనం వ్యాపారసంబంధమైన ఒప్పందాలను చేసుకోగలిగాము. ఇది దిగుమతి సుంకాల ఆధిక్యతను తగ్గించలేకపోయినా, అవి మరింత పెరగకుండా మాత్రం అడ్డుకోగలిగినవి.

ఈ లోగా అనేక పథకాలను ప్రవేశపెట్టటంద్వారా శాంతిభద్రతలను నెలకొల్పటం జరిగింది. ఇవన్నీ నిష్ప్రయోజనమైనవిగానూ, విషాదాంతాలకు దారితీసే ఆలోచనలుగానూ ఇప్పుడు కనిపించినా, అమెరికన్‌ల హృదయాల్లో యుద్ధమనేది గొప్పనేరమనీ, మన ప్రభుత్వానికీ, ప్రాథమిక స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకూ భంగంవాటిల్లనంతవరకూ యుద్ధాలు జరుపరాదనే అభిప్రాయం లోతుగా నాటుకున్నది. "మంచినికోరే యుద్ధంకానీ, చెడుగును కోరే శాంతికానీ ఎన్నడూ ఉండదు" అనేదే అమెరికన్ సిద్ధాంతం.

1928 లో మనం కెల్లోగ్-బ్రియాండ్ ఒప్పందంమీద సంతకాలు చేశాము; అమెరికాలోని శాంతిభద్రతాసంఘ కార్యకలాపాల కారణంగా జరిగిన యీ ఒప్పందంప్రకారం మనం, మరొక 59 జాతులతో కలిసి యుద్ధాన్నిబహిష్కరించటం జరిగింది. దురాక్రమణదారులు తిరిగి ఆయుధాలను ధరిస్తూంటే, మనస్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హద్దులలో ఉంచుకుంటూ, తాటస్థ్యవిధానాన్ని అనుసరిండంవల్లనే, హిట్లర్, జపానీయులూ మనం ఆయుధాలను పూనబోమని వారి దురాక్రమణలకు ఎరైనవారికి ఆయుధాల సరఫరా జరపబోమనీ తెలుసుకోవటం వారికెంతో ఉత్సాహకారణమైంది. మంచూరియాను స్వాధీనపరుచుకొన్న దగ్గర్నుంచీ, పోలెండుమీద జరిగిన దాడివరకూ, అమెరికన్‌లు యుద్ధరంగంలో ప్రవేశించరాదనే దృఢనిశ్చయం దురాక్రమణదారుల ధైర్యసాహసాలు పెంపొందింపజేసి, ప్రపంచయుద్ధానికి దారితీసింది.

రెండు ప్రపంచయుద్ధాలకూ మధ్యకాలంలో మనం నైతిక, న్యాయబద్ధమైన ధోరణిలో, ప్రపంచశక్తుల తాలూకు నిజానిజాలను పరిశీలించాము.

ఆర్థికమైన కారణాలప్రాముఖ్యతను గుర్తించేందుకు మనం నిరాకరించిన కారణంగా, దిగుమతి సుంకాలను పెంచి, మన మిత్రులు తమ ఋణాలను తీర్చేఅవకాశాలను ఆటంకపరిచాము. జపానీయులు ఉత్పత్తిచేసిన సరుకులను కొనేందుకు మనం నిరాకరించి, జపాన్‌నుంచి వలసవొచ్చినవారిని చేకొనకుండా చేయటంవల్ల, జపానీయులు ప్రపంచంలోని ఇతరదేశాలతో వ్యాపారసంబంధాలను పెట్టుకోవటం, ముడిసరుకులను పరదేశాలనుంచి కొనుక్కోవటం జరగటంతో జపానీయుల దురాక్రమణను మనంపరోక్షంగా ప్రోత్సహించటం జరిగింది.

మన బలాతిశయాలతో మూర్ఛపోయి, మనం మన అంతర్జాతీయ బాధ్యతల్ని విస్మరించాము. త్రాగుడు నిర్మూలించేందుకుగాను మద్యపాన నిషేధచట్టాన్ని అమలుజరిపేందుకు ప్రయత్నించటం, ఆయుధాలనువిసర్జించటంద్వారా యుద్ధప్రమాదాల్ని రూపుమాపేందుకు ప్రయత్నించటంలాటి పిచ్చిపనులు-కేవలం నైతికచట్టాన్ని అమలుజరిపి పాపాలనుజయించేందుకు ప్రయత్నించటమేఐంది. ఇలాటి నైతికదృక్పథాన్ని విమర్శించేవారు-దురాక్రమణలపట్లచూపే ఏవగింపులాటిదే కానట్లయితే, దురాక్రమణదారులకు ప్రజాభిప్రాయం ఏనాడూ సానుకూలంగా ఉండేదికాదు; నిజానికి దురాక్రమణ అనేది అంత్యస్థితిలో దాపరించనే దాపరించింది.

రాజకీయదక్షతనేది కేవలం సర్వజనాంగీకారమైన బలంమీదనే అత్యధికంగా ఆధారపడిఉంటునేది. అమెరికాలోవలె మరే ఇతరదేశంలోనూ కనిపించదు. ఒక తరగతివారు పరిపాలకులనీ, మరొక తరగతివారే రాజకీయదక్షులనేదిలేదు. అత్యద్భుతంగా విస్తరించిన మన అంతర్జాతీయ సంబంధబాంధవ్యాలలోని క్లిష్టతలనుగూర్చి మన ప్రజలందరికీ తెలుసునని అనుకోవటం కుదరదు కనుక, వారికి అర్థమయ్యేభాషలో ఆయా సంబంధాలను గూర్చి, ఆయాసమస్యలను గూర్చి చెప్పవలసిఉంటుంది. కనుకనే నైతికధోరణిలో ఇది కొనసాగించబడుతూ-సముద్రాంతరదేశాలలో ఉండే

మన మిత్రులకు అంతగా రుచించకుండా ఉంటూన్నది. ఐనప్పటికీ మన రాజకీయదక్షత ఎప్పుడూ-బలహీనమైన, చిన్నదైన జాతి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలసాధనకొరకై పోరాడేప్రజ, శాంతిభద్రతలపట్ల ఆపేక్షచూపే జనావళివైపుకే మొగ్గుతూ, విస్తరించే మన ఆర్థికవిధానం తాలూకు ఫలంలో వారికి కూడా భాగాలు పంచేందుకు సంసిద్ధంగా ఉంటూన్నది.

## రెండో ప్రపంచయుద్ధం; అనంతరం.

యూరప్‌లో తిరిగి యుద్ధం అరంభమై. ఫ్రాన్స్ ఓడిపోవటం జరిగాక, మనం అట్లాంటిక్ ఛార్టర్‌ను అనుసరించి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలూ, ఆర్థిక సామాజిక హక్కులు కాపాడే సిద్ధాంతాలను గౌరవించవలసిన కారణంగా సహజంగానే మన మిత్రులైన బ్రిటన్‌లతో చేతులు కలిపాము; ఐతే యీ సిద్ధాంతాల సాధన ఎంతవరకూ కొనసాగిందనేది వేరొక విషయం.

యుద్ధసమయంలో మన సైనికుల్ని సరఫరా చేయటమేగాక, యుద్ధానంతరం మనం 90 బిలియన్ డాలర్లు 'ఇవ్వటం - పుచ్చుకోవటం' అనే పద్ధతిమీద సహాయం చేశాం. చివరకు రష్యాతో మైత్రి సంపాయించి, వివిధ జాతులున్న కుటుంబంలోకి రష్యాను కూడా ఆహ్వానిద్దామనే సదుద్దేశంతో, అట్లాంటిక్ ఛార్టర్‌నూ, మన ఆదర్శాలనూకూడా అతిక్రమించి, రష్యాకు బాల్టిక్ రాష్ట్రాలూ, పోలెండు తూర్పు సరిహద్దులూ, ఇచ్చి - బాల్కన్స్‌లోనూ, మంఘూరియాలోనూ రష్యన్ పలుకుబడులనుకూడా ఆటంకపరచకుండటం జరిగింది. హిట్లర్, దారుణమైన దాడులకు రష్యన్‌లు తమ సరిహద్దులను వొదిలి దేశంలోని మూలమూలలకూ పరుగులిడిన ఆపత్ సమయంలో, మన సహాయం అర్థించనంతవరకూ ఇవ్వవలసిన అవసరం లేకపోయినా, లేదా ఆ చేసే సహాయానికి మన షరతులను అంగీకరించవలసి ఉన్నప్పుడుకూడా - మనం గౌరవనీయమైన పద్ధతిమీద ఉండే గాఢవిశ్వాస కారణంగా, విశాల హృదయాన్ని రష్యాపట్ల ప్రదర్శించాము.

యుద్ధం ముగియగానే మనం తొందర తొందరగా సైన్యాలను ఉపసంహరించటం, కంట్రోల్స్‌ను ఎత్తివేయటం, యుద్ధ సమయంలో ఏర్పరిచిన ఏజన్సీలను మూసివేయటం జరిగింది; విజయాన్ని సాధించినందుకు తగిన ప్రతిఫలమున్న శకం ఉన్నదికదాననే ఉత్సాహంతో ఎదురు చూశాము. అణుశక్తి శాస్త్రీయ విజ్ఞానాన్ని ప్రపంచానికి పంచేందుకు మనం సిద్ధపడ్డాము; అఛిసన్ - లిల్లింథాల్ పథకాన్ననుసరించి అణుశక్తితో జరిగే యుద్ధాన్ని నిషేధించేందుకూ, ప్రపంచంలో శాంతి భద్రతల్ని నెలకొల్పేందుకూ, ఎన్నో సమ్మతులను ఇచ్చాము. ఐతే రష్యన్ ప్రభుత్వం మన పథకాల్ని నిరాకరించి, ఆస్థానంలో హాస్యాస్పదమైన వాటిని ఉంచిన పథకాన్ని మన ముందుంచింది.

ఈ లోగా రష్యన్‌లు తమ సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకునే కార్య కలాపాలలో ఊపిరితిరగకుండా పనిచేస్తున్నారు. బాల్టిక్‌స్టేట్స్‌ను తమకు కలుపుకోవటం, తూర్పుజర్మనీని సోవియట్ రాజ్యభాగంగా చేసుకోవటం, పోలెండు, చెకోస్లోవేకియా, హంగరీ, బల్గేరియా, రొమేనియా అల్బేనియా దేశాలలోని అధికారాలను చేజిక్కించుకొని కొత్తగా 3,92,000 చదరపు మైళ్ళ భూభాగాన్ని ఆక్రమించుకొని, 9 కోట్లమంది ప్రజలను తమ పౌరులుగా చేసుకోవటం జరిగింది. ఇదే సమయంలో యునైటెడ్‌స్టేట్స్ ఫిలిప్పీన్స్‌కూ, గ్రేట్‌బ్రిటన్ ఇండియా, పాకిస్తాన్, సిలోన్, బర్మాలకూ స్వాతంత్ర్యాలను ఇచ్చేందుకు ఆలోచనలుచేస్తున్నవి. నెదర్‌లెండ్సునుంచి ఇండోనేషియా స్వాతంత్ర్యాన్ని సంపాయించింది. ఈ మార్పుల కారణంగా 2,894,000 చదరపుమైళ్లూ, ఆ వైశాల్యంలోఉన్న 555,000,000 ప్రజలూ స్వాతంత్ర్యాన్ని పొందారు.

ఇంతకుముందే యునైటెడ్‌స్టేట్స్ అనేకసమావేశాలను ప్రోత్సహించి, యునైటెడ్‌నేషన్స్ స్థాపనకు దారిఏర్పరచింది. లీగ్ ఆఫ్ నేషన్స్ అంతర్జాతీయశాంతిభద్రతలను కాపాడలేకపోయినప్పటికీ, యునైటెడ్ నేషన్స్

దాన్ని సాధించగలుగుతుందని అమెరికన్‌లు ఆశించారు. కాని, రష్యా తన ఇరుగుపొరుగు రాజ్యాలను దిగమింగేందుకూ, దూరదేశాల్లో ప్రభుత్వాలను పడగొట్టేందుకూ. కంకణాన్ని ధరించినకారణంగా ఇది దుస్సాధ్యమైంది. రాజకీయంగా రష్యాప్రవర్తన ఇలాఉంటే, పోనీ ఆర్థికరంగంలో అనేక యునైటెడ్‌నేషన్స్ ఏజన్సీలద్వారా సహాయసహకారాలను ఇస్తుందేమో నంటే, అలాటిదీ కనిపించలేదు.

1947 లో గ్రేట్‌బ్రిటన్ టర్కీకీ, గ్రీస్‌కూ ఆర్థిక సైనిక సహాయాలను చేయలేమని ప్రకటించినప్పుడు, మన శక్తిసామర్థ్యాలకు అదొక పరీక్షయి, సత్యాన్ని ఎదుర్కొనవలసిరాగా, మనం సహాయపడకుండటాన్నుంచి తప్పించుకోలేకపోయ్యాము. ట్రూమన్ సిద్ధాంతాల ప్రకారం పరదేశాలపట్ల అమెరికన్ వైఖరిలో గొప్ప మార్పువొచ్చింది. మన దేశపు సరిహద్దుల లోకి మాత్రమే మనము ముడుచుకొనిఉండి, హాయిగాఉండగలమనే స్వప్నం వమ్మయింది. బ్రిటన్ మహాసముద్రాలను పరిశీలిస్తూ, అధికారం ఎటూ మొగ్గిపోకుండా కాపాడుతుందనికానీ, యునైటెడ్‌నేషన్స్ అన్ని అవసర పరిస్థితుల్లోనూ సమర్థించగలదనికానీ మనమిక అభిప్రాయపడ లేము. రష్యన్ అధికారాలు సామ్రాజ్యతత్వాన్ని పెంపొందించుకొని రాజ్య విస్తరణలో నిమగ్నులౌతూ, ప్రపంచంలో అశాంతినీ, విప్లవాన్నీ లేవ దీసేందుకు ప్రయత్నిస్తూన్నంతకాలం, ఒక్క అమెరికన్ అధికారాలు మాత్రమే అలాటి దురధికారాలను సమంగా ఉంచగలదు.

"కొద్దిమంది ఆయుధాలుపూని ప్రజానీకాన్ని అణచివేసేందుకు ప్రయత్నిస్తూన్నప్పుడూ, బైటనుంచివొచ్చే వొత్తిడులకారణంగా దుర్మార్గాలను చేస్తున్నప్పుడూ-అలాటి, ప్రజల స్వేచ్ఛకొరకై యునైటెడ్‌స్టేట్స్ వారిని బలపరుస్తుంది"-ఇదీ ట్రూమన్ సిద్ధాంత సారంశం.

యూరప్‌లో ఏర్పడిన ఆర్థికసంబంధమైన క్లిష్టతను సమస్యల సందర్భములో-మనం మార్షల్‌ప్లాన్‌తో ముందుకు వచ్చాము; ఇంతవరకూ ఏఒక్క

దేశమూ, ఇలాటి ఆర్థిక సహాయాన్ని అందివ్వలేదు. ఈప్లాన్ ఉద్దేశం-సహాయంపొందిన దేశాలు సహాయపడినదేశానికి కట్టుబడిఉండటంలేదు; కాని ఆ దేశీయులు తమకు అనుకూలమైన విధానంలో వారివారి మేళ్లను కొనసాగించటం; ఐతే ఇందులో స్వలాభం కూడా లేకపోలేదు-స్వాతంత్ర్య ప్రపంచమందంతటా ఆరోగ్యకరమైన ఆర్థికవిధానం అమల్లో ఉండటమే మనకు రక్ష।

అంతేగాక 1947 లో పశ్చిమార్థగోళంలోని దేశాలలో స్వరక్షణను ఉద్దేశించి మిత్రరాజ్యసమితిగాఏర్పడి, మన సాయుధ సైనిక బలాలను పెంపొందించుకొని దేశరక్షశాఖను ఏర్పరిచాము. తరువాతి సంవత్సరములో యూరప్, పసిఫిక్ రాజ్యాలకు కూడా యీ మిత్రత్వం విస్తరింపజేయబడింది.

అత్యంత శక్తివంతమైన రష్యన్సైన్యాలు సరిహద్దు ప్రాంతాల్లో ఉండటంవల్ల 1948 లో కమ్యూనిస్టులు జెకోస్లోవేకియాలో తిరుగుబాటుకుకారణభూతులయ్యాక, మనం మన రక్షణబలాన్ని పెంపొందింపజేసుకోక తప్పలేదు. జనాభా నిష్పత్తినిబట్టి చూసినట్లయితే, మనకన్నా రష్యాకు మూడున్నరరెట్లు అధికమైన సైనికబలాలున్నవి.

ఆ తరువాత కొరియామీద దాడిజరిగింది. కమ్యూనిస్టులు ప్రపంచంలో ఏ ప్రదేశంలోనైనాసరే దాడిజరిపేందుకూ, అక్కడిపరిస్థితులను తమ చేతుల్లో ఉంచుకునేందుకూ ప్రయత్నించేందుకూ సిద్ధపడుతూన్నారనేదిస్పష్టమయింది. సకాలంలో అమెరికా తీసుకున్నచర్యను యునైటెడ్ నేషన్సు కూడా బలపరచటంలో కమ్యూనిస్టులవల్ల దాపరించే భయాలు ఎదుర్కొబడినవి.

తాము వలసదారులుగాఉండి పడినబాధలనుంచి విముక్తులయేందుకుగాను యునైటెడ్ స్టేట్స్ యుద్ధంలోనుంచే అవతరించినప్పటికీ, దక్షిణ అమెరికాలోనూ, ఫిలిప్పయిన్స్‌లోనూ, ఇంకా అనేక ఇతరతావుల్లోనూ తమ స్వాతంత్ర్యసిద్ధికై పోరాడేవారికి బాసటగానిలిచింది; ఐతే కమ్యూనిస్టు

నియంతలు తమ చుట్టుపట్లఉన్న స్వాతంత్ర్యరాజ్యాలను కబళించటంలో నిమగ్నులైవుండి-యునైటెడ్‌స్టేట్స్ వలసరాజ్యాల విస్తరణను ప్రోత్స హిస్తున్నదనే దుష్ప్రచారాన్ని సాగిస్తున్నారు. యూరప్‌లోని మన మిత్ర త్వాన్ని పెంపొందించుకునేందుకుగాను మనంచేసే ప్రయత్నాలలో మన కాలు వలసరాజ్యాలమీద కొద్దిగాపడింది; ఉదాహరణకు-ఆల్జీరియాలాటి ప్రదే శాలలో-ఆ దేశంలోనే పుట్టిపెరిగిన యూరపియన్‌లను కాపాడవలసిన బాధ్యత మనకు ఉన్నది. ఏమైనప్పటికీ గత దశాబ్దంలోని నిష్పాక్షిక పరి శీలనల్లో పశ్చిమరాజ్యాలవారు ప్రజల స్వాతంత్ర్యానికై పాటుబడుతూంటే రష్యా వారిని బానిసలుగా చేయటం. లేదా ఎదుర్కొన్న పక్షంలో వారిని తుడిచివేయటం చేస్తున్నది.

తమ విరోధులు అస్త్రసన్యాసం చేయటంవల్ల, దురాక్రమణదారుల దృక్పథం ఎన్నడూ మంచివైపు మళ్ళదనే కఠినసత్యాన్ని నేర్చుకొని. అమెరికన్‌లు దురాక్రమణను తుడిచివేసే పథకాలను ప్రవేశపెట్టేందుకు అవసరమైనంత సైనికబలాలనూ, కావలసినంత ఆర్థిక సహాయాన్నీ తమ మిత్రులకు అందించి. ప్రపంచాన్ని తమహస్తగతం చేసుకొనే సోవియట్ యూనియన్ పథకాలను ఎదిరించే వారందరికీ బాసటగా నిలిచారు. ఐతే చిత్రమేమిటంటే-ఇలాటి అత్యధికవ్యయంతో కూడిన, కష్టతరమైన నిర్ణ యాన్ని చేసుకున్నాక. వారి ఉద్దేశ్యాలు అనుమానించబడినవి. చివరకు తమ సైనికబలాలను తగినంతగా ఉంచుకోనిదే యుద్ధప్రమాదాన్ని తప్పించ లేమని తెలుసుకొని- ఇలాటిది రెండు ప్రపంచ సంగ్రామాలలోనూ వీరు చేయలేదనే నేరారోపణకు గురైనప్పటికీ, ఇప్పుడు వీరిది సాధించి యుద్ధో న్మాదులనే పేరు బడ్డారు!

ఆ పురాతనస్వప్నం- ప్రపంచంలో మరి యుద్ధాలనేవి లేకుండా చేసేం దుకు వీరు తిరిగి తిరిగి నిరాయుధీకరణ పథకాలెన్నిటినో ప్రవేశపెట్టాలని ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. మొదటిగా అణుయుద్ధాలను బహిష్కరిం

చటం. తరువాత సైనిక స్థావరాల పరిశీలన పథకాలను అసలు జరపట మూను: యీ రెండోదే లేనట్లయితే నిరాయుధీకరణ కేవలం ఒక హాస్యాస్పదమైన కార్యక్రమంగానే ఉండిపోతుంది. సంవత్సరాల తరబడి ఎంతో ఓర్పుతో జరిపిన సంప్రదింపుల ఫలితం ఒక్కటే: ఎలాటి సైనికస్థావరాల పరిశీలనా పథకానికైనా సరే రష్యా ఒప్పుకోకపోవటం!

యునైటెడ్‌స్టేట్స్ తాలూకు చరిత్రే యీ విషయాలను రుజూచేయగలదు; సోవియట్ యూనియన్ ఫిన్‌లాండ్, పోలెండ్లమీద జరిపిన దురాక్రమణ పథకాల్లాటివి ఎన్నడూ ఊహించలేము; చివరకు యాల్టా ఒప్పందంలోకూడా. మంచూరియాలో రష్యా పలుకుబడులకు అగ్నిపరీక్ష ఎదురైనప్పుడు, యునైటెడ్‌స్టేట్స్ సిఫారస్ చేసినదానికన్నా ఎక్కువ భూభాగాన్నే చైనా రష్యాకు ఇచ్చుకున్నది: యీ ఒప్పందం అనేకమంది అమెరికన్‌లకు సిగ్గుచేటయింది.

యుద్ధమే సంభవిస్తే అనేక సైన్యాలను పోషించవలసిన బాధ్యతలు నెత్తిన పడటం, తదనుగుణంగా పన్నులు భారమవటం, వస్తురూపాన ఉన్న ఐశ్వర్యమంతా నాశనమవటం జరుగుతుంది: అత్యధికోత్పత్తి అమూల్యమైనదిగా భావించే సంస్కృతి ఉన్నజాతికి ఇలాటిది గొప్ప నేరంగా ఉంటుంది. యుద్ధాలను ప్రోత్సహించటంవల్ల పరిశ్రమల్లోని లాభాలు అంతులేనంతగా పెరుగుతవనే వాదాన్ని తీసుకున్నట్లయితే. యుద్ధంలో ఇవ్వబడిన కాంట్రాక్టుల విషయంలో అమెరికా అవలంబించిన పునఃసంప్రదింపుల ఫలితంగా, రెండో ప్రపంచ యుద్ధసమయంలోనూ, ఆ తరువాతా అమెరికన్ ప్రభుత్వానికి 10,431,637,000 ముదరావొచ్చింది. మిగతా లాభాల విషయంలోకూడా శాంతి సమయంలో వొచ్చేలాభాలకన్న అధికంగా వొచ్చిన లాభాలమీద 95% వరకూ పన్నులు విధించబడినవి, ఆ తరువాత. వ్యక్తిగతంగా తమతమ భాగాలకు వొచ్చిన లాభాలమీద కూడా ఆ యా వ్యక్తులు పైస్థాయిల్లో ఆదాయపుపన్ను కట్టవలసి వొచ్చింది.

తమ విరోధులు సాయుధదురాక్రమణలను రాజకీయ ఆయుధాలుగా ఉపయోగించుకుంటూంటే, అమెరికన్‌లకు ఆలాటిఊహలే రానికారణంగా వారికిది ఎంతో ఇబ్బందిగా పరిణమిస్తూన్నది. అమెరికా తన విధానానికి యుద్ధం ఒక ఆయుధమని ఏనాడూ నమ్మని కారణంగానూ, దీనికి వ్యతిరేకవిధానాన్ని అవలంబించిన ప్రజకు అమెరికా ఏనాడూ తన సహాయసానుభూతుల్ని అందివ్వని కారణంగానూ, తమ విరోధులే ముందు దెబ్బతీసేవరకూ అమెరికా వేచి ఉండవలసిన పరిస్థితులు ఏర్పడినవి.

ఇంతకుముందు విశదీకరించిన కారణాలకు అనుగుణంగా, ప్రపంచంలో మనస్థానం ఎంతో నైతికమైనదిగాఉండి. మనమిత్రరాజ్యాలవారి విధానాలు మనకు నమ్మకమున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు భంగకరంగా ఉన్న పక్షంలో ఆలాటివాటిని అంగీకరించటం మన మతం కానేరదు. ఐనప్పటికీ హిట్లర్, ముస్సోలినీలు ప్రపంచాన్నే కబళించే పథకాలు వేసినప్పుడుకూడా మన విధానాలకు ప్రతికూలంగా ఉన్న సోవియట్ యూనియన్‌కుసైతం ఆ ఆపత్‌సమయంలో మనం సహాయపడినాము.

ప్రపంచంలోని నలుమూలలనుంచీవొచ్చిన బహూజనావళి బలపరచిన మన ప్రభుత్వంలో. ఇదే సమయంలో మనం ఏర్పరచుకొన్న విదేశీయ రాజ్యాంగ విధానానికి జనబాహుళ్యం సమ్మతికూడా అవసరం. పరభాషలు మాట్లాదే సమాజాలవారు ప్రత్యేకమైన కోర్కెలను వెల్లడిచేస్తే-ఉదాహరణకు కోఆర్డినేటింగ్‌కమిటీ ఆఫ్ అమెరికన్ పోలిష్ ఎసోసియేషన్స్ వారు సోవియట్ రష్యాదురాక్రమణచేసిన రాజ్యాలను గుర్తించకుండా, బహిష్కరించబడిన ప్రభుత్వాలను గుర్తించమనటంలాటివి జరుగుతూంటవి. కార్మికులూ. వ్యాపారస్థులూ. రైతులూ, స్త్రీలూ. వివిధమతాలకు సంబంధించిన సమాజాలూ - వీరందరికీ విదేశీయ రాజ్యాంగ విధానంలో కుతూహలముండటం, వీరందరి అభిప్రాయాలూ వాషింగ్‌టన్‌లో వినిపిస్తూ ఉండటం జరుగుతూన్నది.

వలసలువచ్చేవారి విషయంలో మనం అవలంబించిన విధానాన్ని ఎదు రొడ్డనే శక్తులుకూడా పనిచేస్తున్నవి. ఈ శతాబ్దంలోని మొదటి రెండు దశాబ్దాలలోనూ ప్రవాహరూపంగా వొచ్చిపడిన వలసదార్ల తాకిడికి హడలి పోయి, వీరందరికీ తగిన సౌకర్యాలను కలిగించలేని పరిస్థితులు ఏర్పడగా, కాంగ్రెస్‌వారు దీన్ని హద్దుపద్దుల్లోఉంచే అనేక చట్టాలను తయారు చేశారు. ఇలాటి వాటిల్లో అధునాతనమైనది 1952 లో చేయబడిన మెక్‌కారన్ - వాల్టర్‌చట్టం; ఇదివరకు ప్రపంచంలో దౌర్జన్యాలతో, బీదరికంతో కుంగి పోయిన ప్రజ యునైటెడ్‌స్టేట్స్‌వైపు ఆశాజనకంగా చూసేది; నిజంగా యోగ్యతలున్న అలాటి ప్రజలక్కూడా యీ చట్టం అమెరికాలో ప్రవేశించే అర్హతలను నిరాకరిస్తున్నది. అణిచివేయబడిన ప్రజలపక్షం వహించి, తన అండదండలను అందించటంలో యునైటెడ్‌స్టేట్స్ వహించిన ఘనతనుకూడా యీ చట్టం కొంతవరకూ తగ్గించివేసింది.

ఈ దారుణమైన చట్టాన్ని సడలించేందుకూ, వలసలు వొచ్చేవారికి అనుకూలంగా ఉండే విధానాన్ని అవలంబించేందుకూ ఉద్దేశించిన అనేక బిల్లులు - మతసంస్థలూ, పౌరసంస్థలూ, విద్యాసంస్థలూ, కార్మికసంఘాలూ ఎంతో ప్రయత్నించినవి. హంగేరీలో కమ్యూనిస్టుల దౌర్జన్యాలకు గురై, ఎరయి, పారిపోయి వొచ్చినవారికి దేశంలోకి ప్రవేశార్హతనిచ్చే ప్రత్యేకపు ఏర్పాటులు జరిగినవి. ఐతే ప్రపంచ విధానాన్నిబట్టి చూసినట్లయితే వలస దారులపట్ల అవలంబించిన యీ విధానం కొన్ని సంవత్సరాలవరకూ ఒక తీవ్రసమస్యగానే ఉంటూంటుంది.

ఒక శతాబ్దంగా విదేశీయ రాజనీతి, రాజ్యాంగ విధానమూ ఎరుగని, ఎంతో హాయిగా, సుఖంగా బతికే జాతికి ఇలాటి ఇబ్బందులనేకం ఎదు రవటం సహజమేమరి। ఇతర దేశాలలోనివారు శతాబ్దాల తరబడిగా నేర్చుకున్న అనేక పాఠాలను, అమెరికన్‌లు తెల్లవారేప్పటికి నేర్చుకోవల సిన వొత్తిడికి గురయ్యారు. మన ప్రజలు నైతికదృక్పథంతో, లభ్యమయే

సహజసంపదలతో అత్యధికోత్పత్తిని సాధించి, జీవిత ప్రమాణాలను పెంపొందించి, విదేశీయరాజ్యాంగవిధానంద్వారా ప్రపంచంలోని అనేకమంది ప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సాధించిన కీర్తిని పొందారనేచెప్పాలి.

1946 వరకూ, మనం తాటస్థ్యవిధానాన్ని అవలంబించటమే ఎప్పటికీ ఒక గొప్పలోపంగా రూపొందింది. చివరకు మేల్కొని - ఇండియాలాటి దేశాలు ఇంకా యీ తాటస్థ్యవిధానాన్ని అవలంబించటం చూసి మనం అదిరి పొయ్యాము. మనం స్వాతంత్ర్య సాధనకొరకు చేసిన పోరాటానంతరం ఏ స్థితిలో ఉన్నామో, కేవలం గెలుచుకొన్న భూమిని పునర్నిర్మించేందుకే ఎలా సర్వశక్తుల్నీ సమీకరించామో, ఇప్పుడు ఇండియా కూడా ఆదేస్థితిలో ఉన్నది.

మనం మనకు కల్పించుకొన్న ప్రమాదాలను సైతం లెక్కచేయక విశ్వప్రయత్నాలుచేసి ఇతరులకు సహాయపడినందుకు అనురాగం, గౌరవాలను ఆశించాము. ఐతే మన మిత్రులుకూడా మన జీవిత విధానాన్ని విమర్శించటం, మన శక్తి సామర్థ్యాలను శంకించటం జరిగినప్పుడు, ఇదంతా మనను చీకాకు పరుస్తూన్నది. మన ప్రవర్తనలో అత్యుత్తమ స్థాయిని యూరప్ కోరింది ; ఐతే మనం దెబ్బతిన్నప్పుడు ఆనందించింది। యునైటెడ్‌స్టేట్స్ ఆత్మదర్పణంగానూ, ఆదేసమయంలో దెబ్బను కాచుకొనే డాలుగానూ ఉండాలనీ, లేదా తమకు అనుకూలంగా ప్రవర్తించాలని యూరప్ కోరుకుంటూన్నదని పి. జి. వర్స్ ధారన్ సూచించారు. కనుకనే వలసరాజ్యాల విధానాన్ని ఏవగించుకోవటాన్ని ఇండోచైనాలో మనం ప్రదర్శించాలని గ్రేట్ బ్రిటన్ కోరింది ; ఐతే ఇరాన్ విషయంలో ఆ విధానాన్ని విస్మరించి, ఆదర్శాలను మంటగలిపి, బ్రిటన్‌ను బలపరచాలనీ వాంఛించింది।

అమెరికన్ రాజనీతిలోని మరొక ఇబ్బంది - (దీన్ని ప్రభుత్వం ముఖ్యసూత్రంగా అంగీకరిస్తూన్నది). అన్ని సంప్రదింపులనూ వెలుగుతోనిండిన

రంగంమీద, వార్తా పత్రికలవారి సమక్షంలో, అమెరికన్ విధానాలను ఖండించేవారూ, లేదా ఎమర్శించేవారూ ఉన్నప్పటికీ, ప్రతి విషయాన్నీ అమెరికన్ విజయంగానో, పరాజయంగానో ఎంచేవారి ఎదుట చర్చించే అవసరాన్ని గుర్తించి అమలు జరపటం. ఐనప్పటికీ అవసరాన్నిబట్టిన రాజనీతి అంటే ఒక విధంగా రాజీపడటమే। యున్ఏజన్సీలలో జరిగే కార్యకలాపాలనుగూర్చి వార్తాపత్రికలు విశదీకరించటం - సంప్రదింపులపట్ల ఉండే గాఢవిశ్వాసాన్ని పెంపొందిస్తూన్నది.

## నూతన పథకాలు

ఇప్పుడొక తావులోనూ, ఆ తరువాత మరొకచోటనూ జరిగే దురాక్రమణల కారణంగా, యునైటెడ్ స్టేట్స్ ఆర్థిక సహాయం చేసేందుకు మారుగా సైనిక, ఆర్థిక సహాయాలు జరిపే సంధులను చేసుకోవలసి వొచ్చింది. ఐనప్పటికీ యుద్ధానంతరం జరిగిన ఆర్థికసహాయం 56 బిలియన్ డాలర్లు - ఇంత పెద్దమొత్తాన్ని ఆలోచించటంకూడా కష్టమే। ప్రైవేట్ సంస్థలవారు ఇతరదేశాల్లో పెట్టిన పెట్టుబడులు మరొక 10 బిలియన్ డాలర్లుకూడా దీనికి కలుస్తవి. అనేక సందర్భాలలో ఆయా దేశాల్లోని స్వార్థపరులు యీ పెట్టుబడులను దిగమింగటంకూడా జరిగింది. మరికొన్ని సందర్భాలలో బడుగుదేశాలకు నిజంగా ఇవ్వవలసిన యీ పెద్దపెద్ద మొత్తాలు మనతో మైత్రి సాధించిన దేశాలకు-ఇవ్వబడుతూన్నవి. ఏమైనప్పటికీ ఇలాటి పథకాలు చరిత్రలో మరెక్కడా కానరావు.

అమెరికా యూరపియన్ పరిశ్రమలకు ఇచ్చిన ఉత్సాహ ప్రోత్సాహాల కారణంగా, యుద్ధానికి ముందున్న ఉత్పత్తి 70% పెరిగింది. అమెరికన్ యాత్రికులూ, సైనిక బలాలూ మరొక 3.2 బిలియన్ డాలర్లు ఖర్చుపెట్టటం వల్ల, ఆ యా ఫలితాలను ప్రతియూరపియన్ గృహమూ అనుభవిస్తూనే ఉన్నది. ప్రఖ్యాతి చెందిన బ్రిటిష్ ఆర్థిక తత్వవేత్త బార్బారావార్డ్-"అమెరికా

చేసిన అర్థికసహాయాలతో అమెరికా ప్రపంచ నాయకత్వానికే అర్హమై ఉండటంవల్ల, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ఆశించే జనావళినంతనూ కలిసి కట్టుగా ఉంచింది"__అన్నారు.

సాంకేతిక నిపుణతద్వారా జరిగే సహాయమనేది కేవలం పేరుకు మాత్రమేననీ, అలాటిది అమెరికన్ తత్వమేననీ, ఆది అమెరికన్ సరిహద్దు ప్రాంతాల్లో జరిగిన అభివృద్ధి ప్రణాళికలనాటినుంచీ జీర్ణించి ఉన్నదనీ, సుస్థిరమైన నివాసాలు ఏర్పడిన తావుల్లో కూడిన విజ్ఞానం స్వచ్ఛంద సేవాసక్తి ఉన్నవారిచేత, అభివృద్ధి కావలసిన భాగాలలో ప్రవేశ పెట్టబడిందనీ - అదే తత్వం యీనాడు అమెరికా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవించే దేశాలపట్ల ప్రదర్శిస్తూ ఉన్నదనీ అప్పటి డైరెక్టర్ అఫ్ ఫారిన్ ఆపరేషన్స్ ఎడ్మినిస్ట్రేషన్‌కు సమర్పించబడిన రిపోర్ట్‌లో సూచించబడింది. ఆ తరువాత యీ సరిహద్దు ప్రాంతంకూడా సుస్థిరమైన అభివృద్ధి జెందటంతో ఇక్కడి విజ్ఞానం ఆ పక్కనున్న సరిహద్దు ప్రాంతానికి అందివ్వబడింది. ఇదే తత్వాన్ని వర్ధిల్లచేసుకొన్న అమెరికన్‌ల సాంకేతికసహాయం, పరదేశాలలోని సాంకేతిక నైపుణ్యంతో కలిసి, అమెరికన్‌ల స్వచ్ఛంద సేవాసక్తికి తార్కాణంగా పరిణమిస్తూన్నది.

ఆ యా ఫలితాలు కనిపిస్తూనే ఉన్నవి - జోర్డన్‌లోని ప్రచండ సూర్యతాపానికిగురైన ఎడారి ఫలవంతంకావటం. నిస్సారమైనభూమిమీద పచ్చిక కంబళీలు పరిచిన విధంగా పెరగటం, ఇండియాలోని గోధుమపంట ఐదింతలు కావటం, ఇరాన్‌లోని క్షేత్రాలమీద చేసిన ప్రయోగ ఫలితాలూ, గ్రామసీమల అభివృద్ధి ప్రణాళికద్వారా కో-ఆపరేటివ్ విధానాలు ప్రవేశ పెట్టబడటం, ఉత్పత్తి అధికం కావటం, రైతులకు స్వచ్ఛమైన మంచినీటి సరఫరా, ఆరోగ్య రక్షణపథకాలూ లభ్యమవటం - బొలీవియానుంచి లెబెనాన్‌వరకూ, పాకీస్థాన్‌నుంచి థాయిలాండ్ వరకూ అభివృద్ధులు కాంచనవుతవి.

లెబనాన్‌లోని పాయింట్ ఫోర్ ప్రోగ్రామునుగూర్చిన వర్ణన ఇలా ఉన్నది: 'ఇదొకవాహనమై-శాస్త్రీయవిజ్ఞానం, సాంకేతిక సృష్టులూ, ఉత్పత్తిలోని అభివృద్ధీ స్నేహపూర్వకంగా అమెరికన్ ఆదర్శాలతో, ఆశయాలతో కలిసి పయనిస్తూ మానవులమధ్య నిజమైన సౌభ్రాతృత్వాన్ని సాధించటం.'

అనేక స్వచ్ఛందసేవా సమాజాలకు ఎక్కువ అవకాశాలు లేకపోయినా కొన్ని చర్చిలూ, CARE, వరల్డ్ నైబర్స్ మొదలైన సంస్థలు చేసే స్వచ్ఛందసేవ, అమెరికన్‌లు తమ అదృష్టాలనూ, సాంకేతిక నైపుణ్యాలనూ మిగతావారితో పంచుకొనే స్వభావసిద్ధమైన వాంఛనూ, ఆశయాన్నీ నిరూపిస్తున్నవి.

యుద్ధానికిముందు టోకియోలోని ఇపిస్కోపాల్ యూనివర్సిటీలో అధ్యాపకుడుగా ఉన్న అమెరికన్-పాల్‌రూష్ మంచి ఉదాహరణ. యుద్ధానంతరం జపాన్‌కుతిరిగివొచ్చి, విపరీతంగా పెరిగిపోతూన్న జనాభా, తక్కువ ఆహార పదార్థాలూ కలిసేకట్టుగా రూపొందించిన విషమ సమస్యతో బాధపడ్డారీయన. తనంత తానుగా కొద్ది విరాళాలను పోగుచేసి, కొండప్రదేశాల్లోఉన్న చిన్న గ్రామం కియొసాటోలో ఒక చిన్న పరిశోధనను ప్రారంభించాడు. ఇంతవరకూ నిస్సారంగా పడిఉన్న కొండప్రదేశాన్ని ఏం చేయాలనేదే ఆయన ఊహ. ఈనాడు KEEP (కియొసాటో ఎడ్యుకేషనల్ ఎక్స్‌పెరిమెంట్ ప్రాజెక్ట్) 19 రకాల కూరగాయల్నీ, ఏడు రకాల ధాన్యాలనూ పండించటమేగాక- హెయర్‌ఫర్డ్, జెర్సే పశుసంపదలను కలిగిఉంది, అధునాతనమైన పాలకేంద్రాన్నీ, వేలకొద్దీ కోళ్ళనూ కలిగి ఉన్నది. మొదటి పశువులనూ, కోళ్ళనూ అమెరికన్‌మిత్రులు విరాళాలుగా ఇచ్చారు. పదికోళ్ళున్న ప్రతిరైతూ పదిగుడ్లనుపొదిగించి, ఆరోగ్యకరమైన పది కోళ్ళను మరొకరైతుకు ఇచ్చేందుకు వాగ్దానం చేశాడు.

కొద్ది సంవత్సరాలక్రితం ఆకొద్ది రాతినేలమీదా ఎన్నో కష్టాలుపడే ఆ ప్రజకు యీనాడు ఒక చర్చ్, ఒక పెద్ద పుస్తకభాండాగారం, అధునిక

మైన పనిముట్లున్న ఒక ఆస్పత్రీ ఉన్నవి. అన్నిటికన్నా ఉత్తమమైనది-కియొసాటోలోని ప్రజలు తమకు తాము సహాయపడుతూ, ఇతరులకూ్కడా సహాయపడటమనేదాన్ని బాగా నేర్చుకున్నారు. బలహీనులకూ, పని పాటలు చేసుకోలేని వారికీ ఏర్పడిన ఒకానొక సంస్థలో ఆహారపదార్థాలు ఐపోయిన స్థితిలో 400 మంది రైతుబిడ్డలు ఒక్కొక్కడు ఒక్కొక్క బంగాళా దుంపపొంతున విరాళం ఇచ్చారు. గత ఐదు శతాబ్దాలలోనూ ఆ సమాజంలో కనిపించని అభివృద్ధి గత ఐదు సంవత్సరాల్లోనూ కనిపించింది. అనేకవేలమంది యాత్రీకులు ఇక్కడేం జరుగుతూన్నదో చూసేందుకు వొచ్చారు: ఇంకా జపాన్‌లోని ఇతర కొండప్రదేశాలలో ఇలాటి పథకాలెన్నో అమలు జరుపబడుతూన్నవి.

ఇలాటి పరోపకారబుద్ధిని సూచించే ఊహలున్న మరొకవ్యక్తి క్లిఫర్డ్ క్లింటన్: ఈయన ప్రవేశపెట్టిన 'ఫీల్స్‌ఫర్ మిలియన్స్' (కోట్లాదిజనానికి ఆహారం) పథకంప్రకారం అనేకఉపయోగాలున్న ఆహారపదార్థాలను ఎలాటి లాభాలూ లేకుండా చాలా తక్కువ వెలకు, అవసరమైన స్థలాలలో సరఫరా జరుగుతూన్నది.

పశ్చిమానఉన్న గొప్ప భూభాగంలోని ఆరిజోనారాష్ట్రంలోని ఫ్లాగ్‌స్టాఫ్ అనే చిన్న గ్రామం-8,000 జనాభా ఉన్న దానిలో ఒకానొక వ్యక్తి వార్తాపత్రికలో, నవంబర్‌లో CARE కి విరాళమివ్వబడే ప్రతిడాలరుకూ, తానొక డాలర్ కలుపుతానని ప్రకటిస్తాడు. ఇలాటి ప్రతిడాలరూ 22 పౌనుల క్షేత్రోత్పత్తిని-పాలు, జున్ను, బియ్యం, చిక్కుళ్లు, పిండి మొదలైనవాటిని 19 బడుగుశాలలోని కాందిశీకుల కుటుంబాలకు లేదా నిరుద్యోగుల కుటుంబాలకు కొని పంపుతుంది.

"ఆకలితో అలమటించిపొయ్యే బహుజనావళికి ఆకలిబాధనుతీర్చి, సముద్రాంతర ఖండాలలోని వారితోడి మనమైత్రిని రుజూచేసేందుకూ ఇక్కడొక సదవకాశమున్నది" అని ఎడిటర్ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చు

తాడు. తాము ఆహారపదార్థాల ప్యాకెట్లు ఎవరికి పంపుతున్నారో, ఆ ప్రజలను ఫ్లాగ్‌స్టాఫ్‌లోని పౌరులు ఎరుగరు; బహుశా వారిని ఎన్నటికీ కలుసుకోలేరు-చూడలేరు: ఐనప్పటికీ విరాళాలివ్వటం తమవిధిగానే వారుభావిస్తూ ఉన్నారు. యాభైకన్నా ఎక్కువగాఉన్న స్వచ్ఛందసేవాసమాజాలు తమ ఏజెన్సీలద్వారా సముద్రాంతరదేశాలలోని వారి సహాయార్థం విరాళాలను పంపుతూనే ఉన్నవి. 1956 లోని మొదటి 6 నెలల్లోనూ విరాళాలరూపంగా ఐన ఖర్చు 162,003,000 డాలర్లు.

"వ్యక్తిగతమైన విరాళాలద్వారా క్రిస్టియన్స్‌వేసిన పథకం-కమ్యూనిజాన్ని జయించగలిగేదాన్నిగూర్చి ఒకానొక మతగురువు ఆదేశప్రకారం ఏర్పడిన 'వరల్డ్‌నైబర్స్' అనే సంస్థ - తన పథకాలను - ఆరోగ్యం, విద్య, వ్యవసాయరంగాలలో ఆసియా, ఆఫ్రికాలలో ప్రవేశపెట్టింది. అవసరమైన తావుకే ఆ సంస్థ వదలి వెళ్తుంది: ముఖ్యంగా గ్రామసీమల్లోని పల్లెటూరి జనానికి తమకు తాముగా సహాయపడటాన్నిగూర్చి-మంచి పద్ధతుల్లో వ్యవసాయాన్ని సాగించటం, చేతిపనులూ, ఆరోగ్యం, శిశుసంరక్షణ మొదలైన వాటిల్లో విజ్ఞానాన్ని అందిస్తూంటుంది.

వరల్డ్ లిటరసీ ఇన్‌కార్పొరేటెడ్ - డాక్టర్ ఫ్రాంక్ కౌబాచ్ తాలూకు ప్రత్యేక సాంకేతిక విద్యావిధానాన్ని అమలుజరిపి వయోజనులకు చదవటం నేర్పి, వారి పనిముట్లను సక్రమంగా ఉపయోగించి వ్యవసాయంలోనూ ఆరోగ్యసంరక్షణలోనూ అభివృద్ధిప్రణాళికలకు అలవడటాన్ని నేర్పుతుంది. ఫాస్టర్ పేరెంట్స్ ప్లాన్ ఫర్ వరల్డ్ చిల్డ్రన్, సేవ్‌దీ చిల్డ్రన్ ఫెడరేషన్, నేషనల్ కమిటీ ఫర్ ఏ ఫ్రీ యూరప్, క్రూసేడ్ ఫర్ ఫ్రీడమ్, ఇంటర్ నేషనల్ రెస్క్యూ కమిటీ-ఇంకా ఇలాటి అనేక స్వచ్ఛందసేవాసక్తి ఉన్న సంస్థలు, పెద్ద పెద్ద మొత్తాలలో విరాళాలను పోగుచేసి సముద్రాంతర దేశాలకు పంపుతున్నవి.

ఇంకా అనేక అమెరికన్ సంస్థలు స్వచ్ఛందసేవాసక్తితో నడపబడేవి-కార్మికసంఘాలూ, పండితుల ఎసోసియేషన్‌లూ, రోటరీలాటి సర్వీస్ క్లబ్‌లతో కలిసిమెలిసి-ఇతర దేశాలలోని సంస్థలతో కూడా కలిసి ప్రపంచ సంస్థలుగా రూపొందుతే ఇంకా ఎంతో సాధించే అవకాశాలున్నవి. రాజకీయ దౌత్యసంబంధాల ద్వారా, ప్రపంచంలోని ప్రజలు ఒకరినొకరు అర్థం చేసుకోగలగటం సాధించబడే అవకాశాలు తక్కువ. కోట్లాదిప్రజలు ఒకరినొకరుకలుసుకొని, తమతమ మానవత్వాలనూ, ఉత్తేజాలనూ, అభిప్రాయాలనూ ఒకరి నొకరు తెలియ బరుచుకొని, సంబంధబాంధవ్యాలను పెంపొందించుకొనేవరకూ 'ప్రపంచసమాజం' ఏర్పడే అవకాశాలు లభ్యమవవు.

ఇలాటి ఇచ్చిపుచ్చుకోవటాలు అత్యధికసంఖ్యల్లో 20, 30, 50 సంవత్సరాల వరకూ కొనసాగగలవని మనం ఆశిద్దాం. నేడు అనేక జాతీయ సంస్థలు అమెరికన్ ప్రభుత్వంమీద తమ పలుకుబడులను ప్రయోగించిన విధంగానే, ప్రపంచంలోని బహుజనావళులు స్వచ్ఛందసేవాదళాలుగాఏర్పడి యునైటెడ్ నేషన్స్‌మీద తమ పలుకుబడులను ప్రసారం చేయగలరనటం ఊహించలేని విషయమా ?

## నూతన విశ్వ సంస్కృతా ?

అనేక క్లిష్టపరిస్థితులు సర్వదాఏర్పడుతూన్న ప్రపంచంలో, సమాజమంటే ఉండవలసిన నిజమైనభావాన్ని పెంపొందించేందుకు యునైటెడ్ స్టేట్స్ చేయగలిగిందేమిటి?

'క్లిష్టపరిస్థితి' అన్నదానికి చైనీయుల భావంలో అపాయమూ, అవకాశమూ అనే రెండు,ఇమిడి ఉన్నవి. మానవ చరిత్రలో ఇంతకు ముందెన్నడూ యీ రెండు పదాలూ ఇంత అన్యోన్యంగా ప్రయోగించబడలేదు. ఇప్పుడు హుందాతనమూ, కీర్తిప్రతిష్ఠలూ మన గుప్పెటలో ఉండటంవల్ల,

ఇంతకుముందు ఆకలీ, వ్యాధిగ్రస్థలవల్ల జరిగే ఆటంకాలకూ మారుగా, ఇప్పుడు మానవుడే ఆ క్లిష్టపరిస్థితిని ఎదుర్కోగలుగుతూన్నాడు.

"మధ్య ప్రపంచంలోని మానవులచే విప్లవాలను రేపేందుకు సహాయపడే నాలుగు సూత్రాలూ ఇవి; జాతీయ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలూ, మానవుని హుందాతనం, ఆర్థికాభివృద్ధీ, శాంతిభద్రతలూను" అని చస్టర్ బౌల్స్ సూచించారు. నిష్పాక్షిక దృష్టిని సారించగల ప్రతివిద్యార్థీ ఇనుపతెరకు ఏవైపున యీ ఉద్దేశ్యాలు అధికంగా మనగలవో నిర్ణయించుకోవటం ఏమంత కష్టమైన పనికాదు.

మార్క్సిస్టువలె మనకు పేటెంట్ చేయబడిన మందులు-సామాజికంగా ఏర్పడే వ్యాధిగ్రస్థతలనన్నిటినీ కుదర్చగలవిలేవు. ఐతే యీ సత్యంలోనే ప్రజాస్వామ్యం తాలూకు శక్తి సామర్థ్యాలు ఇమిడిఉన్నవి; ఎందుకంటే మన విధానాన్ని ఇతరులమీద రుద్దేందుకు మనం ఎన్నడూ ప్రయత్నించలేము; కాని ప్రజల ఆరోగ్యాన్నీ, ఆర్థికస్థితినీ అభివృద్ధిచేసే ప్రయత్నాలు చేసి, చేతులుకలిపి. ఆ కలపటంలో ఆ ప్రజకు సంకెళ్లు తొడగకుండా, వారి ఆశయాలను వారే ఎన్నుకొని సాధించుకొనే అవకాశాలను కలిగించాము. బైటినుంచివిప్లవం రావటమనేదాన్ని-రష్యావలెమనం కల్పించలేము; ఎందుకంటే మన చరిత్రచెప్పిన సత్యాలద్వారా సామాజిక ఆర్థికాభివృద్ధులనేవి లోలోనే జరగాలి; ఆ జరగటం కూడా మానవుని హక్కులకుహామీ ఇవ్వగల కాన్స్టిట్యూషన్ పీఠంగా ఏర్పడిన రాజకీయచైతన్యం ద్వారానే జరగాలనే విషయం మనకు బాగా తెలిసిందీ, మనమందరమూఅంగీకరించిందీను. ఐతే మన చరిత్రద్వారా కూడా విప్లవం ఎల్లవేళలా వర్ధిల్లుతూనేఉంటుంది-కాని యీ విప్లవం-ఇంకా ఇంకా అధిక ప్రజల తాలూకు జీవనప్రమాణాన్ని పెంపొందించటం, వారికి మంచి ఆహారం, ఆరోగ్యం ఎక్కువ విరామకాలం, విద్యాసౌకర్యం- సర్వమానవ సమానత్వం మొదలైనవాటికొరకై సాగించబడుతూ ఉంటుంది.

స్వదేశంలో మనం మన సమస్యలను-నేరాలను ఏ విధంగా అరికట్టవల సిందీ, మురికిప్రదేశాలను తుడిచివేయటం, పారిశ్రామిక నాగరికతలోనికుళ్లు పై భాగాలకు విస్తరించకుండా చూడటం, మన పౌరులందరికీ సరిసమాన రక్షణా, సౌకర్యాలూ అందించటం, ప్రపంచం మననుంచిఆశించేపరిపక్వతా, బాధ్యతలను నిర్వహించటం-మొదలైనవాటిని ఏ విధంగా సమర్థిస్తున్నామో దానిమీదనే యునైటెడ్ స్టేట్స్‌పట్ల ప్రపంచానికిఉండే గౌరవం ఆధారపడి ఉంటుంది. ఇక్కడ మనం స్వదేశంలో ఏంచేస్తున్నామనేదానికి సరిసమానంగా అంతర్జాతీయ మిత్రత్వాన్నిగూర్చి మనం చెప్పేది ఎన్నటికీ సరి తూగదు.

తమ సౌకర్యాలను ఇతరులతో పంచుకునేందుకు ఎంతో ఆత్రతపడే అమెరికన్‌లు వారి తొందరలో ప్రజాస్వామ్యాన్నిగూర్చి ప్రపంచానికిబోధించటం తమ వంతని భావిస్తారు. ఫ్రాన్స్, ఇండోనీషియా, గ్రీస్, ఫిన్లండ్ లలో తమ తమ స్వాతంత్రాలకోసం పోరాడినవారికి దాన్నిగూర్చి మనం బోధించవలసిన అవసరంలేదు. అంతేగాక యునైటెడ్ స్టేట్స్, రష్యాల మధ్య ఎన్నుకోమని మనం ఎవరిమీదా వొత్తిడి తీసుకుని రావలసిన అవసరమూ లేదు. మనకు మన శతాబ్దమూ ఉన్నది. ఆ రోజుల్లో మన గొడవ లేవో మనం పడ్డాము; ఆ రోజుల్లోకన్న యీ రోజుల్లో ప్రపంచానికి గొప్ప భయం ఏర్పడిఉంటే, కేవలం అధికారదర్పంతో, దాన్నిసాధించి, తద్వారా తమ ఆశయాలను సిద్ధింపజేసుకునేందుకు నానాఅగచాట్లూ పడేవారు మన చేత క్షమింపబడాలనికోరితే, వారిపట్ల సానుభూతి చూపటం మన వంతు. మన సంస్థలను తీసుకొనివెళ్లి పరదేశాలలో స్థాపించలేము, కేవలం అభిప్రాయాలనూ, ఆశయాలనూ, విధానాలనుమాత్రమే మనం అందివ్వగలం.

పశ్చిమదేశాలలోని శాస్త్రీయపద్ధతుల్ని ప్రపంచమంతా మెచ్చుకుంటుంది. విశ్వవిద్యావ్యాప్తి, చట్టబద్ధమైన ప్రభుత్వము, ప్రజారోగ్యము, సామాజిక సంరక్షణ, వ్యక్తిగతమైన హక్కులు ప్రభుత్వహామీతో, ప్రజాసంక్షేమోద్దే

క్ష్యంతో అమలుజరపబడటం-మొదలైన వాటిని కూడా ప్రపంచం హర్షి స్తుంది. ఐతే పశ్చిమ వాసుల నాగరికత, ఇతర సంస్కృతులనుంచి నేర్చుకోవలసింది చాలా ఉన్నది.

పశ్చిమదేశాలకూ, తూర్పుదేశాలకూ దృక్పథంలో చాలా తేడాలున్నవి. ముఖ్యంగా అది కాలాన్ని చలనంలేని సరస్సువలె చూస్తుందేకాని, ప్రవహించే నదివలె చూడదు. పశ్చిమవాసులు తమ అనుభవాలను విశదీకరించేందుకు ప్రయత్నిస్తే, తూర్పువాసులు ప్రతివిషయాన్నీ నిర్ణీతంకాని ఒక భాగంగా చూస్తారు. కనుక విజ్ఞుడు ఏదీ నిర్ధారణగా చెప్పలేడు; ఎందుకంటే, ఒకవేళ ఆ నిర్ణయంలో మార్పులుండే పక్షంలో, ఆయన వాటినుంచి వెనక్కుమళ్ళే అవకాశాన్ని కోల్పోతాడు. ఇలాటి దృక్పథవిశేషం ప్రపంచ రాజకీయాలపట్ల ప్రధానపాత్రను ధరిస్తూన్నది.

అమెరికన్ వేదాంతులు కొందరు పదార్థతత్వాన్ని ఖండించి, ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రబోధించసాగాక, ప్రాక్ దేశాలలోని ఆధ్యాత్మికవాదంపట్ల మనం ఆకర్షించబడి, ఆ యా అభిప్రాయాలమీది అభిలాషలను పెంపొందించుకున్నాము. క్లిప్పర్ ఓడలు చైనానుంచి ధనాన్ని తీసుకొని వొచ్చే రోజులనుంచీ, ప్రాక్ దేశాభిప్రాయాలు అమెరికన్ కళల్లో కన్పట్టసాగినవి. చిత్రకళలోనూ, ముఖ్యంగా కట్టడపు పనితనంలోనూ జపానీయుల పలుకుబడులు విస్తరించినవి. ప్రాక్ దేశాలలోని అనేకమతాల కారణంగా అమెరికాలో అనేక మతైకమైన శాఖలు ఏర్పడినవి. అన్ని పెద్ద విశ్వవిద్యాలయాల్లోనూ ప్రాక్ దేశాలకు సంబంధించిన విద్యాశాఖలు నెలకొల్పబడినవి. ఎక్కువమంది సైనికులూ, యాత్రీకులూ ప్రాక్ దేశాలకు వెళ్ళివొచ్చి, అక్కడినాగరికతనుగూర్చి కొంతవరకైనా అర్థంచేసుకొని మనకుచెపుతూ, అంతకుపూర్వం కేవలం బొమ్మలద్వారానూ, పుస్తకాలద్వారానూ తెలుసుకున్నదాన్ని విశదీకరించటం జరిగింది. హవాయ్‌లో తూర్పు పశ్చిమాల సంస్కృతులూ, నాగరికతలూ ఒకదానితో మరొకటి అనేక స్థాయిల్లో

కలిసిపోయినవి. అక్కడ- అమెరికన్ భూభాగంమీద జీవితానికి సంబం ధించిన యీ రెండు దృక్పథాల సారాంశమూ ఏకం చేయబడే ప్రయత్నాలు కూడా సాగినవి.

యాత్రలద్వారానూ, అనేక విషయాలకు సంబంధించిన వార్తలు ప్రవా హంగా అందివ్వబడటంద్వారానూ, ఇదివరకుకన్న అమెరికన్‌లు ప్రాపం చిక విషయాలతో ఎక్కువ సంబంధాన్ని కలిగిఉన్నారు, కార్మికులూ, క్షేత్రంమీద పనిచేసుకునేవారూ, యువకులూ, మహిళాసమాజాలూ, సామా జిక సేవాసమాజాలూ మొదలైనని విదేశ విషయాలనుగూర్చిన అనేక సత్యాలను తమ తమ సభ్యులకు అందిస్తూ ఉన్నారు. సర్వీస్‌క్లబ్‌కు సంబం ధించిన, లేదా యూనియన్‌కు సంబంధించిన ఏ మేగజైన్‌ను తీసుకున్నా. అందులో కనీసం ఒక్కటి, బహుశా చాలా వ్యాసాలు ప్రపంచ విషయా లను గూర్చినవి కనిపించటం యీ రోజుల్లో పరిపాటి. ఈ సంస్థలు పర దేశ విషయాలను అవగాహన చేసుకొనే అవకాశాన్ని కలిగించటంవల్ల, ఆయా ప్రజాభిప్రాయాలు కాంగ్రెస్‌మీద పలుకుబడుల ప్రభావాన్ని ప్రసరిం చటం, ప్రభుత్వ విధానాన్ని బలపరచటం జరుగుతూన్నది. అమెరికన్ ప్రజాభిప్రాయంలో ఉవ్వెత్తుగా వొచ్చే బ్రహ్మాండమైన అలలు అనేవి పూర్వకాలంనాటి మాట అనేందుకు దృఢమైన రుజూలుఉన్నవి.

వ్యక్తిత్వం, స్వచ్ఛందసేవాసక్తి, ఫెడరలిజమ్ అనేవి అమెరికన్ ధోర ణిలో, అమెరికన్‌ల బాధ్యతాయుత ప్రవర్తన, ప్రపంచ సమాజాలలో కలిసి పొయ్యేఅభిలాషలతో ముందుకు సాగుతున్నవనేది సుస్పష్టం. పాల్‌రూష్, క్లిఫర్డ్, క్లిన్‌టన్‌ల వ్యక్తిగతసంస్థలు, స్వచ్ఛందసేవాసక్తిఉన్న చర్యల ద్వారా వెలుగులోకి వొచ్చినవీ, యునైటెడ్ నేషన్స్, దానికి సంబంధిం చిన ఇతర శాఖలద్వారా వెల్లడయే ఫెడరలిస్ట్ సూత్రాలూ, యీనాడు మనకు కొట్టొచ్చినట్లుగా కనిపించేవి. అధికారాలను సరిసమానంగాఉంచటం కన్న, సంస్కృతులను అన్వయించటానికే ప్రాధాన్యత నిచ్చేది మన

ప్రపంచం: ఎందుకంటే యీ సంస్కృతులే నూతన ప్రపంచానికి నాగరికతను ప్రసాదించి-శాస్త్రీయవిజ్ఞానాన్ని విశదీకరించి, కళల ప్రయోజనాల్ని వివరించి మానవుల వస్తుసముదాయ సౌకర్యాలను పెంపొందించి, అందరు మానవులూ విజ్ఞానంలోనూ, ఆధ్యాత్మిక దృక్పధంలోనూ అత్యధిక సంతృప్తిని పొందేందుకు తగిన సరిసమానత్వాన్ని రూపొందించగలదు.

1920 లో యునైటెడ్‌స్టేట్స్‌లోని సంరక్షణంటే అదొకదాండు లేవాస్టాన్ అనే అభిప్రాయంగా ఉండేదని జార్జ్‌సౌరీ సూచించారు. 1930 లో దీని అర్థం మారింది- చివరికానికీ, వృద్ధాప్యానికీ ఇది రక్షణగాఉన్నది. 1940 కల్లా నియంతృత్వంనుంచి కాపాడబడిన ప్రపంచంగామారింది. 1950 లో ఇది అనేక సందర్భాలలో ప్రభుత్వరహస్యాలను శత్రువుల నుంచి కాపాడేదిగా మారింది. మనం మన శక్తిసామర్ధ్యాలను సక్రమంగా ఉపయోగించే పక్షంలో - 1960 కల్లా ఇది సృజనాత్మక, ప్రయోజన సహితమైన, రక్షణ ఉండే జీవితంగా రూపొందినదవుతుంది.

ఇలాటి జీవితం తాలూకు విత్తనాలు అప్పుడే నాటబడినవి. ఇప్పటికీ మనం బాహాటంగా ఉండే సమాజాన్ని సృష్టించి, అందులోని అనేక సంస్థలను అభివృద్ధి చేసేందుకు ప్రయత్నిస్తూ, దాని కదలిక వేగంలో అది బైటికిప్రసరించే ఘాత్తిడులను స్నేహపూర్వకంగా స్వీకరిస్తూ, అందులోని సంఘర్షణలనూ, వాదోపవాదాలనూ గమనిస్తూ, భావిలో గాఢవిశ్వాసాన్నుంచి ప్రస్తుతం జరిగే అన్యాయాల విషయమై కోపోద్దీపితులమౌతూ, మానసిక ఆధ్యాత్మిక శక్తులకు, శారీరక వస్తురూప శక్తులను జోడిస్తూఉన్నాము. ఈ సమాజంతాలూకుశక్తి కొంతవరకూ యువతీ యువకులమీదా, దాని గాఢమైన ఆశలు అత్యధికోత్పత్తిమీదా ఆధారపడి ఉన్నవి.

దీన్నిగూర్చి బాగా చెప్పగలిగింది బహుశా ఇది: దీని తత్వం 'ఔను' అనటమే కాని 'కాదు' అనటం కాదు: నిరాశతో కుంగిపోవటంకాదు-ఆశతో

ఉత్సాహంగా ఉండటం; ఏవగించుకోవటంకాదు. అనురాగాన్ని ప్రదర్శించటం. ఈవిధానం నిర్మించేదేకాని, నాశనంచేసేదికాదు. ఒక తరగతి ప్రజను మరొక తరగతి ప్రజతో ఘర్షణపడేట్లు చేయటంకాదు; అసలు ప్రజానీకంలో తరగతులే లేకుండా తుడిచివేయటం, ప్రపంచంలోఉన్న చాలని వాటిని తిరిగి పంపిణీలుచేయటం, ఆ యా విభేదాలను యీ విధానంలో పరిష్కరించటం దీని ఉద్దేశంకాదు; ఉత్పత్తిని అత్యధికంచేసి, ఇంతకు పూర్వం కొద్దిమందికే లభ్యమౌతూన్నవాటిని, ఇప్పుడు అందరికీ లభ్యమయేట్లుచేయటం. ఇరుగు పొరుగుల సహాయ సహకారాలతో జీవితాన్ని గడిపేందుకు శతాబ్దాల తరబడిగా అలవడిఉండటంవల్ల, యీనాడు కొత్త ఇరుగు పొ[illegible] ప్రపంచమేనని అంగీకరిస్తున్నది.



ఐ పో యిం ది.

---



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPUA 102B156 |
| పుస్తకం పేరు | అమెరికన్ జీవితం |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 373 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | a, Ba |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |